ప్రచురణ నెం 289
ప్రథమ ముద్రణ
వైశాఖం, 1880
(మే, 1958)



# HOW THE STEEL WAS TEMPERED

By

NIKOLAI OSTROVSKY

PART I

వైశ్యరత్న ప్రింటింగ్ వర్క్సు,
విజయవాడ-1,

వెల :
రు. 3-2

# పరిచయం

సోవియటు సాహిత్యంలో నికొలాయ్ ఓస్త్రోవ్‌స్కీ నవల 'కాకలుతీరిన యోధుడు'కు ప్రత్యేకస్థానం వుంది. ఈపుస్తకం వ్రాయడం ఒక్కటేకాదు, అసలు ఆయన రచనావ్యాసంగమే ఒక వీరకృత్యం.

రోవ్నో రాష్ట్రంలోని ఓస్ట్రోజ్‌స్కీ జిల్లాలోని విలియా అనే గ్రామంలో 1904లో ఓస్త్రోవ్‌స్కీ పుట్టేడు. ఆయనతండ్రి పని ఎద్దడిరోజుల్లో కూలిపనికి పోతూండేవాడు. ఆయన ఆదాయం చాలేదికాదు. తల్లీ, చెల్లెళ్ళూ జమీందార్ల సేరీలలో కూలికి పోతూండేవారు. ఆయనఅన్నగారు ఒక తాళాలుచేసే వానివద్ద పని నేర్చుకొనేందుకు కుదిరేడు. ఆ యజమాని తన పనివాళ్ళని నానాహింసలూ పెట్టేవాడు. గర్భదరిద్రమూ, కఠినపీడనా మధ్య ఆయనబాల్యం గడిచి, వర్గశత్రువులయెడ పరమద్వేషాన్ని రగిల్చింది. సాంఘిక అన్యాయాలు, మానవుని అవమానాలయెడ తీవ్రవ్యతిరేకతను రేకొల్పింది. ఆయన తొమ్మిదేళ్ళప్పుడు గొర్రెల్నికాచేడు. పదకొండో యేట షెపెటోవ్కా అనే యూక్రేనియన్ నగరంలోని రైలుస్టేషన్‌లోని హోటల్‌లో పనికి కుదిరేడు. మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైనాక ఆయన కుటుంబంవాళ్ళు ఆ పట్టణానికి చేరుకొన్నారు.

హోటలులో జరిగే అన్యాయాలు, మోసాలు చూడలేక ఆయన అక్కడే రైల్వేకర్మాగారంలో మెకానిక్‌గా పనిచేస్తున్న అన్నగారివద్దనే తీరుబడి సమయంఅంతా గడిపేవాడు.

•

అక్కడే మానవహక్కుల కోసం కార్మికులు పోరాడా లనే విషయం నేర్చుకొన్నాడు. బోల్షివిక్కులు చెప్పేదంటే లెనిన్‌నుగురించీ, ఆయన అభిప్రాయాల్నిగురించీ విన్నాడు.

తమ వూళ్ళోవున్నప్పుడు బళ్లో చాల తెలివిగలవాడని పేరు తెచ్చుకున్నాడు. కాని షెపెటోవ్కాకు చేరేక తల్లి దండ్రులాయనను మళ్ళా బళ్ళోకి పంపేరు. కాని, ఆయన వేసే ప్రశ్నలకు చికాకుపడి మతాచార్యుడు ఆయనను బళ్ళోంచి తగిలేసేడు.

1917 విప్లవం వచ్చేకగాని ఆయన చదువు వృద్ధి పొందే అవకాశాలు కలగలేదు. నగరంలోని పవర్ హౌస్‌లో పనిచేస్తూనే స్వయంగా చదువుకోసాగేడు. పాఠశాలలో ఒక సాహితీసమితిని స్థాపించేడు. దానికో సాహిత్య పత్రిక ఏర్ప డింది. వాటిలో తలమునకలయ్యేవాడు. వయస్సు వస్తున్న రోజుల్లో ఆయన గారిబాల్డీనీ, గాడ్ ఫ్లైనీ, మహావీరుల్నీ కొలిచే వాడు. అస్తమానమూ ఏదో ఒకటి చదువుతూనే వుండే వాడు. యూక్రేనియన్ విప్లవకవి తారాస్ షెవ్‌చెంకో రచన లన్నా, గోగోల్ వ్రాసిన తారాస్‌బుల్బా అన్నా చెవికోసు కొనేవాడు.

యూక్రెయిన్‌లో అంతర్యుద్ధం మహాభయంకరంగా నడిచింది. ఆనాటి అంతర్జాతీయ జీవితానికి యూక్రెయిన్ కేంద్రం అయిందన్నాడు జె. వి. స్టాలిన్. "రష్యాలో ప్రారంభమైన కార్మిక విప్లవమూ, పశ్చిమదిశనుంచి వస్తున్న సామ్రాజ్యవాద ప్రతివిప్లవమూ అక్కడే ఘర్షించేయి." ఇది యూక్రేనియన్ యువజనుల్ని వర్గపోరాటాలవైపు ఆకర్షిం

చేయి. ద్రోహంచేసి యుద్ధరంగంలో జర్మన్లకు దారిఇచ్చేసిన యూక్రేనియన్ బూర్జువాజీతోనూ, విదేశీయురాక్రమణదారులతోనూ పోరాడుతున్న రహస్యవిప్లవ కమిటీకి ఓస్త్రోవ్‌స్కీ, అతని మిత్రులూ సాయపడసాగేరు షెపెటోవ్కా విముక్తి పొందగానే ఆతడు నగరజీవితం దారిన పెట్టడంలోనూ, దొంగవర్తకుల్నీ, విప్లవ వ్యతిరేకుల్నీ పట్టుకోవడంలోనూ విప్లవ కమిటీకి బాగా తోడ్పడ్డాడు.

షెపెటోవ్కాలో మొట్టమొదటచేరిన 'కామ్‌సోమాల్' సభ్యులు అయిదుగురిలో ఓస్త్రోవ్‌స్కీ ఒకడు. 1919 ఆగస్టులో ఆతడింటినుంచి పారిపోయి ఎర్రసేనలలో చేరేడు. ఆతడు సేనలలో మంచిసాహసిగా పేరుపడ్డాడు. పోలిష్(తెల్ల)సేనలతోటి యుద్ధాలలో పేరుపడ్డ మొదటిగుర్రపుసైన్యంతో కలసి ఆతడు 1920 వేసవిలో తన పట్టణానికి తిరిగివచ్చేడు. అప్పటికింకా యుద్ధం ముగియలేదు. మళ్ళీఆతడు సైన్యాలలో పనిచేస్తానని సిద్ధంఅయ్యేడు. ఆనాటి కాతని వయస్సు 15 ఏళ్ళు. ల్వోవ్ వద్ద జరిగిన యుద్ధంలో గాయపడ్డాడు. కుడికన్ను పోయింది. రెండునెలలు హాస్పిటలులోవుండి, విడుదలయి షెపెటోవ్కాకు చేరుకున్నాడు.

1921లో ఆతడు కీవ్ వెళ్లేడు. అక్కడ 'కామ్‌సోమాల్' సిర్మాణానికి నాయకత్వం వహించేడు. రెండోవేపున రైల్వే వర్కుషాపులలో ఎలక్ట్రీషియన్‌గా పనిచేస్తూనే సాంకేతిక పరీక్షలకు చదువుకోసాగేడు. అవి మహాగడ్డురోజులు. పొయ్యిలోకీ, పొయ్యిమీదికీకూడా కరువొచ్చింది. నగరంలో వంటచెరుకు దొరక్కుండాపోతే, దానిని తీసుకొచ్చేటందుకై

చిన్న రైలుమార్గాన్ని వేసేటందుకు కొంతమంది కార్మిక యువకుల్ని పంపేరు. నికోలాయ్ ఓస్ట్రోవ్‌స్కీ ప్రథముడయ్యేడు. ఎన్నో చిక్కుల మధ్య ఆ పని పూర్తి అయింది. కాని ఆ శ్రమతో ఆతని ఆరోగ్యం చెడిపోయింది. ఇంకా జబ్బునుంచి పూర్తిగా తేరుకోకుండానే మరుసటిఏడాది ఆకురాలు కాలంలో ఆతను కామ్‌సోమాల్‌లోని కామ్రేడ్స్‌తో కలిసి కలప తెప్పలు వరదల్లో కొట్టుకుపోకుండా గట్టుకు లాగడానికి వెళ్ళేడు. ద్నీపర్ నదినీటిలో మోకాలిబంటి లోతున నిలబడి ఆతడా పని ముగిసేవరకూ కష్టపడ్డాడు.

యుద్ధంలో తగిలిన గాయం, టైఫస్‌జ్వరం, బహు తీవ్రంగావచ్చిన కీళ్ళనొప్పుల వ్యాధి ఆతడు కీవ్‌లో పని మానుకోవలసినంత బలహీనస్థితికి తెచ్చేయి. కాని, అవధ్యుడుగా పరిగణించబడి, దేశ రాజకీయ జీవితానికీ, నిర్మాణాత్మక కృషికీ దూరంకావడం ఆతనికి ఇష్టంకాలేదు. ఏదో ఒకపని చేస్తానంటాడు. చివరకు ఆయన పట్టుదలమీదనే పశ్చిమ సరిహద్దులోని యూక్రేనియన్ నగరం బెరెజ్దోవ్‌కు పంపేరు. అక్కడ పార్టీ, కామ్‌సోమాల్ కార్యక్రమాలలో చాల గట్టిగా పనిచేసేడు.

1924లో ఓస్ట్రోవ్‌స్కీ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడుగా చేరేడు. ఆనాటికి పనిఏమీ చెయ్యలేనంతటి అనారోగ్యం వచ్చేసింది. ప్రత్యేక నిపుణులు మందులిచ్చేరు. శానిటోరియంలో ఎంతోకాలం చికిత్సచేసేరు. కాని, రోగం తగ్గలేదు. (*Onkylosic Polyarthritis*) పైగా ఎక్కువయింది. ఈ వీర యువకుడు జీవితాంతంవరకూ మంచంమీద గడపవలసిన

వాడేనని 1928 ఆఖరుకు స్పష్టంఅయింది. మరోమూడేళ్ళకి పూర్తిగా గుడ్డితనం వచ్చేసింది. 1930లో కాళ్ళన్నీ పూర్తిగా బిగిసిపోయేయి ఒక్కచేతులూ, మోచేతులూమాత్రమే స్వాధీనంలో వున్నాయి.

ఆరోగ్యం చిక్కుతుందనే ఆశపోయింది. ఇంక ఓస్త్రొవ్‌స్కీ తన జీవితానికి ఒక గమ్యాన్ని, సార్థక్యాన్నికూర్చుకొనేటందుకు ఒక పథకం వేసుకొన్నాడు. కదలమెదలలేకపోయినా ప్రజలూ, వారి పోరాటాలకూ దూరంగావుండడం ఆతనికి సాధ్యంకాలేదు. ఈమారు మరోకొత్త ఆయుధంతో రంగంలోకి దిగజాలేడు. రచనలను ఈమారు తన ఆయుధం చేసుకోదలచేడు. కొత్తగావస్తున్న యువకులకు నూతనోత్తేజాన్నీ, కమ్యూనిస్టు శిక్షణనూ అందించగల రచన సాగించాలనుకొన్నాడు. ఆ విధంగా పార్టీకి సేవచేయుబూనుకొన్నాడు.

ఈదీర్ఘవ్యాధి ప్రారంభమైన కొత్తలో, బహుశా 1925 లోనో 26 లోనో మొట్టమొదటిమారు ఆయనకీ తలోచన కలిగింది. ఆ ప్రారంభదినాలలో కామ్‌సోమాల్ సభ్యుల కార్యకలాపాలూ వాటిని గురించి కథలు కథలుగాచెప్పడం ఆతనికి బహుసరదాగా వుండేది. ఆకథలు చెప్పడంలో మంచి నేర్పుచూపేవాడు. కాని, ఆనాటికి వానిని పుస్తకరూపంలో పెట్టాలనే ఆలోచన ఏర్పడలేదు. కమ్యూనిస్టు యూనివర్సిటీలో హోస్టుద్వారా విద్యాభ్యాసం పూర్తిచేసేకగాని తన దేశాన్నీ, ప్రజల్నీ, తననూకూడ మార్క్స్–లెనిన్‌ల ఉపదేశాలు ఎంతగా మార్చివేయుగలిగేయో అర్థంకాలేదు.

లెనిన్ స్టాలిన్‌లు నిర్మించినపార్టీ తనదేశాన్ని విముక్తి చేయడంలోవున్న గొప్పతనమూ, తన అనుభవాలలోని విశేషమూ ఆతనికి స్పష్టంగా అర్థంఅయింది అప్పుడే.

పుష్కిన్, గోగోల్, తర్జినేవ్, టాల్‌స్టాయ్, చెహోవ్, గోర్కీ మొదలయిన సుప్రసిద్ధ రష్యను రచయితల రచనల నాతడు జాగ్రత్తగా చదివేడు. గోర్కీ వ్రాసిన 'అమ్మ' నవలా, కథలూ అంటే ఆతను చెవికోసుకొనేవాడు. తర్వాత కళ్ళుపోయినాక మిత్రులచేతా, బంధువులచేతా గోర్కీరచనలు చదివించుకొని వినేవాడు. సాహిత్యంగురించీ, శ్రామిక వర్గరచయితల బాధ్యతలను గురించీ ఆయనవ్రాసిన భాగాలను విడిగా వ్రాయించి పెట్టుకొనేవాడు. అంతర్యుద్ధ కాలాన్నీ, ఆనాటి పోరాటాల్నీగురించి వచ్చిన రచనలను చదివేడు. ముఖ్యంగా డిమిట్రీఫర్మానోవ్ వ్రాసిన ఛాపయేవ్ తిరుగుబాటులన్నా, ఎ. సెరాఫిమోవిచ్ వ్రాసిన 'లావా' (ఐరన్‌ఫ్లడ్)అన్నా, ఫెడయేవ్ వ్రాసిన 'డిబకల్' అన్నా ఆతడెంతో ప్రియంగా వినేవాడు.

ఆ తర్వాత మొదటి పంచవర్షప్రణాళిక, బ్రహ్మాండమైన పరిమాణంలో పరిశ్రమల నిర్మాణం సాగిపోయింది. నూతనాభివృద్ధిని సాధించడానికై ప్రజలు విపరీతమైన ఉత్సాహాన్ని ప్రదర్శించేరు. లక్షలసంఖ్యలో కార్మికవర్గం అసమానమైన వీరత్వాన్ని ప్రదర్శించారు.

మాగ్నిటోగోర్‌స్కీలోని ఇనుము ఉక్కు కర్మాగారాల్నీ, దినీపర్ నదిమీద జలవిద్యుదుత్పత్తి కేంద్రాన్నీ, స్టాలిన్ గ్రాడ్‌లో ట్రాక్టర్ కర్మాగారాన్నీ, మొదటి ప్రణాళికక్రింద

ఎత్తుకున్న పరిశ్రమల్నీ నిర్మించడంలో దేశంఅంతటితో పాటు కామ్‌సోమాల్‌సభ్యులు లక్షలసంఖ్యలో అసమాన త్యాగసాహసాల్ని ప్రదర్శించేరు. సమిష్టివ్యవసాయక్షేత్రాల వుద్యమంలో కోట్లకొలది రైతాంగం చేరింది.

ఈ ఘటనలమధ్య ఓస్ట్రోవ్‌స్కీ కథానాయకుడు పరిణతి పొందేడు.

1930 లో ఆయన రెండుకళ్ళూ పోయేయి. మనిషి మంచంమీాదినుంచి దిగలేదు. ఆ దశలోవుండి ఆతడు శరీర బాధలకు మూలుగుతూనే 'కాకలుతీరిన యోధుడు' వ్రాతకు ఉపక్రమించేడు. కొంతవ్రాసేక మరి సాధ్యం అయిందికాదు. చెప్పి భార్యచేత వ్రాయించేడు. ప్రియమిత్రులు కొంతభాగం వ్రాసేరు. ఆవిధంగా దీని రచన 1933 జూన్ నాటికి పూర్తి చేసేడు.

ఇది కేవలం రచయిత ఆత్మకథ మాత్రమేకాదు. ఓస్ట్రోవ్‌స్కీ చెప్పినట్లు "కామ్‌సోమాల్ సభ్యుడు ఓస్ట్రోవ్‌స్కీ జీవితమేకాదు. ఇదో నవల."

ఆయన ఈ నవలలో తన జీవితంతోపాటు తన సమకాలీన యువజనుల జీవితాన్నికూడా దీనిలో చిత్రించేడు. వ్యతిరేక వాతావరణంలో నూతనతరం ఏవిధంగా రూపాన్ని కూర్చుకొంటూందో, ఆ వాతావరణాన్ని తన కనుకూలంగా తీర్చి దిద్దుకొనేటందుకు సాగిస్తున్నపోరాటాన్నీ, సోషలిస్టు సమాజ నిర్మాణానికై ప్రజానీకం సాగిస్తున్న కృషినీ దీనిలో వివరించేడు. నూతన మానవుని విలువలను, నూతనసామాజిక, నైతికవిలువలను చిత్రించేడు.

ఓస్త్రోవ్‌స్కీ గొప్ప కళాకారుడు. జీవితంలో కనబడే సునిశితమైన స్థైర్యధైర్యాల్నిగాని, నూతనసమాజనిర్మాణంలో ఎదుర్కోవలసివచ్చే కష్టనిష్ఠురాల్నిగాని, శిథిలమైపోతున్న పాతసమాజంలోని పీడన, తాడనలను గురించిగాని ఆతడు చెప్పకుండా దాచెయ్యలేదు, దాచిపెట్టనూలేదు. తన కథా నాయకుని లోపాల్ని చూపించడానికి సందేహించనూలేదు. తన కథానాయకుని పరిణామాన్ని చిత్రించడంలో పెట్టుబడి దారీవిధానావశేషాలను మానవుల మనస్సులనుంచి తొల గించడం ఏలాగో చూపించడంచేతనే ఓస్త్రోవ్‌స్కీ రచన కింత ప్రాముఖ్యతా ప్రజాదరం లభించింది.

* * *

1935 లో ఆయనకు లెనిన్ పదకం బహూకరించేరు. ఆసందర్భంలో జోసెఫ్ స్టాలిన్‌కు అభివందనలు తెలుపుతూ ఇల్లా వ్రాసేరు :

"నేను కామ్‌సోమాల్ సభ్యుడుగా పెరిగేను. మన సోవియట్ మాతృభూమిలోని కొత్తతరం యువకుల విద్యాభి వృద్ధికై నాబొందిలో ప్రాణమున్నంతవరకు కృషిచేస్తాను."

ఆయన తన మాట నిలబెట్టుకొన్నాడు.

"కాకలుతీరిన యోధుడు" మలిముద్రణకు తయారు చేస్తూనే ఆయన తన రెండో నవలను వ్రాయడానికి పూను కొన్నాడు. "అగ్నిగుండంలో" అనే ఆ నవలను వ్రాస్తున్న కాలంలోనే రెండో ప్రపంచయుద్ధపు ఘంటలు వాగుతూ

వస్తున్నాయి. బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో జపాను, జర్మనీలు సోవియట్ మీదికి యుద్ధ సన్నాహాలు చేస్తున్నాయి ఆ పరిస్థితులను వివరిస్తూ ఓస్ట్రోవ్‌స్కీ ఇల్లా అన్నారు.

"మనం అందరం శాంతంగా దేశపునర్నిర్మాణాన్ని కొనసాగిస్తున్నాం. శాంతి మన జెండా. మన పార్టీ, మన ప్రభుత్వమూ ఈ జెండాను ఎత్తిపట్టుకొంది... మనకు శాంతి కావాలి. కమ్యూనిజమ్ ప్రాసాదాన్ని నిర్మించాలంటే మనకు శాంతి అవసరం. కాని, మనచుట్టూవున్న కపటశత్రు కూటాన్ని గమనించకపోవడం ఆత్మద్రోహం అవుతుంది.

సోషలిస్టు సమాజంలో పెరుగుతున్న నూతనతరం యువకులకు వారి శత్రువులు ఎవరో చూపడానికై తన నూతన రచనలో పూనుకొన్నాడు.

"మనల్ని యుద్ధాలలోకి ఈడిస్తే, ఒక్కడుకూడా మనమతిప్పకుండా యుద్ధంలో నిలబడేటట్లు చేయడమే నా వుద్దేశం."

ఆ కొత్తనవలలో మొదటిభాగాన్నిమాత్రమే ఓస్ట్రోవ్‌స్కీ పూర్తిచేయగలిగేడు. ఆ పుస్తకం ప్రచురించబడి వెలువడిన రోజునే—1936 డిసెంబరు 22న—నికోలాయ్ ఓస్ట్రోవ్‌స్కీ మరణించేడు.

"మరణించేకకూడా మానవజాతికి సేవచేయగలగడం కన్న మనుష్యుడు కోరతగింది ఏముంది?"—అన్నాడు ఓస్ట్రోవ్‌స్కీ...

నిజంగా అంతే. అంతకన్న కోరదగింది ఏంవుంది? ఓస్ట్రోవ్‌స్కీ కోరిక నెరవేరుతూంది. ఈనాటికీ ఆయన రచనలు దేశదేశాలలో కోట్లకొలది యువకులకి ఉత్సాహానందాల్ని కలిగిస్తున్నాయి. మానవసౌఖ్యానికి మార్గాల్ని చూపుతున్నాయి. అంతకన్న కోరదగింది ఏముంది?



# ప్రకరణం 1

"ఈస్టర్ సెలవులకిముందు పరీక్షల్లో మాయింటికి వచ్చిన వాళ్ళెవరర్రా, మీలో."

ఉపాధ్యాయుడు తరగతివేపు గుచ్చిగుచ్చి చూస్తూ ప్రశ్నించేడు. ఆయన లావుపాటి మనిషి. మతాచార్యుడి దుస్తుల్లో వున్నాడు. మెళ్ళో క్రాస్ ఒకటి బరువుగా వేళ్ళాడుతూ వుంది.

ఆరుగురు పిల్లలు—నలుగురు బాలురూ, ఇద్దరు బాలికలూ గబగబా లేచి నిల్చున్నారు. ఆయనవేపు హడలిపోతూ చూస్తూన్నారు. మతాచార్యుడు ఆ ఆరుగురినీ ఉచ్చిపోయేలా చూసేడు.

ఆడపిల్లలవేపు తిరిగి ఆయన "కూర్చోండి" అన్నాడు.

అమ్మయ్య అనుకొని వాళ్ళిద్దరూ చటుక్కున కూర్చున్నారు.

ఫాదర్ వాసిలీ కళ్ళీమారు మిగిలిన నలుగురివేపూ తిరిగేయి.

"ఇల్లా రాండిరా!"

ఫాదర్ వాసిలీ లేచి నిలబడి కూర్చున్న కుర్చీని వెనక్కి తోసేడు. హడలిపోతూ ఒకరినొకరు ఒత్తుకుని నిల్చున్న ఆ నలుగుర్నీ ఆయన సమీపించేడు.

"మీలో చుట్టకాల్చే బడుద్ధాయి ఎవరురా?"

ఒకరిప్రక్క కొకరు ఒత్తుకుంటూ నలుగురూ ఒకే పర్యాయం సమాధానం యిచ్చేరు :

"మే మెవ్వరం కాల్చమండి!"

ఫాదర్ ముఖం జేవురించింది.

"ఒక్కరూ కాల్చరేం? ఐతే మా యింట్లో రొట్టె పిండిలో పొగాకుపొడుం పోసిందెవరురా? మాట్లాడరేం...?"

ఎవ్వరూ మాట్లాడ లేదు.

"నేనే చెప్తా వుండండి. జేబులేవీ, దగ్గిరిగా రాండి. తిరగేయరేం... ..."

వాళ్ళల్లో ముగ్గురు ముందు కదుగేశారు. తమ జేబులో వున్నవన్నీ టేబులుమీద పెట్టేసేరు.

జేబులు తిరగేసి కుట్టుమడతల్లో పొగాకు రజను కన బడుతుందేమోనని ఫాదరు బహుపరీక్షగా చూసేడు. ఏమీ కనిపించలేదు.

ఈమారు నాలుగో కుర్రవానిని పిలిచేడు.

"మొద్దులా అల్లానిల్చున్నా వేంరా."

కుర్రవాడు చూపుల్లో ద్వేషం వెలిగక్కుతూ నిశ్శబ్దంగా నిల్చున్నాడు.

"నా చొక్కాకి జేబుల్లేవు." మోకాళ్ళనద్ద టాకీలు వేసిన నీలిరంగు ట్రౌజరూ, బూడిదరంగు-చొక్కానూ తడిమి చూపేడు.

"జేబుల్లేవేం? అల్లాంటి వెధవపని ఎవరుచేస్తారో నాకు తెలియదనుకున్నావు కాదూ! ఇదివరకటల్లే వదిలేస్తాననుకోకు. నీకు ఓమూరు శాస్తిజరగాలిసిందే. వెనకటిసారి మీ అమ్మ వచ్చి బతిమాలుకుంటూందని వదిలేశా. ఇంక అదేంసాగదు. ఫో."

ఫాదర్ వాసిలీ ఆ కుర్రవాడిని చెవి మెలేస్తూ గది బయటకు తోసేసి తలుపు వేసేడు.

తరగతిలో పిల్లలంతా వణికిపోతూ నిశ్శబ్దంగా కూర్చున్నారు. వాళ్ళల్లో ఒక్కడికీ పావెల్ కోర్చాగినును ఫాదరు క్లాసులోంచి ఎందుకు పంపేసేడో తెలియదు. సెర్జీ బ్రూజక్ ఎరుగును. కాని వాడేమీ చెప్పడు. వాడూ, కోర్చాగినూ ప్రియమిత్రులు. ఆరోజున పాఠాలురాని పిల్లల్ని ఫాదర్ ఇంట్లోని వంటగదిలో కూర్చోబెట్టేరు. ఆయనవచ్చి పాఠాలు వప్పచెప్పుకొనేవరకూ కూర్చుని చదవమన్నారు. అక్కడ ఒక గిన్నెలో ఈస్టర్ కేక్ తయారు చేయడంకోసం పిండికలిపి పెట్టివుంది. కోర్చాగిన్ తనతో తెచ్చిన పొగాకు నలిపి ఆ పాడుం పిండిలో కలిపేడు. ఈ సంగతి సెర్జీకితప్ప మరెవ్వరికీ తెలియదు.

ఫాదర్ గెంటేసేక పావెల్ పోయి స్కూలుమెట్లమీద చతికిలపడ్డాడు. ఇల్లాజరిగిందనిచెప్తే తల్లి ఏమంటుందో అని

భయపడ్డాడు. వాళ్ళు చాల బీదవాళ్ళు. తల్లి ఎక్సైజు ఇనస్పెక్టరుగారింట్లో వంటపుట్టిగా కుదిరి నానాచాకిరీచేస్తూ అతనిని చదివిస్తూంది.

ఆతని కళ్ళల్లో నీళ్ళుతిరిగేయి.

" ఏమిటిచెయ్యడం ? ఆ ఫాదర్ ముండాకొడుక్కి తెగులా! రొట్టెపిండిలో పొగాకుగుండ వెయ్యాలనే బుద్ధి నాకు ఎందుకు కలిగిందో! సెర్యోజ్కాగాడే రేపెట్టేడు. "ముసలి పీనుగుని ఏడిపిద్దాంరా" అన్నాడు. చేశాం. సెర్యోజ్కా కేం. దాటిపోతాడు. నన్ను బళ్ళోంచి వెళ్ళగొడతారు."

ఫాదర్ వాసిలీమీాద పావెల్ కోపం ఈనాటిదికాదు. ఒకరోజున మిష్కాలెవ్ చుకోవ్తో వాడూ దెబ్బలాడుకున్నారు. టీచరు దానికి శిక్షగా పాఠాలయిపోయేకకూడా ఇంటికి పోనివ్వలేదు. ఎవ్వరూ లేకుండా క్లాసుగదిలో అట్టేపెడితే ఏదన్నా అల్లరిచేస్తాడని ఆయన వాడిని తనతో రెండో క్లాసుకు తీసుకుపోయి కూర్చోపెట్టేడు.

పావెల్ ఆ తరగతిలో వెనకాల కూర్చున్నాడు. పాఠాలు వింటున్నాడు. ఆ రోజున టీచరు భూమినిగురించి ఇతరగోళాలనుగురించి పాఠంచెప్తున్నాడు. పావెల్ కి అదంతా ఆశ్చర్యంగావుంది. భూమి కొన్ని కోట్ల సంవత్సరాలక్రితం ఏర్పడిందనీ, నక్షత్రాలుకూడా మనం వున్న భూమివంటివే ననీ ఆయన చెప్తూంటే ఆశ్చర్యం అనిపించింది. మళ్ళీ ఏం గొడవ వస్తుందోననే భయంలేకపోతే "బైబిల్ లో అల్లా చెప్పలేదే" అనేసేవాడే.

పావెల్‌కు బైబిల్ అంతా కంఠోపాఠమే. పాత, కొత్త నిబంధనలు రెండూ తుదివరకూ చదివేసేడు. దేవుడు ఏ వారంనాడు ఏమేమిటి సృష్టించేడో వాటికి నాలిక చివరనే వున్నాయి. బైబిలుపాఠంలో మంచి మార్కులు తెచ్చుకొనేవాడు.

అతడు నేర్చుకొన్నదానికి ఇక్కడ టీచరుచెప్పేది విరుద్ధంగావుంది. అదేమిటో ఫాదర్ వాసిలీని అడిగి తేల్చుకోవాలనుకొన్నాడు. మళ్లీ పాఠంనాడు ఆయనవచ్చి కుర్చీలో కూర్చున్నాడో లేదో పావెల్ చెయ్యెత్తేడు. ఆయన అనుజ్ఞ తీసుకొని లేచి నిలబడ్డాడు.

"ఫాదర్! రెండోతరగతి మేస్టారు భూమిపుట్టి కొన్ని కోట్ల ఏళ్ళయిందన్నారు. మరి బైబిల్‌లో అయిదువేల ఏళ్ళ..."

ఫాదర్ వాసిలీ హుంకరించేసరికి హడలిపోయి మాట మధ్యనే నిలిపేసేడు.

"ఏమిట్రా అన్నావు. వుంధాకోరా! బైబిల్‌లో నువ్వు చదివింది ఇదిట్రా?"

మళ్ళీ సమాధానం చెప్పేలోపునే ఫాదర్ వానిని ఎడాపెడా వాయించి తలకాయ గోడనేసి కొట్టేడు. తెలివొచ్చి చూసేసరికి పావెల్‌కి తాను క్లాసుగది బయటనున్నానని అర్థం అయింది. తల అంతా నొప్పిగావుంది.

ఆ సంగతి విన్నప్పుడు వాళ్ళమ్మా తిట్టింది. మర్నాడు వెళ్ళి కొడుకుని బళ్లోకి రానివ్వమని ఫాదర్ వాసిలీని బ్రతిమ

లాడుకొంది. ఆ రోజు మొదలుకొని పావెల్‌కు ఫాదర్ మీద తగనికోపమూ, అసహ్యమూను. రెంటివేపున భయమూ లేకపోలేదు. తనకి అన్యాయం జరిగించని ఆ కుర్రవాడి మనస్సు మండిపోతూంది. అనవసరంగా కొట్టిన ఫాదర్ మీద వానికి కోపం తీరనేలేదు. ఆయన ముఖం కనబడితే చాలు ధుమధుమలాడుతాడు. పళ్ళు కొరుక్కుంటాడు.

అది జరిగేక ఫాదర్ వాసిలీ వానిని చాలమార్లు కించపరిచేడు. చీటికిమాటికీ క్లాసులోంచి బయటికి పొమ్మనేవాడు. ఏదో చిన్నపొరపాటు జరిగిందని రోజులూ, వారాలూ తరబడి బెంచీమీద నిల్చోబెట్టేవాడు. వాని నొక్క ప్రశ్న అడిగేవాడు కాదు. దానితో ఈస్టర్ సెలవులకిముందు పాఠాలు వొప్పచెప్పలేకపోయేడు. మళ్ళీ వొప్పచెప్పుకొంటానంటూ ఫాదర్ వానిని మిగిలిన మొద్దబ్బాయిలతోపాటు ఇంటికి రప్పించుకొన్నాడు. అప్పుడే జరిగిందీ ఘటన.

రొట్టెపిండిలో పొగాకుగుండ పోస్తుండగా ఎవ్వరూ చూడలేదు. అయినా ఫాదర్ కనిపెట్టేసేడు.

పాఠం అయిపోయేక పిల్లలంతా బయటికి వచ్చేసేరు. మూతి ముడుచుకు కూర్చున్న పావెల్ చుట్టూ మూగేరు. సెర్జీబ్రూజక్ క్లాసులోంచి బయటకు రాలేదు. ఇందులో తన తప్పువున్నదని మనస్సు పీకుతూంది. కాని, ఏమీ చెయ్యలేదు.

టీచర్ల గది కిటికీలోంచి హెడ్‌మాస్టరు బయటకు కేకవేసాడు.

"కోర్చాగిన్‌ను వెంటనే ఇల్లారమ్మనండి రా."

ఆ కేకకి పావెల్ ఉలికిపడి లేచాడు. హడలిపోతూ వెళ్ళేడు.

*          *          *

రైల్వేస్టేషన్ హోటల్ యజమాని పావెల్ వేపు ఒక్క క్షణం చూసేడు.

"ఎన్నేళ్ళున్నాయి"

"పన్నెండు"

"సరే, ఉంచు. పనిచేసిన రోజుల్లో అన్నంపెడతాం. నెలకెనిమిది రూబుళ్ళిస్తాం. రోజువిడిచి రోజు రాత్రీ, పగలూ పనిచెయ్యాలిసి వుంటుంది. చేతిదెబ్బకొట్టే గుణంగాని లేదు కదా ?"

తల్లి ఆదుర్దాగా భయపడుతూ అటువంటిదేమీ చెయ్యడంది.

"లేదు బాబూ ! దానికి నేను పూచీ."

"అయితే ఈవేళే వచ్చి పనిలో చేరమను."

యజమాని కౌంటరువద్దనున్న పడుచుకు పావెల్‌ను చూపించేడు.

"జినా ! ఈ కుర్రవాడిని వంటింట్లోకి తీసుకెళ్ళి ఫ్రోశ్యాకు వప్పచెప్పు. గ్రిష్కాకు బదులు వీడిని పనిలో వుంచమను."

మూసంస్ని కోస్తున్నకత్తిని క్రిందపెట్టి జినా పావెల్‌ను తనతో రమ్మని తల విసిరింది. హాలులోంచి ప్రక్కద్వారం గుండా గిన్నెలు కడిగేచోటికి తీసుకెళ్ళింది.

తల్లి పావెల్‌ని గుమ్మందాకా సాగనంపి చెవిలో రహస్యంగా ధైర్యంచెప్పింది.

"నాయనా! పావ్లూషా! ఒళ్ళు దాచుకోకుండా పని చెయ్యి. మంచి పనివా డనిపించుకో."

వాడు వెళ్ళిపోయేవరకూ విచారంగా అలాగే చూస్తూ నిలబడింది. తర్వాత నెమ్మదిగా కదిలి వెళ్ళిపోయింది.

పాత్రలు కడిగేచోట మహా హడావిడిగా వుంది. ప్లేట్లు, ఫోర్కులు, చాకులు బల్లమీద దొంతరులుగా పేరుకుంటూంటే చాలమంది ఆడవాళ్ళు భుజాలమీది తుండుగుడ్డలతో వాటిని తుడుస్తున్నారు.

రెండు పెద్ద సామోవర్ల వద్ద ఒక చింపిరిజుట్టు కుర్రవాడు నిల్చుని మంటపెడుతున్నాడు. వాడు పావెల్‌కన్న కొంచెం పెద్దవాడు.

ఒక పెద్దతొట్టెలో నీళ్ళు సలసల మరుగుతున్నాయి. ఆవిరి గదిఅంతా కమ్ముకొని మసక మసకగావుంది. మసులుతున్న నీళ్ళలో పళ్ళేలూ అవీ కడుగుతున్నారు. ఆ ఆవిరి తెరలో వాళ్ళముఖాలుకూడా సరిగ్గా కనపడ్డంలేదు. ఏం చెయ్యాలో తెలియక పావెల్ తటపటాయిస్తూ నిల్చున్నాడు.

జినా అక్కడ పళ్ళేలు కడుగుతున్న ఒకామెవద్దకు వెళ్ళి భుజంతట్టింది.

"చూడు, ఫ్రోశ్యా, గ్రిష్కాకి బదులు పనికోసం మరో కుర్రవాడిని తీసుకొచ్చా. ఏంపని చెయ్యాలో చెప్పి చేయించు."

జినా ఫ్రోశ్యాను పావెల్‌కు చూపింది.

"ఆవిడది ఇక్కడిపని. ఆవిడ చెప్పినట్లు చెయ్యి."

జినా తనపని పూర్తిచేసుకొని స్వస్థలానికి తిరిగి పోయింది.

"ఊఁ"

ఏం చెయ్యమన్నావన్నట్లు పావెల్ ఫ్రోశ్యాముఖం వంక చూసేడు. ఆమె ఒక్కక్షణం వానిని ఆపాదమస్తకం పరీక్షగా చూసింది. నుదుటిచెమట ఒత్తుకొంటూ, దిగజారిన చొక్కాచేతిని పైకిమడుచుకొంది. ఆమె గొంతులో ప్రేమ, మాధుర్యం వినిపించేయి.

"ఇదేమంత పెద్దబరువు పనికాదురా నాయినా! కాని, దీనికి తెమలిక అంటూవుండదు. చూడు ఆ మూల నున్న రాగిగుండిగ! దాని క్రింద తెల్లవారకుండా మంట చెయ్యాలి. ఎప్పుడూనీళ్ళు సలసలలాడేటట్లు మంట దిగజారకుండా వుంచాలి. అవసరమైతే పేళ్ళుపగలెయ్యాలి. చూడు ఆ సామోవర్ల క్రింద మంటసంగతి చూస్తుండాలి. ఒక్కొక్కప్పుడు చాకులు, ఫోర్కులు కడగాలి. మురికినీళ్ళు పట్టుకుపోయి బయట పారపోస్తుండాలి. ఏవో బోలెడన్ని పను లుంటాయి."

ఆవిడమాటల్లో "కాస్త్రోమకా" యాస వినిపిస్తోంది. ఆ మాట యాస, ధోరణి, చిన్నముక్కు, కంప ఎర్రబారిన ముఖమూ చూస్తే పావెల్ మనస్సు కుదటపడింది.

"మంచిదిలాగే వుంది"—అనుకొన్నాడు, పావెల్. బిడియం తగ్గింది. నెమ్మదిగానే తన పనేమిటన్నాడు.

"మామ్మా! ఇప్పుడేం చెయ్యను?"

పళ్ళేలు కడుగుతున్నవాళ్ళంతా పక్కున నవ్వేరు.

"ఫ్రోశ్యా, ఎక్కడో మనమణ్ణి సంపాదించిందే—"

మిగిలినవాళ్ళకన్న ఫ్రోశ్యాయే మరీ విరగబడి నవ్వింది.

ఆవిరి తెరలో ఫ్రోశ్యా ఇంకా చిన్నపిల్లయేనన్న సంగతి పావెల్‌కు తెలియలేదు. ఆమె వయస్సు పద్ధెనిమిదేళ్ళకు మించదు.

పావెల్ చిన్నపుచ్చుకొని, అక్కడున్న కుర్రవాడి నడిగేడు.

"ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు?"

ఆ కుర్రవాడూ పకపకలాడుతున్నాడు. మీ "మామ్మనే అడుగు. ఆవిడ చెప్తుంది. నే పోతున్నా"— అంటూ వాడు ఒక్క ఉదుటులో వంటగది గుమ్మంగుండా పరుగెత్తిపోయేడు.

పళ్ళేలు కడుగుతున్నవాళ్ళల్లో నడికారు ఆమె ఒకతె పావెల్‌కు పనిచెప్పింది.

"ఇల్లారా, బాబూ! ఈఫోర్కులు కాస్త తుడు."

పావెల్‌కు ఒక తువ్వాలు సందిస్తూ ఆమె మిగిలిన వాళ్ళని గదమాయించింది.

"ఎందుకర్రా వికవికలాడుతారు? పాపం వాడేమన్నాడని..."

"ఇదిగో చూడు. తువ్వాలు ఒకకొస పళ్ళతో కరిచిపట్టు. రెండో వేపు చేత్తో సాగలాగిపట్టుకో. ఇదిగో ఇల్లాగ ఫోర్కు పళ్ళమధ్యనుంచి తువ్వాలుమార్చి మకిలి ఏమీ లేకుండా తుడవాలి. వాళ్ళతో పెద్దపేచీ వస్తుందిసుమీ. వచ్చినవాళ్ళు ఫోర్కులీన్నీ, చాకులీన్నీ మహాపరీక్షగాచూస్తారు. కాస్త మకిలి కనిపించిందంటే ఊరూ వాడా ఏకంచేసేస్తారు. యజమానురాలు గూబ కదలేసి వీధిలోకి తోసేస్తుంది. జాగ్రత్త."

పావెల్‌కి ఆశ్చర్యం వేసింది.

"యజమానురాలు! ఆవిడెవరు? ఇందాక నాకు పని యిచ్చిన ఆయనే యజమాని అనుకున్నానే."

ఆమె నవ్వింది.

"యజమాని ఒక వట్టి అజగరం. ఈ చెంబూ, తప్పేలాలాగే వకపదార్థం. అసలు పెత్తనమంతా ఆవిడిదే. ఈవేళ ఆమె యిక్కడలేదు. రెండురోజులు చూస్తే నీకే తెలుస్తుందిలే."

అంట్లు తోసే గదితలుపు తెరుచుకొని ముగ్గురు 'వైటర్లు' ఒకరితర్వాత ఒకరు లోపలికి వచ్చేరు. వాళ్ళ చేతుల్లోవున్న తట్టలలో ఎంగిలిపళ్ళేలు దొంతరదొంతర్లుగా వున్నాయి.

తలుపుచెక్కలా వెనుపట్టి, మెల్లకన్నువున్న ఒకడు గదమాయిస్తూ పని త్వరగా జరగాలన్నాడు.

"చురుగ్గా కానియ్యండి. పన్నెండు కావచ్చింది. మీరింకా ఇల్లాగే వున్నారు."

ఇంతలో పావెల్ వాని కంటబడ్డాడు.

"వీ డెవరు ?"

ఫ్రోశ్యా సమాధానం ఇచ్చింది.

"కొత్తగా వచ్చేడు."

"కొత్తవాడా?... ఏయ్' కుర్రాడా, ఇల్లాచూడు..."

వాడు పావెల్ భుజంమీద చెయ్యేసి సామోవర్ల వేపు తోసేడు.

"వాట్లల్లో నీరు ఎప్పుడూ మసలుతూండాలి. మంట చూస్తూండాలి. చూసేవా. దీని క్రింద మంట దిగజారి పోయింది. ఈ వేళ కేదో అయిపోయింది. కాని, రేపూ ఇల్లాగే జరిగిందా ముక్కు బద్దలుకొట్టేస్తా, చూసుకో."

పావెల్ ఏమీ అనలేదు. సామోవర్ల క్రింద మంట చేసేడు.

ఆవిధంగా చాకిరీ ప్రారంభమయింది. పనిలో చేరిన రోజున పడ్డంతకష్టం పావెల్ జీవితంలో ఎరగడు. అమ్మమాట వినకుండా పని ఎగెయ్యడానికి ఇదేం స్వంతఇల్లుకాదు. చెప్పిన పని వెంటనే చెయ్యకపోతే పని సాగ్లాపడదని ఆ మెల్లకన్ను వాడు ఖచ్చితంగా చెప్పేసేడు.

గట్టిగావిసిరి సామోవర్ల క్రింద మంటలు క్షణంలో లేపేడు. చెత్తడబ్బా చేతులమీద ఎత్తుకొని ఒక్కఉరుకున వీధిలోకి ఉరికి చెత్తకుండీలో పారపోసి వచ్చేడు. వేడి నీళ్ళ గుండిగ క్రింద కట్టెలు వేసేడు. పళ్ళేలుతుడిచిన తడితువాళ్ళని సామోవర్ల మీద చుట్టి క్షణంలో ఆరబెట్టి ఇచ్చేడు—ఒక్క మాటలో చెప్పాలంటే, చెప్పినపనల్లా చేసేడు. ఆ రోజున పనులు పూర్తి చేసుకొని పడుకొనేందుకు వంటయింట్లోకి వెళ్ళేసరికి పావెల్ కాళ్ళు తేలిపోతున్నాయి. అసీసియా (పళ్ళేలు కడుగుతున్న వాళ్ళలో నడివయసామె) పావెల్ వెళ్ళి పోయాక వానినిగురించి జాలిపడింది.

"కుర్రాడు తమాషావవాడు. అటు ఇటూ చక్ర బిళ్ళలా తిరుగుతున్నాడు. అల్లాంటివాడిని అప్పుడే పనిలోకి ఎందుకుపంపేరో." ఫ్రోశ్యా తలవూపింది. "మంచి పని వాడు; రెండోమాటు చెప్పనక్కర్లేదు."

లూషా "అదెన్నాళ్ళు లే"-అంది.—"అంతా మొదట్లో అల్లాగే వుంటారు."

* * *

ఆ వెనకటి రాత్రంతా పనిచేసిచేసి, తెల్లవారి ఏడు గంటలవేళకి పావెల్ బాగాఅలిసిపోయేడు. తనకు బదులుగా పనిచేయడానికి వచ్చిన కుర్రవాడికి సామోవర్లు వప్పచెప్పి బయలుదేరేడు. ఆ బుంగమొహం కుర్రాడు వికారంగా చూసేడు. సామోవర్ల క్రింద మంటలు భగభగ మండు తున్నాయి. పెద్దమేస్త్రీలా రెండుచేతులూ జేబుల్లో పెట్టు

కొని, పళ్ళసందునుంచి ఉమ్మి వేస్తూ తల ఎగ రేసేడు. మహా పొగరుబోతుతనంగా గదమాయించేడు.

"ఒరే చప్పిడిముక్కా! ఇల్లాచూడు. రేపు తెల్లవారి ఆరుగంటలయ్యేసరికి యిక్కడుండాలి తెలుసా?"

"ఆరింటి కెందుకు? పిస్తు పూరపటం ఏడింటికిగా?"

"దానికేంలే. నువ్వు ఆరింటి కిక్కడికి వచ్చితీరాలి. వాగేవంటే పళ్ళు రాలిపోతాయి. నిన్న పనిలోకి వచ్చేవో లేదో అప్పుడే నీలుగుతున్నావు."

పళ్ళేలు కడిగేవాళ్ళు అప్పుడే తమవంతుపని ముగించు కొని వచ్చేరు. ఆ కుర్రాళ్ళ సంభాషణ వింటూ నిలబడ్డారు. రెండోకుర్రాడి బెదరింపూ, దబాయింపూ చూస్తే పావెల్ కి మంట పుట్టింది. అదేవో కసుక్కుంటూ పన్నెట్లు పిడికిలి బిగించి ఒక్కడుగు వేసేడు. కాని అంతలో తనపని కాస్తా పోతుందేమోనని భయంవేసి తగ్గేడు. ఐనా కోపం చల్లార లేదు.

"అట్టేవాగకు. కొంచెం తగ్గు. మరీ తెగనీలిగితే ఒళ్ళు మర్దనా అవుతుంది. రేపు ఏడుగంటలకొస్తాను. నీపాటి నాకు చేతకాకపోలేదు. ఏం? ఓ చూపు చూసుకొందామంటా వేమిటి?

రెండో కుర్రాడికి పావెల్ ముఖంవంక చూసేసరికి భయంవేసింది. ఆశ్చర్యమూ కలిగింది. జంకుతూ కొళ్ళాగు ప్రక్కకి తప్పుకొన్నాడు. కొత్తకుర్రాడు పేచీకి సిద్ధం అవు తాడని వాడు అనుకోలేదు. గొణుక్కుంటూ వెనకతిరి గేడు.

"అల్లాగేలే. చూద్దాం."

మొదటిరోజున ఏవిధాగొడవలు లేకుండానే పావెల్ పనిముగించుకొని ఇంటికి చేరేడు. తానూ పనివాడయ్యేడు. పక్కేకూర్చుండి తింటున్నాడని ఎవ్వరూ ఆతడి ననలేదు.

ఉదయభానుడు రంపపుమిల్లు కప్పుమీదికెక్కి వస్తున్నాడు. పావెల్ రెండు జిందీక్కలతోట దాటేడు. ఆవలి ప్రక్కనే లాగనియిల్లు.

"అమ్మ ఇప్పుడేలేచి వుంటుంది."— అనుకొంటూ ఆతడు వడిగా అడుగులువేసేడు. సన్నగా ఈలపాట పాడుతూ నడుస్తున్నాడు.

"బట్టోలంచి తరిమేస్తే మనిషేం కొంపమునిగిపోలేదు. ఆ దిక్కుమాలిన షావిరీ నా ప్రాణాలు ఎల్లాగూ కొరుక్కు తినేవాడు. ఇప్పుడు గింజుకుచావనమ్మా."

పావెల్ కోరడిగుమ్మానికున్న తాడుగొళ్ళెంతీస్తూంటే ఆవేళ తనతో పేచీపెట్టుకొన్న కుర్రాడిమాట గుర్తువచ్చింది.

"వెధవ! బుంగలా మొహం వాడూ. ఏదో ఓరోజున వాడికి నాచేతిలో దెబ్బలుతప్పవు."

పావెల్ వచ్చేసరికి ఆతనితల్లి ముంగిటివాకిట్లో సామోవర్ క్రింద నిప్పు రాజేస్తూంది. కొడుకును చూడగానే ఆతురతతో లేచింది.

"పనెలావుందిరా నాయనా?

"బాగానేవుంది."

తల్లి ఏదో అనబోతూంది. ఇంతలో కిటికీవద్ద నిలబడ్డ అన్ననుచూసేడు.

"ఆర్టెమ్ వచ్చేడా?"

"నిన్న రాత్రి. ఇంక ఇక్కడే వుంటాడు. రైల్వే యార్డులో పని చూసుకొంటాడు."

పావెల్ నెమ్మదిగా వీధితలుపు తెరిచేడు.

ఆతని అన్న గుమ్మానికి వీపుతిప్పి బల్లవద్ద కూర్చుని వున్నాడు. తలుపు చప్పుడుకాగానే వెనుతిరిగి చూసేడు. దట్టమైన కనుబొమల్లోంచి ఆతనిచూపులు చాల గంభీరంగా కనపడ్డాయి.

"ఏమిరోయ్, పోగాకు! ఎల్లావుందేమిటి వ్యవహారం?"

అన్నగారేమంటాడోనని పావెల్ జంకుతూనేవున్నాడు.

"ఆర్టెమ్‌కి అప్పుడే అన్నీ తెలిశాయన్నమాట. చీవాట్లూ, చెప్పుదెబ్బలు తప్పవు" అనుకుంటూ పావెల్ అన్నఎదుట జంకుతూ నిలబడ్డాడు.

ఆర్టెమ్ తమ్ముణ్ణి కొట్టేధోరణిలోవున్నట్లు లేదు. మోచేతులు రెండూ బల్లమీద ఆనించి ముందుకు వంగి తమ్ముని వేపు ఎకసక్కెమూ, యీసడింపూ కనబరచేడు.

"ఇక్కడికి చదువు పూర్తి అయిందన్నమాట. ఇంక చెత్తా-చెదారం ఎత్తుతావు. అంతేనా?"

పావెల్ తలవంచుకొని నేలబీటల్ని పరీక్షిస్తూ నిల బడ్డాడు. ఆర్టెమ్‌లేచి వంటింట్లోకి వెళ్ళేడు.

పావెల్ అనుకోన్నాడు — "దెబ్బలు తప్పేయి."

తర్వాత భోజనంవేళ ఆర్టెమ్ బళ్ళో జరిగిన గొడవ గురించి అడిగేడు. పావెల్ జరిగిందంతా చెప్పేడు.

తల్లి విచారపడింది.

"ఇప్పుడే ఇంత అల్లరైతే పెద్దవాడయ్యేక ఎల్లా వుంటాడు? ఎవరిపోలిక వచ్చిందో, ఏమో. వీడితో ఎల్లాగ? కొంపమీదికి ఏంతెస్తాడో యనే భయం."

ఆర్టెమ్ చేతిలోవున్న ఖాళీకప్పు క్రింద పెట్టేసి తమ్ముడికేసి చూసేడు.

"ఒరేయి! అయిందేదో అయిపోయింది. ఇంకనుంచేనా జాగ్రత్తగావుండు. ఒళ్ళువొంచి పనిచెయ్యి. అల్లరిచిల్లర వేషాలేయకు. ఈపని పాడుచేసుకోన్నావా తాట ఎక్కేస్తా. జ్ఞాపకంవుంచుకో. ఇప్పటికే అమ్మ నీమూలంగా బెంగపెట్టుక్కూర్చుంది. ఎప్పుడూ ఏదోపేచీ తీసుకొస్తూనే వున్నావు. ఇంకేనా జాగ్రత్తగావుండు. ఓ ఏడాది పనిచెయ్యి. తర్వాత రైల్వేడిపోలో అప్రెంటిస్‌గా చేర్పిస్తా. అంట్లు తోముకుంటే ఏమవుతుంది? ఏదో పని నేర్చుకోవాలిగాని, ఇప్పుడింకా చిన్నవాడివి. ఓ ఏడాది పోతే ఏదోచూద్దాం. వాళ్ళు పని ఇవ్వకపోరు. ఇంక నేనూ ఇక్కడేవుంటాను. అమ్మని పనికిపోనివ్వొద్దు. వెధవ కొంపల్లోచేసిన చాకిరీచాలు. పావ్కా! ఇల్లాచూడు. అల్లరి చిల్లరగా వుండకూడదు. పెద్దమనిషి కావాలిగాని, తెలుసా?"

ఆర్గెన్ లేచేడు. కుర్చీనిగా ప్రక్కకేసి కోటు తీసి తొడుక్కుంటూ, "ఓ గంట అల్లాతిరిగొస్తాను సాన్యా!" అన్నాను.

వెడుతూ వెడుతూ కిటికీవద్ద నిలబడి పావెల్ ను పిలిచేడు.

"నీ కోసం బూట్లూ, ఓ చాకూ తెచ్చేను. అమ్మనడుగు ఇస్తుంది."

* * *

స్టేషన్ లో. హోటలు రాత్రీపగలూ తెరిచేవుంటుంది.

అదో జంక్షను అక్కడ ఆరు వేపులనుంచి రైలుమార్గాలు కలుస్తాయి. రాత్రివేళ గంటో, రెండుగంటలోతప్ప అస్తమానం బళ్ళు వస్తూపోతూనే వుంటాయి. స్టేషను ఎప్పుడూ హడావిడిగానే వుంటుంది. వందలకొద్దీ రైళ్ళు ఆ స్టేషన్ గుండా నలుమూలలకీ పోతుంటాయి. ఒక యుద్ధరంగంనుంచి మరోరంగానికి సైన్యాల్ని చేరవేస్తూ రైళ్ళువస్తూ, పోతూనే వుంటాయి. గాయపడ్డవాళ్ళని వేలకొద్దిమందిని మోసుకు వస్తుంటాయి. బూడిదరంగు దుస్తుల్లో సైనికులు ప్రవాహంలా స్టేషన్ మీదుగా పోతుంటారు.

పావెల్ అక్కడ రెండేళ్ళు పనిచేసేడు. ఆ రెండేళ్లూ అంట్లుతోమేచోటూ వంటవండేచోటూ తప్ప వాడు మరో పని ఎరగడు. వంటశాల నేలమాళిగ గదిలోవుంది. దాంట్లో ఇరవై మంది పనివాళ్ళు ఊపిరి తిప్పుకునేటందుకు లేకుండా పనిచేస్తుంటారు. వంటశాలకీ, హోటలుహాలుకీ మధ్య పది మంది వైటర్లు ఒక చేడుపకులూ, పసగులూమీద వుంటారు.

ఇప్పటికి పావెల్ జీతం ఎనిమిది నుంచి పదికి పెరిగింది. ఈ రెండేళ్ళలోనూ మనిషి బాగా సాగేడు. ఒళ్ళు గట్టిపడింది. ఈ మధ్యకాలంలో చాలకష్టమూ పడ్డాడు. మధ్య ఆరు నెలల పాటు వంటశాలలో అదీ ఇదీ అందించడానికి పెట్టేరు. కాని మళ్ళీ ఎందుకో అంట్లు తోమడానికి పంపేసేరు. ఎందుకో వంటమేస్త్రీకి వాడిమీద కోపం వచ్చింది. చెవులు మెలేస్తే ఎప్పుడో అతాత్తుగా కత్తితో పొడిచేస్తాడని అతనికి భయం కలిగింది. కష్టపడి పనిచేస్తాడనేది లేకపోతే పావెల్ కోపదారితనం మూలంగా ఆ వుద్యోగం కాస్తా ఎప్పుడో వూడిపోయేది. వాళ్ళల్లో అంత కష్టపడగలవాడూ, ఓప్పున్నవాడూ మరోడు లేడు.

మంచి పనిరద్దీ సమయాల్లో ప్లేట్లు పేర్చిన తట్టలు తీసుకొని వంటయింటి మెట్లు రెండూ, మూడూ ఒక్కంగలో దాటేస్తూ పరుగులెత్తుతాడు.

అర్థరాత్రివేళ హోటలులోని రెండు హాళ్ళూ ఖాళీగా వున్న సమయాల్లో వైటర్లంతా సామాన్ల గదిలో చేరుతారు. డబ్బుపెట్టి పేకాటలతో కాలక్షేపం చేస్తారు. పెద్ద మొత్తాలు చేతులుమారడం పావెల్ అనేకసార్లు చూసేడు. ఒకటీ అరా రూబుళ్ళ బహుమానాలచొప్పున ప్రతిషిఫ్టులోనూ ప్రతి వైటరికీ ముప్పయి నలభయి రూబుళ్ళు వసమానం వుంటుంది. అదంతా వాళ్ళు జూదమాడీ, త్రాగేసీ తగలబెడుతూంటే పావెల్‌కెంతో అసహ్యం.

“చచ్చు వెధవలు. ఆర్టెమ్ ఎల్లాంటి పనివాడు! వాడికొచ్చేది నెలకి నలభయ్యెనిమిది రూబుళ్ళు. నాకొచ్చేది

పడి. ఆ మొత్తం వీళ్ళకొక్కరోజులో వస్తుంది. తీరాచేసి వీళ్ళుచేసే పనేమిటి? ఫలాహారపు పళ్ళేలు అటూ ఇటూ మొయ్యడమేగా. ఇంక ఆ డబ్బంతా తాగీ, పేకాడీ తగలేస్తున్నారు."

యజమానుల్ని చూసినట్లే, వెయిటర్లనికూడా పావెల్ ద్వేషిస్తాడు.

"చేతులు నలుపుతూ వెధవలు పందుల్లా దొర్లుతారు. అక్కడ ఇళ్ళదగ్గర వీళ్ళ పెళ్ళాలూ, పిల్లలూ లక్షాధికార్లలా వేషాలుపోతారు."

కాలేజీలలో వేసే యూనిఫారాలుతొడిగి కొడుకుల్ని ఒకొక్కప్పుడు ఆ హోటలుకు తీసుకొస్తుండేవారు. ఎప్పుడేనా వాళ్ళభార్యలు వచ్చేవారు. శుభ్రమైనతిండి వుంటుందేమో వాళ్ళు బొద్దుగా దూదిబొరెములల్లే వుంటారు.

"వీళ్ళు పదార్థాలు వడ్డించే పెద్దమనుష్యులదగ్గరకన్న వీళ్ళదగ్గిరే ఎక్కువ డబ్బుంటుంది"—అనుకొనేవాడు పావెల్.

వంటశాలలో చీకటి మూలల్లోనూ, సామాన్లగది లోనూ అర్ధరాత్రివేళ సాగే కామకలాపాలకూడా పావెల్ అలవాటుపడిపోయేడు. అక్కడి పెత్తందార్లకి మానం అమ్ముకోని ఆడవాళ్లెవ్వరూ అక్కడ ఒక్కరోజు పనిచేయ లేరని అతడు గ్రహించేడు.

ప్రతి చిన్నవిషయాన్నీ, ఎంతో ఆసక్తితో, ఆశ్చర్యంతో పరిశీలించే పావెల్‌కు ఆ జీవితంలోని నిగూఢమైన

లోతులు తెలియడం కష్టంకాదు. అక్కడ పేరుకొన్న మురికి, దుర్వాసన ఆతని మనస్సును వ్యాకులపరచేది.

ఆర్టెమ్ రైల్వేయార్డులలో తమ్ముడికి పని ఇప్పించలేక పోయేడు. పదిహేనేళ్ళ లోపువాళ్ళు అక్కర్లేదన్నారు. పావెల్‌కు పొగచూరి నల్లగావున్న రైల్వే వర్కుషాపు భవనం అంటే ఏదో వెర్రి ఆకర్షణ ఏర్పడింది. హోటలు పని మానుకొని అక్కడి కెప్పుడుపోతానా యని కలలు కంటూండేవాడు.

తరుచుగా ఆర్టెమ్‌కోసం యార్డులకు వెళ్ళేవాడు. ఆతనితోపాటు రైలుపెట్టెలు చూడ్డానికి వెళ్ళేవాడు. అవసర మైనప్పుడు చిన్నపనీ, పెద్దపనీ సాయంచేస్తుండేవాడు.

హోటలునుంచి ఫ్రోశ్యా పని మానుకుపోయేక అతడికి మరీ ఒంటరితనం అనిపిస్తూంది. ఆమెకూ తనకూ మధ్యఏర్ప డిన స్నేహంఎంతగాఢమైనదో అప్పుడుగాని తెలియులేదు. తెల్ల వారి గిన్నెలు కడిగేచోటికి వచ్చేసరికి అక్కడ పనిచేస్తున్న కాందిశీకస్త్రీలు కైకురుబాయ్ కురుమంటూండేవారు. తనకు పరిచితమైన గొంతు వినిపించకపోతే ఏదో పోగొట్టుకున్నట్లు అనిపించేది.

ఒకరోజున నీళ్ళకాగుక్రింద మంటపెడుతూ కూర్చు న్నాడు. ఆ సమయంలో అక్కడెవ్వరూ లేరు.

ఫ్రోశ్యా ఎందుకో జ్ఞాపకంవచ్చింది. ఆమె వెళ్ళిపోయే టందుకు ముందు తానుచూసిన ఒకఘటన కళ్ళముందు మెది లింది.

శనివారంనాడు పావెల్ వంటశాలలోకి వెడుతూ, వైటర్లు సాధారణంగా పేకాడే ఆట చేసి తొంగిచూసేడు.

ఆట మంచి రసకందాయప్పట్టులో వుంది. డబ్బు లెక్క చూస్తూన్న జలివానోవ్ మహోత్సాహంగా వున్నాడు.

వెనకాల మెట్లమీద అడుగులు చప్పుడయ్యేయి. వెనక్కి చూసేసరికి ప్రోఖోష్కా వస్తున్నాడు. పావెల్ మెట్ల క్రిందికి తప్పుకొన్నాడు. అక్కడ కటిక చీకటి. ప్రోఖోష్కా వానిని చూడలేదు.

అతడు కొద్దిదూరం వెళ్ళేసరికి మళ్ళీ మెట్లమీద గబగబా ఎవరో దిగివస్తున్నట్లు వినిపించింది.

"ప్రోఖోష్కా! ఉండు." పావెల్ కది పరిచితమైన గొంతుకే.

ప్రోఖోష్కా నిలబడ్డాడు.

"ఏంపని?"

ఫ్రోశ్యా మెట్లు గబగబ దిగివచ్చి, వైటర్ రెక్క పట్టుకొంది. ఆమెనోట మాట పెగిలిరావడంలేదు.

"లెఫ్టినెంట్ ఇచ్చిన డబ్బెక్కడెట్టేవు?"

ప్రోఖోష్కా చెయ్యి విదిలించుకొన్నాడు.

"డబ్బేమిటింకా? నీ కిచ్చేను కాదూ."

ఫ్రోశ్యా వెక్కి వెక్కి ఏడుస్తూ మాట్లాడుతూంది.

"ఆయన మూడువందల రూబుళ్ళివ్వలేదూ?"

ప్రోఖోష్కా వెటకారంగా గదిమేడు.

“మహానుభావుడట! ఏం ఇస్తేనేం? ఎంతా నీకే కావాలేం? గిన్నెలు కడక్క నేనుండ పెద్ద పోకిళ్ళు పోతూండే. నీకిచ్చిన ఏభయ్యే ఎక్కువ. నీకంటె అందమైనవాళ్ళూ, బాగా చదువుకున్నవాళ్ళూకూడ అంతకంటె చవగ్గా దొరుకుతారు. ఒక్క రాత్రికి ఏభయి రూబుళ్ళు. ఆ మాత్రం ఇచ్చినందుకు సంతోషపడు. పోనీఅంటే మరో పదిస్తా. లేకుంటే ఇరవై తీసుకో. అంతేగాని,... కావాలంటే మరో కణ్ణి చూడు. నేనూ సాయంచేస్తా...”

ప్రోఖోష్కా గిర్రున తిరిగి వంటింట్లోకి పోయేడు.

“ దొంగపీనుగ ”

ఫ్రోశ్యా అక్కడున్న కట్టెలరాశినానుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

కట్టెల్ని పెట్టి తలకొట్టుకొని ఫ్రోశ్యా ఏడుస్తుంటే పావెల్ గుండె తరుక్కుపోయింది. కాని అతడు చీకట్లోంచి బయటికిరాలేదు.

“ఆఖరికి దీన్నికూడా అమ్మేసేరన్నమాట. వీళ్ళతాడు తెగ!...ఫ్రోశ్యా! ఏంపని చేసేవు?”

ఆతనికి ప్రోఖోష్కామీాది కోపం పదింతలయింది. ఆ పరిసరాలు పరమాసహ్యం అనిపిస్తున్నాయి.

“నాకే ఆర్టెమ్ కున్నంత బలంవుంటే...నా కొడుకుని చచ్చేటట్లు కొడుదును.”—అని మళ్ళీ ఇంకోమారు అనుకొన్నాడు.

కాగు క్రింద మంటలు భగ్గుమన్నాయి. ఎర్రటిమంటలు నాలుకల్లా సాగి వెక్కిరిస్తున్నట్టనిపించింది.

గది నిశ్శబ్దంగావుంది. కాగుకున్న కుళాయిలోంచి ఒక్కొక్క బొట్టే టప్పుటప్పున పడుతూవుంది.

క్లిమ్‌కా మిగిలిపోయిన ఒక్క గిన్నెతోమి తీసుకొచ్చేడు. మెరిసేటట్లు గుడ్డతోరుద్ది తుడిచేడు. దానిని అరపమీాదపెట్టి చేతులు తుడుచుకొన్నాడు. అప్పూట డ్యూటీలోవున్న వంట వాడూ, వానితోడు:ఒనిషీ నిద్రపోతున్నారు. ప్రతిరోజూ ఈవేళటప్పుడు మూడుగంటలసేపు పనుండదు. క్లిమ్‌కావచ్చి పావెల్‌తో కూర్చుంటాడు. ఆ ఇద్దరికీ బాగా స్నేహంకలి సింది.

"క్లిమ్‌కా! కూర్చో."

ఆ కుర్రాడువచ్చి పొయ్యివద్దనున్న కట్టెలపోగు చేరబడి కాళ్ళు బారజాపుకొని కూర్చున్నాడు.

"మంటలకేసి అల్లా చూస్తున్నావు. శకునం తెలుసుకొంటున్నావా?"

పావెల్ అతికష్టంమీాద మంటలనుంచి చూపులు మరల్చేడు. ఆతని కళ్ళల్లో విచారం తొణుకుతూంది. క్లిమ్‌కా తన మిత్రుడి కళ్ళల్లో విచారరేఖల నింతవరకెన్నడూ చూడ్డ లేదు.

"అల్లావున్నావేం?... ఏం జరిగింది?"

పావెల్ లేచివచ్చి క్లిమ్‌కా ప్రక్కన కూర్చున్నాడు.

"ఏం కాలేదు. ఇక్కడుండా లనిపించడంలేదు."

"ఏదో జరిగింది." క్లిమ్‌కా చెప్పమంటూ కూర్చున్నాడు.

"ఈవేళ కొత్తగా జరిగిందేం లేదు. నేనిక్కడ చేరింది లగాయతు జరుగుతున్నదే. గాడిదచాకిరీ చేస్తున్నాం. తిట్లు తప్ప ఒక్క మంచిమాట వుండదు కదా—ఎవ్వడుపడితే వాడు మనమీద చెయ్యిచేసుకొంటాడు. అదేమని అడిగేవాడొక్కడుండడు. ఒళ్ళుహూనంచేసుకు పనిచేసినా ఎవడో ఒకడికి సంతృప్తి కలగదు. వాడు మనఅంతు కనుక్కొంటాడు. తప్పు అనిపించుకోకుండా చెయ్యాలని ఎంతసతమతంఅయినా, ఎవరో ఒకరికి వాళ్ళడిగిన వస్తువు తెచ్చివ్వడంలో ఆలశ్యమయిందనో, మరొకటో కారణం దొరుకుతుంది. మనగొంతు పట్టుకొంటాడు..."

"అల్లా అరవకురా బాబూ? అంటూ క్లిమ్‌కా భయంతో దిక్కులు చూచేడు.

"ఎవరేనా వస్తారు. వాళ్ళ చెవినిపడితే ఇంకేమన్నా వుందా?"

పావెల్ చర్రున లేచాడు.

"వింటే విననీ. నేనిక్కడవుండాలని ఏడుస్తున్నానా? ఇంతకంటె వీధుల్లో మంచు ఎత్తిపోయడం నయం... ఇదో దొంగల మడుగు. వాళ్ళచేతుల్లో వున్న డబ్బుచూడు. మనని ఎల్లాచూస్తారో చూడ్డంలేదూ? ఇక్కడున్న ఆడపిల్లల పాట్లుచూడు. ఎవరేనా వాళ్ళు చెప్పినపనికి వొప్పుకోకపోతే గెంటేస్తారు. పోవడానికి దారిలేని ఆ కాందిశీక స్త్రీలని పనిలో పెట్టుకొంటారు. ఏదో ఇంత తినడానికేనా దొరుకుతుందని

నాళ్ళొస్తారు. ఇంత రొట్టెకోసం ఎంత నీచానికేనా దిగక తప్పనిస్థితి వాళ్ళది."

ఆ మాటలు ఎవరన్నా వింటున్నారేమోనని క్లిమ్కా తలుపుదగ్గిరికి పరుగెత్తివెళ్ళిచూసేడు. అయినా పావెల్ ఆగలేదు.

"ఓరేయ్. వాళ్ళల్లా కొడుతూంటే ఒక్కమాటకూడా లేకుండా అల్లా పడతావేంరా?"

పావెల్ అక్కడున్న బల్లమీద చతికిలబడి ఎదురుగా వున్న టేబిల్ మీద తలఆనించి కూర్చున్నాడు. క్లిమ్కా వెళ్ళి కాగుక్రిందమంట ఎగసనతోసేడు.

"ఈవేళేం చదవొద్దూ."

"బుక్స్టాల్ మూసేసేరు. చదివేందుకేంలేదు—" అన్నాడు పావెల్.

"ఎందుకు మూసేసేరు?"

"షాపులో వుండేవాడిదగ్గర ఏదోవుందని పోలీసాళ్ళు లాక్కుపోయేరు."

"లాక్కుపోయేరూ? ఎందుకూ?"

"ఏదో రాజకీయాలట."

అదేమిటో అర్థంగాక క్లిమ్కా పావెల్వంక కళ్ళప్ప గించిచూసేడు.

"రాజకీయాలంటే?"

పావెల్ భుజాలు కుదిలించుకొన్నాడు.

"దేవుడి కెరక. జార్ వద్దసటం రాజకీయాలంటారు."
క్లిమ్కా వులికిపడ్డాడు.

"ఎవరన్నా అల్లాంటి పని చేస్తారూ?"

"ఏమో."

గ్లాషా తలుపుతోసుకుని లోపలికి వచ్చింది. నిద్ర బరువుతో ఆమె కళ్ళు పొంగివున్నాయి.

"మీరిద్దరూ మేలుకొన్నారేమర్రా! ఇంకా గంటకిగాని బండేదీరాదు. పడుకోండి. పావ్కా! ఓ నిమషం కన్నుమూయి. పొయ్యి నే చూస్తుంటాలే."

* * *

పావెల్ అనుకున్నకన్న త్వరగా, ఎన్నడూ అనుకోని విధంగా పనిమానుకు పోవలసివచ్చింది.

జనవరిలో ఒకరోజున బాగా మంచుపడుతున్నరోజున పావెల్ తనపని పూర్తిచేసుకొని ఇంటికి పోవాలనే ప్రయత్నంలోవున్నాడు. కాని తరవాత పనిచేయవలసిన వంతువాడు రాలేదు. యజమానురాలితో చెప్తే, ఆమె పావెల్ పోవడానికి వీల్లేదంది. మరి తప్పిందికాదు. వెనుకటిరోజు పగలంతా పనిచేశాడు. రాత్రంతా పనిచేశాడు. కాళ్ళూ, చేతులూ తేలిపోతున్నాయి. సాయంకాలం అయ్యేసరికి నిల్చోలేకుండా అలసిపోయేడు. రాత్రివచ్చింది. మధ్య ఖాళీవేళప్పుడు నీళ్ళకాగుల్లో నీరుపోయాలి. మళ్ళీ మూడుగంటల బండి వచ్చేవేళకు నీళ్ళు మరగపెట్టాలి.

పావెల్ నీళ్ళకోసం కుళాయితిప్పేడు. ఒక్కచుక్క రావడంలేదు. పంపు చెడిపోయిందన్నమాట. చేసేదిలేక కుళాయి అల్లాగే తెరిచివుంచి కట్టెలపోగుమీద కూర్చు న్నాడు. బాగా అలిసివున్నాడేమో ఇట్టే నిద్రపట్టేసింది.

మరికొంచెంసేపట్లో కుళాయి గురగురలూ, బుస బుసలూ ప్రారంభించింది. నీరు వచ్చింది. కాగునిండి పొర్లి పోతూంది. ఆ వేళప్పుడు అక్కడ ఎవ్వరూవుండరు. కనక దాని నెవరూ చూడలేదు. నీరు గదంతాపాకి హాలులోకి కూడా ప్రవహించింది.

ప్రయాణీకులు క్రిందపెట్టుకున్న పెట్టెలక్రిందికీ, సంచుల క్రిందికీ నీరుపాకింది. నేలమీదనే పడుకొని నిద్రపోతున్న ఒకరివీపు తడిసేవరకు దానినెవ్వరూ చూడలేదు. ఆ బాట సారి మొర్రో అన్నాడు. అంతా కంగారుపడి మూటలూ, పెట్టెలూ పుచ్చుకు పరుగులు ప్రారంభించేరు. ఒకటే గంద్ర గోళం.

ఇంకా నీరు వస్తూనేవుంది.

ప్రోఖోష్కా రెండోహాలులో బల్లలు తుడుస్తున్నాడు. గంద్రగోళం విని పరుగెత్తివచ్చేడు. గబగబావెళ్ళి తలుపు తోసేడు. అంతవరకూ తలుపు అడ్డంగా వుండడంచేత అంట్ల గదిలో నీరునిండుగాచేరినా హాలులోకి కొద్దికొద్దిగా మాత్రమే జాలుకడుతూంది. ఇప్పుడు తలుపుతోయగానే ఒక్కమాటు ప్రవాహంలా వచ్చిపడింది.

గోల ఇంకా ఎక్కువైంది. ష్యాటిలోవున్న వైటర్లు అంట్లగదిలోకి పరుగెత్తేరు. నిద్రపోతున్న పావెల్ మీదికి ప్రోఖోష్కా ఒంటికాలిమీద లేచేడు.

తనమీదపడి దబదబా బాదేస్తూంటే పావెల్‌కు ఏమిటో, ఎందుకో అర్థంకాలేదు. ఒళ్ళంతా దెబ్బలతో కమికి సలుపు పుట్టింది.

ఎల్లాగో ఇంటికి చేరేడు.

పొద్దున్నే ఆర్టెమ్ వచ్చేడు. ఏం జరిగిందేమిటన్నాడు.

జరిగినదంతా పావెల్ పూసగుచ్చినట్లు చెప్పేడు.

"నిన్ను కొట్టిందెవరు ?

" ప్రోఖోష్కా "

"సరే పడుకో. ఎక్కడికీ కదలకు."

ఆర్టెమ్ ఇంకేమీ అనలేదు. వంకెనున్న కోటు తొడుక్కుని తిన్నగా హోటలుకెళ్ళేడు.

ప్రోఖోర్ అనే అతడు ఎక్కడుంటాడు ?

ఆర్టెమ్ ప్రశ్నకు పళ్లేలుకడుగుతున్న గ్లాషా వెనుతిరిగి చూసింది.

" ఇప్పుడే వస్తాడు. "

ఆర్టెమ్ తలుపుదగ్గర గోడకి జేరబడి నిలబడ్డాడు.

"సరే. ఇక్కడేవుంటా."

అంతలో ఒక మేకుల పళ్ళేలున్నతట్ట రెండుచేతు లతోనూ ఎత్తిపట్టుకొని, కాలితో తలుపునెట్టి ప్రోఖోర్ అంట్లగదిలో అడుగుపెట్టేడు.

"అతడే—"అని గ్లాషా చూపింది.

ఆర్టెమ్ కదిలి ఎదురెళ్లేడు. ఆతడి భుజంపట్టుకొని కళ్ల ల్లోకి గుచ్చిచూశాడు.

"మా తమ్ముడు పావ్కాని కొట్టేవు ఎందుకు?

ప్రోఖోర్ చెయ్యి విడిపించుకొనేటందుకు ప్రయత్నిం చేడు. ఆర్టెమ్ సాగదీసి ఒక్కటికొట్టేడు. దానితో ప్రోఖోర్ నేలకరిచేడు. లేవబోయేడు. కాని, రెండో దెబ్బతో మరి ఆ ప్రయత్నంకూడా చెయ్యలేకపోయేడు.

పళ్లేలు కడిగేవాళ్లంతా భయపడి తలోమూలకీ పారిపోయేరు.

ఆర్టెమ్ మారుమాటలేకుండా వెళ్లిపోయాడు.

ముఖంనుంచి రక్తం కారుతూంటే తుడుచుకుంటూ ప్రోఖోర్ లేచాడు.

ఆ సాయంకాలం ఆర్టెం రైల్వేయార్డులనుంచి ఇంటికి రాలేదు.

తల్లి వాకబుచేస్తే పోలీసులు పట్టుకుపోయేరన్నారు.

ఆరు రోజులతర్వాత ఓనాడు అర్ధరాత్రివేళ ఆర్టెమ్ ఇంటికొచ్చేడు. తల్లి నిద్రపోతూంది. పావెల్ లేచి మంచం

నడుమ కూర్చునివున్నాడు. ఆర్టెమ్ వానిపక్కన కూర్చున్నాడు.

"ఎల్లావుంది? చంపేద్దును... అయితే అయిందిలే. ఎలక్ట్రిక్ స్టేషన్ వాళ్ళతో మాట్లాడేను. రేపటినుంచి అక్కడికెడుదువుగాని. ఏదన్నామంచివృత్తి నేర్చుకోవాలి. ఇల్లా, ఎంతకాలం?"

పావెల్ అన్నగారిభుజం కౌగలించుకొన్నాడు.

## ప్రకరణం 2

జార్ను ? ద్దదించేసేరన్న వార్త తుపానులావచ్చి పడింది.

నగరప్రజలు మొదట దానిని నమ్మలేదు.

మంచుతుపాను విసురుతున్న ఒకరోజున రైలొకటి స్టేషన్లోకి తడుములాడుకుంటూవచ్చి ఆగింది. సైనికులు వేసుకొనే బరువుకోట్లు తొడిగిన ఇద్దరు కాలేజీకుర్రాళ్ళూ, చొక్కా చేతులకు ఎర్రపట్టీలున్న ఓ విప్లవ సైనికులదళమూ బండి దిగేరు. దిగుతూనే స్టేషన్లోని పోలీసుల్నీ వారి అధిపతిఅయిన ఒక ముసిలి కర్నలును అరెస్టుచేసేరు. అప్పుడు నగరప్రజలంతా తాము విన్నవార్త నిజమే అనుకొన్నారు. వీధులో పేరుకున్న మంచులో దున్నుకుంటూ వేలకొద్దిమంది స్క్వేర్లోకి చేరుకున్నారు.

స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం గురించి ఎన్నడూ వినని మాటలు చెప్తూంటే చెవులు దోరపెట్టుకు విన్నారు.

అటుతర్వాత అంతా గంద్రగోళం. ఓమూల హుషారు; మరోవేపున అదురు. తర్వాత అంతా చల్లబడింది. జారు

హాలుమీగాద ఎర్రజెండా రెపరెపలాడింది. మార్పేదో వచ్చిందనుకోటానికి గుర్తుగా జెండార్ములు, బండిస్టులూ టౌన్‌హాలులో ఆఫీసుల నాక్రమించేరు. మిగతా అంతా మామూలే.

శీతాకాలం ఆఖరురోజుల్లో గుర్రపు సైన్యదళం ఒకటి పట్టణంలో మకాంపెట్టేరు. తెల్లవారేసరికి చిన్నచిన్న స్క్వాడ్రన్లుగా చీలి రైలుపెట్టెలన్నీ వెతికి యుద్ధంనుంచి పారిపోయివస్తున్నవారి నందరినీ పట్టుకొంటున్నారు.

గుర్రపుసైన్యంలో వాళ్ళంతా అజానుబాహులు. తిండి లోపం ఏమీలేదేమో బాగా బలిసివున్నారు. వాళ్ళ ఆఫీసర్లంతా రాజకుమారులూ, జమీందారీ కుటుంబాల వాళ్ళూను. జార్‌ల కాలంనాడున్నట్లే పటకాలూ, అవీ బంగారు, వెండినీటిపూత పూసివున్నాయి. అవన్నీ చూస్తే అసలు దేశంలో విప్లవంఅనేది వచ్చిందా అనిపిస్తుంది.

పావెల్, క్లిమ్కా, సెర్జీ బ్రూజక్ మొదలయినవాళ్ళ కంటికి మార్పేమీ కనబడ్డంలేదు. యజమానులు వెనకటివాళ్ళే. నవంబరుదాకా పరిస్థితులలో మార్పేమీలేదు. మళ్ళీ స్టేషన్‌కి కొత్తకొత్త జనం వస్తున్నారు. మళ్ళీ హడావిడి బయలుదేరింది. ఆ వస్తున్నవాళ్ళల్లో చాలభాగం సరాసరి యుద్ధరంగాలనుంచి వస్తున్నవారే. వాళ్ళని బోల్షివిక్కు లని పిలుస్తున్నారు.

ఆ మాట ఎక్కడపుట్టిందో, ఎందుకుపుట్టిందో తెలియదు.

వాళ్ళు రావడం ప్రారంభించేక యుద్ధంనుంచి పారి పోయివచ్చిన వాళ్ళని పట్టుకోవడం గుర్రపుసైన్యాలవాళ్ళకి సాధ్యం కావడంలేదు. చీటికి మాటికీ స్టేషన్‌లో రైఫిళ్ళు కాల్పులు వినిపిస్తున్నాయి. ఆఫీసు కిటికీల తలుపులకున్న అద్దాలు పగిలిపోతున్నాయి. యుద్ధరంగాలనుంచి వచ్చే వాళ్ళు ఈమారు జట్లుజట్లుగా వస్తున్నారు. వాళ్ళని ముట్టు కుంటే తుపాకీ తీస్తున్నారు. డిసెంబరు ప్రారంభంనాటికి రైళ్ళనిండా వాళ్ళే.

వాళ్ళని ఆపడానికి ఒకరోజున గుర్రపుసైన్యదళం యీవత్తూ స్టేషన్‌లోకి వచ్చింది. కాని మిషన్‌గన్‌గుళ్ళు వాళ్ళని ముసురుకున్నాయి. రైలులోవచ్చిన సైనికులకు చావంటే భయంలేదు.

యుద్ధరంగాలనుంచి వస్తున్నవాళ్ళు గుర్రపుసైన్య దళాన్ని పట్టణం ఆవలికంటా తరిమివేసి తిరిగి వచ్చారు.

*　　　*　　　*

1918 వసంతంలో ఓరోజున మన ముగ్గురుమిత్రులూ బ్రూజక్ ఇంట్లో పేకాట ఆడిఆడి విసుగుపుట్టి వీధిలోకి బయలు దేరేరు. కాస్సేపు కోర్చాగిన్ ఇంటి ఆవరణలో గడ్డిమీద చదికిలబడ్డారు. వాళ్ళకేమీ తోచడంలేదు. మామూలు కాలక్షేపాలన్నీ పాతబడిపోయేయి. ఆరోజు ఎల్లాగడపటమా అనుకొంటూంటే వీధిలో గుర్రపుడెక్కల చప్పుడు వినిపిం చింది. తిరిగిచూసేరు. ఒక గుర్రంమీద ఎవరో వీధివెంట ఊరుకులమీద వస్తున్నాడు. రోడ్డుకీ వాళ్ళు కూర్చున్న వాకి

లికీ మధ్యనున్న కాలవను గుర్రం ఒక్క గంతులో దాటింది. రాతు కోరడి దగ్గర గుర్రాన్ని నిలబెట్టి, టోపీ విసిరి వాళ్ళని పిలిచేడు.

"అబ్బాయిలూ! ఓ మాటు ఇల్లా వస్తారా?"

పావెలూ, క్లిమూ ఒక్క గంతువేసి కోరడికేసి పరుగెత్తేరు. రాతు దుమ్ముకొట్టుకుని వున్నాడు. తల వెనక్కి అదిమిన టోపీమీదా, కోటుమీదా దుమ్ము అట్టలుకట్టి వుంది. నడుము పటకాని ఒక రివాల్వరూ, రెండు జర్మనీ చేతిబాంబులూ వ్రేలాడుతున్నాయి.

"కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెట్టగలరా?"

పావెల్ ఇంట్లోకి పరుగెత్తేడు. సెర్జీ ఆ సైనికుడివంక వింతగాచూస్తూ నిలబడ్డాడు.

"మీ పట్టణాధికారి ఎవరో చెప్పగలవా?

సెర్జీ గబగబ ఆయాసపడుతూ వూళ్ళో కభుర్లన్నీ చెప్పేడు.

"రెండువారాలనుంచి అధికారి అంటూ ఎవరూలేరు. హోమ్‌గార్డుంది. వాళ్ళే అన్నీచూస్తున్నారు. రాత్రిపూట వంతులవారీగా పట్టణంలో వాళ్ళంతాగస్తీ తిరుగుతున్నారు. అంతే. మరి నువ్వెవరు?"

రాతు నవ్వేడు.

"అన్నీ ఒక్కమాటే తెలుసుకొంటే పెద్దతనం ఇప్పుడే వచ్చేస్తుంది సుమీ."

ఇంతలో ఒక చెంబునిండా మంచినీళ్ళు తీసుకొని పావెల్ వచ్చేడు.

రాతుసు బాగా దాహం వేస్తూండి వుంటుంది. ఒక్క గుటకలో చెంబెడునీళ్ళూ తాగేసి, చెంబు ఇచ్చేసేడు. వెంటనే కళ్లెం వదులుచేసి ఒక్కవురుకులో పైన్ అడవి కేసి అదృశ్యమైపోయేడు.

పావెల్ క్లిమ్‌ని అడిగేడు :

"ఎవరతడు ?"

క్లిమ్ భుజాలు కుదుపుకుంటూ "నాకేం తెలుసు" నన్నాడు.

సెర్గీ రాజకీయ వ్యవహారాలన్నీ తెలిసినవాడిలాగ మాట్లాడేడు.

"మళ్ళీ అధికారులు మారుతారనితోస్తుంది. అందుకే నిన్న లెస్జింకీలు వెళ్ళిపోయేరు. డబ్బున్నవాళ్ళు పారిపోతున్నారంటే పార్టిజాన్‌లు వస్తున్నారనుకోవాలి."

ఆ మాటలు నమ్మదగినవిగానే కనబడ్డంచేత పావెలూ, క్లిమ్మూ అంగీకరించేరు.

ఇంతలో మళ్ళీ వీధిలో గుర్రపుడెక్కల చప్పుడు వినిపించింది. ముగ్గురూ కోరడిదగ్గిరికి పరుగెత్తేరు.

దూరాన అడివి కాపలాదారు ఇంటిప్రక్కగా అడవిలోంచి మనుష్యులూ, బళ్ళూ రావడం లీలగా కనిపించింది. అంతకంటె దగ్గరగా దండు బాటమీద రైఫిళ్ళు తీసుకొని పది పదిహేనుమంది గుర్రపురౌతులు కనిపించేరు. వాళ్ళు

ముందు ఆఫీసర్లు ధరించే దుస్తులలో ఒక నడికారు మనిషి వున్నాడు. ఆతని మెడలో దూరదర్శిని వ్రేలాడుతూంది. అతని ప్రక్కనే తమకంతకుముందు కనిపించిన అతిథున్నాడు. నడికారతని గుండెలమీద కోటుకి ఎర్రటి పట్టీ వ్రేలాడుతూంది.

"నే చెప్పలేదూ"— అంటూ సెర్జీ పావెల్‌ను వేలితో పొడిచేడు." ఆ ఎర్రపట్టీ చూసేవా? వీళ్ళు పార్టిజాన్లే. కాకుంటే చెవి కదపా...

సెర్జీ 'హూప్' అంటూ ఒక్క-గంతులో కోరడిదాటి రోడ్డుమీదికి పరుగెత్తేడు.

మిగిలినవాళ్లుకూడా ఆతని వెంట బడ్డారు. ముగ్గురూ రోడ్డుప్రక్క నిలబడి గుర్రపురౌతులువస్తూంటే చూస్తున్నారు.

రౌతులు దగ్గరకు వచ్చేరు. వాళ్ళతో వున్న వెనకటి రౌతు కుర్రవాళ్ళనిచూచి తలవూపేడు. కొరడాతో లెస్జింకీల ఇంటివేపు చూపించేడు.

"ఎవరిదాయిల్లు?"

పావెల్ గుర్రంప్రక్క-నే నడక ప్రారంభించేడు.

"లాయర్ లెస్జింకీది. నిన్ననే వాళ్ళు వెళ్ళిపోయేరు. బహుశా మీరు వస్తున్నారని భయపడ్డారు..."

నడికారు అతడు చిరునవ్వు నవ్వేడు.

"మే మెవరమో నీకేం తెలుసు?"

పావెల్ అతని చొక్కా-నున్న పట్టీవేపు చూపించేడు.

"అదేం! ఎవరేనా చెప్పేస్తారు..."

రైతులు పట్టణంలోకి వస్తూంటే ఇళ్ళల్లో జనం వీధుల్లోకివచ్చి వింతగా చూస్తున్నారు. దుమ్ముకొట్టుకొని, అలసిపోయివున్న రెడ్ గార్డ్‌లు నడుస్తూంటే మనముగ్గురు మిత్రులూ వాళ్లని చూస్తూన్నారు. రైతులవెనక ఒక ఫిరంగీ, కొన్ని మరతుపాకులూ బళ్ళమీదవచ్చేయి. వాటివెనకాల పీఖ్యా పడ్డారు. ఆ దళం చౌకిలో చేరి మకాంపరాట్లు చేసుకోసాగేరు.

ఆరోజు సాయంకాలం లెస్జింకీల ఇంటిసావిట్లో బల్ల ముందు నలుగురు కూర్చున్నారు. వాళ్ళల్లో ఒకడు రెడ్ గార్డ్ దళం నాయకుడు బుల్గాకోవ్. అతడు నడికారువాడు. జుట్టప్పుడే నెరసింది. మిగిలిన ముగ్గురూకూడా దళంలోని నాయకులే.

ఆ జిల్లామ్యాపు ఒకటితీసి బుల్గాకోవ్ బల్లమీద పరిచేడు.

"కామ్రేడ్ యెర్మాచెంకో! మనం ఇక్కడ నిలబడాలంటావుకదూ! కాని ప్రొద్దునే పోవడం అవసరం అని నా అభిప్రాయం. రాత్రివేళ వెళ్ళిపోగలిగితే మరీమంచిది. కాని. మనవాళ్ళకి ఆమాత్రం విశ్రాంతివుండాలి. జర్మన్లు ఆక్రమించక పూర్వం మనం కజాటిన్ చేరుకోవాలి. మనకున్న బలంతో ఇక్కడ ఎదుర్కోడానికి చూడడం తెలివితక్కువ. మనకున్న దొక్క ఫిరంగి. దానికున్న దిముప్ఫయిరౌండ్లమందు. మన బలగంమాత్రం ఎంత? రెండువందలమంది కాల్బలం, అరవైమంది రౌతులూ. జర్మన్లు ఉక్కుగుండులా నెట్టుకు వస్తూంటే మనం ఆపగలమా? మనలాగే తిరోగమిస్తున్న రెడ్ గార్డుదళాల్ని మరికొన్నింటిని కలుపుకొంటే తప్ప నిల

బడతేం. పైగా దారిపొడుగునా విప్లవ వ్యతిరేకముఠాలు మనకి అడ్డంతగులుతాయనేది మరిచిపోకూడదు. పొద్దున్నే బయలుదేరిపోదాం. వెళ్ళేముందు స్టేషన్ ఆవలవున్న వంతెనను కూలగొట్టి మరీపోవాలి. దానిని బాగుచేసుకొనేసరికి రెండుమూడు రోజులవుతుంది. అది బాగయ్యేవరకూ వాళ్లు ముందుకురాలేరు. మీరేమంటారు? మనం ఏదోఒకటి తేల్చుకోవాలి,"

బుల్గాకోవ్‌కు ఎదురుగాకూర్చున్న స్త్రుజ్కోవ్, పెదిమలు తడుపుకుంటూ మ్యేప్‌కేసి చూసేడు.

"బుల్గాకోవ్ చెప్పిందే సరి."

కార్మికులు తొడుక్కొనే చొక్కాతోవున్న యువకుడుకూడా అదే అంగీకరించేడు.

"బుల్గాకోవ్ సరిగ్గా చెప్పేడు."

ఆరోజున మొదట పావెలూ వగైరాలతో మాటాడిన మెర్మాచెంకో తల అడ్డంగాతిప్పేడు.

"ఈ దళాన్నిమనం చేర్చింది ఎందుకేం? ఒక్క-మాటేనా చెయ్యికలపకుండా జర్మన్లకు దూరంగా పోతూండడానికా? వాళ్ళతో ఇక్కడ కలబడ్డం మంచిదని నా అభిప్రాయం. ఊరికేపరుగెత్తడం అసహ్యంగావుంది. నన్నడుగుతే ఇక్కడే నిలబడి యుద్ధంచెయ్యాలంటాను."

మెర్మాచెంకో ఆవేశంతో లేచి గదిలో పచారు ప్రారంభించేడు.

బుల్గాకోవ్ ఆతనివంక అనంగీకారంగా చూసేడు.

"యెర్మాచెంకో! మనం హాస్తబుగ్గ ప్రయోగించాలి. ఓడిపోతామని తెలిసీ, సర్వనాశనం అవుతుందని ఎరిగీ మన వాళ్ళని యుద్ధంలోకి పంపకూడదు. అది వట్టి తెలివితక్కువ. ఒక డివిజన్ సైన్యం భారీఫిరంగులూ, సాయుధశకటాలతో మన వెంటబడింది... చిన్నపిల్లలాగ మొండితనం చేయడం మంచిది కాదు. కామ్రేడ్ యెర్మాచెంకో! ఇంక నిర్ణయం అయిపోయినట్లే. రేపు ప్రొద్దునే నగరం వొదిలిపోతాం... ఇంక తర్వాత విషయం పౌ సంబంధాలుగురించి.

"...మనమే అందరికన్నా చిట్టచివర పోతున్నాం. జర్మనీవాళ్ళ వెనకభాగంలో పనిచేసేవాళ్ళని ఏర్పాటుచేసే బాధ్యత మనదే. ఇదో పెద్దజంక్షను. పట్టణంలో రెండు రైలు స్టేషన్లున్నాయి. రైల్వేలో నమ్మకంగా పనిచెయ్యగల కామ్రేడ్‌ని చూడాలి. ఆపని చేసేటందుకు మనిషిని ఆలోచిద్దాం. మీ దృష్టిలో ఎవరన్నావున్నారా?

"కళాసీ ఫ్యోదోర్ జకరయ్‌ను వదలడం మంచిది..." —అన్నాడు యెర్మాచెంకో.

"ముఖ్యమైనది—అతడిక్కడివాడు. పైగా ఫిట్టర్ పని తెలిసినవాడు; మెకానిక్. అందుచేత స్టేషన్‌లో ఏదోపని సంపాదించుకోగలడు. ఫ్యోడోర్ మన దళంలోవుండగా ఎవ్వరూ చూడలేదు. —ఈవేళ రాత్రికిగాని ఇక్కడికిరాడు. నిదానంగల మనిషి. పని చక్కగా జరుగుతుంది. అతడే సరయినవాడు."

బుల్గాకోవ్ అంగీకరించేడు.

''ఔను. బాగా చెప్పేవు. మీ కేమన్నా అభ్యంతరం వుందా?...

''లేదు...అయితే అదీ తేలిపోయినట్లే. జకరయ్‌కి కొంత డబ్బూ, పని సాగించడానికి అవసరమయ్యే కాగితాలూ ఇచ్చి పోదాం.... ఇంకొకటుంది. పట్టణంలో నిలవవున్న తుపాకుల మాటేమిటి? ఇంచుమించు ఇరవై వేల రైఫిల్లున్నాయి. జార్ ప్రభుత్వం జాగ్రత్తచేసింది. వాటిమాటే అంతామరిచేను. వాటి నో రైతుమకాంపాకలో దాచేరు ఆరైతు వాటిని వొదుల్చుకొందామని నాకామాట కాస్తా చెవినేసేడు. వాటిని జర్మన్లకి వదలవద్దు. తగలపెట్టేద్దాం. తెల్లారేలోపున ఆ పని పూర్తనాలంటే ఇప్పుడే ప్రారంభించాలి. ఆ పాకకి నిప్పు పెడితే చుట్టుప్రక్కల ఇళ్లుకూడా తగులడతాయేమో. అదో ఇబ్బంది. ఆ పాక బీదాబిక్కీ వుండేచోట వూరుచివరుంది.'' త్రజోక్ ఈమాటు కదిలేడు. భారీఅయిన మనిషి. ఆతని గడ్డం కొన్నివారాలుగా కత్తిమొహం చూసినట్లులేదు. మనిషి మంచి దృఢకాయుడు.

''ఎందుకు తగులబెట్టడం. పట్టణంలో పంచిపెట్టేద్దాం.''

బుల్గాకోవ్ చటుక్కున అతనివేపు తిరిగేడు.

''పంచిపెడదామా''

యెర్మాచెంకో హుషారు కనబరచేడు.

''అద్భుతమైన ఆలోచన. కార్మికులందరికీ, అడిగిన వారికల్లా ఇచ్చేద్దాం. జర్మనువాళ్ళమీద కసితీర్చుకొనే టందుకు చేతుల్లో ఏదన్నావుండనేనా వుంటుంది. వాళ్లు

ఎన్ని అఘాయిత్యాలు చేయాలో అన్నీ చేస్తారు.
రాంగానే మనవాళ్లు తుపాకీతిత్యానికి వుంటుంది
చెప్పిందే బాగుంది. తుపాకులు పంచిపెడదాం
ప్రక్కల పల్లెల్లో ఇవ్వడంకూడా మంచిది. రైతుల
పెడతారు. జర్మనీవాళ్ళు చేతికందినదల్లా పట్టి
ప్రారంభించినప్పుడు చేతిలో ఆయుధం వుండడం
మంచిది.”

బుల్గాకోవ్ ఆనందపడ్డాడు.

“అదీ బాగానేవుంది. కాని, జర్మనీవాళ్లు ఆ
వొప్పచెప్పమంటే అంతా తెచ్చియిచ్చేస్తారు.”

“అందరూ యివ్వరు. జాగ్రత్తచేసేవాళ్లు కూడా
వుండకపోరు” —అన్నాడు మొర్మాచెంకో.

బుల్గాకోవ్ ఏమంటారనన్నట్లు మిగిలినవాళ్ల
చూసేడు.

“ఆయుధాలు పంచిపెడదాం” కార్మికుయు
ప్రతిపాదనను సమర్థించేడు.

“అయితే అల్లాగేచేద్దాం”

బుల్గాకోవ్ కుర్చీలోంచి లేచేడు.

“ఇప్పటికింతే. తెల్లవారేవరకూ కాస్త
తీసుకొందాం. జకరయ్ వస్తే నా దగ్గరకు పంపండి.
మాట్లాడాలి. మొర్మాచెంకో! నువ్వువెళ్లి సెంట్రీ
పరీక్షించిరా.”

అందరూ వెళ్లేక బుల్గాకోవ్ సావడి ప్రక్కనేవున్న పడకగదిలో కెళ్లి మంచంమీద దళసరికోటు పరుచుకొని పడుకొన్నాడు.

* * *

మర్నాడు ప్రొద్దుటే పావెల్ ఎలక్ట్రిక్ స్టేషన్‌నుంచి తిరిగివస్తూ పట్టణంఅంతా మహాహడావిడిగా వుండడం గమనించేడు.

వెళ్ళసకొద్దీ ఒకటే జనరద్దీ. ప్రతివారిభుజానా ఒకటీ, రెండూ, ఒక్కొక్కప్పుడు మూడూకూడా రైఫిళ్లున్నాయి. అదంతా ఏమిటో అతనికి అర్థంకాలేదు. హడావిడిగా ఇంటికి పరుగెత్తేడు. లెస్జింకీల ఇంటివద్ద యెర్మాచెంకో గుర్రం ఎక్కబోతూ కనిపించేడు.

పావెల్ ఇంట్లోకి పరుగెత్తేడు. కాళ్లూ చేతులూ మొహం కడుక్కున్నాడు. ఆర్టెమ్ ఇంకా ఇంటికిరాలేదని తల్లి చెప్పింది. ఆమాట పూర్తిగా వినిపించుకోకుండానే పట్టణం రెండో మూలనున్న సెర్జీ బ్రూజక్ ఇంటికి పరుగెత్తేడు.

సెర్జీతండ్రి ఇంజన్‌డ్రైవర్‌కి అసిస్టెంటు. వాళ్లకో చిన్నయిల్లూ, చేరెడునేలా వున్నాయి.

పావెల్ వెళ్లేసరికి సెర్జీ ఇంట్లోలేడు. వాళ్ళమ్మ లావుగా పాలిపోయినట్లున్న మొహం ఆవిడా పావెల్‌వైపు ఎంతో రుసరుసలాడుతూ చూసింది.

"వాడెక్కడికిపోయేడో దేవుడికి తెలియాలి. ఇంకా సరిగ్గా తెల్లవారనేనాలేదు. పిశాచం పూనినవాడిలా పరు

గ_త్తేదు. ఎక్కడో రైఫిళ్లు పంచిపెడుతున్నారట అక్కడికే పోయేడనుకుంటున్నాను. మహా పెద్ద పీహాధిపీసర్లై పోయేరు. నాలుగు వుతికితేతప్ప చెప్పినమాట వినేలా లేరు. వేలె డున్నాడో లేదో తుపాకులు కావాలట. ఒక్కతూటా ఇంటికి తెచ్చేడంటే తాట వొలిచేస్తానని వెధవకో చెప్పా. ఏం తెస్తాడో, ఏంచావో, మధ్య నాకొస్తుంది. నువ్వా అక్కడికేనా ప్రయాణం?"

సెర్గీతల్లిమాట లింకా ఆ మెనోట్లో వుండగానే పావెల్ వీధి కడ్డంపడి పరుగెత్తిపోతున్నాడు.

పెద్దబజారులోకి వెళ్ళేసరికి ఒకఅతను రెండు భుజాల మీదా రెండురైఫిళ్లుపెట్టుకొని ఎదురయ్యేడు.

ఏమండీ! అవెక్కడివి?"

"వెక్షోవినాలో పంచిపెడుతున్నారు."

పావెల్ మళ్ళీ పరుగు లంకించుకున్నాడు. రెండువీధుల ఆవల ఒక కుర్రవాడు బరువుగావుండే రైఫిల్ ఒకటి ఈడ్చుకొంటూ వస్తున్నాడు. దాని చివర సన్నీకూడా తగిలించి వుంది.

"ఇదెక్కడిదిరా?"

"నిన్నవచ్చినవాళ్లు అదిగో ఆ స్కూలు కెదురుగా వున్న ఇంటిదగ్గిర పంచిపెడుతున్నారు. కాని అయిపోయేయి. ఇంకేమీ లేవు. రాత్రంతా పంచిపెడుతూనే వున్నారు. ఇంకక్కడ వట్టి పెట్టెలు మాత్రం వున్నాయి. కాని, నేను

దీనితో... రెండు సంపాదించేను'' – అన్నాడు ఆ కుర్రవాడు సగర్వంగా.

ఆ వార్తవిని పావెల్ దిగాలుపడిపోయేడు.

'' ఏడిసినట్లేవుంది. తిన్నగా అక్కడికే వెళ్లివుంటే గుండేది. ఛీ, ఎంత పనిచేశాను?

హఠాత్తుగా ఓ ఆలోచన తట్టింది. వెనుతిరిగి గబ బా పరుగెత్తి, ఆ కుర్రాడిని కలుసుకొన్నాడు.

“నీకు రెండుంచుకోయ్! తే ఇల్లా తే. ఇది నాకు.”

పావెల్ కుర్రవాడి చేతిలోంచి తుపాకీ లాక్కున్నాడు.

కుర్రాడికి మహాకోపం వచ్చింది. పావెల్ మీదికి రకబోయేడు. కాని, అతడు వెనక్కిజరిగి సన్నీ మీదికి ప్పేడు.

“జాగ్రత్త! గుచ్చుకొంటుంది.”

ఏమీ చెయ్యలేక ఆ కుర్రవాడు ఏడుస్తూ వెళ్ళిపోయేడు. పావెల్ బ్రహ్మానందపడుతూ ఇంటికెళ్ళేడు. గుమ్మం ంచి వెళ్ళకుండా ఇంటివెనక కంచెదాటి తిన్నగా పాకలో ళ్ళేడు. వెనుపట్టెమీద కనబడకుండా దాచి, దిగివచ్చేడు. తులు దులుపుకొని, నవ్వుకుంటూ ఇంట్లో అడుగుపెట్టేడు.

* * *

యుక్రెయిన్‌లో వేసవికాలపు రోజుల్లో సాయంకాల శోభ చాల ఆహ్లాదకరంగా వుంటుంది. షెపెటోవ్కా లాంటి పట్టణాలు పట్టణాల్లేకాకుండా చివరలనున్న పేటలల్లే వుంటాయి. వేసవి వచ్చిందంటే సాయంకాలంపూట పడుచు

వాళ్ళేవళ్ళూ ఇళ్ళల్లో వుండరు. ఇంటి అరుగుల దగ్గరికే ముందరివాకిళ్ళలోనో, రోడ్డు ప్రక్క పోగుచేసిన రాళ్ళ మీదనో జంటజంటలుగా, గుంపులుగుంపులుగా కూర్చు కేరింతాలు కొడుతూంటారు.

పువ్వులు వికసించి, ఘుమఘుమవాసనలు వెద జల్లుతుంటాయి. ఎక్కడో ఆకాశపుటంచుల్లో నక్షత్రాలు మిణుకు మిణుకు మంటుంటాయి. దూరమునుంచి పాటలు తేలి వినిపిస్తుంటాయి...

పావెల్‌కి అకార్డియన్ వాయించడం అంటే ఇష్టం. దానిని వాళ్ళో పెట్టుకొని, రెండు వరసలలో మెట్లమీద సున్నితంగా వేళ్ళు పరుగెత్తిస్తూంటాడు...

ఆరోజున సాయంకాలం ఎంతో ఆనందముగా వుంది. పావెల్ ఇంటిముందున్న కర్రదుంగలమీద చాలమంది పడుచువాళ్ళు చేరేరు. పొరుగింటి తాపీమేస్త్రి కూతురు గాలోచ్కా వాళ్ళల్లో మహాహుషారుగావుంది. మగపిల్లలతో కలిసిపాడడం, నాట్యంచేయడం ఆమెకి మహాసరదా. ఆమె గొంతుక సన్నగా, కమ్మగా వుంటుంది.

ఆవిడంటే పావెల్‌కు కాస్త భయం. ఆమెకు నోరు చురుకు ఎక్కువ. అతని ప్రక్కనకూర్చుని కౌగలించుకొని పకపకానవ్వుతూంటుంది.

"అకార్డియన్ ఎంత బాగా వాయిస్తావు! కాస్త వయసు వాడివై పోయేవుగాని, నిన్ను పెళ్ళిచేసుకొనేదాన్నే. అకార్డి యన్ వాయించేవాళ్ళంటే నాకెంతో యిష్టం." ... నేను

దీనితో పావెల్‌కు ఎంతో సిగ్గేసింది. చీకటిపడిపోయింది కనక సగంగ్ర మిగిలినవాళ్ళు చూస్తే ఆటపట్టించేవారే. కొంచెం క్కకి జరిగేడు. కాని, ఆమె వదలలేదు.

"మహాదొడ్డవాడివే. అల్లాపారిపోతావేమిటి? అంటూ మె పకపకనవ్వింది.

ఆమె రొమ్ములు అతని భుజాన్ని గట్టిగా, వెచ్చగా అదుముకొన్నాయి. పావెల్ మనస్సు ఎల్లాగోఅయిపోయింది. వాకిట్లో జనంఅంతా గొల్లున నవ్వుతున్నారు.

పావెల్ ఆమె భుజంపట్టుకుని త్రోసేడు.

"జరుగు, కొంచెం."

మళ్ళీ పకపకలు, వేళాకోళాలు, వెక్కిరింతలూ.

మారూస్యావచ్చి పావెల్‌ని ఆదుకొంది.

"మనస్సు కలిచివేసేపాట నేదన్నాపాడు పావెల్."

పావెల్ అంగుళులు ఆకార్డియన్ మెట్లమీద సున్ని కంగా నృత్యంచేసేయి. మధురమైన ఒక జానపదగీతం సాయంకాలపు పిల్లగాలులలో తేలుతూ వినిపించింది. గాలి కో గొంతు కలిపింది. మారూస్యా, ఆమెవెనుక మిగిలిన పాళ్ళూ కలిసేరు.

యువకంఠాలు దూరాన అడవులలో ప్రతిధ్వనించేయి.

మధ్యలో ఆర్టెమ్ కంఠం వినిపించింది.

"పావ్కా!"

అకార్డియన్ఆపి పావెల్ భుజాన వేసుకొన్నాడు.

"పోవాలి. నన్ను పిలుస్తున్నారు."

"ఏమిటోతొందర ఒక్క పాట పాడి వెళ్ళు."-అంటూ మారూస్యా బ్రతిమాలింది.

కాని, పావెల్ ఆగలేదు.

"వీల్లేదు. రేపు మళ్ళీ పాడుకుందాం. ఇప్పుడు వెళ్ళి తీరాలి. మా అన్న పిలుస్తున్నాడు..."

మాట పూర్తి చేయకుండానే పావెల్ ఇంట్లోకి పరుగెత్తేడు.

గదిలో తన అన్నతో పాటు మరో ఇద్దరు కూర్చున్నారు. వారిలో ఒకడు ఆర్టెమ్ స్నేహితుడు రోమన్. మరొకరెవరో కొత్తవాడు.

"పిలిచేవా?"

ఆర్టెమ్ తల వూపేడు.

"మనం ఇప్పుడనుకున్నాం, మా తమ్ముడు వీడే."—అని కొత్తవ్యక్తికి పరిచయం చేసేడు.

ఆ కొత్తమనిషి చిరునవ్వుతో చేయి చాపేడు.

ఆర్టెమ్ తన తమ్ముడివేపు తిరిగేడు.

"పావ్కా! మీ పవర్ స్టేషన్‌లో ఎలక్ట్రీషియన్ జబ్బుగా వున్నాడని చెప్పేవుకదూ? పని బాగా చేతనైనవాడున్నాడు. కావాలేమో తెలుసుకో. అడిగి చెప్తావుకదూ."

కొత్తవ్యక్తి మధ్యలో అందుకున్నాడు.

"అదంతా అనవసరం. ఇతనితో వెళ్ళి, ఆ యజమానితో నేనే మాట్లాడేస్తే తీరిపోతుంది."

"వాళ్ళకి మనిషి కావలసినమాట నిజమే. స్టాంకో విచ్ జబ్బుగా వుండడంచేత ఈ వేళ స్టేషన్‌లో యంత్రాలు కదలడంలేదు. యజమాని రెండుమార్లు ఎవరన్నా ఆపని తెలిసినవాళ్ళున్నారేమోనని అడిగి తిరిగివెళ్ళేడు. బాగ్గేసే వాడొక్కడినీ పెట్టుకొని యంత్రంచేత పనిచేయించడానికి భయపడ్డాను. ఎలక్ట్రీషియనుకి టైఫస్ తగిలింది."

"ఇహాసేం. తీరిపోయింది. రేపుప్రొద్దున్నే వస్తాను. ఇద్దరం కలిసేపోదాం."

"అల్లాగే."

పావెల్ వంక కొత్తమనిషి ఎంతో పరిశీలనగా చూసేడు. ఆ చూపులతో పావెల్‌కు ఎలాగో అనిపించింది. కొత్త మనిషి బూడిదరంగు పొడుగు కోటు తొడుక్కున్నాడు. దానికి బొత్తాలు పైనుంచి క్రిందికల్లా బిగించేడు. అది సరిగ్గా సరిపడదు కాబోలు. వీపుమీద కుట్లు పిటపిటలాడుతున్నాయి. మెడ ఆంబోతు మెడలాగ మంచి వలంగావుంది. మనిషిని చూస్తేనే మంచి బలిష్ఠుడనిపిస్తుంది.

ఆర్టెమ్ ఆతనిని గుమ్మందాకా సాగనంపేడు.

"మరి దిగబడతా, జకరయ్! రేపు వెళ్ళిరా."

* * *

పార్టిజాన్ దళం వెళ్ళిపోయిన మూడు రోజులకి జర్మనులు పట్టణంలో అడుగుపెట్టేరు. అంతవరకూ నిశ్శబ్దంగా వున్న స్టేషన్‌లో రైలుకూత వినిపించింది. వెనకాలనే వాళ్ళొచ్చేరు.

"జర్మన్లొస్తున్నారు" —అనే వార్త వాళ్ళకి ముందే పట్టణంఅంతా పాకింది.

చెదపుట్ట కదిలించినట్లు పట్టణంఅంతా కలతపడింది. జర్మన్లు వస్తున్నారని వాళ్ళదివరకే ఎరుగుదురు. అయినా ఎందుకో వాళ్ళకి నమ్మకం చిక్కలేదు. ఆ జర్మన్ రాక్షసులు ఎప్పుడో రావడంకాదు; అప్పుడే వచ్చేశారు. పట్టణంలో అడుగుపెట్టేరు.

ఎవ్వరూ తమవీధిగుమ్మాలూ, ఇంటి కోరళ్ళూదాటి బయట అడుగుపెట్టడంలేదు. వీధిలోకివెళ్ళడం అంటే ఎవరికి వారికే భయంగావుంది.

దండుబాట ఆవైపునా, ఈవైపునా రెండుపంక్తులుగా జర్మనులు పట్టణంలో ప్రవేశించేరు. బాగా లేత ఆకుపచ్చరంగు యూనిఫారాలు తొడిగేరు రైఫిళ్ళు సర్వసిద్ధంగా పట్టుకొన్నారు. వానిచివరన వెడల్పాటి కత్తుల్లాంటి సన్నీలు తగిలించివున్నాయి. బరువైన ఉక్కుటోపీలు పెట్టుకొన్నారు. వీపుల్ని పెద్దపెద్దమూటలు మోస్తున్నారు. అంతూపొంతూ లేకుండా ఓ ప్రవాహంలాగ వాళ్ళు స్టేషన్లోంచి పట్టణంలోకి వచ్చేరు. బహుజాగ్రత్తగా ఏక్షణంలో ఎవరు ఎదురొన్నా తిప్పికొట్టేటందుకు తయ్యారీలో నడుస్తున్నారు.

సేనలముందు మాజర్లు చేతబట్టుకొని ఇద్దరు ఆఫీసర్లు నడుస్తున్నారు. రోడ్డుమధ్యగా వస్తున్నాడు దుబాసీ. ఆ దుబాసీ హెట్మన్ క్రింద పనిచేస్తున్న ఒక సార్జంట్-మేజరు. నీలిరంగు యుక్రేనియనుకోటు వేసుకొన్నాడు. తలమీద ఎత్తయిన బొచ్చుటోపీ వుంది.

నగరమధ్యంలోవున్న చౌక్‌లోకి జర్మన్ సేనలు చేరేయి. బ్యాండు మోగింది. కాస్తధైర్యంవున్న నగర వాసులు నలుగురూ ఆచుట్టూచేరేరు. దుబాసీ ప్రక్కనే వున్న అరుగెక్కి సేనానాయకుడు మేజర్ కోర్ఫ్ ఆజ్ఞాపత్రాల్ని చదివి వినిపించేడు.

(1) నగరప్రజలంతా తమ దగ్గరున్న తుపాకులనూ, ఇతర ఆయుధాలనూ ఇరవైనాలుగు గంటలలోపున వప్ప చెప్పాలి. ఈ ఆజ్ఞమీరితే కాల్చిచంపుతాము.

ఇదినాయాజ్ఞ.

(2) పట్టణంలో సైనికశాసనం ప్రకటించబడింది. రాత్రి ఎనిమిదిగంటలుదాటేక వీధుల్లో ఎవరూతిరగకూడదు.

మేజర్ కెర్ఫ్

పట్టణ సేనానాయకుడు.

వెనకటిరోజుల్లో పురపాలకసంఘంవున్న భవనంలోనే విప్లవానంతరం నగర సోవియట్ కార్యాలయం పెట్టేరు. ఇప్పుడు దానినే జర్మను సేనాధిపతి తన కార్యాలయంగా వుపయోగించేడు. గుమ్మంలో ఒకసైనికుణ్ణి కాపలాపెట్టేడు. ఆ భవనం వెనకవేపు సావిట్లో ప్రజలు స్వాధీనపరిచే ఆయుధాలను జాగ్రత్తపెట్టడానికి ఏర్పాట్లుచేసేరు.

కాల్చిచంపేస్తామనేసరికి భయపడి పౌరులు తమవద్ద నున్న ఆయుధాలన్నింటినీ తేవడం ప్రారంభించేరు. పెద్దవాళ్లెవరూ రావడంలేదు. చిన్నపిల్లలూ, పడుచువాళ్ళూ పట్టుకొస్తున్నారు. జర్మన్లెవ్వరినీ పట్టుకోలేదు.

స్వయంగా పట్టుకురావడానికి ఇష్టంలేనివాళ్ళు ఎవరూ చూడకుండా తమ యింట్లో వున్న ఆయుధాల్ని రాత్రిపూట రోడ్డుమీద పారేసి ఏమీ ఎరగనట్లూరుకొంటున్నారు. ప్రొద్దుటే జర్మన్ గస్తీబాగ్లు వాటిని పోగుచేసి బళ్ళలో వేసి కమాండరు కార్యాలయానికి చేరేస్తున్నారు.

మధ్యాహ్నం ఒంటిగంటకు సేనాధిపతి ఇచ్చిన గడువు పూర్తి అయింది. వసూలయిన తుపాకులు లెక్కచూసేరు. పద్నాలుగువేలు లెక్కతేలేయి. అంటే ఇంకా ఆరువేలు దాగేయన్నమాట. వరుసపెట్టి సోదాలు ఆ కొసనుంచి ఈ కొసకు సాగించేరు. కాని లాభంలేకపోయింది.

మర్నాడుదయానే ఇద్దరు రైల్వే కార్మికుల్ని తీసుకుపోయి యూదుల గోరీలదొడ్డిదగ్గర నిల్చోబెట్టి కాల్చేసేరు. వాళ్ళ యిళ్ళలో తుపాకులు దొరికేయి.

* * *

సేనానాయకుడి ఆజ్ఞ వినగానే ఆర్టెమ్ హడావిడిగా ఇంటికి వచ్చేడు. వాకిట్లో పావెల్ కనిపించేడు. రెక్క పట్టుకొని నిలేసేడు.

"తుపాకులన్నా ఏవన్నా తెచ్చావా?"

తాను తెచ్చిన తుపాకీనిగురించి ఎవ్వరికీ చెప్పకూడదనుకొన్నా, పావెల్ అన్నగారివద్ద అబద్ధం ఆడలేకపోయేడు. అన్నీ చెప్పేసేడు.

ఇద్దరూ పెరటిపాకలోకెళ్ళేరు. వెదుపట్టె వెనక దాచిన రైఫిల్ను దింపేరు. ఆర్టెమ్ దానిచివరవున్న సన్నీని, మొదట

వున్న బోల్టునీ తీసేసేడు. బోల్ట్ స్ప్రింగుని బలంకొద్దీ కొరడిరాటనిపెట్టి బాదేడు. రైఫిల్ మడమ తుంపులయిపోయింది. దానిని దొడ్డిగా పలవున్న ఖాళీజాగాలోకి విసిరిపారేసేడు. బైనెట్‌నీ, బోల్ట్‌నీ పాకీగోతిలో పారేసేడు.

"ఒరేయి, నువ్వేం చంటిపిల్లడివి కావు. తుపాకులతో చెలగాటంవద్దు. అల్లాంటి వేవీ ఇంట్లోకి తేవద్దు. గట్టిగా చెప్తున్నా. అల్లాంటి పనులుచేస్తే ప్రాణాలెగిరిపోతాయి. రోజులు అల్లావున్నాయి. కొంటెపనులుచేసుకు నువ్వేదన్నా చేసేవా ముందు నాపీకమీదకొస్తుంది. కుర్రాడివని నిన్ను ముట్టుకోరు. రోజులేం బాగాలేవు. తెలిసిందా?"

పావెల్ అల్లాగే నన్నాడు.

వాళ్ళిద్దరూ పెరట్లోంచి ఇంట్లోకివస్తూంటే లెస్జింకీల గుమ్మంలో బండిఆగింది. లాయరు లెస్జింకీ, భార్యా, ఇద్దరు పిల్లలు నెల్లీ, విక్టరూ బండిదిగేరు.

"మళ్ళీ పక్షులు గూటికి చేరుకుంటున్నాయి. వీళ్ళ దుంపతెగ! ఇంక నానాఅల్లరీ ప్రారంభిస్తారు"— అంటూ ఆర్టెమ్ గొణుక్కున్నాడు.

ఆరోజంతా రైఫిల్‌పోయినందుకు పావెల్ విచారంగానే వున్నాడు. అతనిమిత్రుడు సెర్జీమాత్రం తన రైఫిల్‌ను బయటపెట్టలేదు. కర్రా కంపా, చెత్తా చెదారమూ పడేసే కూలిపోతున్న ఒక పాతపాకలో ఓమూల బాగాలోతుగా గొయ్యితీసేడు. వాడు సరికొత్తరైఫిళ్ళు మూడు పట్టుకొచ్చేడు. వాటిని పాతగుడ్డల్లో చుట్టబెట్టి పాతేసి ఆ ప్రదేశం అంతా

చదునుగా తొక్కే-సేశు. దానిమీద ఇంత చెత్తా చెదార మూపడేసి కొత్తగాతవ్విన గుర్తులు కనబడకుండా చేసేశు. ఇంకేమన్నా గుర్తులున్నాయేమో నని జాగ్రత్తగా పరిశీలించి సంతృప్తిపడ్డాడు.

"ఇంక సోదాచెయ్యమను. దొరికినా ఎవరివని పట్టుకుంటాపు. ఈపాక ఎవరిదంటారేమిటి ?"—అనుకొన్నాడు.

* * *

జకరయ్ పవర్ స్టేషనులో పనికి కుదిరి నెలరోజులు పైగా అయింది. ఆతనితో పావెల్‌కు గాఢమైన స్నేహం కుదిరింది. ఆతడు డైనమో ఎల్లా తయారయిందీ, ఎల్లా పనిచేసేదీ నేర్పేడు.

జకరయ్‌కి పావెల్ మీద అభిమానం కుదిరింది. పని లేనిరోజుల్లో ఆర్టెమ్ ఇంటికి తప్పకుండా వస్తున్నాడు. ముసలమ్మ ఇంటిగొడవలన్నీ చెప్తూంటే ఓపిగ్గా వినేవాడు. చిన్న కొడుకు చేసే చిలిపిపనులను గురించి ఆమె మహావిచారం తెలిపేది. జకరయ్ మంచి ఆలోచనాపరుడు. ఓపికగల వాడూను. ఆతనితో మాట్లాడితే మేరియా యాకోవ్లేవ్నాకు ఎంతో సంతృప్తి అనిపించేది. మనసుమీాది బరువు తీసేసినట్లనిపించేది. ఒక్క గడియసేపు తన వ్యధలన్నీ మరచిపోయేది.

పవర్ స్టేషన్ దొడ్డిలో నిలవచేసిన కర్రలాట్లమధ్యగా పోతూంటే ఓరోజున పావెల్‌ను జకరయ్ ఆపేశు.

"నీకు పేచీయంటే మహోయిష్టమటగా? మీ అమ్మ చెప్పింది. కోడిపుంజులా ప్రతివాళ్ళమీదికీ వెళతావట."

ఆ మాటంటూ జకరయ్ చిరునవ్వు నవ్వేడు.

"పేచీకోరుతనం వుండడం తప్పేంకాదు. కాని, ఎవరితో, ఎందుకు పేచీపడాలో తెలిసివుండాలి."

జకరయ్ వేళాకోళం చేస్తున్నాడో, నిజంగానే అంటున్నాడో పావెల్‌కి అర్థంకాలేదు.

"నేనూరికే ఎప్పుడూ దెబ్బలాడను. అన్యాయం జరుగుతూంటే ఊరుకోలేను."

"దెబ్బలాడడంలో పనికొస్తాయి. పేచీలు నేర్చుకుంటావా."

జకరయ్ ప్రశ్నకు పావెల్ ఉలికిపడ్డాడు. ఆశ్చర్యంతో అతనివంక చూసేడు.

"అంటే?"

"చూద్దువుగానికా."

జకరయ్ అక్కడికక్కడే బాక్సింగ్‌మీద చిన్న పాఠం చెప్పేడు.

ఆ విద్య పావెల్‌కు అంతత్వరగా పట్టుబడలేదు. చాల మాట్లు జకరయ్ గుద్దులకు పడిపోయాడు. అయినా పట్టుదల వదలకుండా నేర్చుకున్నాడు.

ఒకరోజున పావెల్ అప్పుడే క్లిమ్‌కా ఇంటినుంచి వచ్చేడు. ఏమీ చెయ్యడానికి కనబడలేదు. వెళ్ళి పెరట్లో మూలగావున్న పెద్దుమిద్దెపై నెక్కేడు. అక్కడ కూర్చోడం

అంటే అతనికి చిన్నప్పటినుంచీ సహాసరదా. షెడ్డుచుట్టూ చెర్రీచెట్లు గుబురుగా పెరిగివున్నాయి. కనక దానిమీద కూర్చుంటే, ఎవ్వరూ చూడకుండా చుట్టూవున్న పెరళ్ళలో ఏంజరుగుతున్నా చూడొచ్చు.

షెడ్డును ఆనుకొనే లెస్టింకీల పెరడువుంది. ఆ పెరడూ, ఇంట్లో కొంత భాగమూ మిద్దెమీంచిచూస్తే కనిపిస్తుంది. పావెల్ అడ్డంగావున్న చెట్టుకొమ్మలు తప్పించి అటు చూసేడు. గుమ్మంలో ఓ బండీవుంది. లెస్టింకీల యింట్లో జర్మన్ లెఫ్టినెంట్ ఒకడు మకాంచేస్తున్నాడు. ఆతని పని వాడు యజమాని పిస్తోల్ని దుమ్ము దులుపుతున్నాడు.

ఇదివరకే లెఫ్టినెంట్ ఆ గుమ్మాన వస్తూపోవడం పావెల్ చాలసార్లు చూసేడు. లెఫ్టినెంట్ లావుగా, పొట్టిగా వుంటాడు. ఎర్రటిమొగం, కత్తిరించిన చిన్నమీసం. పిన్స్ నెజ్ పెడతాడు. నెత్తిన మెరుస్తున్న టోపీ. గుమ్మానికి పక్కనున్న గదిలోనే అతడుంటాడు. గదికి తోటవేపున కిటికీ వుంది. షెడ్డుమిద్దెమీంచి చూస్తే ఎదురుగావున్న కిటికీలోంచి గదిఅంతా కనిపిస్తుంది.

టేబిల్ వద్ద కూర్చుని లెఫ్టినెంట్ ఏదో వ్రాసుకొంటూ కనబడ్డాడు. ఆ కాగితం తీసుకొని గదిబయటికివచ్చేడు. అది పనివాడిచేతిలో పెట్టి తోటలోంచి గేటువేపు బయలుదేరేడు. చలవపందరిదగ్గరకొచ్చి ఒక్కక్షణం నిలబడి ఎవరితోనో మాట్లాడేడు. ఓనిమిషంపోయేక లెస్జింకీకూతురు నెల్లీ బయటికి వచ్చింది. లెఫ్టినెంట్ ఆమె చెయ్యిపట్టుకున్నాడు. ఇద్దరూ గేట్లోంచి వీధిలోకి వెళ్ళేరు.

కొంచెంసేపున్నాక లెఫ్టినెంటుబంట్రోతు గదిలోకెళ్ళేడు. దులుపుతున్న యూనిఫారం చిలకకొయ్యని తగిలించేడు. కిటికీతలుపులు బారుగా తెరిచి గదిఅంతా సర్దేడు. ఆపని పూర్తిఅయ్యేక గదితలుపులుమూసి ఎక్కడికో బయలుదేరేడు.

కిటికీకి ఎదురుగావున్న టేబిల్ మీద బెల్టూ, దాని ప్రక్కన మెరుస్తున్న వస్తువొకటీ పావెల్ కి కనిపించాయి.

అదేమిటో చూడాలనిపించింది. నెమ్మదిగా చప్పుడు చేయకుండా చెట్టుకొమ్మలమీదుగా లెఫ్టినెంకీల పెరట్లోకి దిగేడు. వొంగి వొదిగి పెరటికడ్డంబడి పరుగెత్తేడు. టేబిల్ మీద హోల్డర్ లో మేలురకం రివాల్వరు కనిపించింది.

ఒక్కనిముషం స్తంభించిపోయేడు. కొంతసేపు తటపటాయించేడు. కాని, మంచి రివాల్వరును వొదిలిపెట్టాలనిపించలేదు. కిటికీలోకెక్కి, రివాల్వరు అందుకున్నాడు. హోల్డరక్కడే పారేసేడు. క్షణంలో పరుగెత్తివచ్చి చెట్టుమీదుగా మిద్దె ఎక్కేశాడు. దూరాన గుర్రాలశాలలో సైసుతో లెఫ్టినెంటుబంట్రోతు మాట్లాడుతూ కనిపించేడు. పెరడంతా నిశ్శబ్దంగావుంది. పావెల్ చడీచప్పుడూ లేకుండా తన పెరట్లోకి దిగి ఇంట్లోకి వెళ్ళేడు.

తల్లి వంటవండుతూంది. ఆమె తిరిగేనా చూడలేదు.

పెట్టె వెనకాలనున్న పాతగుడ్డ ఒకటితీసి కోటు జేబులో కుక్కుకున్నాడు. రెండోకంటివాడి కక్కనబడకుండా ఇంట్లోంచి బయటికివచ్చేడు. వాకిలిగేటులోంచి వెళ్ళకుండా

కోరశీమీాదఎక్కి బయటికురికేడు. గోడ్డొత్తిన్నగా చిట్టడవికేసి బయలుదేరేడు. పరుగెత్తుతూంటే జేబులో బరువుగావున్న రివాల్వరు కాళ్ళకు అడ్డుపడకుండా ఎత్తిపట్టుకొని అడవి దగ్గరలోవున్న ఇటికావం చేరుకొన్నాడు.

ఆవం దగ్గ రెవరూ లేరు. పేర్చినఆవం కూలిపోయి వుంది. కానులన్నీ పడిపోయేయి. ఇటికలు చెల్లాచెదరుగా పడి, పాచిమొలచి వున్నాయి. పావెలూ; అతని స్నేహితు లిద్దరూ తప్ప దాని చుట్టుప్రక్కలకుకూడా ఎవరూపోరు. వాళ్ళు ఆటలకు ఆచోటు ఏరుకొన్నారు. ఆ చుట్టుప్రక్కల ప్రదేశాలన్నీ ఆతనికి కొట్టినపిండే.

నెమ్మదిగా ఆవంలోపలికి దిగేడు. గుడ్డలోచుట్టిన రివాల్వరు ఒకమూలలోపెట్టి దానిమీాద ఇటికలు పేర్చేడు. బయటికివచ్చి ఆ కాను మొదట్లోకూడ ఇటికలుపేర్చి దారి మూసేశేడు. ఆ ప్రదేశం బాగా గుర్తుపెట్టుకొని నెమ్మదిగా ఇంటిముఖం పట్టేడు.

“ ఇంక ఏం జరుగుతుందో. ”

ఆ మాట తలుచుకొన్నప్పుడల్లా కాళ్ళల్లోంచీ వణుకు వస్తూంది.

ఇంటికి పోవడం ఇష్టంలేక, వేళకాకపోయినా సరాసరి పవర్ స్టేషన్ కే వెళ్ళేడు. కాపలావానివద్ద తాళాలు తీసుకొని తలుపులు తీసేడు. బాయిలర్ క్రిందచేరిన కట్టెల బూడిద తీసేడు. దానిక్రింద మంటచేసేడు. బాయిలరునిండా నీరు పట్టేడు. అంతసేపూ అతనిదృష్టి లెస్జింకీల యింటిగది మీాదనేవుంది.

పదకొండుగంటలవేళ జకరయ్ వచ్చి అతనిని బయ టకు పిలిచేడు.

"మీాయిల్లు సోదాచేసేరెందుకు?"

పావెల్ ఉలికిపడ్డాడు.

"సోదా?"

"ఏదోవుంది. నీకేం తెలియదన్నమాటే."

పావెల్కి తెలుసును. కాని, తాను ఎత్తుకొచ్చిన రివాల్వరుసంగతి నాతను జకరయ్తోకూడా చెప్పదలచ లేదు. ఆదుర్దాతో వణికిపోతున్నాడు.

"ఆర్టెమ్‌ను అరెస్టుచేసేరా?"

ఎవ్వరినీ అరెస్టుచేయలేదు. కాని కొంపఅంతా తల్ల క్రిందులు చేసిపెట్టేరు."

పావెల్కి భయం పూర్తిగా తొలగకపోయినా, అదటు మాత్రం తగ్గింది. ఒక్కక్షణం ఇద్దరూ ఎవరి ఆలోచనలలో వారు మునిగి అక్కడే నిల్చున్నారు. వారిలో ఒకనికి సోదా ఎందుకు జరిగిందో తెలుసుకనక అదటుపడుతున్నాడు. రెండో వానికి తెలియదు. కనక ఏంజాగ్రత్తతీసుకోవాలా యని ఆలో చిస్తున్నాడు.

"దొంగముండాకొడుకులకి ఏంఅనుమానం కలిగిందో, ఆర్టెమ్‌కి కూడా నా సంగతి తెలియదు; చెప్పలేదు. కాని, ఆ యిల్లు సోదాచేశారు. ఎందుకో ఇంకొంచెం జాగ్రత్త పడాలి."

ఒక్క నిమిషం పోయేక యిద్దరూ ఎవరి పనులకు వాళ్ళు పోయేరు.

*　　*　　*

లెస్జింకీల యిల్లంతా చాల అల్లకల్లోలంగా వుంది.

తన ఆయుధం కనబడకపోయేసరికి లెఫ్టినెంట్ తన బంట్రోతు నడిగేడు. వాడు గది అంతా వెతికి ఎవరో ఎత్తుకు పోయి వుంటారన్నాడు. ఆ మాట వినబడేసరికి లెఫ్టినెంటు తామసం పట్టలేక శక్తికొద్దీ ఊచిపుచ్చుకొని ఒక్క లెంప కాయ కొట్టేడు. ఆ దెబ్బకి కళ్ళుతిరిగిపోతూన్న బంట్రోతు ఎటెన్షన్‌లో నిల్చోక తప్పలేదు.

లాయర్ని పిలిపించేరు. ఆయన ఆవార్త వినగానే చాల మండిపడ్డాడు. తనయింట్లో అటువంటి అపచారం జరిగినందుకు క్షమార్పణ చెప్పుకొన్నాడు.

పొరుగింటివాళ్ళు దొంగిలించివుంటారని విక్టర్ లెస్జింకీ అందించేడు. వాడి అనుమానం పావెల్ కోర్చాగిన్ మీదికి పోయింది కొడుకు అనుమానాన్ని వకీలు వెంటనే లెప్టినెం టుకు చెప్పేడు. చెప్పడంతడువు సోదాజరిగింది.

కాని ఏమీ దొరకలేదు. అదిచూసేక ఎంత ప్రమాద మైన పనులుచేసినా ఒక్కొక్కప్పుడు ఏమీబాధలేకుండా బయటపడవచ్చునని పావెల్‌కి ధైర్యం కలిగింది.

# ప్రకరణం 3

త్రోన్యా కిటికీదగ్గర నిలబడి గాలికి వూగుతున్న పోప్లర్ల వంక దీక్షగా చూస్తూంది. చిన్నప్పుడెప్పుడో పుట్టిపెరిగిన ఈ ప్రాంతానికి మళ్ళీవచ్చి అప్పుడే ఏడాది అయింది. నిన్న వెళ్ళి ఈవేళ తిరిగొచ్చినట్లేవుంది.

ఎక్కడామార్పులేదు; ఎప్పటిలాగే రాస్ప్బెర్రీపొదల్ని అందంగా కత్తిరించేరు. పూలతోటలో దారులుతీర్చినట్లు వేసేరు. దారులప్రక్కన తనతల్లికి చాలాప్రియమయిన పువ్వులమొక్కలు పెంచేరు. తోటఅంతా తీర్చిదిద్దినట్లుంది. అవే మళ్ళీమళ్ళీ చూస్తూంటే త్రోన్యాకి విసుగుపుడుతూంది.

తాను చదువుతూన్న నవల చేతబట్టుకొని, తలుపు తీసుకొని వరండాలోకి వచ్చింది. మెట్లుదిగి తోటలోకి వెళ్ళింది. నెమ్మదిగా వికెట్ గేట్ తోసుకొని పవర్ స్టేషన్ కు నీళ్ళుపంపే కోనేరుకేసి నడిచింది.

బ్రిడ్జి దాటింది. రోడ్డు కిరుప్రక్కలావున్న చెట్లను చూస్తూ నడుస్తూంది. కుడిచేతివేపున కోనేటుంది. దాని గట్ల వెంబడి రెల్లూ, జమ్మూ దట్టంగా పెరిగివుంది. రోడ్డుకి ఎడంవేపున అడవి.

క్వారీ గుంటలకేసి వెడదామని బయలుదేరుతూంటే కోనేటి నీటిమీద చేపలగాలం వూగుతూ కనబడి ఆగింది.

దగ్గరేవున్న విల్లోచెట్టు పంగలకొమ్మల్లో కెక్కి చూసింది. నీటిదగ్గరగా ఒక కుర్రవాడు కూర్చుని కనబడ్డాడు. ఆతని కామె రాకే తెలియదు.

"ఇక్కడ చేపలు పడతాయా?"

పావెల్ కోపంగా వెనుతిరిగి చూసేడు.

విల్లోకొమ్మమీదుగా నీటిలోకి వంగిచూస్తున్న ఆ అమ్మాయి నాతడెన్నడూ చూడలేదు. ఓడకళాసులు తొడుక్కునే తెల్లబ్లౌజు తొడిగింది. బంగారురంగుజుట్టు పెద్దముడిగా వేసుకొంది.

ఆతనిచేయి వణికింది. ఎరను తేల్చివుంచే బెండుముక్క కదిలింది.

"చేప పడింది, పడింది" అంటూ ఆమె వెనకనుంచి కేకపెట్టింది.

పావెల్‌కి కోపంవచ్చి ఒక్క విదుపులో గేలంపైకి విసిరేడు. ఎరతోసహా బెండు గాలిలోకి తేలివచ్చింది.

"పాడు! చేపలుకూడా పట్టుకోనివ్వరు. ఇదెక్కడి నుంచివచ్చిందిరా" అనుకొంటూ పావెల్ విసుగుతో గేలం దూరంగా వేసేడు. కాని అది అనువైనచోటు కాదు. అటూయిటూవున్న గాంభారిదుంపలమధ్య పడి గేలం వాటిలో చిక్కుకుంది.

తను చేసిన పొరపాటు తెలిసేక మరీ విసుగుపుట్టింది. చప్పున వెనక్కి తిరిగి ఆ అమ్మాయిమీద బుస్సుమన్నాడు.

"నోరు మూసుక్కూర్చోలేవు. నువ్విల్లా కేకలెడితే చేపలీచుట్టుప్రక్కలకూడా వుండకుండాపోతాయి."

తోన్యా ఎగతాళిచేసింది.

"నీ ధుమధుమలుచూసే చేపలు పారిపోతాయి. మధ్యాహ్నంపూట మతివున్న వాడెవ్వడూ గేలంపుచ్చుకు బయలుదేరడు.

పావెల్ మర్యాదగా మాట్లాడాలనే అనుకొన్నాడు. కాని, ఆమె మాటలు వినేసరికి మహాకోపం వచ్చింది.

"నువ్విక్కడినుంచి వెళ్ళిపోతే బ్రతుకుతా, తల్లీ."

తోన్యా కళ్ళు చిలిపితనంగా నవ్వేయి.

"నీ దారి కడ్డున్నానా ?"

ఈ మారామె స్వరంలో అపహాస్యంకన్న స్నేహ భావం ఎక్కువ కనబడింది. నాలుగూ చెడామడా అనేసి తరిమేద్దామనుకొన్న పావెల్ ఆ స్వరం వినబడ్డాక ఏమీ అనలేకపోయేడు.

"నీకు చూడాలనుంటే ఉండు. చూడు. ఉన్నా, వెళ్ళినా నాకు పోయేదిలేదు."

పావెల్ మళ్ళీ కూర్చుండి బెండూ తాడూ సరిచేసుకోవడం ప్రారంభించేడు. గేలం ములికి గాంధారి దుంపల వేళ్ళల్లో చిక్కుకొందో ఏమో, గట్టిగా లాగితే తెగిపో

తుందేమో. అల్లాంటిదేదన్నా జరిగితే ఆ పిల్ల నవ్వుతుందని భయం. "పోకూడదా, ఇక్కడెందుకు?" అనుకొన్నాడు.

తోన్యా పంగలకొమ్మమీద కుదురుగా కూర్చుంది. చేతిలోని పుస్తకాన్ని తొడమీద మూసిపెట్టుకొని పావెల్ వంకచూస్తూ కూర్చుంది. మొదట మోటుతనంగా పొమ్మన్న మనిషి. ఇప్పుడామె అసలక్కడుందన్నట్లే గమనించడంలేదు.

అద్దంలావున్న నీళ్ళల్లో ఆమె ప్రతిబింబం కనిపిస్తూంది. పుస్తకం చదవడంలో మునిగి తన్నుగమనించడంలేదని తోచి నప్పుడు నెమ్మదిగా తాడులాగేడు. బెండు నీటిలో మునిగి పోయింది. తాడు బిగువయింది.

"ముండమొయ్యా చిక్కడింది." అనుకొన్నాడు. ఓర గంట తనవంకచూస్తూ చిరునవ్వునవ్వుతున్న ఆమెముఖం నీటిలోంచి తొంగిచూస్తూంది.

ఆ సమయంలో పంపుగొట్టాలున్నచోటికి దగ్గరగా వున్న వంతెనమీద ఇద్దరు పడుచువాళ్ళువస్తూ కనిపించేరు. ఇద్దరూ కాలేజీ విద్యార్థులు. ఒకడు రైల్వేయార్డులలో పని చేస్తున్నాడు. ఇంజనీరు సుఖార్కోకొడుకు. అందమైన జుట్టు, ముడతలమొగమూను, పిల్లలంతా వానిని మచ్చలమొగం షూర్కా అంటారు. వానిచేతిలో మంచి అందమైన గేలం కర్రవుంది. పెదవులమధ్య ఒకవేపుగా సిగరెట్టుదోపేడు. వానితోవున్న రెండోవాడు లెస్జిన్స్కికొడుకు విక్టర్. అతడు పొడుగ్గా, నాజూకుగా వుంటాడు.

“హు - నేస్త్యా, లౌన్స్ ఏపిల్ల! పీచ్ పంతులాగా వుంది.”- అన్నాడు షూరాక్ తన మిత్రుడికేసి తిరిగి.

“మంచిసరదాఅయిన పిల్లలే. కీవ్‌లో ఆరోఘారం చదువుతూంది. వేసంకాలపుసెలవులకని వచ్చింది. వాళ్ళ నాన్న ఇక్కడ ఫారెస్టరు. మా చెల్లెలు లిజాకు ఆవిడ తెలుసు. ఓమాటు ఓ చిన్న ప్రేమలేఖకూడా వ్రాసేనులే— నువ్వంటే నాకెంతో ఇష్టం — నీ సమాధానంకోసం ఎంతో ఆతురతతో ఎదురుచూస్తున్నా” నంటూ ఏమిటో తెగవ్రాసేను. నాడ్సన్ వ్రాసిన పద్యాలుకూడా దాంట్లో దూర్చేనులే.

“ఆవి డేమంది?” అని ప్రశ్నించేడు విక్టర్.

షూరాక్ దిగులుమొఖం పెట్టేడు—“ఆవిడకి తగని అతిశయంలే. వెర్రిమొర్రిపుత్తరాలు వ్రాసి కాగితాలు పాడు చెయ్యకండి. అయితే అంతా మొదట అల్లాగే అంటారులే. ఈ సంగతులన్నీ మనకి కొట్టినపిండే. వెధవది-ఈ శృంగార తతంగం అంటే నాకు మహా చెడ్డ చిరాకు. నెలలతరబడి ఏడుస్తూ అస్సురుస్సురంటూ కూర్చోడం నా కసహ్యం. సుఖంగా సాయంకాలంపూట చల్లగాలిలో తిరక్క యీ తగులాటం ఏమిటి? అల్లా బారకాసుల కెడితే బోలెడంత మంది పడుచుపిల్లలు. మూడు రూబుళ్ళు మనవి కావను కొంటే కావలసినంత సుఖం. వాళ్ళతో యీ గొడవలే వుండవు. వాల్కాతిఖోనోవ్‌ను ఎరుగుదువా! వాడూ నేనూ వెడుతూంటాం.”

విక్టర్ అసహ్యంతో మొగం చిట్లించుకొన్నాడు.

"ఏరా, ఆ చెత్తముండలతో పోతూంటావా?"

షూరాక్ సిగరెట్టుకొస నమిలి ఉమ్మేసేడు.

"మడికట్టుకున్నట్లు మాట్లాడకు. నీ తిరుగుళ్ళు నాకు తెలియవా?"

విక్టర్ వానిమాట పూర్తికాకుండానే అడ్డుతగిలేడు.

"నీ పీచ్‌పండుని కాస్త పరిచయం చెయ్యి."

"అయితే నడు. లేకపోతే చల్లగా జారుకోగలదు. నిన్న ఆవిడ ఒక్కర్తీ గేలం తీసుకు బయలుదేరింది.

ఇద్దరుమిత్రులూ తోన్యాను సమీపించేరు. సుఖాగ్గో నోట్లోంచి సిగరెట్టుతీసి, ఆమెకు అభివాదనం చేసేడు.

"తుమనోవా! బాగున్నావా? వేటకొచ్చేవా?"

"ఏంలేదు. ఊరికేచూస్తున్నా"—అంది తోన్యా.

సుఖారోక్ విక్టర్ చేయిపట్టుకొని ముందుకులాగేడు.

"మీరొకరి నొకరు ఎరగరనుకొంటా. ఈయన నా మిత్రం, విక్టర్ లెస్జిన్స్కీ"

విక్టర్ కంగారుగా చెయ్యిచాచేడు.

సంభాషణ తెగకుండా నడపడంకోసం సుఖారోక్ తాపత్రయపడుతున్నాడు.

"ఈవేళ చేపలుపట్టకుండా వట్టినే కూర్చున్నావేం?"

"గేలం మరిచివచ్చా."

"నే నింకోటి తెస్తా. ఈలోపున ఇది తీసుకో. ఇప్పుడే వస్తా."

విక్టర్ కోరినట్లు పరిచయంచేసేక వాళ్ళిద్దర్నీ ఏకాంతంగా వదిలిపోదామని సుఖార్కో ఆలోచన. కాని, తోన్యా ఆటంకపరచింది.

"వద్దు. ఇక్కడో కాయన గేలంవేసేడు. మనం ఎందుకు అడ్డం?"

"అడ్డం ఎవరికి? అతనికా?"—అంటూ సుఖార్కో పావెల్ వంక చూసేడు. తోన్యా చెప్పేవరకు అతనిని చూడనేలేదు.

"ఉండు ఒక్కక్షణంలో తోలిపారేస్తా."

తోన్యా వద్దనేలోపునే సుఖార్కో పావెల్ దగ్గరికి పరుగెత్తేడు.

"గేలం తీసేసుకుని లేచిపో. ఊ. లే..."

సుఖార్కో అరుస్తున్నా పావెల్ లెక్కచెయ్యలేదు. గేలం తియ్యలేదు. చురచురా ఒక్కమారు చూసే డంతే.

"నోరుముయ్యి. ఏమిటాగొడవ."

"ఏమిట్రా. ఎదురుకూడా చెప్తున్నావే. ఓరి దద్దమ్మా! పోతావా, పోవా."—అంటూ సుఖార్కో గంతులేసేడు. ఎర్రలతోవున్న డబ్బాను ఒక్క తన్నుతన్నేడు. అది ఒక్క ఎగురులోపోయి నీళ్ళల్లో పడింది నీళ్ళు చింది తోన్యామీద పడ్డాయి.

తోన్యా కోప్పడింది.

"సుఖార్కో! ఏమిటాపని. సిగ్గులేదూ?"

పావెల్ ఒక్క ఉదుటున లేచేడు. పావెల్కు తన అన్న ఆర్టెమ్ పనిచేస్తున్న రైల్వేయార్డు ఇంజనీరుకొడుకు

సుఖారోక్ తెలుసు. రెండు తన్ని తే పోయి తండ్రితో చెప్తాడు. తన అన్నగారు ఇరుకునపడతాడు. ఆ ఆలోచనతో పావెల్ వస్తాయించేడు.

ఊరుకుంటే ముందుదెబ్బ పావెల్‌ది అవుతుందనిపించి సుఖారోక్ తానే చర్రున ముందుకెళ్ళేడు. గుండెలమీద చెయ్యేసి వెనక్కి తోసేడు. పావెల్ నీటిఅంచున వున్నాడు. తోపుతో నీటిలో పడిపోయేవాడే. కాని చేతులాడించీ, ఒక వేపుగా వొరిగి ఆపుకొన్నాడు.

పావెల్ కన్న సుఖారోక్ రెండేళ్ళు పెద్ద. జగడగొండి యనీ, రౌడీయనీ పేరున్నవాడు.

గుండెలమీద దెబ్బపడడంతో పావెల్ కళ్ళు జేగురు ముద్దలయేయి.

"అలాగేం. మరికానియ్."–అంటూ పావెల్ ఊతంగా సుఖారోక్ ముఖంమీద ఒక్కగుద్దుగుద్దేడు. ఆ దెబ్బనుంచి తేరుకొనేలోపున చొక్కామెడపట్టీపట్టుకొని నీళ్ళల్లోకి ఈడ్చుకు పోయేడు.

మోకాలులోతునీళ్ళల్లో, బూట్లూ, పాంటూ తడిసి పోయేయి. పావెల్ చెయిపట్టువిడిపించుకొనేటందుకు సుఖార్కో మహాప్రయత్నం చేసేడు. తనపని నెరవేరడంతో పావెల్ వానిని వదిలేసి గట్టెక్కేడు. సుఖారోక్ వాని వెంటబడ్డాడు.

గట్టెక్కేక పావెల్ తాచుపాములా బుస్సుమంటూ వెనక్కి తిరిగేడు. జకరయ్ చెప్పినపాఠం గుర్తు తెచ్చుకొన్నాడు.

"ఎడమ కాలు ఊనుకో. కుడి నూరాలు వంచు. కాలు బిగపట్టు. బొటనవ్రేలి పిడికిలి బిగించి ఎదుటి వాని గడ్డంక్రింద తగిలేలా ఒక్క ఊపులో గుద్దు."

ధప్పుమని చప్పుడైంది. సుఖార్కో నాలుక కరుచుకొన్నాడు. గడ్డమూ, నాలుకా విపరీతంగా బాధపెడుతూంటే గొల్లుమన్నాడు. చేతులు ఆకాశంలోకి ఎగిరేయి. వెల్లకిలా వెనక్కి నీటిలో దబ్బున పడ్డాడు.

తోన్యా విరగబడి నవ్వింది.

"భేష్! మంచిపని చేశావు."

పావెల్ గేలం తాడు పట్టుకొని ఒక్క ఊపున లాగేడు. తెగిపోయింది. చేతిలో మిగిలిన ముక్కతోనే కోనేరుగట్టెక్కి రోడ్డుమీదికి వెళ్ళిపోయేడు.

వెనకనుంచి విక్టర్ తోన్యాతో చెప్తున్న మాటలు వినిపించేయి.

"వాడో పచ్చిరౌడీ. పావెల్ కొర్చాగిన్ అని—"

* * *

రైలుస్టేషనువద్ద గందరగోళంగావుంది. రైలుమార్గం పొడుగునా కార్మికులు సమ్మె ప్రారంభించినట్లు వార్తలు వస్తున్నాయి. పక్కనేవున్న మరో పెద్ద స్టేషన్లో కార్మికులంతా సమ్మెకన్నా పెద్ద దేదో ప్రారంభిస్తున్నారట. ఏదో ప్రకటనలు వెంటతీసుకుపోతున్నారని చెప్పి ఇద్దరు డ్రైవర్లను జర్మనీవాళ్ళు అరెస్టుచేసేరు. రైల్వే పనివాళ్ళల్లో కొందరికి

పల్లెటూళ్ళల్లో సంబంధ బాంధవ్యాలున్నాయి. జర్మనీవాళ్ళ వెంట వెనకటి జమీందార్లు గ్రామాల్లోకి రావడమూ, రైతుల పంటల్నీ, పశువుల్నీ ఊడ్చుకుపోవడమూ ప్రారంభమయ్యేసరికి వాళ్ళల్లో ఆవేశాలు పుట్టుకొచ్చేయి.

హెట్మన్ సైనికులువచ్చి రైతులవీపులు చిట్లగొడుతున్నారు. జిల్లాఅంతటా పార్టిజాన్ల వుద్యమం క్రమంగా అలుముకొంటూంది. బోల్షివిక్కులప్పుడే ఓడజను పైచిలుకు పార్టిజాన్ దళాలను తయారుచేసేరు.

జకరయ్‌కి ఈమధ్యన అసలు తీరికేలేదు. పట్టణంలో వున్న రోజుల్లో ఆతడు ఎంతోపనిచేసేడు. రైల్వేపనివాళ్ళతో సంబంధాలూ, పరిచయాలూ పెట్టుకొన్నాడు. పడుచుకారుతో స్నేహంచేసేడు. రైల్వేయార్డులోని మెకానిక్‌లలోనూ రంపపుమిల్లు పనివాళ్ళలోనూ గట్టివాళ్ళను కొందర్ని ఏరి బలమైనదళాన్ని కూర్చేడు. ఆర్టెమ్ అభిప్రాయాలు ఏమిటో తెలుసుకొనాలని ప్రయత్నించి, బోల్షివిక్‌పార్టీని గురించి నీ అభిప్రాయం ఏమిటని ఒకరోజున అడిగేడు.

"ఈ పార్టీల్నిగురించి నాకేమీ తెలియదయ్యా— అయినా, నావల్ల జరిగేదేమన్నావుంటే చెప్పు. చేస్తా"— అన్నాడు ఆర్టెమ్.

జకరయ్ తృప్తిపడ్డాడు. ఆర్టెమ్ మాటకు నిలబడతాడని స్థిరపరుచుకొన్నాడు. ఇహాపార్టీలో చేరడానికంటూరా. ఆర్టెమ్ దానికి సిద్ధంగా లేడు.

"సరిలే. ఆతనికే తెలిసివస్తుంది."—అనుకొన్నాడు.

జకరయ్ పవర్ స్టేషనులో పని మానుకొని రైల్వే యార్డులో కుదిరేడు. అక్కడ ఆతని పని సులువుఅయింది. పవర్ స్టేషన్‌లో వున్నప్పుడు రైల్వేవాళ్ళతో పరిచయం పెంచుకోవడం చాల కష్టంగా వుండేది.

రైలుమార్గంమీద బళ్ళ రాకపోకలు విధీవిరామం లేకుండా సాగుతున్నాయి. యూక్రెయిన్ గ్రామాలలో దోచుకున్న వస్తువుల్ని బళ్ళకెక్కించి జర్మనుసైనికులు తమ దేశం పంపుతున్నారు. వేలకొద్దీ పెట్టెలనిండా ధాన్యం, గోధుమ, జొన్న, సజ్జ, పశువులు ఎగుమతి అయిపోతున్నాయి.

* * *

స్టేషన్‌లో టెలిగ్రాఫరు పోనోమరెంకోను హెట్మన్ సైనికులు అరెస్టుచేసేరు. తలవనితలంపుగా జరిగిం దది. గార్డురూమ్‌కి లాక్కుపోయి చితుకకొట్టేరు. ఆర్టెమ్ తోడిపని వాడు రోమన్ సిదోరెంకోపేరు బయటపెట్టినది ఆతడే అయి వుండాలి.

పనివేళప్పుడు రోమన్‌కోసం ఇద్దరు జర్మన్లూ, హెట్మన్ అంగరక్షకు డొకడూ, స్టేషన్ కమాండెంటు అసిస్టెంటూ కలిసివచ్చేరు. కమాండెంటు అసిస్టెంటు ఓ మాటామంతీ లేకుండా తిన్నగావెళ్ళి చేతిలోవున్న కొరడాకర్రతో రోమన్ మొగంమీద కొట్టేడు.

"లంజకొడకా, లేచిరా ! నీ వ్యవహారం చూస్తాం."

కమాండెంటు అసిస్టెంటు రోమన్ జబ్బపట్టుకొని గుంజేడు.

"ప్రచారాలు గిరాగాలూ చెయ్యటం ఏమిటో చూపిస్తాం."

ప్రక్కనే పనిచేస్తున్న ఆర్టెమ్ తన చేతిలోపనిముట్టు నేలనిపారేసి చరాచరా వచ్చేడు.

"తొత్తుకొడుక! చెయ్యివదులు."

ఆర్టెమ్ తనను నిగ్రహించుకోనేటందుకు అతికష్టపడుతున్నాడు.

అసిస్టెంట్ కమాండెంట్ వెనక్కి అడుగేస్తూ రివాల్వరు తీసేడు. ఒక జర్మన్ సైనికుడు తుపాకీతీసి బోల్టువేసి సిద్ధం చేసేడు. కదిలితే కాల్చేయడానికి సిద్ధపడ్డాడు.

"ఆగు."

అంతమనిషీ ఆ చిన్నసైనికుడిముందు ఏమీ చెయ్యలేకపోయేడు.

రోమన్‌నూ, ఆర్టెమ్‌నూ అరెస్టుచేసేరు. ఒక గంట పోయేక ఆర్టెమ్‌ను వదిలిపెట్టేరు. రోమన్‌ను సామాన్లగదిలో పెట్టి తాళంవేసేరు.

ఈ అరెస్టులు జరిగేక ఒక్క మనిషికూడా పనిలో మిగలలేదు. డిపో పనివాళ్ళంతా స్టేషన్ ఎదురుగావున్న పార్కులో సమావేశం అయ్యేరు. స్విచ్ మెన్, స్టోర్ హౌస్ పనివాళ్ళూ వచ్చిచేరేరు. ఆవేశాలు తీవ్రమైనాయి. రోమన్‌నూ, పోనోమరెంకోనూ విడుదలచేయాలని కోరుతూ ఎవరో ఒక మెమోను వ్రాసుకొచ్చేరు.

అసిస్టెంట్ కమాండెంటు కొందరు హెట్మన్ గార్డులను తీసుకొని రివాల్వరు ఝుళిపిస్తూ మీటింగుచోటికి పరుగెత్తి వచ్చేడు.

"నడవండి. పనిలోకి. రానివాళ్ళందర్నీ అరెస్టు చేయిస్తా. మీలో కొందర్ని కాల్చేస్తేగాని బుద్ధిరాదు."

ఆ అరుపులకు పనివాళ్ళల్లో ఉద్రేకాలు మరింత ఎక్కువైనాయి. ఒక్కపెట్టున గర్జించేరు. పరిస్థితి తప్పి వచ్చిందని స్టేషన్ కమాండెంటు నగరంలోన్న జర్మన్ సైన్యాలకు కబురుపంపేడు. ట్రక్కులలో వాళ్ళు బయలు దేరేరు.

పనివాళ్ళంతా ఆ వార్తవిని తిన్నగా ఇళ్ళకుపోయేరు. స్టేషన్ మేష్టరుకూడా నిలబడలేదు. జకరయ్ ప్రయత్నాలు ఫలోన్ముఖం అయినాయి. స్టేషన్లో కార్మికులు మొత్తంగా కార్యరంగంలో దిగడం ఇదే ప్రథమం.

జర్మన్లు ప్లాట్ఫారమ్మీద ఒక భారీమరతుపాకిని నిలిపి సిద్ధంచేసేరు. ఒక సైనికుడు గుర్రంమీద వేలుపెట్టి సిద్ధంగా కూర్చున్నాడు.

స్టేషన్లో ఒక్కమనిషికూడా లేకుండా వెళ్ళిపోయేరు.

రాత్రివేళ అరెస్టులు ప్రారంభమైనాయి. ఆర్టెమ్ను కూడా అరెస్టుచేసేరు. ఇంటికి వెళ్ళకపోవడంచేత జకరయ్ అరెస్టు తప్పించుకొన్నాడు.

అరెస్టుచేసినవా రందరినీ గుడ్సుషెడ్లో పెట్టేరు. పనిలోకి వస్తారా, కోర్టుమార్షల్ చేయమంటారా అని అడిగేరు.

రైలుదారిపొడుగునా కార్మికులు సమ్మెచేస్తున్నారు ఒకరాత్రీ పగలూ రైలుబండి ఒక్కటికూడా అటూయిటూ వెళ్ళలేదు. నూటయిరవై కిలోమీటర్ల దూరంలో ఒకపెద్ద పార్టిజాన్‌దళం బ్రిడ్జీలు పేల్చేసింది. రైలుపట్టాలు పీకేసింది. తుపాకులు తీసుకొని యుద్ధం సాగిస్తూంది.

రాత్రివేళ జర్మన్ సేనల్ని తీసుకొని ఒకరైలువచ్చింది. స్టేషన్‌లోకి వచ్చేక డ్రైవరు, అతని సహాయకుడు, ఫైర్మనూ ఇదిగో వస్తున్నామని మళ్ళీ కనబడకుండా వెళ్ళిపోయేరు. దానిని కదిలించే మార్గంలేదు. సైడింగులలో మరోరెండు బళ్ళు సిద్ధంగావున్నాయి. వాటిని తీసుకెళ్ళేవారు లేరు.

స్టేషన్ కమాండెంటు కొందరు జర్మన్ సైనికుల్ని వెంటబెట్టుకొని గుడ్సుషెడ్ తలుపులు తెరచుకొని లోపలికి వచ్చేడు.

వస్తూనే పేర్లు పిలిచేడు.

"క్లోర్చాగిన్, పోవెస్‌టోవ్‌స్కీ, బ్రూజక్, మీరు ఒక రైలుబండిని నడిపించుకుపోవాలి. కాదంటే ఇక్కడే కాల్చేస్తాం. ఏమంటారు."

ముగ్గురూ నిశ్శబ్దంగా తలవూపేరు. వారివెంట తగిన బందోబస్తుఇచ్చి ఇంజన్‌దగ్గిరికి తీసుకెళ్ళేరు. రెండోబండికి కావలసిన మనుష్యుల్ని ఏరుతూ అసిస్టెంట్ కమాండెంట్ అక్కడే నిలిచిపోయేడు.

ఇంజన్ రొప్పుతూ, వొగరుస్తూ చీకట్లో పరుగెత్తి పోతూంది. ఆట్రెమ్ పారతో ఇంతబొగ్గు ఇంజన్‌లోకి కొట్టి

తలుపు మూసేడు. పరికరాల పెట్టెమీదవున్న డబ్బాలో నీళ్ళతో గొంతు తడుపుకొని పోలెన్‌టోవ్‌స్కీని పలకరించేడు. పోలెన్‌టోవ్‌స్కీ ఇంజన్‌డ్రైవర్‌గా రిటైరయినవాడు. ఆతడే ఇప్పుడు డ్రైవరు.

"ఏం తాతా! బండిని తీసుకెళ్ళవలసిందేనా?"

పొలెన్‌టోవ్‌స్కీ కళ్ళల్లో చిరాకు కనబడింది.

"చంపుతానంటే ఏంచేస్తావు?"

"తన్నేసి లేచిపోతేసరి."—అన్నాడు బ్రూజక్, ఓర గంట బొగ్గుపెట్టెమీద కూర్చున్న జర్మన్‌సైనికుణ్ణి కనిపెట్టి చూస్తూ.

"ఆ వెధవ అక్కడ లేకపోతే నేను అంతేచేద్దును"—అన్నాడు ఆర్టెమ్.

"అంతేలే."—అన్నాడు బ్రూజక్. ఆమాట అని కిటికీలోంచి తల బయటికిపెట్టి తొంగిచూసేడు.

పోలెన్‌టోవ్‌స్కీ ఏదో పనివున్నట్లు ఆర్టెమ్ ప్రక్కకి చేరేడు. రహస్యంగా తన అభిప్రాయం చెవినివేసేడు.

"ఈ బండిని ముందుకి పోనియ్యకూడదు. అక్కడ యుద్ధం జరుగుతూంది. మనవాళ్ళని చంపడానికని వీళ్ళని మనం తీసుకెడుతున్నాం. ఒరే అబ్బాయి! జార్ పాలించిన రోజుల్లోకూడా సమ్మె జరుగుతూందంటే నేను ఇంజను ముట్టుకొనేవాడిని కాను. ఇప్పుడు దీనిని సరిగ్గా తీసుకెడతాననుకోకు. మనవాళ్ళకి మనమే నష్టం తెచ్చిపెడితే మరి బ్రతికుండగా తలఎత్తుకోగలమా? దీనితో వచ్చిన ఇంజన్ డ్రైవరూ, వాళ్ళూ

లేచిపోయేరు. ఔనా! చస్తేచచ్చేమని వాళ్ళు సాహసం చేసేరు. ఈ బండిని తీసుకెళ్ళడం మన పనికాదు. ఏమంటావు?"

"నిజమే తాతా! కాని వాడిమాటేమిటి?"

పోలెన్‌టోవ్‌స్కీ ఆలోచనలోపడ్డాడు. పక్కనున్న పాతగుడ్డపెట్టి నుదుటిచెమట తుడుచుకొన్నాడు. ఏంచెయ్యడమా అని ఆలోచిస్తున్నట్లు "ప్రెపర్‌గాజ్" వంక తదేక దీక్షగాచూస్తూ నిలుచున్నాడు. మహోవ్రేకంతో బండబూతులు తిడుతున్నాడు.

ఆర్టెమ్ మళ్ళీ గొంతుతడుపుకొని డబ్బా క్రింద పెట్టేడు. ఇద్దరూ దీర్ఘాలోచనలో వున్నారు. ఆర్టెమ్‌కు జకరయ్ మాటలు జ్ఞాపకం వచ్చేయి.

"బోల్షివిక్ పార్టీనిగురించీ, కమ్యూనిజం గురించీ నీ అభిప్రాయం ఏమిటి?"

అవసరంవస్తే నేను మీతరఫే అనుకోమని తాను ఆనాడు అన్నాడు.

ఆ మాటలు గుర్తువచ్చి మంచి సాయమేచేస్తున్నా—అనుకొన్నాడు.

"ఊళ్ళోకేర్పటందుకు సైన్యాల్ని తీసుకెడుతున్నా. మంచిసాయమే."

ఆర్టెమ్ ప్రక్కనేవున్న పరికరాల పెట్టెమీాద పోలెన్‌టోవ్‌స్కీ, వొంగి ఏదో వెతుకుతున్నట్లు నటిస్తూ నెమ్మదిగా అన్నాడు.

"వాడిపని పట్టెయ్యాలి."

ఆర్టెమ్ ఉలికిపడ్డాడు.

"మరోదారిలేదు. వాడితల పగలేసి, లివర్లు నిప్పుల్లో పారేద్దాం. ఆవిరి వదిలేసి లేచిపోదాం."

ఆర్టెమ్‌కు పెద్దబరువు దిగిపోయినట్లనిపించింది.

"బాగుంటుంది."

అతడు బ్రూజక్ వద్దకెళ్ళి తమ నిర్ణయం చెప్పేడు.

బ్రూజక్ వెంటనే సమాధానం ఇవ్వలేదు. చేస్తూన్నది చాల ప్రమాదకరమైనపని. తమరంతా పిల్లాజెల్లావున్న వాళ్ళు. పోలెన్‌టోవ్‌స్కీ కుటుంబం మరీ పెద్దది. పూటకి తొమ్మిది విస్తళ్ళు లేవాలి. అయినా తప్పదు. బండిని గమ్యం చేర్చడం తప్పని ముగ్గురూ ఎరుగుదురు.

ఆలోచించి బ్రూజక్ తన ఇష్టం తెలిపేడు.

"కాని, వాడిమాటేమిటి ! ఏంచెయ్యాలి ?"

ఆర్టెమ్‌కు అతని అభిప్రాయం అవగతం అయింది. తిన్నగా పోలెంటోవ్‌స్కీ దగ్గిరికెళ్ళేడు. తలవూపులోనే బ్రూజక్ అంగీకారం తెలియపరిచేడు. అయితే తర్వాతపని ఏమిటో అర్థంకాలేదు. మరింత దగ్గరగ వెళ్ళేడు.

"కాని ఎల్లాగ ?"

పోలెన్‌టోవ్‌స్కీ ఆర్టెమ్‌వంక పరీక్షగాచూసేడు.

నువ్వే మొదలు పెట్టు. అందరిలోకీ బాగాబలమైన వాడివి నువ్వు. గునపం తీసుకొని ఒదిలెయ్యి. ఒక్కదెబ్బతో తీరిపోతుంది."

ఆర్టెమ్ కనుబొమ్మలు ముడివేసేడు.

"నావలనకాదు. ఆ వెధవ తప్పేముంది? వాడిని చంపుతామంటే వచ్చేడు."

పోలెన్‌టోవ్‌స్కీ కళ్ళు చురచురలాడేయి.

"వాడి తప్పేమీ లేదంటావు. ఈ పనిచేయడంలో మన తప్పేమిటి మరి? ఒక్కటి మరచిపోకు. ఫ్యాసిటివ్ సైన్యదళాన్ని తీసుకెళుతున్నామనేది మరవకు. నువ్వు అమాయకు లనుకొనే వీళ్ళే పార్టిజాన్లని కాల్చిచంపుతారు. అయితే తప్పంతా పార్టిజాన్లది అనవుకదా! ఇదిగో, నువ్వు బలవంతుడవేగాని ఆలోచనమాత్రం తక్కువ."

"సరే, సరే," అన్నాడు ఆర్టెమ్. ఆతని గొంతు వణికింది. మారుమాటలేకుండా గునపంతీసుకొని బయలు దేరుతూంటే పోలెన్‌టోవ్‌స్కీ నెమ్మదిగా వూదేడు.

"అది నాకియ్యి. పార తీసుకొని టెండర్‌లోకి వెళ్ళు. నేను క్రిందినుంచి బొగ్గులాగుతున్నట్లు నటిస్తాను. వీలువెంబడిని అవసరమైతే నువ్వొకటి తగిలిద్దువుగాని."

బ్రూజక్ "అదే మంచిపని" అన్నాడు. తానువచ్చి ఆవిరిగొట్టంవద్ద అదీఇదీ సర్దుతున్నట్లు నటిస్తున్నాడు.

జర్మన్‌సైనికుడు బొగ్గుపెట్టె అంచున సిగరెట్టు కాల్చు కుంటూ కూర్చున్నాడు. కాళ్ళమధ్యన రైఫిల్‌నొక్కి పట్టుకొని వున్నాడు. క్షణానికోమాటు ఇంజన్‌లో పనిచేస్తున్నారో లేదో తొంగిచూస్తున్నాడు.

ఆర్టెమ్ కింపెపుల్లోకి రావడంచూచినా వాడాట్టే లెక్కచేయలేదు. వాడు కూర్చున్న చోటనున్న పెద్ద బొగ్గులను తియ్యాలిసివుందన్నట్లు పోలెన్‌టోవ్‌స్కీ సంజ్ఞ చేసేడు. జర్మనీవాడు లేచి దిగివచ్చేడు.

సుత్తి దెబ్బతో వానితల గుమ్మడిపండులా టప్పు మంది. ఆ చప్పుడికి ఆర్టెమూ, బ్రూజకూ అదిరిపడ్డారు. సైనికుడిశరీరం ఇంజన్‌లో పొర్లాడింది.

పోలెన్‌టోవ్‌స్కీ సుత్తి క్రింద పారేసేడు.

"ఖతం, ఇంక పని ఆపడానికి వీలులేదు.

ఆతనికంఠం వణికింది. "ఆవిరిగొట్టం స్క్రూలు వూడ తియ్యండి."

పది నిముషాలలో ఆపని పూర్తిఅయింది. ఇంజన్ వశం తప్పుతూంది. క్రమంగా వేగం తగ్గిపోతూంది.

దూరాన కాటికపోగుల్లా కనిపిస్తున్న చెట్లు ఇంజన్ హెడ్‌లైట్ వెల్తుర్లో జిగేల్ మంటున్నాయి. ఇంజన్‌లోని మంటలవెల్తుర్లో ఒక్కక్షణం మసకగాకనిపించి మళ్ళీకాటుక ముద్దలయి పోతున్నాయి. క్రమంగా ఇంజనుబలం ఇంకా ఇంకా క్షీణిస్తూంది.

"ఉరుకు"

పోలెన్‌టోవ్‌స్కీ ఆజ్ఞవినబడగానే ఆర్టెమ్ తానుపట్టు కొన్న కమ్మీని వదిలి చీకట్లోకి వురికేడు. ఇంజను విసురుతో కొంతదూరం అంతమనిషీ గాలిలో ప్రయాణం చేసేడు. నేల

కాళ్ళకు తగిలింది. ఆ వేగంతోనే నాలుగడుగులు వేసేడు. బొక్క బోర్లా పడిపోయేడు.

ఆతని వెనకనే మరో రెండునీడలు ఇంజన్ చెరోవేపు నుంచీ చీకట్లోకి దిగిపోయేయి.

*　　*　　*

బ్రూజక్ ఇంట్లో అసలు ప్రాణమేవున్నట్లులేదు. సెర్గీ తల్లి ఆంటోనినా వాసిలివ్నా గత నాలుగురోజులనుంచీ ఒకటే బెంగగావుంది. ఆమె మగడిసంగతి ఏమీ తెలియ లేదు. కోర్నాచ్గినున్నూ, పోలెన్‌టోవ్‌స్కీనీ జతచేసి జర్మనీ వాళ్ళు ఆతనిని ఇంజను నడపడానికి పంపేరనేంతవరకే ఆమెకు తెలుసు. నిన్న హెట్మన్ గార్డులు ముగ్గురొచ్చి నానా మాటలూ అని తిట్టిపోయేరు.

వాళ్ళమాటల్నిపట్టి ఏదో తిరకాసుజరిగిందని ఆమెకు అర్థం అయింది. చాల కంగారుపడింది. వాళ్ళు అల్లా వెళ్ళ గానే తిన్నగా బయలుదేరి మేరియానికోలయేవ్నా పద్దకు బయలుదేరింది.

వంటింట్లో పనిచేస్తూన్న పెద్దకూతురు వాల్యా తల్లి ఎక్కడికో బయలుదేరడం చూసింది.

"ఎక్కడకమ్మా!"

"కోర్నాచ్గిన్లయింటికి. నాన్నసంగతి వాళ్ళకేమన్నా తెలుసేమో, సెర్గీవస్తే అల్లాట్సేమన్ కేసివెళ్ళి పోలెన్‌టోవ్‌స్కీల యింటికిపోయి కనుక్కురమ్మను."

వాల్యా తల్లిని కౌగలించుకొంది.

"ఏం భయంలేదమ్మా."

మేరియానికోలయేవ్నా మామూలుగానే ఆంటోనీనాను ఆహ్వానించి, కూర్చోబెట్టింది. ఆమెకు తెలుసునని యీమె; ఈమెకు తెలుసునని ఆమె ఇంతవరకూ అనుకొంటూన్నారు. కాని మొదటిమాటలోనే ఇద్దరూ నిరుత్సాహపడ్డారు.

రాత్రి కోర్చాగిన్‌ల ఇల్లుకూడా సోదాచేసేరు. వాళ్ళు ఆర్టెమ్‌కోసం వెతుకుతున్నారు. అతడు ఇంటికిరాగానే కమాండెంట్ ఆఫీసుకు కబురుచెయ్యాలని మేరియాకు పదిమాట్లు చెప్పి వెళ్ళేరు.

సైనికులను చూసేసరికి మేరియాకు ప్రాణాలు పైనే పోయేయి. వాళ్ళు వచ్చేసరికి ఇంట్లో ఆమె ఒక్కర్తేవుంది. పావెల్ రాత్రి షిఫ్ట్‌కెళ్ళేడు.

పొద్దుటే రాగానే రాత్రి తమయిల్లు సోదాజరిగిన మాట పావెల్ విన్నాడు. తన అన్న ఏమయ్యేడోనని కంగారుపట్టుకొంది. ఆర్టెమ్ ఆట్టే చనువుగా వుండకపోయినా, ఇద్దరి స్వభావాలూ వేరయినా అన్నదమ్ములకి ఒకరంటే మరొకరికి చాలప్రేమ. పైకి అలా కనబడదుగాని తనకోసం ఆర్టెమ్ ఎంత త్యాగానికైనా సిద్ధపడతాడని పావెల్ ఎరుగును.

ఆవార్త విన్నాక అతడు ఒక్కక్షణంకూడా నిలబడలేదు. జకరయ్‌కోసం స్టేషనుకు పరుగెత్తేడు. కాని, అతడక్కడ లేడు. ఎరిగినవాళ్ళు కొందరు కనిపించేరు. కాని తన

అన్నా వాళ్లూ ఏమయ్యేరో వాళ్లెవ్వరికీ తెలియదు. ఇంజన్ డ్రైవరు పోలెన్‌టోవ్‌స్కీ ఇంట్లో వాళ్లెవరికీ ఆతని విషయం తెలియదు. పావెల్ వాళ్ళగుమ్మంలోకి వెళ్ళేసరికి చిన్నవాడు 'బోరిస్' ఎదురయ్యేడు. రాత్రి వాళ్ళయిల్లుకూడా సోదా చేసేరని వాడు చెప్పేడు. పోలీసులు పోలెన్‌టోవ్‌స్కీ కోసం వెతుకుతున్నారట !

పావెల్ ఇంటికి తిరిగివచ్చి వాళ్ళెవరికీ తెలియదట అని తల్లితో చెప్పేడు.

* * *

తలుపుచప్పుడు విని వాల్యా తలఎత్తి చూసింది.

"ఎవరక్కడ?"

తలుపుతీయగానే క్లిమ్‌కా మార్చెంకో ఇంట్లోకి వచ్చేడు. వాడి జుట్టంతా చెరిగిపోయి అట్టలుకట్టివుంది. ముఖం అంతా కందిపోయింది. పరుగెత్తి వస్తున్నాడేమో తెగవగరుస్తున్నాడు.

"మీ అమ్మవుందా?"

"లేదు; ఎక్కడికో వెళ్ళింది"—అని వాల్యా సమాధానం చెప్పింది.

"ఎక్కడికి?"

"బహుశా కోర్చాగిన్ల యింటికెళ్ళివుంటుంది."

ఆ మాటవినగానే క్లిమ్‌కా గిర్రున తిరిగి పరుగెత్తబోయేడు. కాని, వాల్యా చటుక్కున వానిచొక్కా చెయ్యి అందుకొని నిలబెట్టింది.

"మీా అమ్మ... ఏమంది" అంటూ క్లిమ్‌కా ఆమె ముఖంవేపు చూస్తూ తటపటాయించేడు.

వాల్యా వానిని వదలలేదు.

"ఏమిటాపని? ఏమిటో చెప్పు. చంపకు."

జకరయ్ నిషేధాన్ని క్లిమ్‌కా మరిచిపోయేడు. అంటో నినావాసిలియేవ్నాకుతప్ప మరెవ్వరికీ ఇవ్వవద్దని అతడు ఒకజాబు ఇచ్చేడు. ఆ జాబునుకాస్తా క్లిమ్‌కా వాల్యాచేతుల్లో పెట్టేడు. సెర్జీచెల్లెలుఅంటే వానికోవిధమైన అభిమానం. ఆమె సుందరమైనముఖం చూస్తూంటే ఆమె అడిగినదానిని కాదనగలశక్తి ఆతనిలో లేదు. కాని వాల్యాయెడ తనకు ప్రేమ వున్నట్లు చెప్పగల ధైర్యమూ అతనికి లేదు. మెతక మనిషి.

వాల్యా ఒక్క చూపులో ఆ కాగితం చదివేసింది.

తోన్యా! బెంగపడకు. మరేమీా ప్రమాదంలేదు. అంతా బాగున్నారు. త్వరలోనే వివరాలు వ్రాస్తాను. మిగిలినవాళ్ళకుకూడా ఈ మాటచెప్పు. ఈ జాబు కాల్చేయి.

జఖార్.

వాల్యా క్లిమ్‌కాను ప్రశ్నలలో ముంచెత్తింది.

"నీకిది ఎక్కడిదిరా. ఎవరిచ్చేరు?"

ఆమె భుజాలుపట్టుకొని కుదిపేసరికి క్లిమ్‌కాకి వున్న మతికూడా ఎగిరిపోయింది. అనుకోకుండానే ఆ మాటకాస్తా బయటపెట్టేసేడు.

"స్టేషన్‌దగ్గర జకరయ్ ఇచ్చేడు."

అంతలో ఆ వుత్తరం ఎవ్వరికీ ఇవ్వవద్దన్న మాట జ్ఞాపకం వచ్చింది.

"మీ అమ్మకి తప్ప ఎవరికీ చూపించవద్దన్నాడు."

వాల్యా నవ్వింది.

"మంచిదే. ఎవరికీ చెప్పనులే. పావెల్ ఇంటికి పరుగెత్తు. అమ్మ అక్కడుంది.

వాల్యా వానిభుజంమీద చెయ్యేసి ఒక వూపుఇచ్చింది. క్షణంలో క్లిమ్‌కా తోటగేటు దాటేసేడు.

ఆరోజున వెళ్ళిన రైల్వేపనివాళ్ళుముగ్గురిలో ఒక్కడూ యింటికి తిరిగిరాలేదు. సాయంకాలం జకరయ్ కోర్చాగిన్ల యింటికివచ్చేడు. రైలులో జరిగినసంగతులు మేరియూనికోలయేవ్నాకు చెప్పేడు. ఆమె హడలిపోయింది. జకరయ్ ఆమెకు ధైర్యంచెప్పేడు. ఏదో మారుమూలవూళ్ళో బ్రూజక్ పినతండ్రి కాపురం వున్నాడనీ, అక్కడికా ముగ్గురూ చేరేరనీ చెప్పేడు. వాళ్ళిరోజునే ఇంటికి రావడం పడదు. కాని, జర్మనీవాళ్ళ వ్యవహారం ఇరుకునపడిందనీ పరిస్థితులు త్వరలోనే మారగలవనీ చెప్పేడు.

మగాళ్ళు అదృశ్యం అయినాక ఆమూడుకుటుంబాలూ ఇదివరలోకన్న బాగా సన్నిహితం అయేయి. ఉండీ ఉడిగీ వచ్చే చిన్నచిన్న వుత్తరాలు చదువుకొని బ్రహ్మానంద పడేవారు. వాళ్లులేకపోతే ఇళ్ళుచిన్నబోయేయని దుఃఖపడేవారు.

దారినపోతూపోతూ వచ్చినట్లుగా ఓరోజున జకరయ్ బొలెన్‌టొవ్‌స్కీల ఇంటికివచ్చి, ఆమెచేతికి కొంతడబ్బు ఇచ్చేడు.

"ఇంట్లో ఖర్చుకోసం మీ ఆయన పంపేడమ్మాయ్! ఆయనగారు పంపించేడనిమాత్రం మళ్ళీ ఎవరికేనా చెప్పేవు గనక."

ఆంటోనినా ఎంతో నిండుమనసుతో అతని చేతులు పట్టుకొంది.

"అల్లాగే. ఇంట్లో ఏమీ లేదు. పిల్లలకి ఏం పెట్టాలో అర్థంగాక తన్నుకుంటున్నా."

జకరయ్ తాను జాగ్రత్తచేసిన డబ్బులోంచే ఆ డబ్బు తెచ్చేడు.

డబ్బు ఇచ్చేసి అతను స్టేషన్‌వైపు బయలుదేరేడు.

"సరే. ఏమవుతుందో చూద్దాం. చంపేస్తామని బెదిరించి సమ్మెను పాడుచేయొచ్చు. పనివాళ్ళని పనిలోకి లాక్కుపోవచ్చు. కాని, ఒకమాటు నిప్పు అంటుకొన్నాక అది ఆరిపోదు. వీళ్ళు ముగ్గురూ మంచి గట్టిపిండాలు."

వాళ్ల గట్టితనం తలుచుకొని జకరయ్ ఎంతో ఉత్సాహపడ్డాడు.

* * *

వోరోబ్యోవా బాల్కా గ్రామం చిట్టచివరన రోడ్డు నానుకొని ఒక చిన్న కమ్మరం దుకాణం వుంది. పొడుగుపాటి పట్టుకారుతో ఎర్రగా కాలిన ఒక ఇనుపకడ్డీని దిమ్మమీాద పెట్టి పట్టుకొని పొటెన్‌టోవ్‌స్కీ కూర్చున్నాడు.

పైన కట్టిన అడ్డదూలానికి వ్రేలాడుతున్న తిత్తుల్ని ఆర్టెమ్ లాగుతున్నాడు.

"పనిచేతనైనవా డెవ్వడికీ ఈరోజుల్లో వూళ్ళల్లో తిండిలేకపోవడం వుండదు. చెయ్యగలంత పనివుంటుంది."— అంటూ పోలెన్‌టోవ్‌స్కీ నవ్వుకొన్నాడు.

"ఒకటిరెండు వారాలిల్లా పనివుంటే ఇంటికింత పిండీ, పిష్టం పంపగలుగుతాను. రైతువాడికి కమ్మరిఅంటే ఎప్పుడూ అభిమానమే. చూసుకో. జమీందారీతిండి తింటున్నాము. బ్రూజక్ ధోరణే అంతావేరు. ఆతడెప్పుడూ రైతుల్లో, రైతుల్లో అంటాడు. పినతండ్రిద్వారా వాళ్ళతోటే ఆతనికి సంబంధాలున్నాయి. వాడి నేమనడానికీ లేదనుకో. నీకూ నాకూ ఓనాగలీ, ఓగొర్రూ అంటూ లేవు. ఈ చేతులుతప్ప మనకేమీ లేవు. వాళ్ళు శ్రామికులంటారే-అచ్చంగా మనమే కాని బ్రూజక్ అల్లాకాదు. వాడిదోకాలు రైలుఇంజను లోనూ వేరోకాలు పల్లెటూళ్ళోనూ..."

పట్టుకాసుతో ఇనపకడ్డీని మంటల్లో తిప్పేడు.

"మనపని అంత బాగులేదనుకో. జర్మనీవాళ్ళ వ్యవహారం త్వరలో తేలకపోతే మనం యెకటూరినోస్లావ్‌కో రాస్తోవ్‌కో చేరుకోవలసివుంటుంది. లేకపోతే ఒకరోజున పట్టుకొని ఉరితీసినా తీసేస్తారు."

"బాగాచెప్పేవు"—అంటూ ఆర్టెమ్ గొణిగేడు.

"మనవాళ్ళేంచేస్తున్నారో ఏమో. హెట్మన్‌గార్డులు వాళ్ళని వదిలిపెట్టేరో లేదో."

"ఔను, బాబాయ్! మనపని గంద్రగోళంలో పడింది. ఇంక ఇంటికిపోయే ఆశ వదలుకోవలసిందే ననుకొంటూ."

ఇంజన్ డ్రైవరు కొలిమిలోంచి ఎర్రగా కాలిన ఇనప ముక్క తీసి దాగలిమీద పెట్టేడు.

"కానీ రెండు దెబ్బలెయ్యి."

ఆర్టెమ్ పెద్దసమ్మెటతీసుకొని, తలపైకంటా ఎత్తి ధనా ధన్‌కొట్టడం ప్రారంభించేడు. దెబ్బదెబ్బకూ మిణుగురులు ఎగిరి పాకలో మూలమూలలకంటా వ్యాపిస్తున్నాయి.

పోలెన్‌టోవ్‌స్కీ ఆ ఇనుపముక్కని తిప్పితిప్పి పట్టు కొంటున్నాడు. అది ఆర్టెమ్ దెబ్బలకి మైనంలా ఎటుకావా లంటే అటు సాగుతుంది.

కమ్మరంపాక గుమ్మంలోంచి వెచ్చనిగాలి వస్తూంది. బయట రాత్రి కటికచీకటిగావుంది.

* * *

దూరాన సరస్సు విశాలంగా నల్లగా కనిపిస్తూంది. దానిచుట్టూ పైన్ చెట్లు వొత్తుగా, ఎత్తుగా పెరిగివున్నాయి.

"అచ్చంగా ప్రాణంవున్నట్లే వున్నాయి."—అను కొంది, తోన్యా వానివేపుచూస్తూ. సరస్సువొడ్డునున్న బండ రాళ్ళప్రక్కనే మొలిచిన గడ్డిపరుపుమీద పడుకుని ఆమె ప్రకృతిసౌందర్యాన్ని గమనిస్తూంది. ఆమె కూర్చున్న మిట్టకు దిగువన సరస్సు, దానికి పైన తోవలో అడివి. సరస్సువొడ్డు నున్న బండరాళ్ళ నల్లని నీడలు సరస్సునీటిని మరింత నల్లగా కనబరుస్తున్నాయి.

స్టేషన్ సమీపంలోనేవున్న ఈ రాతిక్వారీకి తోన్యా అప్పుడప్పుడు వచ్చి కూర్చునిపోతూ వుంటుంది. రాళ్ళకి

గాతాలు పెట్టిన చోట్లలో మూడుచోట్ల నీటిజాలులు బయట పడి మూడు చెరువులు తయారయేయి. ఇంక తవ్వకం సాగక క్వారీలో పని నిలిపేసేరు.

నీటిలో తపతప చప్పుడు వినిపించి తోన్యా తలఎత్తింది. ఎదురుగావున్న దుబ్బుల్ని తప్పించి ధ్వని వినవస్తున్న వేపు తొంగిచూసింది. ఎవరో బలంగా బారవేస్తూ చెరువులోకి ఈదుకుపోతున్నాడు. ఈతగాని వీపూ, తలామాత్రం కన బడుతున్నాయి. ఎనుబోతులా బుసలుకొడుతున్నాడు. నీళ్లలో ఓ నిముషం పిల్లిమంత్రాలు కొట్టేడు. మునిగి కొంతదూరం ఈది పైకి తేలేడు. వెల్లకితలా నీటిమీాదపడుకొని తేలి ఈద డం ప్రారంభించేడు. ముఖంమీాదపడుతున్న సూర్యకిరణాలకి ముఖం చిట్లించేడు. చేతులు బారుగా చాచేడు. శరీరం కొద్దిగా వంగివుంది.

వంచిన కొమ్మని తోన్యా వదలిపెట్టింది, "చూడ్డం మర్యాదకాదు" అనుకొని నవ్వుకుంటూ మళ్ళీ పుస్తకం మీాదికి వంగింది.

లెస్జింస్కీ యిచ్చిన ఆ పుస్తకం చదవడంలో మునిగి పోయి, ఎవరో రాతిబండలమీాదికి వచ్చి నిల్చోడంకూడా ఆమె గమనించలేదు. వచ్చినవాని కాలుతగిలి ఓరాయి క్రిందికిదొర్లి చప్పుడయింది. ఆమె తలఎత్తేసరికి ఎదుట పావెల్ కోర్చాగిన్ నిలబడివున్నాడు. అంతవరకూ ఆతడు కూడా ఆమెను గమనించనేలేదు. ఆమెను చూడగానే కంగారుపడ్డాడు. వెళ్ళిపోవడానికని వెనక్కి తిరిగేడు.

ఆతనితల తడిగా వున్నదని తోన్యా గమనించింది.

“ఈతలాడిం దితడే నన్నమాట” అనుకుంది ఆమె.

పావెల్ తోన్యాను గుర్తుపట్టి ఆగేడు.

“నువ్విక్కడున్నావనిఎరుగను. హడలు పెట్టలేదుకద!”

“ఏమీలేదు. నీకేం ఆక్షేపణలేకుంటే ఓ నిముషం కూర్చుని కబుర్లు చెప్పు.”

పావెల్ ఆశ్చర్యంతో ఆమెవంక చూసేడు.

“నీతో ఏం మాట్లాడను?”

తోన్యా చిరునవ్వు నవ్వింది.

“పోనీ, కూర్చో.” అని ఆమె సమీపంలోని ఓ బండ చూపింది.

“నీ పేరేమిటి?”

“పావెల్ కోర్చాగిన్.”

“నాపేరు తోన్యా.”

పావెల్ బిడియపడుతూ తలమీదిటోపీని చేతుల్లో తిప్పేస్తున్నాడు.

“నిన్ను పావ్కా అంటారా? పావ్కాకన్న పావెల్ అన్నదే బాగుంది. నేనల్లాగే పిలుస్తా. నువ్వు తరుచుగా...”

‘ఈతలాటకి’ అనేమాట నాలుకచివరకంటూవచ్చింది. కాని, తానాతనిని చూసినట్లు చెప్పడం ఇష్టంలేక మాట సర్దుకుంది.

“...షికారు వస్తూంటావా?”

“తరుచుగా రాను. తీరుబడి దొరికినప్పుడు...”

"అయితే ఎక్కడేనా పనిచేస్తున్నావా?"

"పవర్ హౌస్‌లో బొగ్గేస్తా."

"అంతనేర్పుగా కుస్తీపట్టడం ఎక్కడనేర్చుకొన్నావు?" అని తోన్యా ఉన్నట్లుండి అడిగింది.

"నాకుస్తీమాట నీకెందుకు?" అనేశాడు పావెల్ తనకు తెలియకుండానే.

తన ప్రశ్నకు ఆతనికి కోపంరావడం చూసి తోన్యా సరెయ్యడానికి పూనుకొంది.

"కోపం ఎందుకు, కోర్చాగిన్, సరదా కడిగేను అంతే. ఆ రోజున ఎంతగుద్దు గుద్దేవో. అంత నిర్దయ పనికిరాదు." అంటూ పకపకా నవ్వింది.

"నీకు కష్టంగా వుందా?"

"నాకేం లేదుసుమా. సుఖారోక్కికి మంచి శాస్తి జరిగిందంటాను. బలేపని చేసేవు. అవునుకాని, రోజూ ఇల్లాగే ఎవరితో ఒకరితో పేచీపడుతుంటావటగా."

"ఎవ రన్నారు?"

"నువ్వో వట్టి పేచీకోరువని విక్టర్ లెస్జిస్కీ అన్నాడు."

పావెల్ ముఖం నల్లబడింది.

"విక్టర్ వట్టివెధవ. ఆడారి. అసలు తగలవలసింది వాడికి. వాడన్నమాటలు నేనూ విన్నా. ఎందుకని వూరుకున్నాగాని."

"అల్లాతిట్టకు. అదిమంచిదికాదు" అంది తోన్యా.

తోన్యా శ్రద్ధగా అన్నీవింది. పావెల్‌కు క్రమంగా సిగ్గు తగ్గిపోయింది. ఎంతకాలంనుంచో పరిచయంవున్నట్లు ఆమెతో మాట్లాడేసేడు. అన్నింటితోబాటు ఆతడు తన అన్న కనబడ్డంలేదనికూడా చెప్పేడు. ఆ కబుర్లలోపడి వారు గంటలు గడిచిపోతున్నట్లుకూడా గమనించలేదు. చివరకు పావెల్ ఉలికిపడ్డట్లు లేచి నిలబడ్డాడు.

"పనిలోకి పోయేవేళయింది. కబుర్లుచెప్తూ కూర్చుంటే వీల్లేదు. పోయి బాయిలర్లక్రింద బొగ్గువెయ్యాలి. దానిలో ఈపాటికి గొడవచేస్తుంటాడు. సెలవు. పట్టణంలో కింక పరుగెత్తాలి. పోతా."

తోన్యాకూడా లేచింది.

"నేనూ పోవాలి. ఇద్దరం కలిసేపోదాం."

"అబ్బే. కుదరదు. నే పరుగెత్తిపోవాలి."

"కానీ, పందెం వేద్దాం. ఎవరు ముందెడతారో చూద్దాం."

పావెల్ ఆమెవంక నిరసనగా చూసేడు.

"నాతో పందెమా! నెగ్గలేవు."

"చూద్దాంగా. ముందిక్కడినుంచి నడు."

పావెల్ తానుకూర్చున్న రాతిమీదినుంచి క్రింది కురికేడు. తోన్యాకూడ దిగడానికి చెయ్యి అందించేడు. ఇద్దరూ అడవిలోంచి బయటికివచ్చి స్టేషన్‌వైపుగావున్న మైదానంలోకి వచ్చేరు.

తోన్యా రోడ్డుమధ్య నిలబడింది.

"పరుగేద్దాం.ఏం?ఒకటీ... రెండూ...మూడు... రా. పట్టుకో నన్ను."

తోన్యా రయ్‌మని పరుగు ప్రారంభించింది. పావెల్ ఆమె వెనకనే పరుగెత్తేడు.

"రెండు అడుగుల్లో ఆమెను అందుకుంటా"—అని పావెల్ భావించేడు. కాని, స్టేషన్ దగ్గరలోకి వచ్చేవరకూ ఆమెను అందుకోలేకపోయేడు. ఆఖరుక్షణంలో ఒక్కమారు ప్రయత్నంచేసి ఆమెను అందుకొని భుజం గట్టిగాపట్టుకొన్నాడు. నవ్వుతూ, ఆయాసపడుతూ... "దొరికేవు" అన్నాడు.

తోన్యా ఆతనిచేయి విడిపించుకొంటూ "వదులు. భుజం నొప్పిపుడుతూంది"—అంది.

ఆమె రొగరుస్తూ ఒక్కక్షణం అతనిని జేరబడి మళ్ళీ అంతలో సర్దుకొంది. పావెల్ ఆమె స్పర్శకు తన్మయత్వం పొందేడు.

"నన్నింతవరకు పరుగులో అందుకొన్నవాళ్ళు లేరు."

తర్వాత ఇద్దరూ చెరోదారి అయ్యేరు. పావెల్ టోపీ వూపి సెలవుతీసుకొంటూ నగరంవేపు పరుగెత్తేడు.

బాయిలర్లుండే గదిలోకెళ్ళేసరికి రెండోవాడు అప్పుడే పనిలో వున్నాడు.

"ఇంకాస్త ఆలస్యం చేయకపోయేవూ. నీపనికూడా నేనే చెయ్యాలా యేం?"

పావెల్ అతనికోపం తీర్చడానికై భుజం తట్టేడు.

"ఎంతసేపు, క్షణం."

అర్ధరాత్రయింది. దానిలో కట్టెలగుట్టమీద గుర్రుపట్టి నిద్రపోతున్నాడు. పావెల్ ఇంజన్‌లో నూనెవేసి, జిడ్డు చేతులు పాతగుడ్డపీలికలికి తుడుచుకొన్నాడు. పెట్టెమీదవున్న గుసెప్పీ గారిబాల్డీజీవితం అందుకొన్నాడు.

"ఆమె తన సుందరమైన నీలికళ్ళతో రాజకుమారుడి వంక చూసింది..."

"ఆమెవీ నీలికళ్ళే" అనుకొన్నాడు పావెల్ తోన్యాను తలుచుకుంటూ. "కాని, ఈవిడ తరహా వేరు. డబ్బున్న వాళ్ళల్లాంటిదికాదు. బలేగా పటగ్గ్తింది..."

తోన్యాతో జరిగిన సంభాషణను తలుచుకొంటూ పావెల్ ఇంజన్‌మాటే మరచిపోయేడు. బాయిలర్‌లో ఆవిరి ఒత్తిడి ఎక్కువై ఇంజన్ మోతపెడుతూంది. ఫ్లైవీల్ ఊరికే తిరిగిపోతూంది. ఇంజన్‌కోసం కట్టిన సిమెంటుచప్టా అదిరిపోతూంది.

పావెల్ ప్రెషర్‌గాజ్‌వంక చూసేడు. ఎర్రగీతని దాటి పోయింది ముల్లు.

"తల్లికడుపుకాల" అనుకొంటూ పావెల్ ఒక్క గంతులోపోయి సేఫ్టీవాల్వ్ అందుకొన్నాడు. రెండుచుట్లు తిప్పేసరికి ఆవిరి తోసుకొంటూ గొట్టంగుండా గదిబయటనే వున్న నదినీటిలో బుస్సుమంది. రెండోవేపున మీట నొక్కి నీటిపంపుచక్రానికి పటకావేసేడు.

దానిలో నోరు తెరిచి గు(ర్రుగు(ర్రుమని ధ్వనులుచేస్తూ గాఢనిద్ర పోతున్నాడు.

ఓ నిముషంలో (ప్రెపర్ గాజ్ లోని ముల్లు మామూలు స్థానానికి వచ్చేసింది.

పావెల్‌ను విడిచిపెట్టేక తోన్యా ఇంటికి బయలు దేరింది. దారిలో నడుస్తున్నదన్న మాటేగాని, ఆమె ఆలో చనలన్నీ ఆ యువకుని నల్లనికళ్ళమీదే వున్నాయి.

"ఎంత చురుకుదనం? ఎవడో తుంటరిఅనుకున్నా. ఎంత మంచివాడు? స్కూళ్ళల్లో చదువుకొనే ఆ చవటలకీ అతడికీ పోలికే లేదు."

పావెల్ పద్ధతే వేరు. అతడు పుట్టిపెరిగిన వాతావరణం తోన్యాకు పూర్తిగా కొత్త.

"అయినా మచ్చికచేసుకోవచ్చు. సరదాగా వుం టాడు."

ఇంటికి వచ్చేనరికి తోటలో లిజాసుఖారోకో, నెల్లీ లెస్జిన్‌స్కీ, విక్టర్ లెస్జిన్‌స్కీలు కనిపించేరు. విక్టర్ ఏదో చదువుతున్నాడు. వారంతా ఆమెకోసమే కనిపెట్టుకొని వున్నట్లుంది.

పరస్పరాభివాదనలయేక తోన్యాకూడ వారి (ప్రక్కనే బల్లమీదకూర్చుంది.లోకాభిరామాయణం సాగుతూండగా, మధ్యలో విక్టర్ వచ్చి ఆమె (ప్రక్కన కూర్చున్నాడు.

"నే నిచ్చిన నవల చదివేవా?"

"సవలా?..." తోన్యా అదేమిటా యని ఒక్క క్షణం ఆలోచించింది. "అదా..."—దానిని చెపుపుగట్టున మరచిపోయేనంది.

"అందులోని ప్రేమగాధ ఏమన్నా బాగుందా?"

తోన్యా ఒక్క-క్షణం ఆలోచించింది. కాలిజోడు కొనతో ఇసకలో కొంతసేపేవో పిచ్చిగీతలు గీసింది. ఉన్నట్లుండి విక్టర్ వంకచూసి "లేదు" అంది.

"అంతకన్న అందమైన ప్రేమగాధ ప్రారంభించేను."

విక్టర్ ఆశ్చర్యం ప్రకటించేడు.

"నిజం! ఎవరు వ్రాసింది?"

తోన్యా కళ్ళల్లో నవ్వు మిసమిసలాడింది.

"దానికో రచయితంటూ లేడు."

విక్టర్ కామె మాటలు అర్థంకాలేదు. ఇంతలో ఇంట్లోంచి పిలుపు వినిపించింది.

"తోన్యా! నీ నేస్తాల్ని పిలువు. టీ త్రాగుదురుగాని."

తోన్యా లేచింది. ఆమెతోనే మిగతా అంతా లేచేరు.

* * *

మనస్సును ఆవరించిన ఏదో కొత్తభావన పావెల్‌ను కంగారు పెడుతూంది; అదేమిటో అర్థం కావడంలేదు.

తోన్యాతండ్రి చీఫ్ ఫారెస్టు వార్డెను. పావెల్ స్థితి గతులతో పోల్చిచూస్తే ఆయనా వకీలు లెస్జిన్‌స్కీ ఒకే అంతస్థువాళ్ళు.

పావెల్ తలతిప్పేడు.

"ఊహు."

"ఏం?"

ఆశ్చర్యంతో ఆమె కనుబొమ్మలు విస్తరించేయి.

"మీ నాన్న కిష్టంవుండకపోవచ్చు. నాకు నమ్మకమే. నాలాంటి వుంధాకోరును తోటలోకి రానిచ్చినందుకు ఆయన నీ చెమడా లూడగొడతాడు."

తోన్యాకు కోపం వచ్చింది.

"అఘోరించినట్లేవుంది. రా, మానాన్న ఎప్పుడూ అల్లాఅనడు. నువ్వే చూస్తావు. రా."

ఆమె పరుగెత్తివెళ్ళి గేటు తీసింది. అనిశ్చితంగానే పావెల్ ఆమెవెంట లోపలికి అడుగుపెట్టేడు.

తోటలో గుండ్రని సిమెంటు బల్లవుంది. వారిద్దరూ వెళ్ళి దానివద్ద కూర్చున్నారు.

"నీకు పుస్తకాలంటే ఇష్టమేనా?

"చాలాఇష్టం"—అన్నాడు పావెల్.

"అన్నింటిలోకీ నీకేదిష్టం?"

పావెల్ ఒక్కక్షణం ఆలోచించేడు.

"గిసెప్పీ గారిబాల్డి"

"గుసెప్పీ అనాలి" అని తోన్యా ఆతని పలుకుబడిని సవరించింది.

"ఆ పుస్తకం నీకు బాగాఇష్టం అన్నమాట."

తోన్యా ఆతనిభుజం పట్టుకొని లాగి గుమ్మంవేపు నెమ్మదిగా నెట్టింది.

"నడు, రా."

వారిద్దరూ భోజనాల గదిలోంచి ఒక పెద్దగదిలోకి వెళ్ళేరు. దానిలో ఒక పెద్దబీరువావుంది. తోన్యా దాని తలుపులు తెరిచింది. వరసలుగాపేర్చివున్న కొన్నివందల పుస్తకాలుచూసి పావెల్ ఆశ్చర్యపడ్డాడు. అన్ని పుస్తకాల నాతడు జీవితంలో చూడలేదు.

"నీకో మంచిపుస్తకం ఇస్తా. నువ్వు తప్పకుండావచ్చి కావలసిన పుస్తకాలు తీసుకెడుతుండాలిసుమా. ఏం."

పావెల్ ఆనందంతో తల వూపాడు.

"నాకు పుస్తకాలంటే ఎంతోఇష్టం."

ఆ రోజున వారు చాల గంటలపాటు ఆనందంగా గడిపేరు. తోన్యా ఆతనిని తల్లికి చూపింది. ఆత డనుకు న్నంత భయకారణం కనపడలేదు. ఆమె చాల మంచిదిలా కనబడింది.

తోన్యా పావెల్ను తన గదిలోకి తీసుకెళ్ళి తన పుస్తకాలు చూపించింది.

గదిలో ఒక చిన్నమేజామీద ఒక చిన్నఅద్దం వుంది. తోన్యా ఆతనిని మేజావద్దకు తీసుకెళ్ళింది.

"ఎందుకాజుట్టు అంత దుబ్బులా పెంచేవు. కత్తెర వేయించుకోరాదా. దువ్వుకోరాదా?"

పావెల్ సిగ్గుపడ్డాడు.

"మరీ పెరిగిపోతే తల నున్నగా చేయించేస్తా. అంత కంటె చేసేదేముంది?"

తోన్యా నవ్వింది. నవ్వుతూనే బల్లమీదున్న దువ్వెన తీసి జుట్టు దువ్వింది. తల అటూఇటూ తిప్పిచూసింది.

"అది! చూసుకో. జుట్టు అందంగా కత్తిరించుకోవాలి. గడ్డిమోపులా పెరగనీకూడదు."

రంగుమాసిన చొక్కా, మాసికలువేసిన లాగూ చూసినా ఆమె వాటినిగురించి ఏమీఅనలేదు. కాని, ఆమె చూపును పావెల్ గమనించేడు. తనదుస్తులు పాడుగా వున్నాయనుకొని సిగ్గుపడ్డాడు.

వెళ్ళిపోయేటప్పుడు తోన్యా అతనిని మళ్ళీ రమ్మని ఆహ్వానించింది. రెండు రోజుల్లో వస్తానని మాట పుచ్చుకొంది. ఇద్దరూ గేలంవేటకి వెడదామనుకొన్నారు.

పావెల్ కిటికీలోంచి తోటలోకి దిగి వెళ్ళిపోయేడు. వీధిగుమ్మాన వెడితే తోన్యాతల్లి కనిపిస్తుందేమోనని అతని సంకోచం.

* * *

ఆర్టెమ్ వెళ్ళిపోయేక కోర్చాగిన్ల యింటిపరిస్థితులేమీ బాగులేవు. పావెల్ తెచ్చే జీతంతో ఇల్లు గడవడం లేదు.

లెస్జిన్ స్కలుసు వంటమనిషి కావాలని తెలిసింది. మేరియా యాకొవ్లవ్నా తాను వెళ్ళి పనికి కుదురుకొంటా నంది. కాని పావెల్ ఒప్పుకోలేదు.

"వద్దమ్మా! మరోపనికూడా ఏదన్నా నేచూస్తా. రంపంమిల్లులో చెక్కలు లాటుపెట్టేందుకు మనిషి కావాల న్నారు. ఓపూట అక్కడికెడతా. మనకి సరిపడకపోదు. నువ్వు పనిలోకి పోవద్దు. పోనిచ్చేనంటే అన్నకి కోపం వస్తుంది."

ఆతనిని వొప్పించడానికై తల్లి చాల చెప్పింది. కాని పావెల్ అంగీకరించలేదు.

మర్నాడే ఆతడు రంపపుమిల్లులో పనికి కుదిరేడు. మిషన్ మీాదకోసిన పలకల్ని ఆరబెట్టడం ఆతని పని. అక్కడ ఆతడెరిగిన కుర్రవాళ్ళు చాలమంది పనిచేస్తున్నారు. మిషా లెవ్చుకోవ్ ఆతనితోపాటు స్కూల్లో చదువుకొన్నాడు. వాన్యాకులెషోవ్ ఆతనికి ఎరికే. పావెల్ మిషాతో కలిసి గుత్తపద్ధతిని పనితీసుకొన్నారు. ఆదా బాగానేవుంటూంది. పగటిపూట రంపంమిల్లులో పనిచేసి, రాత్రికి పవర్ స్టేషన్‌కి పోతున్నాడు.

పదోరోజున పావెల్‌కి కూలిఇచ్చేరు. ఆ డబ్బు తెచ్చి తల్లి చేతిలోపెట్టేడు.

ఆ డబ్బుయిస్తూ ఓ నిముషం తటపటాయించేడు. మాటచెప్పడానికి సిగ్గుపడ్డాడు. ఎల్లాఅయితేనేం బయట పడ్డాడు.

"నాకో శాటిన్ షర్టు—నీలిరంగుది – చిరుచుకొన్నావు గుర్తులేదూ? అట్లాంటిది—కొనుక్కుంటాను. దీంట్లో సగం నే తీసుకుంటా. కాని పర్వాలేదులే. మళ్ళీసంపాదిస్తా. చూడీ చొక్కా, ఎంత అసహ్యంగావుందో"

డబ్బుఅడుగుతున్నందుకు సిగ్గుపడి, క్షమార్పణ చెప్పుకొంటున్నట్లు మాట్లాడేడు.

"దానికేముంది; తప్పకుండా కొనుక్కోస్తా. బాబూ! గుడ్డ ఈవేళ తీసుకొస్తాలే. రేపు కుట్టుతా. పాపం నీకు సరయిన చొక్కాయేలేదు." అంటూ ఆమె ఎంతో ఆప్యాయంగా కొడుకువేపు చూసింది.

అక్కడినుంచి పావెల్ మంగలిషాపు కెళ్ళేడు. గుమ్మంలో ఒక్కక్షణం నిలబడి జేబులోని రూబులుబిళ్ళ తడిమిచూసుకొని లోపల అడుగుపెట్టేడు.

మంగలి తలవూపి ఆతనిని ఖాళీగావున్న కుర్చీలో కూర్చోపెట్టేడు.

మెత్తగావున్న కుర్చీమెత్తలలో దిగబడ్డట్లయింది. ఎదురుగావున్న అద్దంలోని ముఖంలో కంగారూ, ఆదుర్దా కనబడుతూంది.

"అంటకత్తెరెయ్యనా ?"

"ఊ... కాదు ... క్రాపుచెయ్యి."

మాటలు పూర్తిగాచెప్పలేక పావెల్ సంజ్ఞలతో తన అభిప్రాయాన్ని స్పష్టపరిచేడు. మంగలి చిన్నగా నవ్వేడు.

"అర్థమయింది."

ఓ పావుగంట తర్వాత శుభ్రంగా, నీటుగా కత్తిరించి, దువ్విన జుట్టూ, అతడూ పావెల్ షాపునుంచి బయటకు వచ్చేరు. క్షవరం పూర్తిఅయ్యేసరికి ఒళ్ళంతా చెమటలు పట్టేశాయి. మనిషి డీలా అయిపోయేడు. దువ్వేనకి లొంగనిజుట్టుకు నీళ్ళసాయంతో లొంగతీసి పంగలి నీటుగా సవరించేడు.

వీధిలోకి వచ్చేక పావెల్ ఒక్కదీర్ఘశ్వాసం తీసుకొన్నాడు. టోపీ కనుబొమ్మలమీదికంటా లాక్కొని ఇంటికేసి తిరిగేడు.

"ఈ వేషంచూసి అమ్మ ఏమనుకొంటుందో."

* * *

గేలంవేటకి వస్తానని పావెల్ మాటయిచ్చి, తప్పినందుకు తోన్యాకెంతో విసుపుట్టింది.

"ఎవరేమనుకొంటారో అనే బాధకూడా లేదనుకొంటూ."

పావెల్ చాలరోజులవరకూ మళ్ళీ కనబడనేలేదు. క్రమంగా, విసుప్పూ, కోపంపోయి ఆతనికోసం ఎదురుచూడ్డం ప్రారంభించింది.

ఒకరోజున ఆమె ఎక్కడికో బయలుదేరబోతూండగా తల్లి పిలిచింది.

"నీకోసం ఎవరో వచ్చేరు. రమ్మంటూవా!"

ఇద్దరూ చిరకాలమిత్రుల్లాగ సాయంత్రందాకా నడిచేరు. పావెల్ జక్తును తెత్తినంటు రివాల్వరును ఎలా అపహరించి దాచేసేదో దాపరికం లేకుండా ఆమెకు చెప్పేసేడు. కొద్దిరోజులు పోయేక అడవిలోకి వేటకు తీసుకెడతానన్నాడు.

“కాని, నేచెప్పింది ఎవరికీ చెప్పకేం.”

“ఎవ్వరికీ చెప్పన”ని తోన్యా ప్రమాణంచేసింది.

# ప్రకరణం 4

యుక్రెయిన్‌లో వర్గపోరాటాలు అతితీవ్రంగా, భయంకరంగా సాగిపోతున్నాయి. అంతకంతకీ ఎక్కువగా కొత్త కొత్త జనం ఆయుధాలు తీస్తున్నారు. ఒక్కొక్క ఘర్షణతో కొత్తజనం పోరాటంలోకి వస్తున్నారు.

'మర్యాదస్తులు' సుఖంగా, శాంతంగా కాలంగడిపే పరిస్థితులు పోయేయి.

శిథిలమైపోతున్న చిన్నచిన్న ఇంటికలుపులు తుపాకి కాల్పులకు దడదడ లాడిపోతున్నాయి. మర్యాదస్థులంతా చుంచుల్లా కొట్టుగది గోడలకో, దొడ్డిలో తవ్విన కందకాల గోడలకో అంటిపెట్టుకు కూర్చొని వణికిపోతున్నారు.

పెట్లూరా రాజట్లు అన్నిరకాల జనంతో నిండిపోయేయి. గోలూబ్, ఆర్చ్ఛేంగిల్, ఏంగిల్, గార్డియూజ్ మొదలయిన బందిపోటుదొంగలు, పెద్ద, చిన్ననాయకుల యాజమాన్యాన గుబెర్నియా (జిల్లావంటిది) అంతా కలగ తిరుగుతున్నారు.

జార్ సైన్యాలలో పనిచేసిన మాజీసైనికోద్యోగులు, సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి చెందిన అతివాదులూ, మితవాదులూ – ఒకళ్ళేమిటి – పదిమందని జేరతీ మగలవాళ్లా

ఒక అటామన్ అయికూర్చున్నాడు. తమ బలం సాగినంత ప్రాంతంలో, సాగేఅవకాశం వున్నంతవరకూ ప్రతివాడూ ఒక రాజయిపోయేడు. వాళ్ళల్లో కొందరు పెట్ల్యూరా తాలూకు నీలి - పసుపుపచ్చ జెండా ఎత్తేరు.

గ్రామాల్లోని ధనికరైతులు, అటామన్ కోనోవాలెట్స్ సేనలలోని గలీషియా రెజిమెంట్లు, ఒకరేమిటి అనేకముఠాలు వాళ్ళతో చేరేయి. వీరందరినీ చేర్చుకుని పెట్ల్యూరా 'పెద్ద అటామన్' అయిపోయేడు. రెజిమెంట్లు, డివిజన్లుపోగుచేసేడు. సోషలిస్టు రివల్యూషనరీలూ, ధనికరైతులూ మొదలయిన వారుచేరిన ఈ సేనల్ని కమ్యూనిస్టుపార్టిజాన్‌లు నాలుగు వేపులనుంచీ కొట్టడం ప్రారంభించేరు. వేలకొలది గుర్రాల డెక్కలచప్పుళ్ళు, మరఫిరంగులూ, ఫిరంగులు అమరించిన బండిచక్రాల గరగరలూతో నేల కంపించిపోతూంది.

గంద్రగోళాలమధ్య 1919 ఏప్రిల్ సాగిపోతూంది. ఏరోజున ఎవరు అధికారంలోవున్నారో ఎవ్వరికీ అర్థంకాదు. పొద్దుటే లేచి, కళ్ళు నులుముకుంటూ పెద్దమనుష్యులు అన్న వాళ్ళు ఆనాడు అధికారంలో ఎవరున్నారో వాకబుచేయడం మామూలయింది.

"అవ్తోనోమ్‌పెత్రోవిచ్! ఈవేళ అధికారులెవరో నీ కేమన్నా తెలుసా?"

అవ్తోనోమ్‌పెత్రోవిచ్ జారిపోతున్న పైజామా పైకి లాక్కుంటూ భయసంభ్రమాలతో దిక్కులుచూస్తూ:

"నాకు తెలీదు. అఫనాస్ కిరిల్లిచ్! రాత్రెవరో వూళ్ళోకి రావడంవచ్చేరు. ఆ వచ్చినదెవరో తెలుసు

కుందాం! వాళ్ళు యూనుకొంపలు దోచుకోవడం ప్రారంభించేరా పెట్లూరా మనుష్యులన్నమాట. ఇంక 'కామ్రేడ్స్' ఎవరన్నా అయితే వాళ్ళమాటల్లోనే తెలిసిపోతుంది. వీధి సావిట్లో ఎవరిబొమ్మ వ్రేలాడదియ్యాలో చూస్తున్నా. జీరాసిమ్‌లియూన్ టీ విచ్‌లాగ చూసిచూసి చిక్కుల్లో పడదలచుకోలేదు సాపం వచ్చినదెవరో చూసుకోకుండా లెనిన్ పటం సావిట్లో పెట్టేడు. తీరాచేస్తే వచ్చినవాళ్ళు పెట్లూరా మనుష్యులు. ఆ బొమ్మమీద కళ్ళుపడగానే ఆతణ్ణి ఒడేసి పట్టుకొన్నారు. "లంజకొడకా! కమ్యూనిస్టువటరా, నీ చర్మం వొలుస్తామని కూర్చున్నారు. తరవాత వడిస్తే ఏం లాభం? చెప్తే వినిపించుకొనేదెవరు?

వీధిలో ఎవరన్నా వస్తున్నారనేసరికి ఈ పెద్దమనుష్యులు చడీచప్పుడులేకుండా తలుపులు మూసుకొని కొట్టు గదుల్లో చేరిపోతారు, ఎందుకేనా మంచిదని...

కార్మికులు నీలి - పసుపురంగు జెండాకనబడితే మహా అసహ్యం కనబరిచేవారు. యూక్రెయిన్‌లో విజృంభిస్తున్న ఈ బూర్జువాజాతీయ దురహంకారాన్ని ఎదిరించగలశక్తి వారికిలేదు. ఏమీచేయలేరు. ఇంక పెట్లూరాదళాలు నాలుగు వేపులనుంచీ గదుముకువస్తూంటే తీవ్రంగా యుద్ధాలుచేస్తూ పరిక్రమిస్తున్న రెడ్‌గార్డుదళాలు కనబడ్డప్పుడల్ల మధ్య మధ్య హుషారు పడుతున్నారు. దారినేపోతూ రెడ్‌గార్డు దళాలు ఓ రోజో రెండు రోజులో ఆ నగరంలో నిలబడతాయి. ఆ రెండు రోజులూ టౌన్‌హాల్‌మీద ఎర్రజెండా

రెపరెప లాడుతుంది. కార్మికులు ఆ రెండు రోజులూ ఆనంద పడతారు. మళ్ళీ ఆ దళం వెళ్ళిపోగానే నిరుత్సాహపడతారు.

ఆ రోజున ట్రాన్స్‌వ్డ్సేవర్ డివిజన్‌తో కర్నల్ గోలుబ్ నగరాన్ని ఆక్రమించుకొని వున్నాడు.

అతని సైన్యంలో వున్న రెండు వేలమందీ పేరుపడ్డ గొంతుకోతరాయుళ్ళు రెండు రోజుల క్రితం గోలుబ్ మంచి అందమైన గుర్రంమీద ముందు వస్తూంటే వెనకన ఆ సేన నగరంలో ప్రవేశించింది. ఏప్రిల్ ఎండ తీవ్రంగావున్నా కర్నల్ కకేషియన్ బుర్ఖా వేసుకొన్నాడు. గొర్రెచర్మంతో కుట్టిన జాకెట్ కోసక్కులు ధరించేవారిది ఎర్రటోపీ-చెర్కెస్కా-ధరించేడు. ఆ వేషానికి అమిరే ఆయుధాలు ధరించేడు. కైజారూ, పట్టాకత్తీ, పట్టాకత్తి పిడిలో వెండి మేకులు మిలమిల లాడుతున్నాయి. వంపుదిరిగిన పైప్ పళ్ళ మధ్య కరిచి పట్టుకొన్నాడు.

కర్నల్ గోలుబ్ అందగాడు. నల్లని కనుబొమ్మలు, అతి తాగుడువలన ఆకుపచ్చరంగు కొద్దిగా కనిపించే తెల్లని ముఖవర్ఛస్సు.

విప్లవానికి పూర్వం కర్నల్ గోలుబ్ పంచదార ఫ్యాక్టరీకి చెందిన బీట్‌రూట్ పొలాలలో వ్యవసాయశాస్త్ర వేత్తగా పనిచేసేవాడు. కాని ఈనాటి అటామన్ అధికారంతో పోలుస్తే అదీ ఓ వుద్యోగమేనా? మాట్లాడకుండా వ్యవసాయశాస్త్రవిజ్ఞుడు గోలుబ్ కర్నల్ గోలుబ్.గా అవతరించి ఆనాటి కల్లోల వాతావరణంలో జెండా ఎత్తేడు.

[illegible] ప్రక్కన [illegible] నాటకశాలా సాంస్కృతికాదరం అయిపోయింది. పెట్రోగ్రాను సమర్థించే సేనావులంతా అక్కడ సమావేశం: యూక్రేనియన్ పంతులమ్మాయి, సుశాబోధకుడి ఇద్దరు కూతుళ్ళు, సుందరి అన్యా, ఆమె చెల్లెలు దీనా, అంత పెద్ద కుటుంబాల వాళ్ళు కాకపోయినా పెద్దవాళ్ళమనుకొనే మరికొంతమంది మహిళలు, కౌంట్ పోటోస్కీ కుటుంబంలోని స్త్రీలు, వర్తక కుటుంబాలకు చెందినవాళ్లకొందరు, 'స్వాతంత్ర్యకోసక్కుల'మని చెప్పుకొనే యూక్రేనియను సోషలిస్టు రివల్యూషనరీ మూక కొంతమంది —— ఇల్లాగే అంతా చేరేరు.

హాలంతా కిక్కిరిసివుంది. ప్రాచీన చిత్రపటాలలోని జాపరోజెకోసక్కుల మాదిరి దుస్తులుధరించి ఆఫీసర్లు పంతులమ్మల అగల్బగళ్ళలో తిరుగుతున్నారు. మిగిలిన ఆడవాళ్ళనికూడా చిన్నచూపు చూపడంలేదు.

రెజిమెంటుతాలూకు బ్యాండువాళ్ళు వాయిస్తున్నారు. ఆరోజు సాయంకాలం 'నాజర్ స్తోదోల్యా' నాటకం ఆడడానికై ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి.

అయితే కరెంటులేదు. ఈ విషయాన్ని అంగరక్షకుడు సబ్ లెఫ్టినెంట్ పొల్యాన్ట్సేవ్ - ఈయన ప్రస్తుతం తన పేరును యూక్రేనియను రూపంలోకి మార్చుకొని ఖోరుంజా పొల్యానూత్స్క్య అని చెప్పుకుంటున్నాడు - కర్నల్ గారికి నివేదించేడు - ఆ సాయంకాలం కర్నల్ కూడా ఈ వినోదాలలో పాల్గొందలిచేడు. ఆయన పొల్యానూత్స్క్య మాటవిని ఖచ్చితంగా ఆజ్ఞాపించేడు.

“కరెంటు వచ్చేలాచూడు. చచ్చయినాసరే ఎవణ్ణో ఎలక్ట్రీషియనును పట్టుకుని పవర్ హౌసుపనిచేసేటట్లుచూడు.”

“అల్లాగే”

చావనవసరం లేకుండానే ఖోరుంజూపాల్యానూత్స్యా ఎలక్ట్రీషియను ఒకణ్ణి పట్టుకొన్నాడు. రెండుగంటలలోపున నాయుధ సైనికుల కాపలాలో పావెలూ, ఒక ఎలక్ట్రీషియనూ, ఒక మెకానికూ పవర్ హౌస్ కి చేరుకున్నారు.

పాల్యానూత్స్యా వాళ్ళ ముగ్గురికీ ఒక ఇనుపదూలం చూపించేడు.

“ఏడయ్యేసరికి లైట్లు వెలగకపోతే మీ ముగ్గురినీ దీనికి ఉరితీస్తా.”

ఆ బెదిరింపు పనిచేసింది. సరిగ్గా వేళకి దీపాలు వెలిగేయి.

కర్నల్ వచ్చేసరికి హాలంతా నిండిపోయివుంది. వెంట ఆయన మకాంచేసిన హోటల్ యజమాని కూతురుకూడా వచ్చింది. లావుగావుంది. బంగారురంగు జుట్టు. తండ్రి బాగావున్నవాడేమో ఆ జిల్లాలోకల్లా పెద్ద పాఠశాలలో ఆమెను చదివించేడు.

వారిద్దరికీ మొదటివరసలో స్థానాలు ఖాళీగావుంచేరు. వారాస్థానాలలో కూర్చోగానే కర్నల్ ఆట ప్రారంభించవచ్చునని సంజ్ఞ చేసేడు. వెంటనే తెర లేచింది. అంతవరకూ రంగస్థలంమీద నిల్చునివున్న సూత్రధారి తప్పుకోడానికి కూడా వ్యవధిలేనంత హఠాత్తుగా తెర లేచింది.

నాటకం జరుగుతున్నంతసేపూ ఆఫీసర్లూ, వారితో వున్నవనితలూ ఫలాహారశాలల బల్లలవద్దనే కాలక్షేపం చేసేరు. దేశవాళీ సారాసీసాలు ఖాళీచేసేరు. పాల్యానూత్సాన్య నగరంలో దొరికిన సరుకంతా స్వాధీనం చేసుకొని వారి వినోదంకోసం తెచ్చిపెట్టేడు. నాటకం పూర్తిఅయ్యేసరికి ఇంచుమించు వారందరూ ఒళ్ళెరగని స్థితిలో వున్నారు.

ఆఖరు అంకం తెరపడ్డాక పాల్యానూత్సాన్య వేదికపైకి వచ్చేడు. చేతులూపుతూ వెంటనే నాట్యం ప్రారంభం కాగలదని ప్రకటించేడు.

జనంఅంతా హర్షధ్వానులుచేసి, హుషారుగా కబుర్లు చెప్పుకుంటూ హాలుబయటికి వెళ్ళిపోయేరు. అంతవరకూ బయటకాపలాగా నిలబడ్డ పెట్లూరాసైనికులు లోపలికివచ్చి కుర్చీలు తీసేశేరు. గలీజుగావున్న హాలంతా వూడ్చి శుభ్రం చేసేరు.

ఓ అరగంట అయ్యేసరికి హాలంతా మహా గంద్రగోళంగావుంది.

పెట్లూరా ఆఫీసర్లు స్థానికయువతులతో కలిసి ఒళ్ళెరగని శివాలాడేరు. వారి బూటుకాళ్ళతొక్కిడికి నాటకశాల అంతా అదిరిపోయింది.

ఇక్కడ నాటకం సాగుతున్నసమయంలోనే కొందరు అశ్వికులు పిండిమిల్లువేపుగా పట్టణంవేపు వచ్చేరు. పేట బయట పెట్టినకాపలాదారు వారిని చూడగనే ఉలికిపడి 'అలారం' ఇచ్చేడు. కాపలావున్న ఇతరులు మరతుపాకుల్ని సిద్ధం

చేసేరు. చీకట్లో తుపాకీలు, గుర్రాలసమ్మెగముల మోతలు కటకటలాడేయి. చీకట్లోనే ఒళ్ళు జలదరించే స్వరంలో హెచ్చరిక వినబడింది.

"ఆగాలి! ఎవరది?"

ఇద్దరు వ్యక్తులు చీకట్లో నీడల్లా కనబడ్డారు. వారిలో ఒకరు ముందుకు వచ్చి జంబోరు గొంతుతో అరిచేడు.

"అటామన్ పావ్ల్యూక్ పటాలం. మీరెవరు? గోలూబ్ సైనికులా?"

కాపలాదారుల మధ్యనున్న ఆఫీసరు ముందు కొచ్చేడు.

"అవును."

"మా మనుష్యులకి మకాం ఎక్కడ?" అన్నాడు పావ్ల్యూక్.

"ఇప్పుడే కార్యాలయానికి ఫోనుచేస్తా" నంటూ ఆఫీసరు చీకట్లో అదృశ్యం అయాడు.

మరునిముషంలో రోడ్డుప్రక్కనే వున్న చిన్న కుటీరంలోంచి బయటికివచ్చి ఆజ్ఞలు జారీచేసేడు.

"రోడ్డుమీదున్న మరతుపాకీ తీసెయ్యండి. అటామన్‌గారికి దారివ్వండి."

విద్యుద్దీపాల వెలుతురులో పట్టపగలులావున్న నాటకశాలముందు పావ్ల్యూక్ గుర్రాన్ని ఆపేడు. నాటకశాల ముందు జనం హడావిడిగా తిరగడం చూసేడు. వెంట

వస్తున్నవానితో “ఇక్కడేదో హడావిడి చేస్తున్నట్లుంది” - అన్నాడు.

“గుకస్నిచ్! దిగి, మనమూ కలుద్దాం. పిల్లలు చాల మంది కనబడుతున్నారు. మనమో ఇద్దర్ని లంకించుకుందాం”.

గుకస్నిచ్ తలవూపేడు. పావ్ల్యూక్ తనక్రింది ఆఫీసరుని పిలిచేడు.

“స్టానిజ్లో! వ్యాపారాళ్ళ ఇళ్ళలో మనవాళ్ళకి మకాములు ఏర్పాటుచెయ్యి. మేమిక్కడ ఆగుతాము. అంగరక్షకుల్ని ఇల్లాపంపు.”

నాటకశాల గుమ్మంవద్ద పెట్లూరా తాలూకు సాయుధభటులిద్దరు వారిని ఆపేరు.

“టికెట్లు.”

పావ్ల్యూక్ వారిని చాల నిరసనగా చూసేడు. ఒకణ్ణి పక్కకు తోసేసేడు. ఆయన వెంటవచ్చిన డజనుమంది గుర్రాల్ని బయటకట్టేసి అప్పుడే అక్కడికి వచ్చేరు. వాళ్ళు రెండోవాడిని తోసేసేరు.

కొత్తగావచ్చిన జనాన్ని అందరూ గమనించేరు. భేతాళవిగ్రహంలావున్న పావ్ల్యూక్ వేపే అందరికళ్ళూ వున్నాయి; ఖరీదైన గుడ్డతో కుట్టిన ఆఫీసరు కోటుధరించేడు. గార్డుదళాలలో తొడిగే బ్రీచ్‌లు తొడిగేడు. తలని బొచ్చుటోపీ పెట్టేడు. భుజానవున్న పటకాని ఒక మౌజర్ పిస్టల్ వ్రేలాడుతూంది. కోటుజేబులోంచి గ్రేనేడ్ తొంగి చూస్తూంది.

గోలుబ్ క్రిందిఆఫీసరు మతబోధకుడి పెద్దకూతురుతో కలిసి నాట్యంచేస్తున్న వేపునుంచిగుసగుసలుబయలు దేరాయి.

"ఎవరబ్బా!"

మతబోధకుడి పెద్దకూతురు గాగరా ఆమె నాట్య వేగానికి లేచిపోయి చుట్టూనిలబడ్డ ప్రేక్షకులకు ఆనంద కరంగా సిల్కుఅండర్ వేర్ కనిపిస్తూంది.

జనాన్ని తోసుకుంటూ పావ్ల్యూక్ హోలులోకి వచ్చేడు. వస్తూనే ఆతని కళ్ళు మతబోధకుడి కూతురి తొడలుమీాద పడ్డాయి. ఆరిపోయిన పెదవులు నాలుకతో తడుపుకున్నాడు. అక్కడినుంచి సరాసరి మేళగాళ్ళున్న చోటికి చకచకా వెళ్ళేడు.

"హోపాక్ వాయించండి."

ఆ ఆజ్ఞను మేళనాయకుడు లెక్కచేయలేదు. పావ్ల్యూక్ కు కోపంవచ్చింది. కొరడాతో ఒక్కటి అంటించేడు. మేళనాయకుడు వీపు తడుముకుంటూ ఒక్కఉరుకుతీసేడు. మేళం నిలిచిపోయింది.

హోటలువానికూతురుకి మహాకోపం వచ్చింది. తన ప్రక్కనేకూర్చున్న గోలుబ్ చేయిపట్టుకు లాగింది.

"ఏమిటూ పొగరుబోతుతనం, ఏమిటండీ వూరుకుం టారు?"

గోలుబ్ ఒక్కవూపులో లేచినిలబడి పక్కనున్న కుర్చీని తన్ని తోసేశేడు. చరచరా నాలుగడులువేసి పావ్ల్యూక్ ఎదట నిలబడ్డాడు. మనిషిగుర్తు తెలిసింది.

వాళ్ళిద్దరిమధ్యా పెత్తనంకోసం తగవులాటజరుగుతూంది. ఓ వారం క్రితమే కర్నల్‌కు పావ్‌ల్యూక్ ఒక బురిడీ తిని పించేడు. రెడ్‌గార్డులతో గోలుబ్ దళాలు యుద్ధంచేసి ఓ మూల తీవ్రంగా నష్టపడుతూంటే పావ్‌ల్యూక్ అతనికి సహాయంవచ్చి ఎర్రసేనలని వెనకనుంచి దెబ్బతీయడానికి బదులు వారిచేతిలోవున్న పట్టణం పట్టుకొన్నాడు. అక్కడున్న కొద్దిమంది రెడ్‌గార్డు కాపలావాళ్ళని తరిమేసి తనవాళ్ళని పెట్టేడు. వాళ్ళ వెనకాల పట్టణం అంతా పూచికపుల్ల మిగలకుండా దోచుకున్నాడు. అయితే పెట్లూరా దళాలన్నింటిమాదిరిగానే అతనిసైన్యంకూడా యూదులనే ఎక్కువగా తుడిచిపెట్టింది. అయినా గోలుబ్‌కు సాయం రాలేదుగా. ఈ లోపున రెడ్‌గార్డు రెజిమెంటు గోలుబ్ సేనల కుడిపార్శ్వాన్ని చిందరవందరచేసి తప్పుకొన్నారు.

అటువంటి ద్రోహి, పొగరుబోతు తన కళ్ళముందు తన ఆఫీసర్లు ఆనందిస్తున్నచోటికి రావడం, వచ్చి తన మేళ నాయకుణ్ణి కొట్టడమూ చూసేసరికి గోలుబ్‌కోపానికి మితిలేక పోయింది. ఈ పొగరుబోతుకు బుద్ధిచెప్పకుంటే తన పెద్దరికం నిలబడదు.

ఒక్క నిముషంసేపు ఇద్దరూ ఒకరి ఎదటవొకరు చూపులతో కాల్చేసుకుంటున్నట్లు నిలబడ్డారు.

చివరకు గోలుబ్ ఒకచేత్తో జేబులోవున్న రివాల్వరును తడిమిచూసుకొని, రెండోచేత్తో కత్తిదూసి హుంకరించేడు.

పుంఢాకోరా! మా వాళ్ళ నెందుకొట్టేవు?"

పావ్ల్యూక్ మాజక్‌ను తరుముకొన్నాడు.

"గోలుబ్ గారూ! తమాయించండి సార్. అట్టే గంతు లెయ్యకండి. నాకు కోపం తెప్పించొద్దు."

గోలుబ్ ఇంక విసలేకపోయేడు.

"వెధవల్ని బయటికి ఈడ్చి, తలో పాతిక దెబ్బలూ తగిలించండి."

గోలుబ్ ఆఫీసర్లు వేటకుక్కల్లాగ పావ్ల్యూక్‌నీ, అతని అనుచరుల్నీ చుట్టుకారుకొన్నారు.

ఎలక్ట్రిక్ బల్బు క్రిందపడి బద్దలయినట్లు ఏమూలనుంచో తుపాకీ కాల్పు వినిపించింది. పావ్ల్యూక్ మనుష్యులూ, గోలుబ్ మనుష్యులూ కలబడ్డారు. ఒకరినొకరు కత్తులతో నరుక్కున్నారు. అది చేయిజారితే ఒకరిజుట్టు ఒకరుపట్టుకొని గుద్దుకొన్నారు. గొంతులు పిసుక్కున్నారు. కాళ్ళుకట్టి పడేసిన పందుల్లాగ గీపెడుతూ ఆడవాళ్ళు అటూఇటూ పరుగు లెత్తుతున్నారు.

కొద్దిసేపట్లో పావ్ల్యూక్‌నూ, అతని సైనికుల్నీ కట్టి పడేసి ఆయుధాలు లాక్కున్నారు. చితకొట్టి, హాలుబయటికి ఈడ్చి, ఓమూలో పారేసేరు.

ఆ కొట్లాటలో పావ్ల్యూక్ టోపీ ఎక్కడికో పోయింది. అతని ఆయుధాలు లాక్కొన్నారు. ముగం అంతా కొట్టుకుపోయింది. కదలా చెయ్యలేని స్థితిలో మనిషి ఉడికి పోతున్నాడు. ఓమూలోకి తోసేసేక పళ్ళు పటపట

లాడిస్తూ [illegible] అనుసరించేరు. టకటకమంటూ గుర్రాలు వీధి వెంట పరుగుతీసేయి.

ఇంత జరిగేక సరదా చచ్చిపోయింది. ఈ ఘటన జరిగేక ఇంకెవ్వరికీ నాట్యం చేసే హుషారు కలగలేదు. ఆడ వాళ్ళు ఇళ్ళకు పోతామని కూర్చున్నారు; కాని గోలుబ్ వినిపించుకోవడం లేదు.

"ఏమీ ఫర్లేదు. హాలులోంచి ఎవ్వర్నీ బయటికి పోనివ్వద్దు. చుట్టూ కాపలా పెట్టు.

ఆ ఆజ్ఞల సమలుజరపడానికై పాల్యానూత్స్కి పరుగు లెత్తేడు.

తెల్లవారేవరకూ నాట్యం జరగాలిసిందే"-అన్నాడు గోలుబ్ తనవద్దకు వచ్చినవాళ్ళతో.

"మొదటి వాల్ట్జ్ నేనే నాట్యంచేస్తా."

మేళగాళ్ళు వాయించడం ప్రారంభించేరు. నాట్యం ప్రారంభమయింది. అయితేనేం మొదటి హుషారు రాలేదు.

గోలుబ్ మతబోధకుడి కూతురితో నాట్యం ప్రారంభించేడు. మొదటివరస పూర్తి కాకపూర్వమే కాపలాదార్లు పరుగెత్తివచ్చేరు.

"పావ్ల్యూక్ మనుష్యులు హాలుని కమ్ముకుంటున్నారు."

ఆ మాట ఇంకా పూర్తి కాకుండానే వీధివైపున్న కిటికీ అద్దాలు బద్దలయి నేలరాలేయి. అద్దాల చట్రంలోంచి మర తుపాకీ గొట్టం గదిలోకి తొంగిచూసింది. దయ్యాన్ని చూసి జడుసుకున్నట్లు జనం దానికి దూరంగా గదిమధ్యకు పరు

గెత్తేరు. వారి పరుగుల్ని అనుసరిస్తూ మరతుపాకీ గొట్టం ఆ వైపూ, ఈ వైపూ మనుష్యుల్ని వెతుక్కుంటున్నట్లు కదులుతూంది.

హాలులో వేలాడుతున్న దీపాల లస్తరును గురిచూసి పాల్యానూత్స్కి రివాల్వరు కాల్చేడు. అది బాంబు పేలినట్లు పెద్ద ధ్వనిచేసింది. ఛిద్రుపలైన గాజుపెంకులు జలజలా సావిట్లోవున్న వాళ్ళ నెత్తినరాలేయి.

హాలంతా చీకటిమునిగింది. బయటినుంచి ఎవరిదో ఆజ్ఞాస్వరం వినబడింది.

"అంతా బయటికి రండి."

ఆ ఆజ్ఞతోపాటు వినశక్యంగాని బూతులు తిట్టేడు.

ఆడవాళ్ళంతా వెర్రిగా కేకలుపెట్టి ఏడుస్తున్నారు. ఏంచెయ్యాలో అర్థంగాక కంగారుపడుతున్న తన ఆఫీసర్లను సమీకరించేటందుకు గోలుబ్ గదిలో ఆ మూలనుంచి ఈ మూలకి హడావిడిగా ఉరుకులెడుతున్నాడు. బయట తుపాకీ కాల్పులు. ఒకటే రణగుణధ్వని. ఈ సందట్లో పాల్యానూత్స్కి చల్లగా దొడ్డితలుపు తెరచుకొని వీధినపడి గోలుబ్ హెడ్ క్వార్టర్సుకి పరుగెత్తేడు.

ఒక అరగంట పోయేసరికి నగరంఅంతా ఒక యుద్ధ రంగంగా మారింది. తుపాకులు, మరతుపాకుల కాల్పులతో వీధులన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి. పట్టణ ప్రజల కదేమిటో అర్థంకాలేదు. మాట్లాడకుండా తలుపులు బిగించుకొని కూర్చున్నారు.

చివరకు కాల్పులు చల్లారేయి. పట్టణం వెలుపల పేటలో ఎక్కడో ఒక్క మరతుపాకీమాత్రం కుక్క మొరిగినట్లు ఉన్నట్లుండి ఘుంయ్ మంటూంది.

తూర్పున తెలిరేకలు కనిపిస్తూండగా క్రమంగా కాల్పులు ఆగిపోయేయి... ... ...

* * *

* పోగ్రామ్ జరిపే ప్రయత్నాలు జరుగుతున్నాయని వార్త పుట్టింది. నదివొడ్డున బురదమడుగులో కట్టిన యూదుపేటకు ఆ వార్త పాకింది. శిథిలం అయిపోతున్న ఆ చిన్నచిన్న గుడిసెలలో కిక్కిరిసిపోయి జీవిస్తున్న ఆ బీద ప్రజ రానున్న ఉత్పాతాన్ని తలుచుకొని వొణికిపోయేరు.

సెర్జి బ్రూజక్ గడిచిన ఏడాదంతా పనిచేసిన ప్రెస్సులోని పనివాళ్ళంతా యూదులే. వారితో ఆతనికి మంచి దోస్తీ ఏర్పడింది. యజమానికి వ్యతిరేకంగా వాళ్ళంతా ఒక్కకుటుంబంవాళ్ళల్లే నిలబడ్డారు. వారి యజమాని బ్లమ్‌స్టీక్ సాధ్యమైనంత ఎక్కువపని చేయించుకొని సాధ్యమైనంత తక్కువజీతం ఇవ్వాలని ప్రయత్నించేవాడు. దాని మీద యజమానికీ పనివారికీ మధ్య ఎప్పుడూ తగువే. అనేకమార్లు పనివాళ్ళు సమ్మెలు చేసేరు. చివరకి రెండు మూడు వారాలనుంచి ప్రెస్సు మూతపడింది. దానిలో

---

* యూదుజాతివారిమీద జరిపే దౌర్జన్య చర్యలు. యూరపులోని ప్రభుత్వాలు పనికట్టుకొని యూదుజాతిని హింసించేటందుకు ప్రోత్సహించేవి.

పద్నాలుగుమంది పనిచేసేవారు. సెర్జీ రోజులో పన్నెండు గంటలూ చేతిప్రెస్‌లో చక్రం తిప్పుతూండేవాడు.

ఆరోజున పనివాళ్ళంతా ఏదో కంగారుగావుండడాన్ని సెర్జీ గమనించేడు. గత కొద్దినెలలుగా "చీఫ్ అటార్నీ" ప్రకటనలు ముద్రించడంతప్ప ప్రెస్సుకి మరో పనేలేదు.

క్షయరోగంతో బాధపడుతున్న మెండల్ సెర్జీని ఒక ప్రక్కకు పిలిచేడు. ఆ కుర్రవానివంక విచారంగా చూసేడు.

"పోగ్రామ్ ప్రయత్నాలు జరుగుతున్నాయని ఎరుగుదువా?"

సెర్జీ ఆశ్చర్యపడ్డాడు.

"లేదు. నాకేం తెలియదే."

మెండల్ సెర్జీభుజంమీద ఎండుపుల్లలావున్న తన చేయివేసి నెమ్మదిగా రహస్యం చెప్పేడు.

"పోగ్రామ్ జరుగుతుంది. సందేహం అక్కర్లేదు. యూదుల్ని చితకొట్టడతారు. ఒక్కటిచెప్పు. ఈ కష్టసమయంలో నీ స్నేహితులకి సాయంచేస్తావా?"

"తప్పకుండా చేస్తాను. కాని మెండల్! నేనేం చెయ్యాలి."

మిగిలిన కంపోజిటర్లుకూడా వాళ్ళ సంభాషణ వింటున్నారు.

"మంచివాడివి, నాయనా, నిన్ను నమ్మవచ్చు. మీ తండ్రిమాత్రం ఓ పనివాడుకాడా. ఒక్కమాటు ఇంటికెళ్ళి అడిగిరా. ఎవరేన్నా కొందరు ముసిలాళ్ళని ఈ

నాలుగు రోజులూ దాచిపెట్టగలడేమో తెలుసుకురా. ఎవరిని దాచాలో తరవాత ఆలోచిద్దాం. అల్లా దాచడానికి ఒప్పుకొనేవాళ్ళింకా ఎవరన్నా వున్నారేమో ఆయన్ని అడుగు. ప్రస్తుతంవరకు ఈ దారిదోపిడీగాళ్ళు రహస్యాన్ని ముట్టుకోరు. సెర్యోజా! వెళ్ళు, తర్వగా."

"మెండల్, మా యింటిసంగతి ఫర్వాలేదు. నువ్వు లెక్కవేసుకో. వెళ్లేప్పుడు దారిలో పావ్ కానూ, క్లిమ్ కానూ కూడ చూసి మాట్లాడుతా. వాళ్ళుకూడా తప్పకుండా కొంతని దాస్తారు."

పరుగెత్తబోతున్న సెర్జీని మెండల్ భుజంపట్టుకుని నిలబెట్టేడు.

"ఒక్కనిముషం. పావ్కా, క్లిమ్కా లెవరు? వాళ్ళు నీకు బాగా తెలుసా?"

సెర్జీ తలవూపేడు.

"తెలియకేం. వాళ్ళు నాదోస్తులు. పావ్కాకోర్చాగిన్ అన్న ఒక మెకానిక్.

మెండల్కు ధైర్యం కలిగింది.

"కోర్చాగినా? తెలుసు మేమిద్దరం ఓ యింట్లోనే వుండేవాళ్ళం. వెళ్ళు, త్వరగావచ్చి ఏమన్నారో చెప్పు."

సెర్జీ ఒక్కగంతువేసి వీధిలోపడ్డాడు.

* * *

పావ్ల్యూక్ మనుష్యులకీ, గోలుబ్ మనుష్యులకీ మధ్య యుద్ధం జరిగిన మూడోరోజున పోగ్రామ్ ప్రారంభమయింది.

పావ్‌ల్యూక్ ఓడిపోయి, పెరెటొవ్వా వదిలిపోయేడు. ఆ చుట్టుప్రక్కలకూడా వుండకుండా లేచిపోయి కొద్దిదూరంలో వున్న ఓ చిన్నపట్టణాన్ని ఆక్రమించి కూర్చున్నాడు. ఆరోజు రాత్రి పెరెటొవ్వాలో జరిగిన దెబ్బలాటలో అతని పరివారంలో ఓ పాతికమందివరకూ నష్టపడ్డారు. గోలుబ్ జనం కూడా ఆ ప్రాంతాలనే నష్టపడ్డారు.

చచ్చిపోయినవాళ్ళని తెల్లవారేసరికి శ్మశానానికి చేరవేసి, ఆట్టే ఆర్భాటంలేకుండా అంత్యక్రియలు జరిపేసేరు. ఆ యుద్ధం, ప్రాణనష్టం ఉభయులకీ గర్వకారణంకాదు. ఆ అటామన్లిద్దరూ కుక్కల్లాకరుచుకొని, ఇప్పుడు చచ్చిపోయినవాళ్ళ అంత్యక్రియలకు ఆర్భాటం చేయడం అసహ్యంగా వుంటుంది. పావ్‌ల్యూక్‌ని కమ్యూనిస్టు దోపిడీగాడుగా ప్రకటించి, తాము పొందిన విజయానికి వుత్సవం చేద్దామని పాల్యానూత్స్క్య ఉబలాటపడ్డాడు. కాని మతబోధకుడు వాసిలీ నాయకత్వాన పనిచేస్తున్న పౌరసంఘం దానికి ఒప్పుకోలేదు.

ఆ ఘర్షణ తర్వాత గోలుబ్ పటాలంలో గొణుగుడు ప్రారంభమయింది. చాలజనం నష్టపడ్డంచేత ముఖ్యంగా అంగరక్షకులలో చాలా అసంతృప్తి బయలుదేరింది. ఆ అసంతృప్తినిపోగొట్టి కాస్త హుషారుచేయడం కోసం పాల్యానూత్స్క్య 'పోగ్రామ్' ప్రారంభింపచేసి, కాస్త కాలక్షేపం జరిగేటట్లు చెయ్యాలన్నాడు. జనంలోవున్న అసంతృప్తిని పోగొట్టడాని కదొక్కటే మార్గమని గోలుబ్‌తో

చెప్పేడు. హోటల్ యజమాని కూతురుని పెళ్ళిచేసుకోబోయే ముందు పట్టణంలో కల్లోలం కలిగించడం గోలుబ్ కి అట్టే ఇష్టంలేదు. కాని, చివరకు తలవూపేడు.

గోలుబ్ అయిష్టానికి మరో కారణంకూడావుంది. అతడీమధ్యనే సోషలిస్టురివల్యూషనరీ పార్టీలో చేరేడు. తన వ్యతిరేకులు తనకు 'పోగ్రాములగాడం' టూపేరెట్టి అప్రతిష్ఠ పాలు చేస్తారేమోనని ఒకభయం. చీఫ్ అటామన్ వద్ద వాడీలుచెప్తే? కానైతే ఇప్పటివరకు తాను చీఫ్ అటామన్ మీాద ఆధారపడడంలేదు. తనబ్రతుకేదో తాను బ్రతుకు తున్నాడు. పైగా ఆచీఫ్ కి తనవద్ద పనిచేస్తున్న జనం ఎల్లాంటి వాళ్ళో తెలియదా? తన డైరెక్టరీ ఖర్చులకోసం కొంప లూడ్చి డబ్బుతీసుకోవడంలేదా? ఇంక పోగ్రామ్ గాడంటా రనా. వచ్చేపేరేదో కొత్తగా రానక్కర్లేదు. ఇదివరకేవుంది. కొత్తగా మళ్ళీఅంటే మునిగిపోయేదేమిాలేదు.

ఒక రోజు పొద్దున్నే పోగ్రామ్ ప్రారంభమయింది.

ఇంకా అప్పటికి కనుచీకటిగావుంది. యూదుపేట వీధులు నిర్మానుష్యంగా వున్నాయి. కిటికీల తలుపులు గట్టిగా బిగించి వున్నాయి.

పైకిచూస్తే జనం అంతా గాఢనిద్రలో వున్నట్లుంది. కాని ఇళ్ళల్లో ఎవ్వరూ నిద్రపోవడంలేదు. అంతా దుస్తులు వేసుకొని రాబోయే ప్రమాదాన్ని ఎదురుచూస్తూ ఒక గదిలో ముడిచిపెట్టుకు కూర్చున్నారు. అభం శుభం ఎరగని అడ్డాలలో బిడ్డలు మాత్రం తల్లులవొడిలో నిశ్చింతగా నిద్ర పోతున్నారు.

గోలుబ్ అంగరక్షక దళనాయకుడు సాలోమూగా ఆ రోజు తెల్లవారేముందు పాల్యానూత్స్యాను లేపడానికై ఎంతో కష్టపడ్డాడు. కాని అతడో పట్టాన లేవలేదు. రాత్రి కలల్లో పీకపిసికిన గూనిపిశాచం ఇగిలిస్తూ ఎదుట వున్నట్లే ఒణికి పోతున్నాడు. లేపగా లేపగా ఎల్లాఅయితేనేం తల ఎత్తి కళ్లు విప్పేడు. ఎదుట సాలోమూగా.

"లేవ్వయ్యా! వేళయింది. నీదే ఆలస్యం."

పాల్యానూత్స్య లేచికూర్చున్నాడు. నోటినిండా వున్న ఉమ్మి తుబుక్కున ఊసేడు.

"ఏమి టంతపని?"

"యూదువాళ్ల డొక్కలు చీరెయ్యొద్దూ. మరచే వేమిటి?"

పాల్యానూత్స్య కంతా జ్ఞాపకంవచ్చింది. అతడా సంగతే మరచేడు. కర్నలూ, అతని ప్రియురాలూ కొద్ది మంది మిత్రులతో కలిసి పొలంపోయి విందు చేసుకొన్నారు. అక్కడి తిండీ, త్రాగుడూ ఉదాత్తం అయింది.

పాల్యానూత్స్య లేచి చన్నీళ్లతో తలతడుపు కున్నాడు. బాగా తెలివి వచ్చింది. వెంటనే హెడ్‌క్వార్టర్సు చేరి ఆజ్ఞలు జారీచేసేడు.

సమయానికి నగరంలో లేకుండా గోలుబ్ ముఖం తప్పించేడు. తర్వాత ఏమన్నావస్తే ఏదో పొరపాటని తప్పు కోవచ్చు. ఈలోపున పాల్యానూత్స్య అడ్డూ ఆపూ

లేకుండా తన పని కొనసాగించవచ్చు. ఇల్లాంటి కాలక్షేపపు పనులంటే పాల్యానూత్స్యాకు మహా హుషారు.

అంగరక్షకదళం నూరుమందీ అప్పటికే గుర్రాలెక్కి కూర్చున్నారు. మళ్లీ తర్వాత ఏ విధమైన ఆటంకం రాకుండా పాల్యానూత్స్య దూరదృష్టితో నగరానికీ స్టేషనుకీ పనివారియిళ్లకూ మధ్య కాపలాదారుల్ని పెట్టేడు. కార్మికులలో ఎవరికయినా ఆవేశంపుట్టి అడ్డువస్తారేమోనని లెస్జింస్కీల తోటలో రోడ్డును కమ్మకొనేటట్లు ఒక మర తుపాకీనికూడా పెట్టేడు.

ఏర్పాట్లన్నీ చేసుకొన్నాక సాలోమూగాతోసహా గుర్రం ఎక్కేడు.

బయలుదేరేముందు హఠాత్తుగా ఏదోగుర్తువచ్చింది.

"ఆగండి. మరిచేపోయేను. గోలుబ్ పెళ్లికి బహుమానం తేవద్దూ. రెండు బళ్లు తోలుకుపోదాం. మొదట దొరికినవి సేనాపతికి. మొదట కనిపించిన పడుచు నాకు. నేనాయన అంగరక్షకుణ్ణికదా. ఏమిరా! అర్థం అయిందా?"

ఈ ఆఖరు వాక్యం సాలోమూగా నుద్దేశించి అన్నది. ఆతడు అర్థంకానట్లు మిర్రిచూపులు చూసేడు.

"నీకేనేమిటి? అందరికీ సరిపడా వుంటారులే."

పాల్యానూత్స్య, సాలోమూగాలు ముందు వెడుతూంటే వెనక ఆ మూక నడిచింది.

పాల్యానూత్స్కీ వెళ్లవారేసరికి ఓ రెండంతస్తుల ఇంటిముందుకువచ్చి గుర్రాన్ని నిలిపేడు. ఇంటిముందు 'ఫస్ట్-బట్టలకొట్టు' అనే బోర్డు తుప్పుపట్టిన దొకటుంది.

అతని గుర్రంకాళ్ళు నేలబెట్టి కొడుతూంది.

"ఇక్కడ ప్రారంభిద్దాం—అంటూ పాల్యానూత్స్కీ గుర్రం దిగేడు.

"దిగండర్రా, ఇదిగో ఒక్కమాట వినండి. ఎవ్వరి తలలూ పగలకొట్టడం మాత్రం చేయకండి. తరవాత చూసుకుందాం. ఇంక పిల్లల్ని దొరకపుచ్చుకొని, ఓపికుండా, సాయంకాలందాకా తంటాలుపడండి."

వాళ్ళల్లో ఒకడు పళ్ళిగిలించేడు.

"ఎవర్తన్నా రమ్మనేదుంటే..."

నలుగురూ నవ్వేరు. పాల్యానూత్స్కీ వానిభుజం తట్టుతున్నట్లు ఆప్యాయంగా చూసేడు.

"అల్లాపిలిచేదుంటే నీ కడ్డం ఏముంది? వెనకాముందూ చూడకు, తోసెయ్. పాల్యానూత్స్కీ మెట్లెక్కి పాపుతలుపులు తన్నేడు. కాని అవి లొంగలేదు.

మొదటి అడుగులోనే హంసపాది. ఇంటిలోపలికున్న గుమ్మండగ్గరకెళ్లి తలుపు తట్టేడు. సాలోమూగా ఆతని వెనకనే నడిచేడు.

వీధిలో గుర్రపుడెక్కల చప్పుడుఆగి, మనుష్యుల పిలుపు వినబడేసరికి లోనున్నవాళ్ళ పైప్రాణాలు పైనే పోయేయి.

ఫకస్ బాగావున్నవాడు. అతడు రెండురోజులక్రితమే పెళ్ళాన్నీ, పిల్లల్నీ తీసుకుని వెళ్ళిపోయేడు. ఇంట్లో రీవా అనే పనిపిల్ల నుంచేడు. రీవా చాల నెమ్మదస్తురాలు. పంధొమ్మిదేళ్ళ ఆ పడుచు ఆతని ఆస్తికి కాపలా. ఒంటరిగా వుండటానికి ఆమె జంకుతూండడంచూసి, తల్లినీ తండ్రినీ తామువచ్చేవరకూ సాయం తెచ్చుకోమన్నాడు.

మొదట రీవా వొప్పుకోలేదు. ఫకస్ మహాగడసరి. బహుశా పోగ్రామ్ వుండకనే పోవచ్చునని ఆమె నూరడించ బూనుకొన్నాడు. అడుక్కునేవాడిని దోచుకొంటే ఏం దొరుకు తుంది?— అని ధైర్యం చెప్పేడు. వీనికి తోడు తిరిగి వచ్చేక ఒక దుస్తుకు సరిపడా మంచిగుడ్డ ఇస్తానని ఆశచూపేడు.

వచ్చిన రోజులు అలాగే ముందుకు పోకుండా వుంటారాయని ఆశపడుతూ, భయంతో వొణికిపోతూ ముగ్గురూ లోపలుండిపోయేరు. కాని, వారాశించినట్లు జరగ లేదు. గుర్రాలు గుమ్మంముందు ఆగేయేమో ననుకొన్నది భ్రమ అనుకొంటుండగానే దుకాణం తలుపుమీద దబదిబలు వినిపించేయి.

పీసక్ బాగా ముసిలివాడు. జుట్టంతా ముగ్గుబుట్టలా నెరిసిపోయింది. భయంతో చిన్నపిల్లవాడల్లే తేరిపారి చూస్తున్నాడు. రక్షించమంటూ జెహోవాను మొరపెట్టు కొన్నాడు. ఏ ఆపదా రాకుండా ఆ ఇంటిని కాపాడమని దేవుణ్ణి వేడుకొన్నాడు. ఆ ప్రార్థన హోరులో పక్కన నిల బడ్డ ముసలమ్మకి మనుష్యుల అడుగులసడికూడా వినబడలేదు.

రీవా మూలగదిలోకి పారిపోయి బీరువా వెనక దాక్కుంది.

వీధి తలుపుమీద ఒక్కతన్ను వినబడి ముసలాళ్ళిద్దరూ వొణికిపోయేరు.

"తలుపు."

ఈమారు అంతక్న బలమైన తన్నూ, దానితోపాటు ఓ వరసతిట్లూ వినిపించేయి.

కాని లోపలివాళ్ళు భయంతో వొణికిపోతున్నారు. తలుపుతీసే శక్తికూడా వాళ్ళ చేతుల్లోలేదు.

తలుపులమీద రైఫిల్ మడమలతో బాదినచప్పుడు. చివరకు గడియ విరిగిపోయింది. తలుపు భళ్ళున తెరుచుకుంది.

సైనికులు ఇంట్లో జొరబడ్డారు. మూలమూలలన్నీ వెతికేరు. కొట్టుగది తలుపులు పగలకొట్టేరు. వీధితలుపు గడియలోపలినుంచి తీసేరు.

ఇంక దోచుకోవడం ఆరంభమయింది.

బట్టలతానులు, పాదరక్షలు మొదలయిన సామగ్రినంతనూ బళ్ళకెత్తేరు. వాటివెంట సాలోమూగా గోలుబ్ హెడ్ క్వార్టర్సుకి బయలుదేరేడు. తిరిగివచ్చేసరికి ఆయింట్లో మూలగదిలోంచి ఏదో వెర్రికేకలు వినబడుతున్నాయి.

పాల్యానూత్స్క్యి తన జనాన్ని కొట్టు చక్కబెట్టడానికి వప్పచెప్పి తాను ఇంటిలోపలి భాగానికి బయలుదేరేడు. అక్కడ ముసలివాళ్ళిద్దరూ, ఆ పడుచూ వణికిపోతూ నిలబడి

వున్నారు. ద్వేషం కక్కుతూన్న కళ్ళతో చూస్తూ, ముసలి వాళ్ళని బయటికి పొమ్మన్నాడు.

"పోండి."

తల్లీ, తండ్రీకూడ అక్కడనుంచి కదలలేదు.

పాల్యానూత్స్కా ఒక్క అడుగు ముందుకు వేసేడు. నెమ్మదిగా కత్తిని వొరనుండి బయటికి లాగేడు.

"అమ్మా!" అని ఆ పడుచు ఓ వెర్రికేక పెట్టింది. సాలోమూగా విన్నదా కేకనే.

ఆ కేకవిని సైనికులంతా బిలబిలలాడుతూ వచ్చేరు. పాల్యానూత్స్కా ముసలివాళ్ళ నిద్దరినీ చూపేడు.

"లాక్కుపోండి."

లాక్కుపోయేరు. అప్పటికి సాలోమూగా లోనికి వచ్చేడు.

"ఈలంజతో ఓ నిముషం మాట్లాడి వస్తాగాని, ఎవరూ రాకుండా ఇక్కడుండి చూస్తూండు."

ఆ పడుచు మళ్ళీ కేకలు పెట్టింది. ముసలి పీసాక్ ఎక్కడినుంచి ఊడిపడ్డాడో పరుగెత్తుకు వచ్చేడు. కాని గుండెలమీద ఒక్కగుద్దు తగిలేసరికి గోడమీద పడిపోయి, బాధకు గిలగిలలాడిపోయేడు. ఎప్పుడూ గట్టిగా మాట్లాడి ఎరగని తోయ్‌బా పెద్దపులిలా సాలోమూగామీద వచ్చి పడింది.

"నాకూతుర్ని ముట్టుకుంటూరా[?]ట్రా. లే అడ్డం."

అంతబలవైునవాడూ సాలోమూగా ఆమె పట్టువిడి పించుకోలేకపోయేడు.

ఈ లోపున పీసాక్ కూడా తేరుకొని, భార్యకు సాయం వచ్చేడు.

"దారిలో లేంకి."

ముసలాళ్ళిద్దరూ పోగడి సాలోమూగాని తోసేసేరు. ఆతడికి కసిపుట్టింది. బెల్టులోవున్న రివాల్వరులాగి మడమతో ముసిలివాడి నెత్తిన ఒక్కటే సేడు. పీసాక్ నేలపడిపోయేడు.

గదిలో రీవా గోలచేస్తూంది. తోయ్ బాని ఇంట్లోంచి బయటికి తోసేసేరు. ఆ ఘటనల కామెమనస్సు చెదిరి పోయింది. సాయంకోసం వెర్రికేకలు పెడుతూంది. వీధు లన్నీ ఆమె అరుపులతో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇంట్లోంచి మళ్ళీ కేకలేం వినబడలేదు.

వాల్యానూత్స్వ్య గదిలోంచి బయటికి వచ్చేడు. సాలో మూగా ఈమాటు తాను దూరడానికి తలుపు తొయ్య బోతూంటే ఆపేడు.

"వెళ్ళకు, అరవకుండా నోరునొక్కితే ఉక్కిరిబిక్కిరై చచ్చింది."

గుమ్మంలో అడ్డంగాపడున్న పీసాక్ శవంమీాదుగా అడుగు వేసేసరికి నల్లగా జిగుడుగావున్న రక్తపుమడుగులో కాలుపడింది.

"ఏం బాగులేదు." అనుకొంటూ వాల్యానూత్స్వ్య వెలుపలికి వెళ్ళిపోయేడు.

సావట్లోనూ, మెట్లమీదా కాలిసంటుకున్న రక్తం పట్టిస్తూ మిగిలినవాళ్లుకూడా నిశ్శబ్దంగా వెళ్ళిపోయేరు.

నగరంలో దోపిడీ బ్రహ్మాండంగా సాగిపోతూంది. దోచుకొచ్చిన సరుకుల పంపకం తెగనప్పుడు దోపిడీగాళ్లు ఓ నిముషంసేపు తన్నుకుంటున్నారు. కత్తులు దూస్తున్నారు. పిడికుద్దులు నిరాఘాటంగా వుపయోగిస్తున్నారు. సారాకొట్టు లోంచి పెద్దపెద్దజాడీలు వీధిలోకి ఈడ్చుకువచ్చి మూతలూడ కొట్టేరు.

దోపిడిగాళ్ళు యూదుల ఇళ్ళల్లో జొరబడ్డారు.

వాళ్ళని అడ్డేవారు లేరు. గదులన్నీ వెతికేరు. సామానులన్నీ చిందరవందర చేసేరు. కంటికి ఆనినది పట్టుకుపోయేరు. మిగతావి చింపీ, బద్దలుకొట్టీ ధ్వంసంచేసేరు. మొదటి రోజున ఇద్దరే చచ్చిపోయేరు: రీవా; ఆమె తండ్రి పీసాక్. కాని ఆ రాత్రి మృత్యువు పేటలో నృత్యమే చేసింది.

సాయంకాలంవేళకల్లా తెగతాగేశేరు. ఎప్పుడు చీకటి పడుతుందాఅని పెట్లూరాబలగం కాచుక్కూర్చుంది.

చీకటిపడ్డాక వాళ్ళని పట్టపగ్గాలులేవు. నిశిరాత్రి చీకట్లో మనుష్యుల్ని చంపడం మహాసులువు. చివరకి నక్కలుకూడా రాత్రివేళే బయలుదేరుతాయి.

ఆ రెండు రాత్రులూ, మూడు పగళ్ళూ జరిగిన బీభత్సాలు మరవడం శక్యమేకాదు. ఎంతమంది తలలు పగిలీ, పీకలుపిసిగీ చచ్చిపడున్నారో. ఆ భయానక

దృశ్యాల కెందరి తలలు నెరిసిపోయినాయో, ఎంత కన్నీరు వరదకట్టిందో. అవమానం, అసహాయతతో బ్రతికి మిగిలిన వాళ్ళు అదృష్టవంతులో, చచ్చినవాళ్ళు అదృష్టవంతులో చెప్పడం కష్టమే. తమ చుట్టూరా జరుగుతున్న ఘటనలు ఎరగకుండా తమ బాధతో తాము మెలికలు తిరిగిపోతూ పడుచుపిల్లలు వీధుల్లో ఎక్కడపడితే అక్కడ కనిపిస్తున్నారు.

నదీసమీపంలో ఒక్కచోటమాత్రం ఈ హంతకులకు ఎదుర్కోలు వచ్చింది. కమ్మరి నామ్‌పెళ్ళాన్ని వీళ్ళుముట్టుకో బోయేసరికి ఆతడు చేతిలోవున్న పెద్దసుత్తితో ఇద్దరి తలలు పగలేసేడు. కుళ్ళినబూడిద గుమ్మిడికాయల్లా వాళ్ళతలలు విచ్చిపోయేయి.

ఆ ప్రమాదవార్త తెలిసి పెట్లూరా బందిపోట్లు పరుగెత్తి వచ్చేరు. తమ ఇరువురి ప్రాణాలకోసం కమ్మరి మహాభయంకరంగా పోరాడేడు. చాలసేపటివరకు తుపాకి కాల్పులు సాగేయి. ఆఖరున తనవద్ద మిగిలిన ఒక్క తూటాతో భార్యను కాల్చేసి, నామ్ వట్టిచేతులతో మృత్యువును ఎదుర్కొన్నాడు. గుమ్మం వెలపలకు వచ్చేసరికి తుపాకిగుళ్ళు ముసురుకొన్నాయి. అంతబలమైనవాడూ తడిసిన గుడ్డపీలికలా నేలకూలిపోయేడు.

సమీప గ్రామాలనుంచి కాస్త జరుగుబాటున్న రైతాంగం బళ్ళు వేసుకొని పట్టణంలోకి వచ్చేరు. పెట్లూరా బందిపోట్ల వెనకాలే ఇళ్ళలోదూరి తమ చేతికందినవి బళ్ళకెక్కించేరు. గోలుబ్ సేసలలోవున్న కొడుకుతో,

బంధువుతో వాళ్ళకూడా వుండి సాగనంపగా హడావిడిగా గుర్రాల్ని వురికిస్తున్నారు. మళ్ళీ వచ్చి మరిన్ని సరుకులు పట్టుకు పోదామని వాళ్ళ ఆదుర్దా.

సెర్యోజా బ్రూజక్ తండ్రి డిసాయంతో తను పనిచేసే ప్రెస్‌లోని పనివాళ్ళని సగంమందివరకూ తన యింట్లోనే దాచేడు. ఎక్కడినుంచో వస్తుండగా చింకిరిగోట్టు ముసిలి వాడొకడు భయంతో చేతులు ఆడించేస్తూ పరుగెత్తిరావడం కనిపించింది.

ఆతపోయూడు. ఆ ముసిలివాడి వెనుక పెట్లూరా సైన్యంలోని రౌతు ఒకడు తరుముకువస్తున్నాడు. గుర్రం మీదున్నవాడు కాలిపరుగున పోతున్న ముసలిదగ్గును అందు కోవడం అంత కష్టంకాదు. ఒక్క ఉదుటులో దగ్గిరకొచ్చే సేడు. గుర్రం మెడమీదకువంగి కత్తివిసిరేడు. ముసలివాడు తనప్రక్కకు గుర్రంరావడం చూసేడు. భయంతో వెర్రికేక పెట్టి రెండుచేతులూ పైకెత్తేడు. ఆ దృశ్యాన్ని సెర్యోజా చూడలేకపోయేడు. ముసిలివానిని కాపాడడానికి తాను గుర్రం ముందు కురికేడు.

"కుక్కలకొడకా! వాడి నెందుకురా చంపుతావు?"

రౌతుచేతిలోకత్తి సెర్యోజానెత్తిన పడిపోయింది.

# ప్రకరణం 5

అటామన్ పెట్లూరా సైన్యాల్ని ఎర్రసైన్యాలు గదుముకొని వస్తున్నాయి. గోలుబ్ దళాన్నికూడా యుద్ధ రంగానికి పిలిచేరు. వెనుక కాపుకోసం ఒక చిన్నసైన్యాన్ని, సేనాధిపతి అనుచరుల్నిమాత్రం పట్టణంలో వదిలి మిగిలిన పటాలాన్ని రంగానికి పంపేసేరు.

నగరప్రజలో కదలిక కలిగింది. దౌర్జన్యచర్యలు కాస్త తగ్గగానే యూదులు ఆ అవకాశం తీసుకొని చచ్చిపోయిన తమవారిని సమాధిచేసేరు. వారి గుడిసెలలో జీవితం మళ్ళీ మామూలుస్థితికి వచ్చేసింది.

సాయంకాలంవేళల్లో కాస్త నిశ్శబ్దంగావున్న వేళ లప్పుడు దూరాన ఉరుముల్లాంటి ధ్వనులు వినిపిస్తూన్నాయి. ఎక్కడో దగ్గర్లోనేయుద్ధం జరుగుతూంది.

స్టేషన్నుంచి రైల్వేపనివారు పనులు వెతుక్కుంటూ గ్రామాలకు బయులుదేరుతున్నారు.

కాలేజీ మూశేసేరు.

పట్టణంలో మార్షల్లా ప్రకటించేరు.

*　　　*　　　*

నిశిరాత్రి. కన్ను పొడుచుకొన్నా కనిపించని చీకటి. ఆ చీకట్లో మిత్రేదో, పల్లం ఏదో పడి మోకాళ్ళు విరగ్గొట్టు కొనేదాకా అర్థంకాదు.

ఇల్లాంటి సమయాల్లో పెద్దమనుష్యు లెవ్వరూ ఇల్లు కదలరు. పైవా ల్లెవరన్నా దీపం వెలుతురు కనిపిస్తే గుమ్మంలో కొస్తారేమోనని దీపంకూడా సాధ్యమైనంత వరకు వెలిగించరు. చీకట్లో సుఖం. ఇంక కొంతమందికి ఇంట్లో వుండడం తోచదు – అల్లాంటివాళ్ళు వీధులవెంటబడి తిరిగితే తిరగనీ, వాళ్ళ గొడవ పెద్దమనుష్యులెవరికీ పట్టదు. వాళ్ళమట్టుకు వాళ్ళు ఏమిచ్చినాసరే గుమ్మం దిగరు.

ఆనాటిరాత్రి సరిగ్గా అల్లాంటిరాత్రే. అయినా అంత చీకట్లోనూ ఎవరో నెమ్మదిగా వీధివెంట వస్తున్నాడు.

ఆతడు కోర్చాగిన్‌ల ఇంటిదగ్గిరికివచ్చి, కిటికీతలుపు నెమ్మదిగా తట్టేడు. సమాధానంలేదు. మళ్ళీ గట్టిగాతట్టేడు.

పావెల్ నిద్రపోతున్నాడు. కలలో ఏదో వింతజంతువు తనమీద మరతుపాకీ గురిపెడుతున్నట్లు కనబడింది. పారి పోవాలనుకొన్నాడు. కాని ఎక్కడికీ పోలేదు. మరతుపాకి చెవులు గళ్ళుపడేలాగ ధనధనలాడింది.

ఆధ్వనికి తెలివివచ్చింది. కిటికీవద్ద చప్పుడువినబడింది.

మంచం దిగేడు. కిటికీవద్దకుపోయి చూసేడు. మనిషి వున్నాడనేగాని అదెవ్వరో అర్థంకాలేదు.

ఇంట్లో తానొక్కడే వున్నాడు. తల్లి పెద్దకూతుర్ని చూడబోయింది. ఆమెమగడు పంచదార ఫ్యాక్టరీలో మెకా

నిక్క. ఆర్టెమ్ పక్కవూళ్ళో ఎక్కడో కమ్మరం చేసుకుంటూ రోజులు గడుపుకొంటున్నాడు.

అయితే ఆర్టెమే కావాలి.

పావెల్ ఆలోచించి కిటికీతలుపు తీద్దామనుకొన్నాడు.

"ఎవరది?"

బయటమనిషి కదిలేడు. నెమ్మదిగా సమాధానం వినిపించింది.

"నేను జకరయ్‌ని."

రెండుచేతులు కిటికీకమ్మలు పట్టుకొన్నాయి. తర్వాత ఫియోడోర్ తల కిటికీలో కనబడింది.

"ఈ రాత్రి ఇక్కడుండిపోయేటందు కొచ్చేను. ఏమీ అభ్యంతరం లేదుగదా?"

"ఏమీలేదు. ఎప్పుడొచ్చినా నీకేం అభ్యంతరం లేదు. ఎక్కు."

ఫియోడోర్ అతికష్టంమీద కిటికీలోంచిదూరి లోపలికి వచ్చేడు.

లోపలికివస్తూనే కిటికీమూసేడు. కాని, కొంతసేపటిదాకా అక్కడే నిలబడ్డాడు. ఏమో వినడానికి ప్రయత్నించేడు. అంతలో మబ్బులచాటునుంచి చంద్రుడు వెలువడ్డాడు. వెన్నెలలో రోడ్డంతా స్పష్టంగా కనబడుతోంది. జకరయ్ పరీక్షగాచూపు ఆనినంత మేరచూసేడు.

"మీఅమ్మని లేపంకదా?"

తానుతప్ప ఇంట్లో వేరెవరూ లేరని పావెల్ అన్నాడు. ఇంక జకరయ్ బెదురుతీరి గట్టిగా మాట్లాడేడు.

తలవని తలంపుగావచ్చిన జకరయ్ పావెల్‌తో ఎని మిదిరోజులు గడిపేడు. ఆ ఎనిమిదిరోజులస్నేహం పావెల్ జీవితాన్నే మార్చేసింది. ఎన్నోకొత్తసంగతులు అతనినుంచి తెలుసుకొన్నాడు.

పోలీసులు తనను పట్టుకొనేటందుకు రెండుమాట్లు దారి కాయడంతో తప్పనిసరిగా ఓ మూల తల దాచుకోవలసి వచ్చింది. ఆ తప్పనిసరి నిర్వ్యాపారతలో పావెల్‌కు ఎన్నో సంగతులు నూరిపోసేడు. ఆనాడా ప్రాంతాలలో కల్లోలాలు రేపుతుతున్న మతాలమీద కసి ఎక్కించేడు.

అతిసులభమైన భాషలో అన్నీ వివరంగా అర్థం అయ్యేటట్లు చెప్పేడు జకరయ్. అతనిలో అనుమానాలేవీ లేవు. ఆయనకు తన బాట ఏదో విస్పష్టం. సోషలిస్టు రివ ల్యూషనరీలనీ, సోషల్ డెమాక్రట్లనీ, పోలిష్ సోషలిస్టులనీ, మరొకటనీ చెప్పుకొనే ఈ పార్టీలన్నీ కార్మికులకు శత్రువులే నని పావెల్‌కు అర్థంఅయింది, కార్మికులకోసం, బీదలకోసం, మడమతిప్పకుండా పోరాడేది ఒక్క కమ్యూనిస్టుపార్టీ యేనని కూడా తెలుసుకొన్నాడు.

అంతవరకు పావెల్‌కు ఇవేమీ తెలియదు.

జకరయ్ కాకలుదేరిన కమ్యూనిస్టు. 1915 నుంచీ రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్‌పార్టీ సభ్యుడు. తన అను భవాలను, జీవితరహస్యాలను చెప్తూంటే పావెల్ చెవులు దోరపెట్టుకు విన్నాడు.

"చిన్నప్పుడు నేనూ నీలాగే వుండేవాడిని. ఏదో చెయ్యాలనే ఆదుర్దాయేగాని ఏంచెయ్యాలో తెలిసేదికాదు.

నేను దరిద్రంలో పుట్టి పెరిగేను. తెగతిని, కొవ్వుబలిసిన షావుకారి బిడ్డల్ని చూస్తే ఒళ్ళు రగిలిపోయేది. అందినప్పుడు ఓ తెర బాదేవాణ్ణి. ఇంటికొచ్చేక మళ్ళీ మా నాన్న నన్ను కొట్టేవాడు. ఒంటరిగా సాధిద్దామంటే జరిగే పనా. కార్మికుల ప్రయోజనాలకోసం పోరాడేవాళ్ళకు ఉండవలసినలక్షణాలన్నీ నీలో వున్నాయి. అయితే చిన్నతనం. వర్గకలహం అంటే ఏమిటో తెలియదు. నే చెప్తా విను. నీలో బాగుపడేవాడి లక్షణాలున్నాయి. ఎవళ్ళేల్లాపోతేనేం అని చేతులు ముడుచుకు కూర్చునే జనంఅంటే నాకు మహా చెడ్డ అసహ్యం. ప్రపంచం అంతా భుగభుగ లాడిపోతూంది. బానిసలంతా లేచేరు. ఇంక వెనకటి బ్రతుకులు లాభంలేదు. ఈ సమయంలో మనకు కావలసింది ధైర్యసాహసాలున్నవాళ్ళుగాని, చిటుక్కుమనేసరికి బిలబిలలాడుతూ పరిగెత్తిపోయే బొద్దింకముండా కొడుకులు కారు.''

జకరయ్ తన మాటకు బలంగా ఒక్కగుద్దుగుద్దేసరికి బల్ల ఝుణఝుణలాడిపోయింది.

లేచి, మహావేశంతో గదిలో పచార్లు ప్రారంభించేడు.

పనేమీ లేకపోవడం అతడికి ఏలాగో వుంది. ఇక్కడెందుకు ఆగిపోయేనా అని మధ్యమధ్య బాధకలుగుతూంది. వెంటనే కదిలి రెడ్ ఆర్మీదళాలను చేరుకోవాలనే నిర్ణయానికి వచ్చేడు.

ఆతడు వెళ్ళిపోయినా పార్టీపని ఆగిపోదు. ఇక్కడ తొమ్మిదిమంది పార్టీసభ్యులున్నారు. వాళ్ళే పట్టణంలో పని చేస్తారు.

"నే లేకపోయినా వాళ్లు చేసుకుపోగలరు. ఏపని లేకుండా కూర్చోవడం నాతరంకాదు. ఇప్పటికే పదినెలలు నిష్కారణం వ్యర్థంచేసేను."—అని జకరయ్ బాధపడ్డాడు.

ఓ రోజున పావెల్ "నిజంగాచెప్పు. నువ్వెవరివి?—" అని అడిగేడు.

ఆ ప్రశ్న ఏమిటో జకరయ్‌కు మొదట అర్థంకాలేదు.

"తెలియదా ?"

"నువ్వు బోల్షివిక్కువో, కమ్యూనిస్టువో అనుకొంటున్నా."

జకరయ్ పకపకనవ్వేడు.

"అంతే. అయితే బోల్షివిక్కునా, కమ్యూనిస్టునా, అర్థం వొక్కటే."

హఠాత్తుగా జకరయ్ నవ్వుమాని పావెల్ ముఖం వంక దీక్షగాచూసేడు.

"సరే. నీకు అర్థం అయింది. పేచీలేదు. కాని, ఈ మాట మరెక్కడాఅనకు. నోరుజారేవా నావెంట బడతారు"

పావెల్ గంభీరంగా తలవూపేడు.

"తెలిసింది."

ఇంతలో బయటమాటలు వినిపించేయి. పిలవనైనా పిలవకుండా ఎవరో తలుపుతోసేరు. జకరయ్ చటుక్కున జేబులోకి చేయిపోనిచ్చేడు. వచ్చిన మనిషిని చూడగానే చేయితీసేసేడు. నెత్తిన కట్టుతో సెర్జి బ్రూజక్ ముందూ, వెనకాల వాల్యా, క్లింకాలూ గదిలో అడుగుపెట్టేరు.

సెర్జీ సరాసరివచ్చి పావెల్ భుజంమీద చెయ్యివేసేడు.

"నిన్ను చూడాలని బయలుదేరేను. కాని, వాల్యా నన్నొక్కడినీ పోనివ్వనంది. వాల్యాఒక్కర్తే నాతోరావడం క్లిమ్‌కాకి ఒప్పుదలకాలేదు. ముగ్గురం బయలుదేరేం."

వాల్యా మాటమధ్యలో సెర్జీ నోరుమూసింది.

"గవ్వలడబ్బా. ఇవ్వాళే క్లిన్నుకాను పడిపించేస్తున్నాడు.

క్లిమ్‌కా చిరునవ్వు నవ్వేడు.

"వాడినేమి అనం? చూస్తున్నాంసుగా. మెదడుకి దెబ్బ తగిలింది, పాపం !

ఆ మాటకు అంతా నవ్వేరు.

కత్తిదెబ్బ తగిలేక సెర్జీ ఇంకా పూర్తిగా తేరుకోలేదు నీరసంగా పావెల్ మంచంమీద చతికిలబడ్డాడు. నలుగురూ బాతాఖానీలో పడ్డారు. మామూలుగా సెర్జీ వట్టి మాటకారి. అల్లాంటివాడీ ఘటన జరిగేక ఏలాగో వుంటున్నాడు. పెట్లూరా సైనికులతో జరిగిన పేచీవిషయం జకరయ్‌కి సవిస్తరంగా చెప్పేడు.

ఇదివరలో జకరయ్ బ్రూజక్‌ల ఇంటికి చాలామాట్లు వెళ్ళేడు. వాళ్ళముగ్గుర్నీ బాగా ఎరుగును. వాళ్ళంటే అతనికభిమానమేకూడ. చిన్నతనంచేత విషయాలు బాగా తెలియకపోయినా వాళ్ళుపుట్టిన వర్గంయొక్క ఆశలూ, ఆశయాలూ వాళ్ళప్రతిపనిలో ద్యోతకమవుతూంటాయి. పోగ్రామ్ నాటిలో యూదుకుటుంబాల్ని తమ యిళ్ళల్లోదాచిన విష

రాలు వాళ్ళు చెప్తూంటే ఎంతో ఆసక్తిగా విన్నాడు. ఆ సాయంకాలం అంతా వాళ్ళని కూర్చోబెట్టి బోల్షివిక్ లను గురించీ, లెనిన్ నుగురించీ, ఆనాటి రాజకీయ ఘటనలను గురించీ చెప్పేడు.

కూటం విడిపోయేసరికి రాత్రి చాల పొద్దుపోయింది.

జకరయ్ ప్రతిరోజూ సాయంకాలం ఎక్కడికో పోయే వాడు, అర్ధరాత్రికి తిరిగివచ్చేవాడు : తను వెళ్ళిపోయేక పట్టణంలో వుండేవాళ్ళు చేయవలసిన పనులు ఏర్పాటు చేస్తున్నాడు.

ఒక రోజు రాత్రి అతడు తిరిగిరాలేదు. పొద్దుటేలేచి చూసేసరికి రాత్రి జకరయ్ రాలేదని పావెల్ గ్రహించేడు.

ఏదో ప్రమాదం జరిగిం దనిపించింది. ఆదరాబాదరా బట్టలు వేసుకొన్నాడు. వీధితలుపు తాళంవేసి, చెవిని అల వాటుగా పెట్టేచోట దాచేడు. తిన్నగా క్లిమ్కా ఇంటికి వెళ్ళేడు. ఫియోడోర్ వృత్తాంతం అక్కడ తెలుస్తుందని వూహించేడు. అతడు వెళ్ళేసరికి క్లిమ్కాతల్లి బట్ట లుతుకు తూంది. ఫియోడోర్ సంగతి అడిగేసరికి ఆమె ఘుంయ్ మంది.

"నాకిదే పని. మీ ఫియోడోర్ ఎటుపోయేడో చూడ్డ మేనా నా పని? వాడిమాట నాకు చెప్పకు. వాడిమొహం తగులడిరి. జోజులిఖాగాడు ఇల్లంతా తిరగేసి చచ్చేడు. వాళ్ళతో మీ కేంపన్రా? నన్నడిగితే మీరంతా - క్లిమ్కా యేమిటి - నువ్వేమిటి, మీరంతా వట్టి... ..."

క్లిమ్‌కాతల్లి పట్టికోపిష్టి. నోటిదురుసు మనిషీను.

పావెల్ క్లిమ్‌కాయింటినుంచి సెర్గీయింటి కెళ్ళేడు. అక్కడ తన మనస్సులో భయం చెప్పేసరికి వాల్యా ఫర్వా లేదంది.

"ఎందు కంతభయం! ఏ స్నేహితుడింట్లో ఆగేడో."

భయం ఎందుకన్నదేగాని వాల్యాకీకూడా గుండెలు టువ్వుటువ్వుమంటూనే వున్నాయి.

పావెల్ ఎంతోసేపు బ్రూజక్‌ల యింటివద్ద ఆగలేదు. వాళ్ళు తిండితిని వెళ్ళమంటున్నా వినిపించుకోకుండా బయలు దేరేడు.

ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా ఇంటికే వెళ్ళేడు. తను వీధిలోకి బయలుదేరేకగాని జకరయ్ ఇంటికి వచ్చేడేమోనని మనస్సు పీకింది.

కాని తలుపుతాళం అల్లాగేవుంది. ఖాళీయింట్లో అడుగు పెట్టడానికి మనస్సు వొప్పక వాకిట్లోనే చాలసేపు దిగాలుపడి నిల్చుండిపోయేడు.

కొద్దినిముషాలు అలా నిల్చున్నవాడికి ఏం తట్టిందో చరచరా దొడ్లోకివెళ్ళి కొట్టంలో కెళ్ళేడు. అటూ యిటూ చూసి మిద్దెపైకి తన మామూలు చోటికి చేయికొన్నాడు. పాతగుడ్డ పీలికలలో దాచిన రివాల్వరు బయటికి తీసేడు.

రివాల్వరు జేబులోవుంటే ఏదో ధైర్యం అనిపించింది. హుషారుగా స్టేషన్ వేపు వెళ్ళేడు.

కాని, అక్కిన్యా జకరయ్ వార్త యేమీ తెలియ లేదు. ఇంటికి తిరిగివస్తూ దారిలో ఫారెస్టు వార్డెన్ గుమ్మం ముందు ఒక్కక్షణం నిలబడ్డాను. కాని, ఇల్లూ, వాకిలీ నిశ్శబ్దంగా వున్నాయి. మళ్ళీ ముందుకు నడిచేడు. ఇల్లూ, వాకిలీ మనుష్యసంచారం వున్నట్లు లేవు. గడ్డిగాదం పెరగంతా మొలిచి జీబురుగావుంది. అది చూస్తూంటే పావెల్ మనస్సు ఎందుకో ఖేదపడింది.

తోన్యాతో ఆఖరుమారు ఆతడు చాల గట్టిగా పేచీ పెట్టుకొని మరావేపు పోలేదు. అది జరిగి అప్పుడే నెలదాటి పోయింది. ఆ జగడంకూడా తలవని తలంపుగా తటస్థ పడింది

ఆ రోజున ఆమె అనుకోకుండానే రోడ్డుమీద తటస్థ పడింది. ఇంటికి పిలిపించింది.

అమ్మా, నాన్న బోల్షావ్‌స్కీలయింటికి ఏనోవిందుకు పోతున్నారు. ఇంటివద్ద ఒక్కర్తినీ వుండాలి. పావ్లూషా! నువ్వు రాకూడదూ? లియోనిద్ ఆంద్రియేవ్ వ్రాసిన సాష్కా ఝిగులోవ్ చదువుకుందాం. ఓమాటు చదివినా నీతోమళ్లీ చదువుతా. సరదాగా వుంటుంది. రా.”

ఆమె పెద్దకళ్ళు ఎంతోఆశతో ఆతనివేపు చూసేయి.”

“అల్లాగే.”

ఇద్దరూ ఎవరిదారిన వారు పోయేరు.

పావెల్ గబగబా మిషన్లగదిలోకి వెళ్ళేడు. ఆ రోజంతా తోన్యాతో సరదాగా గడపవచ్చుననే సంతోషంతో ఆతడు త్వరత్వరగా పనులు పూర్తిచేసేడు.

సాయంకాలం వెళ్ళి తలుపు తట్టేసరికి తోన్యా కంగారు పడుతూ తలుపు తీసింది.

"మాయింటికి పైవాళ్ళెవరో వచ్చేరు. వాళ్లు వస్తా రనుకోలేదు. రా, లోపలికి."

పావెల్ వెళ్ళిపోదామనుకున్నాడు. వెనక్కి తిరిగేడు కూడా.

కాని తోన్యా రెక్కపట్టుకొంది.

"రా, లోపలికి. వాళ్ళకి నిన్ను పరిచయంచేస్తా."

ఇద్దరూ వంటగదిదాటి ఆమె గదిలో కెళ్ళేరు.

"ఈయన నా మిత్రుడు పావెల్ కోర్చాగిన్."

— అని ఆమె అక్కడున్న ముగ్గురికీ అతనిని పరి చయంచేసింది.

వారిలో ఒకామె లిజాసుఖార్కో. ఆమె కొంచెం నలుపయినా అందమైనమనిషి. కాలేజీలో చదువుతూంది. చిన్నినోరు. అందంగా శిఖచుట్టింది. సన్నగా, పొడుగ్గావున్న ఒక యువకుడు ఆమెప్రక్కనున్నాడు. నల్లనికోటు తొడి గేడు. వాసననూనెరాసి నున్నగా తలదువ్వేడు. వారిద్దరితో వున్న విక్టర్ లెస్జిన్స్కీతో అతనికి బాగాపరిచయమే. అసలు తోన్యా తలుపుతీసేసరికి కనిపించిందికూడా అతనిముఖమే.

లెస్జిన్స్కీ తలఎత్తేడు. కోర్చాగిన్ను వెంటనే గుర్తు పట్టేడు. అతనిముఖంలో ఆశ్చర్యం ప్రతిబింబించింది.

పావెల్ కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గుమ్మంలో నిల బడ్డాడు. విక్టర్ను చూస్తూంటే వొళ్ళుఱగిలిపోతూంది.

తోన్యా గ్రహించింది. పరిస్థితులు చక్కబరచేటందుకు పావెల్‌ను లోపలికి రమ్మనిపిలిచి లిజాను పరిచయంచేసింది.

అంతవరకూ ఆకొత్తవానివంక ఆసక్తితో చూస్తున్న లిజా కుర్చీలోంచి లేచింది.

కాని, పావెల్ అదేం గమనించలేదు. గిరుక్కున తిరిగేడు. వీధిగుమ్మంలో తోన్యా అతనిని అందుకొని రెక్క పట్టుకొని నిలేసింది.

"ఎందుకు పారిపోతున్నావు? నిన్ను చూపిద్దామని నే ననుకొంటూంటే... ..."

పావెల్ ఆమెచెయ్యి విదిలించుకొని కసిరికొట్టేడు. "ఆ చవటముందు నన్నుప్రదర్శించ నక్కర్లేదు. నీ కిష్టమైతే కావచ్చుకాని, ఆ మూకఅంటే నాకసహ్యం. వాళ్ళతో నాకు పొత్తుకుదరదు. నీ స్నేహితులు వీళ్ళని ఎరిగివుంటే అసలు వచ్చేవాడినేకాదు."

తోన్యాకు చాలకోపం వచ్చింది. కాని ఆపుకొంది.

"ఏమిటామాట? నీ స్నేహితులెవరనికాని, మీాఇంటి కెవరొస్తుంటారనిగాని నే నెప్పుడేనా అడిగేనా?"

"నువ్వెవరినిచూసినా నాకేం బాధలేదు. ఇకమాత్రం ఈ యింట్లో అడుగుపెట్టను."

ఆమాటలనేసి పావెల్ చరాచరా వెళ్ళిపోయేడు.

అటుతర్వాత తోన్యా మరికనబడలేదు. తర్వాత పోగ్రామ్ ప్రారంభమైంది. యూదుకుటుంబాల్ని దాచడం,

దాటించడం హడావిడిలో ఆతడా పేచీ సంగతే మరిచి పోయేడు. ఈ వేళ హఠాత్తుగా ఆమెను చూడాలనిపించింది.

జకరయ్ కనిపించకుండా పోవడమూ, ఇంటివద్ద ఎవరూ లేకపోవడమూ పావెల్ కు ఎంతో బాధగావుంది. ఇంటికి పోవాలనిపించ లేదు. ఎదురుగా ఎంతో దూరంవరకు సన్నగా రోడ్డు కనిపిస్తూంది. రోడ్డంతా గతుకులూ, గోతులూ. ఎండల్లో కరిగిన మంచునీటిబురద ఇంకా ఆర లేదు. ఎదురుగా దూరాన కూలిపోతూ, కూలిపోతున్న ఓ యింటిగోడ వెనకరోడ్డు పక్కకుతిరిగి కనుమరుగయింది.

* * *

ఒకరోడ్డు కూడలిలో విక్టర్ లెస్జిన్స్కీ లిజాతో మాట్లాడుతున్నాడు. వారున్నచోటికి ఎదురుగా విరిగిపోయిన ఓ పెట్టెకొట్టు వుంది. దానికి "ఖనిజోదకం" అని వ్రాసిన బోర్డు తల్లక్రిందులుగా వ్రేలాడుతూంది.

ఆమెచేయి పట్టుకొని విక్టర్ ఎంతో వినయంగా ప్రార్థిస్తున్నాడు.

"వస్తావుకాదూ ? మోసం చెయ్యకూడదుసుమా ?"

లిజా కళ్లెగరేస్తూ అలాగేనంది.

"తప్పకుండావస్తా. కాని నేవచ్చేదాకా ఆగాలి సుమా ?"

వెళ్ళేటప్పుడు లిజా ఆశాభరితములైన చూపులతో ఆతనివంక తిరిగితిరిగి చూసింది.

కొద్దిఅడుగులు వేసేక ఎవరో ఇద్దరు వీథిమలుపుతిరిగి రోడ్డుమీాదికిరావడం చూసింది. వాళ్ళు తనకెదురుగా వస్తు న్నారు. ముందువస్తున్న అతడు పనివాళ్ళదుస్తులు వేసు కొన్నాడు. విశాలమయిన వక్షస్థలం అతడు చాలా బలవంతు డని చెప్తూంది. తలమీాద నల్లనిటోపీ మొగంమీాదికంటా దిగలాగుకొని వుంది. కంటికింద ఏదో దెబ్బతగిలి నల్లగా కమిలిపోయి వుంది.

అతడు ఝుమాయించి వూగుతూ నడుస్తున్నాడు.

అతని వెనక మూడడుగులలో పెట్లూారా సైనికు డొకడు బైనెట్‌ను ముందువాని వీపునానించినట్లు పట్టుకొని నడుస్తున్నాడు. సైనికుడి మొలదట్టీ కిరువేపులా తూటా సంచులు వ్రేలాడుతున్నాయి. వాని కోటు బూడిదరంగులో వుంది. నెత్తిమీాద గొర్రెబొచ్చుటోపీ వుంది. వానిక్రింద నుంచి రెండు చిన్నకళ్ళు ముందునడుస్తున్న వాని మెడ మీాదనే వున్నాయి. అతని మీాసాలు పొగాకు కసరుతో పసుపుపచ్చగా వున్నాయి.

లీజా నడకవేగం తగ్గించి రోడ్డు అవలివేపు నడి చింది. ఆ సమయంలోనే వెనకవేపున పావెల్ రోడ్డుమీాద కనబడ్డాడు.

శిథిలగృహందాటి రోడ్డు మలుపు తిరగ్గానే పావెల్ కూడా వాళ్ళని చూసేడు. ఉలికిపడి నిలబడిపోయేడు. వస్తున్నవాళ్ళల్లో ముందున్న జకరయ్‌ని గుర్తుపట్టేడు.

“ఇదా కారణం!”

జకరయ్ సమీపించేడు. పావెల్ ఆవేశంతో తబ్బిబ్బు అవుతున్నాడు. ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. క్షణం నిలబడి ఆలోచించడానికక్కడా వ్యవధి లేదు. ఒక్కటే సత్యం కనబడుతూంది. జకరయ్ పని అయిపోయింది.

ఆ ఆలోచనతో స్తంభించినట్లయి పావెల్ నిలబడి పోయేడు. ఇప్పుడేం చెయ్యాలి ?

ఆఖరు నిముషంలో ఆతడికి తన జేబులో పిస్తోలు సంగతి జ్ఞాపకంవచ్చింది. తననుదాటగానే సైనికుణ్ణి రివాల్వరుతో కాల్చెయ్యాలనుకొన్నాడు. జకరయ్ దాటిపోవచ్చును.

ఆ ఆలోచనతట్టగానే పావెల్ మనస్సు కుదుటపడింది. గడిచినరోజునే ఫియోడోర్ ఓ మాట అన్నాడు.

"ఆపనికి దిట్టమైనవాళ్ళు కావాలి..."

ఆమాట జ్ఞాపకం వచ్చింది. చటుక్కున తిరిగిచూసేడు. పట్టణంలోకి పోయేరోడ్డు నిర్మానుష్యంగావుంది. ఒక ప్రాణి కూడా కనబడలేదు. ఎదుట ఒక ఆడుది రోడ్డెపోతూండడం గమనించేడు. ఆమె అడ్డురాలేదు. కూడలిలో చీలిన రోడ్డు మీద ఎవరన్నావున్నారేమో ఆతనికి కనబడడంలేదు. చాలాదూరాన స్టేషన్ సమీపంలో ఎవరో కొద్దిమంది కని పిస్తున్నారు.

పావెల్ రోడ్డుప్రక్కకు తప్పుకొన్నాడు. కొద్ది గజాల దూరంలోవుండగా జకరయ్ ఆతనిని చూసేడు.

అప్రత్యాశితంగా పావెల్ కనిపించడంతో జకరయ్ అడుగు నెమ్మదిగా పడింది. సన్నీ వీపులో గుచ్చుకొంది.

"జాగ్రత్త. సరిగ్గా నడవకపోతివా వీపుమీద తుపాకీ మడమ నాట్యం చేస్తుంది."—అంటూ ఆ సైనికుడు కీచు గొంతుకతో అరిచేడు.

జకరయ్ అడుగు వేగంగా పడింది. పావెల్‌తో ఏదో చెప్పాలనుకొన్నాడు. కాని, ఏమిటాలోచించాడో ఆగేడు. చెయ్యి మాత్రం వూపేడు.

పసుపురంగు మీసాలూవాడూ ఆ సైనికుడు తనవేపు శ్రద్ధచూపకుండేటందుకు జకరయ్ దగ్గిరికి వచ్చినప్పుడు పావెల్ వెనక్కి తిరిగేడు. ఆ జరుగుతున్నదానితో తనకేమీ సంబంధంలేకపోయినా. కాని ఏదో భయం మనస్సును పీడిస్తూనే వుంది.

"గురితప్పి జకరయ్‌కి తగిలితే..."

కాని ఆ సైనికుడు పక్కకు వచ్చేసేడు. ఇంకా ఆలోచించేటందుకేనా వ్యవధిలేదు.

సైనికుడు పక్కకు వచ్చేసేడు. పావెల్ ఒక గంతు వేసి వానిచేతిలోని తుపాకీ పట్టుకొని నేలవేపు నొక్కేసేడు.

సన్నీ క్రిందనున్న రాతికి తగిలి ఖంగుమంది.

సైనికుడు ఒక్కక్షణం నిర్ఘాంతపడిపోయేడు.

అంతలో తేరుకొని తుపాకీ లాక్కోబోయేడు. పావెల్ తన బలంఅంతా వుపయోగించి పట్టువిడవకుండా వ్రేలాడేడు. ఆ గుంజులాటలో తుపాకి పేలింది. గుండు నేలనున్న రాతికి తగిలి తూలి పక్కనున్న గోతిలో పడింది.

కాల్పుచప్పుడు వినబడగానే జకరయ్ పక్కకుగంతేడు. గిరుక్కున తిరిగేడు. పావెల్ చేతిలోంచి తుపాకీ లాక్కునే

టందుకు పెట్లూరా సైనికుడు మహా పెనుగులాడుతున్నాడు. చేతులు మెలిపడి బాధగావున్నా పావెల్ వదలడంలేదు. కోపంవచ్చి ఆ సైనికుడు ఆతాని క్రిందపడతోసేడు. క్రింద పడ్డా ఆతడు తుపాకీ వదలనేలేదు. పైగా అతనితోపాటు సైనికుడుకూడా క్రిందపడ్డాడు.

రెండక్షణాల్లో జకరయ్ వచ్చిపడ్డాడు. వస్తూనే ఊతం తీసుకొని సైనికుడి గూబమీద ఒక్కగుద్దు గుద్దేడు. ఎముకలు పటపటలాడేయి. మరుక్షణంలో మరోదెబ్బ. ఇంకొకటి. పెట్లూరా సైనికుడి శరీరం జానకారిపోయి ప్రక్కనున్న గోతిలో పడిపోయింది.

జకరయ్ పావెల్‌ను లేవదీసి నిలోచ్బెట్టేడు.

* * *

మనునాడు పాతఫ్యాక్టరీవద్ద లిజా తనను కలుసుకొనేటందుకు వాగ్దానంచేసిందన్న హుషారులో విక్టర్ ఈలపాట పాడుకుంటూ ప్రక్కరోడ్డునపడి ఓ వందగజాలుదూరం వెళ్ళేలోపుగనే ఇదంతా జరిగిపోయింది.

లిజాసుఖార్కో ప్రేమకలాపాలు సాగించడంలో అఖండ ప్రజ్ఞావంతురాలని కాలేజీలోని సరస యువపుంగవులలో ప్రఖ్యాతివుంది. సెమ్యాక్ జలివానోవ్ ఓమారు తానామె పక్కలో చేరేనని చెప్పేడు. కాని, సెమ్యాన్ కోతలరాయడు. ఆసంగతి ఎరిగిన విక్టర్ ఆమాట నమ్మలేదు. కాని, ఆనాటి నుంచీ వాళ్ళసంబంధం మనస్సులో మెదులుతూనేవుంది. ఆ మాట నిజమో, అబద్ధమో రేపు తేలిపోతుంది అనుకొన్నాడు.

"వచ్చింపం లే వదిలిపెట్టకు. ఏదేమైనా ముద్దుపెట్టుకోనిస్తుంది. సెమ్యూన్ చెప్పిందే నిజమైతే..."

ఆ దారినే వస్తున్న ఇద్దరు పెట్లూరా సైనికులు ఆతనికి ఎదురయ్యారు. వాళ్ళల్లో ఒకడు గుర్రంమీద కాళ్ళు ఒక వేపుకే వేసి గోడమీద కూర్చున్నట్లు కూర్చున్నాడు. వాని చేతిలో తోలుబకెట్ ఒకటుంది. బహుశా గుర్రానికి నీరు పెట్టడానికి పోతూండి వుంటాడు. రెండోవాడు గుర్రం ప్రక్కనే నడుస్తున్నాడు. పొట్టిచొక్కా, వదులు లాగూను. ఒకచేయి గుర్రంమీదవున్నవాని మోకాలిమీద వేసి ఏదో చెప్తున్నాడు.

విక్టర్ వాళ్ళు వస్తూంటే దారితొలిగి ప్రక్కకు నిలబడ్డాడు. దాటిపోగానే మళ్ళీదారిలోకి తిరిగేడు. ఇంతలో పెద్దరోడ్డుమీద తుపాకీ కాల్చిన చప్పుడు వినిపించింది. నిలబడి వెనుతిరిగేడు. అప్పుడే గుర్రంమీదున్నవాడు ఆ ధ్వని వినవచ్చినవేపు గుర్రాన్ని అదిలించేడు. రెండోవాడు కత్తి సవరించుకొని పరుగెత్తుతున్నాడు.

విక్టర్కూడా వాళ్ళవెనకాలనే పరుగెత్తేడు. అతడు పెద్దరోడ్డుకు తిరిగేసరికి మరోకాల్పు చప్పుడు. గుర్రం వెర్రిగా ఉరకలు వేసుకొంటూ వస్తూంది. రౌతు రికాబులతో పొట్టలోతన్ని దాని నింకా పరుగెత్తమంటున్నాడు. వచ్చి వచ్చి దగ్గరలోవున్న ఇంటిగుమ్మంలో గుర్రాన్ని నిలిపేడు.

"లేవండి. మనవాణ్ణి ఒకణ్ణి చంపేసేరు."

మరుక్షణంలో ఆ యింట్లోంచి బిలబిలలాడుతూ పది మంది బయటకు పరుగెత్తివచ్చేరు. వస్తూండగానే తుపాకీ బోల్టులు టకటకమన్నాయి.

నిక్టర్‌ను అరెస్టుచేసేరు.

చాలమంది రోడ్డుమీద నిలబడ్డారు. వారిలో విక్టరూ, లిజాకూడావున్నారు. సాక్ష్యంకోసం ఇద్దర్నీ ఆపేరు.

మొదటనే లిజా భయంతో కొయ్యబారి నిలబడి పోయిందేమో జకరయ్‌నూ, కోర్చాగిన్‌నూ చూడగలిగింది. వారామె ప్రక్కనుంచే పరుగెత్తేరు. తోన్యా ఆరోజున తమకు పరిచయంచేసినవాడు ఈతడేనని గుర్తించిందికూడా. ఆమె ఆశ్చర్యపడింది.

వాళ్ళిద్దరూ ఆమె ప్రక్కనేవున్న కంచెదాటి తోటలో పడ్డారు. మరుక్షణంలో గుర్రపురౌతు వచ్చేసేడు. తోటలో పరుగెత్తుతున్న జకరయ్ చేతులో తుపాకీ కనబడింది. ప్రక్క గోతిలోపడ్డ తోడిసైనికుడు తూలిపోతూ వొళ్ళు దులుపుకొని పైకివస్తున్నాడు. పరిస్థితుల్ని గమనించి రౌతు తన గుర్రాన్ని కోరడివేపు తిప్పేడు.

జకరయ్ ఆగేడు. గిరుక్కున తిరిగి, శాంతంగా తుపాకీఎత్తి కాల్చేడు. దానితో రౌతు హడలిపోయి గుర్రాన్ని తిప్పి వుడాయించేడు.

పిడిగుద్దులకి పళ్ళు కదిలిపోయి, పెదవులు వాచిపోయి వున్న సైనికుడినోట మాటకూడా సరిగ్గా రావడంలేదు.

మొద్దుపీనుగా! ఖైదీని చెయ్యిజారిపోనిచ్చేవు. నీకు ఇరవయ్యయిదు బెత్తందెబ్బలు శిక్ష."—అన్నాడొకడు.

మహా మొనగాడివి. చేతిలోంచి జారిపోయేడుట. ఆ క్షుద్రలంజకొడుకు మీదపడతాడనిగాని కలగన్నానా?

లిజాను చాలా ప్రశ్నలు వేశారు. ఎస్కార్టు సైనికుడు చెప్పినవే ఆమెకూడా వర్ణించింది. కాని; ఆ క్షుద్రవాడెవరో ఆమె ఎరిగినా చెప్పలేదు. ఎరుగుదు ననలేదు. అయినా బంట్రోతులు వాళ్ళని వదలలేదు. తీసుకుపోయి సేనాధిపతి ఎదుట పెట్టేరు. ప్రశ్నలువేసి విసిగించి విసిగించి సాయంకాలం వదిలేరు.

లిజాను దిగబెట్టడానికై విక్టర్ వెంటవచ్చేడు.

కమాండెంటు ఆఫీసునుంచి స్టేషనుకి చాలాదూరం. ఇంతదూరం ఇద్దరూ చెట్టాపట్టాలు వేసుకొని నడిచేరు. ఇటువంటి సదవకాశం లభింపచేసిన ఆ ఘటనకు విక్టరు అభివాదనలు తెలిపేడు.

తన ఇంటిచాయలకు వచ్చేకగాని లిజా కోర్చాగిన్ను తాను గుర్తుపట్టినమాట చెప్పనేలేదు.

"ఖైదీని విడిపించిన దెవరో తెలుసా?"

"నాకెల్లా తెలుస్తుంది?"

"ఓ రోజున సాయంకాలం తోన్యా ఓ పడుచువాడిని మనకు పరిచయం చేయబోయింది, జ్ఞాపకం వుందా?"

విక్టర్ నిలబడిపోయేడు.

"పావెల్ కోర్చాగిన్?"

"అతడే. కోర్చాగిన్ అని చెప్పినట్లేగుర్తు. ఆ రోజున ఎల్లా పరుగెత్తేడో చూచేవుగా. అతడే."

విక్టర్నోట మాటరాలేదు.

"నీకు నమ్మకంగా తెలుసా?"

"అహా! ఆ ముఖం బాగా గుర్తే నాకు."

"అయితే కమాండెంటుకు ఎందుకు చెప్పేవుకావు?"

లిజాకు అసహ్యం వేసింది.

"అల్లాంటి వెధవపని చేస్తానా?"

"వెధవపని? ఆ సైనికుడిమీద పడ్డదెవరో చెప్పడం వెధవ పనా?

"కాక, మర్యాద పనుకొంటున్నావా? వాళ్ళు చేస్తున్నదేమి ఘనకార్యమో మరచిపోయినట్లున్నావే. కాలేజీలో ఎంతమంది యూదు అనాథులుచేరేరు. తెలియదా? ఇంకా కోర్చాగిన్ విషయం వాళ్ళకి చెప్పకేం? చాల్చాలు. ఇల్లాంటివాడి పనుకోలేదు."

లిజా సమాధానం లెస్జిన్స్కీ-కి చాల ఆశ్చర్యం కలిగించింది. కాని, ఆమెతో పేచీపెట్టుకొంటే రేపటికి తాను వేసుకొన్న పథకంకాస్తా బెడిసిపోతుంది. కనక విషయం మార్చేడు.

"కోపంవద్దు, లిజా! హాస్యానికంటే అంతకోపమా?"

"ఈ హాస్యం నాకు నచ్చలేదుసుమా!"—అంది ఆమె కట్టె విరిచినట్లు.

సుఖారోక్-ల యింటిదాకావచ్చి విక్టర్ వెనుతిరిగేడు.

"లిజా! వస్తావుకదూ!"

"ఏమో, చూద్దాం."

ఇంటికిపోతూ విక్టర్ ఆలోచన సాగించేడు.

"నీకది వెధవపనిగాతోస్తే తోచవచ్చునే బంగారు తల్లీ! కాని నాకదేం వెధవపనికాదు. ఎవరు ఎవరిని విడిపించినా నాకేం సంబంధం లేదనుకో."

లెన్‌జిన్‌స్కీలు ప్రాచీన పోలిష్‌కులీన కుటుంబీకులు. వారికి యుద్ధంలోని ఇరుపక్షాలమీదా సమానమైన అసహ్యాభావమేవుంది. వాళ్ళు మన్నించేదల్లా పోలిష్‌కులీన ప్రభుత్వాన్నిమాత్రమే. పోలిష్‌సేనలూ, దానితోపాటు 'రెజ్ పోస్పోలిటా'*త్వరలోనే వస్తాయని వాళ్ళవిశ్వాసం. అయినా కోర్చాగిన్‌గాడి పీడవదుల్చుకొనేటందు కిదో దారి అనిపించింది.

"మెడలు విరిచేస్తారు"

లెన్‌జిన్‌స్కీల కుటుంబంలో విక్టర్ ఒక్కడే పట్టణంలో దిగబడ్డాడు. పంచదార ఫ్యాక్టరీ అసిస్టెంటు మేనేజరు భార్య అతని పినతల్లి. ఆయన కుటుంబంవాళ్ళంతా ఇప్పుడు వార్సాలోనే వుంటున్నారు. ఆయన తండ్రి సిగిస్మండ్ లెన్‌జిన్‌స్కీ వార్సాలో ఒక ప్రముఖవ్యక్తి.

విక్టర్ సరాసరి కమాండెంటు ఆఫీసులో కెళ్ళేడు.

మరో కొద్దిసేపట్లో నలుగురు పెట్లూరా సైనికుల్ని వెంటబెట్టుకొని విక్టర్ కోర్చాగిన్‌ల ఇంటివేపు బయలుదేరేడు.

దూరంనుంచే ఆ ఇంటివేపు చూపించేడు.

"ఆ దీపంవెలుతురు కనిపిస్తూందే కిటికీ. అదే ఇల్లు. మరి నే వెళ్ళనా?"

---

* పోలిష్ కులీన కుటుంబాల ప్రభుత్వానికి పేరు.

"వెళ్లు, మిగిలింది మేం చూసుకొంటాం. మంచి సాయం చేసేవు."

విక్టర్ చరచరా వెళ్ళిపోయేడు.

*　　*　　*

ఒక్క గుద్దుగుద్ది తోసేసేసరికి పావెల్ లుంగచుట్టుకొని ఆ చీకటిగదిలో పడిపోయేడు. దెబ్బను కాచుకొనేటందుకు చాచినచేతులకు గదిగోడలు తగిలేయి. చుట్టువారా తడి మేకు. ఒక మంచంలాంటిది తగిలింది. మాట్లాడక దాని మీద చదికిలబడ్డాడు. వొళ్ళంతా దెబ్బలకి హూనం అయిపోయి సలుపుతూంది.

తనను అరెస్టుచేసేరంటే ఆతనికెంతో ఆశ్చర్యంగా వుంది. తననుగురించి వాళ్ళకి ఎల్లా తెలిసిందో. తననెవ్వరూ చూడలేదే. తననేంచేస్తారోమరి. జకరయ్ ఎక్కడున్నాడు?

పావెల్ ఆతనిని క్లిమ్కాయింటివద్ద దిగబెట్టేడు. అక్కడ నుంచి తాను సెర్జీయింటికెళ్ళేడు. జకరయ్ చీకటిపడేవరకూ క్లిమ్కావాళ్ళ యింటిదగ్గరేవుండి, చీకటిపడగానే పట్టణం నుంచి తప్పించుకొనిపోతాడు.

"రివాల్వరు దాచేసేను. మంచిపనే చేసేను."—అనుకొన్నాడు.

అదే నాదగ్గర దొరికిందంటే ఈపాటికే చంపేద్దురు. కాని, అసలు నాసంగతి వాళ్ళకెల్లా తెలిసిందోమరి!"

కాని, ఎంత ఆలోచించినా ఆ ప్రశ్నకిమాత్రం సమాధానం దొరకడంలేదు.

పెట్లూరా సైనికులు కోర్చాగిన్‌ల యిల్లు మూలమూలల అంతటా తిరగేసి వెతికేరు. కాని, వాళ్ళకేం దొరకలేదు. ఆర్త్రెమ్ తనబట్టలూ, పాతలూ, సంగీతంపెట్టె తానున్న చోటికి తీసుకుపోయేడు. ఉన్న ఒక్క ట్రంకూ ముసలమ్మ కూతురుగా ఇంటికి పట్టుకుపోయింది. ఇంట్లో వాళ్ళకేం దొరకలేదు.

గార్డుహౌసుకు తీసుకెడుతూ వాళ్ళుకొట్టిన దెబ్బల్ని పావెల్ మరచిపోలేదు. కటికచీకటి. ఆకాశం మబ్బుమబ్బుగా వుంది. నాలుగుమూలలనుంచీ ఓ వరసన తన్ని కొడుతూంటే పడుతూ, లేస్తూ ఎటు వెడుతున్నదీకూడా తెలియకుండానే నడిచేడు.

పక్కగదిలోంచి మాటలు వినిపిస్తున్నాయి. దానిలో కమాండెంటు గార్డువుంది. తలుపుక్రిందినుంచి సన్నని కాంతి రేఖ కనబడుతూంది. పావెల్ నెమ్మదిగాలేచి తడుముకుంటూ గది అంతా కలయతిరిగేడు. తన కెదురుగావున్న గోడ దగ్గిర మరోమంచంవుంది. దానికిపైన కిటికీ ఒకటి ఊచలు బిగించినది వుంది. అవేమన్నా కదులుతాయేమోనని ప్రయత్నించి చూసేడు. కాని లాభంలేకపోయింది. దానిని వెనకటి రోజుల్లో కొట్టుగదిగా వుపయోగించేరు.

గుమ్మందగ్గర కెళ్ళి ఒక్కనిముషం వింటూ నిల్చున్నాడు. నెమ్మదిగా లాగబోయేడు. కిర్రుమంది. పావెల్ దానిని మనస్సులోనే తిట్టుకున్నాడు.

తలుపు సందులోంచిచూస్తే ఎదురుగా ఓ మంచం మీద బీటలువారిన రెండు పాదాలు కనిపించేయి. ఇంకో

మారు తలుపు గెంటేడు. ఈమారు కిర్రు మరింత ఎక్కు వయింది. వెంటనే నిద్రమొహం ఒకటి మంచంమీద కదిలింది. పేలుపట్టిన దుబ్బుతలను బరుక్కుంటూ వాడు బూతులకు లంకించుకొన్నాడు. తిట్టడం పూర్తిఅయ్యేక మంచం పక్కనే గోడకు చేరబెట్టిన రైఫిల్ అందుకొన్నాడు.

"ముయ్యి తలుపు. ఈమారు మళ్ళీ తలుపు దగ్గర కనిపించేవంటే నీ బుర్ర పేలగొట్టేస్తా."

పావెల్ తలుపుమూసేడు. పక్కగదిలో పకపకలూ వికవికలూ వినిపించేయి.

ఆ రాత్రంతా ఆతడు ఆలోచిస్తూనే వున్నాడు. పోరాటంలో తానూ కలుగజేసుకోవాలనుకొని చేసిన మొదటి ప్రయత్నంలోనే చేతులు కాలేయి. బోనులో ఎలకలా పట్టుబడి పోయాడు.

ఆ ఆలోచనల్లోనే నిద్రముగత వచ్చింది. ముసలితల్లి కళ్ళఎదుట కనిపించింది.

"ఆవిడ వూళ్ళోలేకపోవడం మంచిదయింది."—అనుకొన్నాడు.

కిటికీసెడ గదిలో నేలని కనబడింది.

క్రమంగా చీకట్లు పల్చనైనాయి. అరుణోదయమయింది.

# ప్రకరణం 6

ఆ పెద్దయింటికంతకూ ఒక్క కిటికీపద్దమాత్రమే వెలుతురు కనిపిస్తోంది. దానికూడా తెరలు దిగవేసేవున్నాయి. బయటి సముద్రంలో కట్టేసిన పక్క ట్రెసోర్ దిక్కులు ప్రతిధ్వనించేలాగ గంయ్యమంది.

తోన్యాకు నిద్రమగతలోనే తల్లి మాటలు వినిపించేయి.

"ఇంక నిద్రపోలేను. రా, లిజా."

గాలిలో తేలివస్తున్నట్లు నడకా, వెచ్చని ఆశ్లేషమూతో తోన్యా మగత వదిలిపోయింది.

చిరునవ్వుతో ఆహ్వానించింది.

"లిజా, వచ్చేవు చాల మంచిపని. నాన్నగారికి ప్రమాదం తప్పినట్లే. ప్రస్తుతం నిద్రపోతున్నారు. ఇన్నాళ్ళకీ రోజునే అన్నయ్యా, నేనూ కాస్త కన్ను మూసేం. చెప్పు. ఊళ్ళోసంగతులు."—అంటూ ఆమెను తన ప్రక్కలో కూర్చుండబెట్టుకొంది.

"సంగతులకేం బోలెడన్ని వున్నాయి. కాని నెమ్మది మీద చెప్తాగా."

లిజా చిరునవ్వు నవ్వుతూ యెకటారినా మిహైలోవ్నా వేపు కన్ను ఎగరేసింది.

తోన్యాతల్లి నవ్వింది. ఆమె పెద్ద అందగత్తెగాక పోయినా మంచిచురుకైనది హృదయం మంచిది. వయస్సు ముప్ఫయ్యేరు దాటినా పసుపుదనపు ప్రథమదశలో వున్నట్లు కనబడుతుంది.

"కొంతసేపు వెళ్ళిపోతానుగాని, నా చెవుల్ని పడ దగిన వార్తలేమీ లేవటే."—అంటూ ఆమె హాస్యమా డుతూ ఓ కుర్చీ లాక్కుని కూర్చుంది.

"ఇక్కడికి మా చదువులు పూర్తిఅయినట్లే. అవో విశేషం. ఏడోతరగతి వాళ్ళందరికీ సర్టిఫికెట్లు ఇవ్వాలని బోర్డువాళ్ళు నిర్ణయించేరు. ప్రతికేను. ఆ దిక్కుమాలిన జామిట్రీ, ఆల్జిబ్రా పేరుచెప్తే అసహ్యంవేస్తోంది. వాటి వలన ఎవరికేంలాభమో? ఏమిటో. ఇల్లా యుద్ధాలు జరుగు తూంటే చదువులేం సాగుతవోగాని మగపిల్లలు ముందుకు చదువుతామనే అంటారు... ఇంక మా మాటా. పెళ్ళిళ్ళ య్యేక ఈ ఆల్జిబ్రా ఎవడిక్కావాలి?"—అంటూ లిజా ఓ నవ్వు నవ్వింది.

కొంతసేపు వాళ్ళతో కబుర్లుచెప్పి యెకటారినామి హైలోవ్నా తనగదికి వెళ్ళిపోయింది.

లిజా తోన్యాకు దగ్గరగా జరిగి, ఆమెమీదకు వ్రాలి సన్నగా రోడ్డుమీద జరిగిన ఘటనలన్నీ చెప్పింది.

"తోనెచ్కా! ఆ పరుగెత్తిపోయినవా డెవరో చూసే సరికి బిత్తరపోయేననుకో."

తోన్యా ఎంతో ఆసక్తితో ఆమె చెప్పిన కథనంతా విని తల కదిపింది.

"క్రోర్యాగిన్."

తోన్యా వులికిపడింది.

"క్రోర్యాగినా?"

తోన్యాలో ఆసక్తి కలిగించగలిగినందుకు లిజాకు ఎంతో హుషారు కలిగింది. విక్టర్‌కూ తనకూ నడిచిన వాగ్వాదం సాభినయంగా వర్ణించింది.

ఆ మాటలువింటూ తోన్యా నిశ్చేష్టురాలయిపోయింది. కాని మాటలధోరణిలో లిజా ఆసంగతిని గమనించనేలేదు.

త్రాగుబోతు ఖోరుంజూకథను తోన్యా వినిపించుకోనేలేదు. ఆమె మనస్సులో ఒకే ఆలోచన బాధిస్తూంది.

"పెట్లూరాసైనికుడిమీద పడ్డదెవరో విక్టర్ లెన్‌జిన్‌స్కీకి తెలిసింది. అయ్యయ్యో! లిజా ఎందుకుచెప్పింది?"

ఆ భావమే అనుకోకుండా బయటపడింది.

"ఎందుకు చెప్పేవు?"

లిజాకు ఆప్రశ్న అర్థంకాలేదు.

"పావ్‌లూషాని గురించి లెన్‌జిన్‌స్కీకి ఎందుకు చెప్పేవే... అతడు పోలీసులకి చెప్పేస్తాడు..."

"చెప్పడే. అల్లాంటి పని చేస్తాడనుకోను. అతడికేం పట్టిందేం!"

తోన్యా ఆవేశంతో మంచంమీద కూర్చుంది.

"నీకుతెలియదే లిజా? వాళ్ళిద్దరికీ పడదు. పైగా... పావ్లూషానుగురించి విక్టర్‌కిచెప్పి చాలా పొరపాటుచేసేవు."

ఇప్పుడుగాని తోన్యా ఆందోళన లిజాకు అర్థంకా లేదు. పావ్లూషా అంటూ ఆ పేరు రెట్టించడంతో ఆమె కది వరలో ఛాయామాత్రంగావున్న అనుమానం స్థిరపడింది.

పొరపాటుచేసే నని విచారపడింది. చాలసేపు మౌనంగా కూర్చుండిపోయింది. తోన్యా మనస్సులో ప్రేమఛాయలు వ్యాపించడం ఆశ్చర్యం కలిగించింది.

"ఒక మామూలు కూలికుర్రవాడిమీద తోన్యాకి ప్రేమ."

వివరాలు అడుగుదా మనుకొంది. కాని సమయం కాదని వూరుకొంది. తన పొరపాటుకు క్షమించమన్నట్లు ఆమె చేతులు పట్టుకొంది.

"విచారించకు, తోన్యా."

"లేదు. నా ఆలోచన పొరపాటేమో. విక్టర్ అలాంటివాడు కాకపోవచ్చునేమోలే."

ఇంతలో డెమియానోవ్ అనేవాళ్ళ తరగతి పడుచువా డొకడు రావడంతో ఆ ప్రసంగం అక్కడితో ఆగిపోయింది.

స్నేహితులు వెళ్ళిపోయేక, వారిని సాగనంపుతూ తోన్యా చాలసేపటివరకూ కోరడిగుమ్మంలోనే నిలబడింది. చల్లనిగాలి మొగాన్ని కొడుతున్నా ఆమెకదలలేదు. దూరాన పట్టణంలోని యిళ్ళల్లో దీపాలు ఎర్రగా మినుకు మినుకు మంటున్నాయి. తనవా డొకడు ఆ యిళ్ళల్లో దేంట్లోనో వున్నాడు. రానున్న ప్రమాదంకూడా ఆతనికి తెలియదు.

ఆతడికి తాను జ్ఞాపకంవుందో లేదో. క్రితం పర్యాయం కనిపించి ఎన్నోరోజులయింది. అనా డాతడిదే తప్పు. అయితే

ఏదో జరిగిపోయింది. రేపేనా వెళ్ళి చూసిరావాలి. స్నేహం కలుపుకోవాలి. తమకు స్నేహం మళ్ళీ కలుస్తుందనే విషయంలో ఆమెకేమాత్రం సందేహంలేదు. ఆ రాత్రి గడిచిపోతే... కాని ఆ రాత్రే ఎన్నోగండాలు గడవాలిసుంటుంది.

ఆ రాత్రి తెల్లవార్లూ ఒక్కటేమాట మనస్సులో మెదులుతూంది.

"రాత్రి గడుస్తే..."

ఇంట్లో ఎవ్వరూ లేవకపూర్వమే తెల్లవారకుండానే తోన్యా లేచింది. పక్కవాళ్ళకు తెలివిరాకుండా నెమ్మదిగా చప్పుడుచేయకుండా వాకిట్లోకి వచ్చింది. త్రెసోర్‌ని విప్పి వెంటతీసుకుని పట్టణంలోకి బయలుదేరింది.

కోర్చాగిన్‌ల ఇంటిసమ్మాంలో కొచ్చి ఓ నిముషం తటపటాయించింది. మళ్ళీ మనస్సు స్థిరపరచుకొని గేట్ తీసింది. త్రెసోర్ తోక ఆడిస్తూ ముందు నడిచింది......

ఆనాడే సాయంకాలంవేళ ఆర్టెమ్ ఇంటికొచ్చేడు. అతడు పనిచేస్తున్న కమ్మరి పట్టణంలోకి వస్తూంటే అతడి బండిలో తానూ వచ్చేడు. గుమ్మంలో బండిదిగి కూడా తెచ్చిన పిండిబస్తా భుజాని కెత్తుకున్నాడు. అతని మిగతా సామాన్లు తీసుకొని కమ్మరివచ్చేడు. ఇంటి తలుపులు బార్లా తెరచివున్నాయి. ఆర్టెమ్ అరుగుమీద గుమ్మం పక్కన బస్తా దించుకొని తమ్ముణ్ణి పిలిచేడు.

"పావ్కా."

సమాధానంలేదు.

"ఏమయింది? ఇంట్లోకి వెళ్ళవేం?"-అన్నాడు, వెనక నుంచి కమ్మరి.

ఇద్దరూ లోనికి నడిచేరు. తన సామానులన్నీ వం టింట్లో పడేసి ఆర్టెమ్ పక్కగదిలోకి వెళ్ళేడు. గదిలో సామా నంతా చిందరవందరగా పడుంది. ఇల్లంతా పాతబట్టలు చెల్లాచెదురుగా పడివున్నాయి. ఆ దృశ్యంచూసి ఆర్టెమ్ స్తంభించిపోయేడు.

ఏమీా అర్థంకాలేదు.

"ఏమిటిదంతా?"

"అంతా తల్లక్రిందులు చేసివుంచే."-అన్నాడు కమ్మరి.

"ఎక్కడికి పోయేడో వీడు"—అన్నాడు ఆర్టెమ్.

కాని, ఆతనికి సమాధానం ఇచ్చేటందుకు కక్కడ ఎవ్వరూ లేరు.

కమ్మరి పోతానని వెళ్ళిపోయేడు.

ఆర్టెమ్ పెరట్లోకివెళ్ళి చుట్టూతిరిగి చూసేడు.

"వీడేమైనాడబ్బా! తలుపులుబార్లా తెరచి పోయేడు."

ఇంతలో అడుగులచప్పుడు వినబడి వెనకతిరిగిచూసేడు. ఎదురుగా పెద్దకుక్క. దానివెనక ఓపడుచు.

ఆమె ఆర్టెమ్‌ను చూస్తూనే "పావెల్ కోర్చాగిన్ ఇంట్లో వున్నాడా?"—అంది.

"వాడికోసమే నేను చూస్తున్నా. కాని, ఎక్కడికి పోయేడో దేవుడికి తెలియాలి. నే వచ్చేటప్పటికి తలుపులు తెరిచివున్నాయి. పావ్కా కనబడలేదు. అయితే నువ్వు వాడికోసమే వచ్చేవా?"

తోన్యా ఆతని ప్రశ్నకు సమాధానం ఇవ్వకుండా ఎదురుప్రశ్న వేసింది.

"మీరు పావెల్ అన్న ఆర్టెమా ?

"ఔను. ఏం ?

తోన్యా సమాధానం ఇవ్వలేదు. తెరచివున్న తలుపులవంక విచారంతో చూస్తూ నిలబడిపోయింది. "నిన్న రాత్రేనా రాకపోయేనే—" అనుకొంది. ఆమె మనస్సు కలతపడింది.

ఆమె వేపు ఆర్టెమ్ ఆశ్చర్యంతో చూస్తూ నిల్చున్నాడు.

"మీరు వచ్చేసరికే తలుపు తెరిచి వుందన్నమాట.

"పావెల్‌తో పనేమిటో అడగొచ్చా."

తోన్యా దగ్గరగావచ్చి బెదురుతూ దిక్కులుచూసి రహస్యం మాట్లాడుతున్నట్లు నెమ్మదిగా చెప్పింది.

"ఖచ్చితంగా చెప్పలేనుగాని పావెల్ ఇంటివద్ద లేడంటే అరెస్టుచేసే రనుకోవాలి."

ఆర్టెమ్ వులికిపడ్డాడు.

"అరెస్టా! ఎందుకు ?"

"నడవండి, లోపలికి వెడదాం."

లోపలికి వెళ్ళినాక తోన్యా తనకు తెలిసినదంతా ఆర్టెమ్‌కు చెప్పింది. ఆతడు నిశ్శబ్దంగా అన్నీ విన్నాడు. చివర నిరుత్సాహంతో విసుక్కున్నాడు.

"ఇదొకటా ఇప్పుడు. అందుకే ఇల్లు అంత కంగాళిగా వుంది. వాడీ వ్యవహారంలో ఎల్లాచిక్కుకున్నాడబ్బా !

ఇప్పుడు వాడెక్కడున్నట్టు? అవ్వుతుగాని, అమ్మాయి! నువ్వెవరివమ్మా !''

''ఫారెస్టువార్డెన్ తుమానోవ్ మా నాన్నగారే. పావెల్ నా నేస్తం.''

''అల్లాగా! వాడు తిండికేమి ఇబ్బందిపడుతున్నాడో నని పిండీ, పిష్టం పట్టుకొచ్చేను. తీరాచూస్తే వాడు...''

తోన్యా, ఆర్టెమ్‌లు నిశ్శబ్దంగా ఒకరిముఖాల నొకరు చూస్తూ చాలసేపు నిలబడిపోయేరు. ఆఖరున తోన్యా పోతానని కదిలింది.

''వెడతానింక. మీకు పావెల్ కనిపిస్తాడేమో. మళ్ళీ సాయంకాలం వస్తా. ఏం జరిగిందో చెప్పుదురుగాని.''

ఆర్టెమ్ నిశ్శబ్దంగా తల వూపేడు.

* * *

శీతాకాలం అంతా ఓ మూలకుచేరి నిద్రపోయిన ఈగ వొకటి ఝుమ్మంటూ రొద ప్రారంభించింది. మూలనున్న ఓ కుక్కిమంచంమీద ఒక పల్లెటూరిపడుచు కాళ్ళు వ్రేలాడ వేసు క్కూర్చుంది. నిర్జీవములయిన చూపులతో ఆమె నేలవేపు అలాగే చూస్తూ చాలసేపు వుండిపోయింది.

కమేండెంట్ పెదవుల నంటిపట్టివున్న సిగరెట్టుముక్కను పీలుస్తూ, నిశింతాగా ఒకకాకితం వ్రాసి చివరన సంతకం పెట్టేడు. దాని దిగువన ''షెపెటోవ్కానగర కమాండెంటు, ఖోరున్‌ఝూ'' అని ముద్రవేసేడు. గుమ్మంలో చప్పుడైతే తలఎత్తి చూసేడు.

చేతికట్టుతో గుమ్మంలో సాలోమూగా నిలబడివున్నాడు.

"ఏమిటిల్లా కొట్టుకొచ్చేవు?"

ఊరికే కొట్టుకొచ్చేనా. బోగు నెట్సు* ఒకడు చేతిని ఎముకకంటా నరికేడు."

ఎదురుగా స్త్రీ ఒకర్తె వున్నదనికూడా గమనించకుండా సాలోమూగా అమ్మా, అలీయుని బూతులకు లంకించుకొన్నాడు.

"నువ్విక్కడేం చేస్తున్నట్లు? మందు తింటున్నావా?"

మందుతినడం మరోలోకంలోనే. యుద్ధరంగంలో వాళ్లు గట్టిగా గదుముకొస్తుంటేనా."

మంచంమీదవున్న ఆ యువతివేపు తలఎగరవేసి, కమాండెంటు ఆతనిని ఆపేడు.

"సరేలే. తర్వాత మాట్లాడుకుందాం."

సాలోమూగా అక్కడున్న ఒక కుర్చీపీటమీద దమ్మున చదికిలబడ్డాడు. టోపీతీసి ఒళ్ళో పెట్టుకొన్నాడు. స్వరం తగ్గించి వచ్చినపని చెప్పడం ప్రారంభించేడు.

"గోలుబ్ పంపించేడు నన్ను. ఓ డివిజన్ రెగ్యులర్ సైన్యాన్ని ఇక్కడికి పంపిస్తారు. ఇక్కడ ఏవో కొన్ని పనుల అవసరం వచ్చింది. వాటిని సరిచూడ్డానికే నేను వచ్చేను. మన 'పెద్ద' ఎవరినో విదేశీనాయకుడిని తీసుకుని వస్తాడను

---

* 17 వ శతాబ్దంలో యూక్రెయిన్ జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడిన దేశభక్తులలో బోగున్ ప్రసిద్ధుడు. ఆయన పేరిట రెడార్మీ రెజిమెంటు ఏర్పడింది. దానిలోనివాడు బోగునెట్సు.

కుంటూ. ఇప్పట్లో "పక్క-దాడులు" వుండవు. ఏమిటి వ్రాస్త
న్నావు ?"

కమాండెంటు నోట్లో సిగరెట్టు ఒకపక్కకు పెదవు
లతో లాక్కున్నాడు.

"ఇక్కడో కుర్రాడు దొరికేడు. జకరయ్ అంటే తెలు
సుగా ? రైల్వేవాళ్ళని మనమీదికి వుసికొల్పేడు, వాడు.
స్టేషన్ దగ్గరే మనవాళ్ళకి పట్టుబడ్డాడు."

"ఏమిటి ? దొరికేడూ." సాలోమూగా తాను
కూర్చున్న కుర్చీబల్లను కమాండెంటు టేబుల్ కు దగ్గరగా
లాక్కున్నాడు.

"ఆ స్టేషన్ కమాండెంటు ఓ మెల్చెంకోకు బుర్ర
లేదు. ఆ జకరయ్ ను ఓ కోసక్కు-వాడినిచ్చి ఇక్కడికి పం
పేడు. దారిలో ఈ కుర్రాడు అడ్డంకొట్టి జకరయ్ ని విడిపిం
చుకుపోయేడు. పట్టపగలు. కోసక్కు-తుపాకీ లాక్కున్నారు.
పళ్ళూడగొట్టి, వదిలిపోయేరు. చేతనైతే పరుగందుకో
మన్నారు. జకరయ్ తప్పించుకుపోయేడు. కాని, వీణ్ణిదొరక
పుచ్చుకున్నాం. అదే ఈ రిపోర్టు."

కమాండెంటు తన ఎదుటవున్న కాగితాల బొత్తిని
ముందుకు నెంటేడు. సాలోమూగా కాగితాలు ఎడంచేత్తో
తిరగేస్తూ ఓమారు ఈ మూలనుంచి ఆ మూలకి తిరగేసేడు.

"వాడిచేత ఏమీ చెప్పించలేక పోయేరన్నమాట."

"అయిదు రోజులున్నుంచి ప్రయత్నిస్తున్నా. ఎన్నడి
గినా "నాకేం తెలియదు. నేనెవ్వరినీ విడిపించలేద"నే

అంటాడు. కుర్రవెధవ! ఎస్కార్టు సిపాయీ వాడిని చూడ గానే గుర్తుపట్టేసు. నలుగురూ ఆపేరుగనక గాని వాడి పీక నులిమేసును. ఖైదీని జారవిడిచినందుకు ఓమెల్చెంకో పాతిక దెబ్బలు కొట్టించేడేమో మండిపోతున్నాడు. వాడిని పట్టుకోవడం కష్టమైపోయింది. ఇంక వాడిని అట్టేవుంచడం అనవసరం. ఖతం చేసెయ్యనిమ్మని అడుగుతూ హెడ్ క్వార్టర్సుకి వ్రాస్తున్నా."

సాలోమూగా తుబుక్కున ఉమ్మివేసేడు.

"నేనైతే వటవట వాగించి వుండేవాడిని. నీకు చేత కాదు. తత్వశాస్త్ర విద్యార్థి కమాండెంటుగా పనికొస్తాడా? రెండుచురుకులు తగిలించిపించేవా?"

కమాండెంటు మండిపడ్డాడు.

"నీనోటికి అడ్డంలేకుండా పోతూంది. అట్టే అధిక ప్రసంగంచేయకు. ఇక్కడ నేను అధికారిని. నీప్రసక్తి ఇక్కడ అనవసరం."

సాలోమూగా కమాండెంటు ఆవేశంచూసి ఫకుక్కున నవ్వేడు.

"ఏమిటా ఆవేశం! కొంచెం తమాయించు మరి. నువ్వూ, నీసమస్యలూ, మంటగలవనీ. నాకు వాటిప్రమేయం అక్కర్లేదు. ఎక్కడన్నా రెండు సీసాలు సామోగా దొరుకు తుందేమో చెప్పు.

కమాండెంటు పళ్ళు ఇగిలించేడు.

"చూద్దాం."

సాలోమూగా వేలితో కాగితాలను చూపించేడు.

"ఇదిగో చూడు. ఆ కుక్రవెధవ సంగతి చూసెయ్యా లనుకొంటే వాడు పదహారేళ్ళవాడని వ్రాయకు. పద్ధెనిమి దేళ్ళు వెయ్యి. ఆరు నెత్తిమీదికొమ్ము వంపుతిప్పి సున్న చేసెయ్యి. లేదా నీ గోల ఎవడూ వినిపించుకోడు."

* * *

బందిఖానాగా వుపయోగిస్తున్న కొట్టుగదిలో ముగ్గురు ఖైదీలున్నారు. మంచంమీద ఓ మూలగా పల్చనికోటు తొడిగిన ఓ ముసలాడు కూర్చుని వున్నాడు. ఆతడు మంచం మీదనే మరంవేసేడు. ఆతనియింట్లో కొందరు పెట్లూరా సైనికులు మకాంచేసేరుట. వాళ్ళకుక్రం ఒకటి కనబడ కుండా పోయింది. దానికోసం ఈ ముసలాడిని పట్టుకొన్నారు.

గదిలోనే క్రింద ఒక వయస్సుమళ్ళిన స్త్రీ చదికిలబడి కూర్చుంది. ఆమె సామోగా అమ్ముతుండేది. ఒక వాచీ దొంగిలించిందని ఆమెను లాక్కొచ్చేరు. మూడోవాడు కోర్చాగిన్. ఒళ్ళంతా దెబ్బలతో హూనమై పోయింది. తెరువు మరపుల్లో కిటికీక్రింద వుండచుట్టుకొని పడివున్నాడు.

* * *

కొంతసేపు గడిచేక సిపాయీలు భయంతో వొణికి పోతూన్న ఓ పడుచును గదిలోకి తీసుకొచ్చి వదిలేరు.

ఆమె ఒక్కక్షణం గదిఅంతా కలయచూస్తూ నిల్చుంది. తిన్నగా వెళ్ళి సామోగాఆమెవద్ద కూర్చుంది.

సామోగాఆమె ఎగదిగా చూసింది.

"ఏం పిల్లా ! ఎందుకు పట్టుకున్నావు ?"

సమాధానంలేదు. అయినా సామోగాయామె వదల లేదు.

"ఎందుకు పట్టుకున్నావు? సామోగాకోసం కాదుగద."

ఆ పల్లెపడుచుకు ఆప్రశ్నలు ఎంటూంటే విసు వేసింది. లేచింది.

"ఏమీకాదు. మా అన్నమూలంగా..."

"అతడేంచేస్తుంటాడు ?"

ముసలాడు గంయ్ మన్నాడు.

"ఎందుకల్లా వేపుకుతింటావు? ఉన్నబాధలకు తోడు నువ్వా ప్రశ్నలువేసి విసిగించాలా ?"

సామోగాయామె చప్రున మంచంవేపు తిరిగింది.

"నన్ను అదుపులో పెట్టడానికి నువ్వెవరివి? నీతో మాట్లాడ్డంలేదు."

ముసలివాడు తుబుక్కున ఉమ్మి వేసేడు.

"నోరుమూసుక్కూర్చో."

ఇంకెవరూ మాటాడలేదు. పల్లెపడుచు పైమీద కప్పుకున్న కంబళీ నేలని పరుచుకొని, తలకింద చెయ్యెత్తు పెట్టుకొని పడుకుంది.

సామోగాయామె ఏదో నములడం ప్రారంభించింది. ముసలివాడు కాళ్ళు క్రిందికి దింపి వ్రేలాడవేసుక్కూర్చున్నాడు. నెమ్మదిగా చుట్ట చుట్టుకొని వెలిగించేడు. ఘాటైన పొగ గదిసంతనూ ఆవరించింది.

సామోగా ఆమె దవడలు కదుపుతూనే గొణగడం ప్రారంభించింది.

"ఆ దిక్కుమాలిన కంపులో తినడం ఎల్లాగ? గది అంతా గాలుకంపు పుట్టిపోతూంది."

ముసలివాడు అపహాస్యం చేసేడు.

"చిక్కిపోతామేమోనని భయమా? ఫర్వాలేదు. నాలుగురోజు లిక్కడుంటే గుమ్మాలు వెడల్పు చేయించవలసి వచ్చేలావుంది. అదంతా అల్లా కూరుకోకపోతే ఆ కుర్రాడికి పెట్టరాదు?"

ఆమె కొరకొరలాడింది.

"పెట్టననలేదు. అడిగితే వద్దంటున్నాడు. నీ ముల్లె నేనేం తినెయ్యడంలేదు. కొంచెం నోరుమూసుకూర్చో."

పళ్లెపడుచు ఆమెవంక తిరిగింది.

"అతని నిక్కడికెందుకు తెచ్చేరో నీకేమన్నా తెలుసా?"

తన నా ప్రశ్న వేసినందుకు ఆమె కొండ ఎక్కింది.

"ఇక్కడివాడే. కోర్చాగినా రెండో కొడుకు. వాళ్ళ అమ్మ ఓ వంటపుట్టి.

ఆ మాటలంటూ అటూ ఇటూచూసి ఆ యువతివేపు వొంగి నెమ్మదిగా రహస్యం చెప్పింది.

"మాయింటి జోజూలిఖాల ఇంట్లో ఓ సరంగువుండేవాడు. అతడో బోల్షివిక్కు. అతడిని విడిపించేడు."

తాను విన్నమాటలు ఆ పడుచుకు గుర్తువచ్చేయి.

"వాణ్ణి ఖతంచేసెయ్యనిమ్మని అడుగుతూ హెడ్ క్వార్టర్సుకి వ్రాస్తున్నా."

*　　　　*　　　　*

ఒకదానితర్వాక ఒకటిగా సైన్యాలతో రైలుబళ్ళు వచ్చి ఆ జంక్షన్‌లో ఆగుతున్నాయి. వాటిలోంచి ఓ ప్రవాహం మాదిరిగా రెగ్యులర్ పటాలాలు దిగుతున్నాయి. అస్తవ్యస్తంగా అటూ ఇటూ పోతున్నాయి. నాలుగుపెట్టెల పొడుగున కవచం అమర్చిన రైలు సైడింగ్‌లోకి వచ్చి నిలబడింది. మూసిన పెట్టెల్లోంచి గుర్రాల్నీ, మూతలులేని పెట్టెలనుంచి ఫిరంగుల్నీ దింపుతున్నారు. దిగీ దిగడంతోటే గుర్రాలకి జీనులుతగిలించి రౌతులు జనసమ్మర్దం మధ్యనే సవారు సాగిస్తున్నారు. స్టేషన్‌లో కాల్బలాలకుచెందిన సైనికులు అటూఇటూ తోసుకుంటూ తిరుగుతున్నారు. స్టేషన్ వెలుపల మైదానంలో గుర్రపుదళాలు బారులుతీరుతున్నాయి.

తమ సైన్యదళాలను పిలుస్తూ ఆఫీసర్లు అటూ ఇటూ హడావిడిగా ఉరుకులెత్తుతున్నారు.

స్టేషన్ కందిరీగల తుట్టులా రొదగావుంది. క్రమంగా ఆ జనంఅంతా పటాలాలుగా ఏర్పడ్డారు. ఒకదానితర్వాత నొకటి ప్రవాహంలాగ సైన్యదళాలు నగరంవేపు నడిచి పోతున్నాయి. కిర్రుమంటూ బళ్ళు కదిలేయి. దళాలలోంచి వెనకబడ్డవాళ్ళు రైఫిల్ డివిజన్ వెనక కాళ్ళీడ్చుకొంటూ నడుస్తున్నారు.

వీళ్ళందరికీ వెనకాల హెడ్ క్వార్టర్సు స్క్వాడ్ నూట యిరవై మందీ గొంతుక లిప్పిపాడుతూ చకచక నడిచిపోతు న్నారు.

ఏమిటీగొడవ ?

ఇదంతాఏమిటి ?

ఏమిటి ఈ గోల ?

పెట్లూరా తన సైన్యదళాలతో వస్తున్నాడిది...

వాళ్ళని చూడ్డానికోసం పావెల్ కోర్చాగిన్ లేచి కిటికీ వద్దకెళ్ళేడు. ఇంకా బాగా రాత్రి కాలేదు. మసకచీకట్లో బళ్ళూ, మనుష్యులూ స్పష్టంగా కనబడ్డంలేదు. కాని, చక్రాల గర గరలూ, సైనికుల అడుగుల చప్పుడూ, వాళ్ళ పాటలూ గోలగా వినిపిస్తున్నాయి.

వెనకనుంచి సన్నని గొంతు వినిపించింది.

"నగరంలోకి సైన్యాలు వచ్చేయి."

కోర్చాగిన్ వెనక్కి తిరిగేడు.

గతదినం తీసుకువచ్చిన పడుచు కనబడింది.

సామోగాయూమె ప్రశ్నిస్తూంటే ఆమె కథను ఆతడది వరకే వినివున్నాడు. నగరానికి ఏడు వెర్స్టులలో వుంది వాళ్ళ వూరు. వాళ్ళఅన్న గ్రిటస్కో కమ్యూనిస్టు దళాలలో చేరేడు. సోవియట్లు ఏర్పడ్డప్పుడు బీదరైతు కమిటీకి ఆయన అధ్యక్షు డుగా ఎన్నుకోబడ్డాడు.

రెడార్మీ ఆప్రాంతంనుంచి వెళ్ళిపోతున్నప్పుడు ఆతడు కూడా వాళ్ళవెంట పోయేడు. ఇప్పుడా కుటుంబాన్ని వీళ్ళు

పీడించుక తింటున్నారు. వాళ్ళకున్నదే ఒక్క గుర్రం. దాన్ని తోలుకుపోయేరు. తండ్రిని కొన్నాళ్ళు జైలులో పెట్టి హింసించేరు. గ్రిట్స్కో ఆధిపత్యంవహించిన బీదరైతు సంఘంమూలంగా ఒదిగి మదిగి వుండవలసివచ్చిన గ్రామమున సబు ఇప్పుడు కసితీర్చుకుంటున్నారు. ఊళ్ళో కెవరొచ్చినా వాళ్ళింట్లో మకాంచూపిస్తున్నాడు. ఆకుటుంబం అడుగంటి పోయింది. మొన్న ఆవూరు కమాండెంటు వెళ్ళేరు. మున సబు ఆతణ్ణి ఈఅమ్మాయివున్నచోటికి తీసుకెళ్ళేరు. వాడామె మీద కన్నేసేడు. సంగతులు కనుక్కోవాలనే పేరుతో ఆమెను తనతో తీసుకొచ్చేడు.

ఎంత ప్రయత్నంచేసినా కోర్చాగిన్‌కు నిద్రపట్టటం లేదు. మరిచిపోదామన్నా మరపురాకుండా ఒకేఒక ప్రశ్న మనస్సుని పీడిస్తూంది.

"ఇంకేం చేయదలచేరో."

కముకు దెబ్బలకి వొళ్లు అంతా సలుపుతూంది. జక రయ్‌తో వచ్చిన ఎస్కార్టుగాడు చంపేసేడు.

ఆలోచనలు మరిచిపోవడంకోసం ఆ ఆడాళ్ళ సంభా షణ కేపు దృష్టి మళ్ళించేడు.

కమాండెంటు తన్ను ఎలా వేపుకుతిన్నాడో, తాను ఏ విధంగా నిరాకరించిందో, "గదిలోపెట్టి తాళంవేస్తే ఎక్కడికెడతావో చూస్తానుగా" అన్న బెదిరింపూ పూస గుచ్చినట్లు ఆ పడుచు సామోగాఆమెతో చెప్తూంది.

గదిఅంతా కటికచీకటి. ఇంకోర్రాత్రిగడపాలి. ఆ మాట తలుచుకుంటే ఉక్కిరిబిక్కిరి అనిపిస్తూంది. ఇప్పటి కిది

ఏడోరాత్రి. అయినా ఎన్నో నెలలు జరిగిపోయినట్లనిపిస్తూంది. నేలరాయిలావుంది. ఎటుదొర్లినా ఒళ్ళుపచ్చిపుండులావుంది. గదిలో ఇప్పుడింక ముగ్గురే మిగిలేరు. ఎక్కడేనా సోడా తెచ్చిపెట్టమని సామోగా ఆవిడను వదిలేసేరు. ముసలివాడు కుంపటిపెట్టుకున్నంత సుఖంగా ఓ మూలపడుకుని గుర్రు పడుతున్నాడు. ఎక్కడా చీకూ, చింతాలేదు మనిషికి. ఏమీ జరగనట్లే గుర్రుపడుతున్నాడు. ఆ పల్లెపడుచు పావెల్ పక్కకి వచ్చిపడుకుంది. ఇద్దరికీకూడా నిద్రలేదు. పావెల్‌కు గతం రోజున కిటికీఎదర సెర్గీ కనబడ్డాడు. అక్కడున్న ఇళ్ళల్లో దేనిలో తన మిత్రుడున్నాడో తెలియక ఒక్కొక్క కిటికీ వేపేచూస్తూ ఆతడక్కడ చాలసేపు నిల్చున్నాడు.

"నే నిక్కడున్నట్లు వీడికి తెలుసన్నమాట"— అనుకొన్నాడు, పావెల్.

ఎవరో ఇచ్చేరంటూ మూడు రోజులనుంచి గార్డులు ఫల్లరొట్టె తెచ్చిఇస్తున్నారు. ఎవరిచ్చేరంటే చెప్పడంలేదు. ఇంక ఈ రెండు రోజులనుంచీ కమాండెంటు ప్రశ్నలతో విసిగిస్తున్నాడు.

ఏమిటిదంతా!

ఎన్ని అడిగినా తానేమీ చెప్పలేదు. పైగా తన కేమీ తెలియదు పొమ్మన్నాడు. తాను ఎందుకు తెలియదన్నాడో తనకే తెలియదు. తనుచదివిన పుస్తకాలలోని వీరుల్లాగే ధైర్యంగా, పట్టుదలగా వుండాలని ఆతని కోరిక. అయినా తన్నుపట్టుకొన్నరోజున "కాల్చిపారెయ్యక ఎందుకు వీణ్ణి జైలులోపెట్టడం"—అని ఒకడంటూంటే తనకు వణకు

పుట్టింది. పదహారేళ్ళ వయస్సులోనే చచ్చిపోవడం అంటే చాల భయంవేసింది. చచ్చిపోయేక ఇంక బ్రతికివుండడం వుండదు.

క్రిస్టినాకూడా ఆలోచనలో పడింది. పావెల్ కన్న ఆమెకు ఎక్కువ తెలుసు. తనను ఏంచెయ్యాదలచేరో బహుశా అతనికి తెలిసివుండదేమో...

పావెల్ నిద్రపట్టక పక్కమీద అటూఇటూ దొర్లుతున్నాడు. క్రిస్టినాకు అతనిమీద జాలిపుట్టుకొచ్చింది. తన విషయంకూడ ఆందోళనకరంగానేవుంది. గదిలోకి పంపేటప్పుడు కమాండెంటు చేసిన బెదిరింపు నామె మరిచిపోలేకుండావుంది. "రేపు నీ సంగతి చెప్తా. నన్ను కాదంటే గార్డు రూమ్‌కే పప్ప చెప్తా. కోసక్కులు నిన్ను వదులుతారనుకోకు"—

ఎక్కడా అయ్యో అనేవాళ్ళులేరు. గ్రిట్‌స్కో కమ్యూనిస్టులతో చేరడం తప్పు తనదా? అబ్బ! ఎన్ని బాధలు!

ఏదోబాధతో చుమ్మలుచుట్టుకుపోయి యేడ్చింది.

గోడ్రపక్క ఏదో నీడకదిలింది.

"ఎందుకేడుస్తావు?"

క్రిస్టినా దుఃఖంపట్టలేక తన బాధలన్నీ చెప్పుకుంది. అతను నిశ్శబ్దంగా ఆమె భుజంమీద చెయ్యివేసేడు.

ఆమె హాడలిపోతూ కన్నీళ్ళు తుడుక్కుంది.

"చిత్రవధ చేసేస్తారు. నాకు ఎక్కడా దారికనబడ్డం లేదు."

పావెల్ మాత్రం ఏం చెప్పగలడు? ఇద్దరిదీ కొంచెం ఇంచుమించు ఒకే స్థితి.

ఆమెను లాక్కుపోవడానికి వచ్చినప్పుడు తాను ఎదురొడ్డింటే? కొట్టిచంపేస్తారు, లేదా నరికేస్తారు. దానితో ఆఖరు. ఆమెను వూరడించేటందుకు ఆమె చేతిమీద నెమ్మదిగా తట్టేడు. ఆమె ఏడ్చేస్తూనింది. గుమ్మంవద్దనున్న సెంట్రీ దారిపోయేవాళ్ళని "ఎవరది"-అని ప్రశ్నిస్తూండడం ఒక్కటే మధ్యమధ్య వినిపిస్తూంది. ముసలివాడు గాఢనిద్రలో వున్నాడు. కాలం గడవడమే లేదు. ఉన్నట్లుండి ఆ పడుచు ఆతనిని కౌగలించుకొని దగ్గిరికి తీసుకొంది.

"ఇదిగో విను. నాకు మరోదారి లేదు. కమాండెంటు కాకపోతే కోసక్కులు. ఆ వెధవ నన్ను మొదట ముట్టుకొన్నాడనే బాధ కలగకుండా నువ్వు..."

"క్రిస్టినా! ఏమిటామాట"

కాని, ఆమె వదలలేదు. ఆమె పెదవులు ఆ చీకట్లో ఆతని పెదవులకై తడుములాడేయి. ఆమె మాటలలో వున్న మార్దవం, నిరాడంబరత్వం—ఆతనికి అర్థమయింది.

తర్వాత ఆతనికి మైమరుపు కలిగింది. ఆతఁడువున్న తాళం ద్వారంలో కాపలావున్న కోసక్కు, కమాండెంటు, దెబ్బలు, ఏడురోజులబాధా, అలసటా అన్నీ అడుగున పడిపోయేయి. కన్నీటతడిసిన బుగ్గలూ, ఆవేశంలో ఉడికిపోతున్న పెదవులూ తప్ప మరో ప్రపంచం జ్ఞాపకంలో లేదు.

హఠాత్తుగా తోన్యా జ్ఞాపకంలో మెదిలింది.

ఆమె నేలాగ మరచిపోగలదు? ఆకళ్ళని మరవడం సాధ్యమా?

అతికష్టంమీద ఓపిక తెచ్చుకున్నాడు క్రిస్టినా కౌగిలి విడిపించుకొని లేచినిల్చాడు. తూలిపోతూ కిటికీవూస పట్టుకొని నిలదొక్కుకున్నాడు. కాని క్రిస్టినా వెనకనే తడుములాడు కుంటూ వచ్చింది.

"ఏం?"

ఆమె కోరిక అంతా ఆ ఒక్కమాటలో వినిపించింది. పావెల్ ఆమెచేయి పట్టుకొన్నాడు.

"వద్దు. క్రిస్టినా! నువ్వు చాలామంచి..."

—ఇంకా ఏవేవో అన్నాడు. కాని ఏమన్నదీ అత నికే తెలియదు.

ఒక్కనిముషం ఇద్దరూ నిశ్శబ్దంగా నిలబడ్డారు. పావెల్ మంచందగ్గిరికెళ్ళి పట్టెమీద అనుకుకూర్చుని ముసిలివానిని లేపేడు.

"ఓచుట్టివ్వు తాతా!"

క్రిస్టినా పైగుడ్డ నిండుగా కప్పుకొని ఒకమూల పడు కొని ఏడ్చింది.

మరునాడు కమాండెంటు కొందరు కోసక్కుల్ని వెంట బెట్టుకువచ్చి క్రిస్టినాను తీసుకుపోయేడు. గుమ్మంలోంచి ఆమె 'ఏంపని చేశావు' అన్నట్లు పావెల్ వంక తిరిగిచూసింది. ఆమె వెళ్ళిపోయేక ఆతని మనస్సు ఎన్నెన్నో విచారాలతో కొట్టు మిట్లాడిపోయింది.

ఆరోజంతా పావెల్‌ను మాట్లాడించడానికి తాత ఎంతో ప్రయత్నంచేసేడు. కాని సఫలుడు కాలేకపోయేడు. ద్వారంలోని రక్షకలూ, కమాండెంటు గార్డుదళమూ మారి, కొత్తవాళ్ళు వచ్చేరు. సాయంకాలంవేళ కొత్తఖైదీని ఎవరినో తెచ్చేరు. పావెల్ ఆతనిని గుర్తుపట్టేడు: పంచదార ఫ్యాక్టరీలో వడ్రంపనిచేసేవాడు. దోలిన్నిక్ ఆతనిపేరు. పొట్టిగా, మంచిబలంగా వుంటాడు. ఒక చిరుగులకోటూ, దానిక్రింద పచ్చనివొక్కా తొడుక్కున్నాడు. గదిలోకి వస్తూనే చూట్టూ ఒక్కమారు కలయచూసేడు.

1917 ఫిబ్రవరిలో దోలిన్నిక్‌ను పావెల్ మొట్టమొదటి సారి చూసేడు. అప్పుడే విప్లవప్రారంభ సూచనలు కనిపిస్తున్నాయి. ప్రజలు పెద్ద పెద్ద ప్రదర్శనలు చేస్తున్నారు. నగరంలోకూడా ప్రదర్శనలుజరుగుతున్నాయి. వానిలో కమ్యూనిస్టులపేరు మొట్టమొదటిమారుగా వినిపించసాగింది. ఆతడు చూసిన మొదటి కమ్యూనిస్టు దోలిన్నిక్. రోడ్డుప్రక్కనే వున్న కోరడి గుమ్మంమీాదనిలబడి ఆతడు సైనికులకు వుపన్యసిస్తున్నాడు. ఆ నాడాతడు తన వుపన్యాసాన్ని ముగిస్తూ అన్నమాటలను పావెల్ మరిచిపోలేదు.

"మీారు బోల్షివిక్‌ల మాటనమ్మండి. వాళ్ళెన్నటికీ ద్రోహం చెయ్యరు."

అటుతర్వాత మళ్ళీ దోలిన్నిక్ కనిపించనేలేదు.

రోజంతా మాట్లాడేందుకు మరోప్రాణిలేకుండా నోరు కట్టుకుని కూర్చోవడం కష్టం అనిపించిందో ఏమో ముసలి

తాత కొత్తవాడు రావడంతో ఎంతో ఆప్యాయం వెలిబుచ్చేడు. దోలిన్సిక్ కూడా వెళ్ళి అతని మంచంమీద ఒక చివరగా కూర్చున్నాడు సిగరెట్టు ముట్టించి బాతాఖానీ వేసేడు.

తర్వాత అతను కోర్చాగిన్ వద్ద కొచ్చేడు.

"ఏమయ్యా ! నిన్నెందుకు పట్టుకొన్నారు ?"

పావెల్‌ను ఎంత కదిలించినా ఔను, కాదు తప్ప మాటమాట రావడంతో అతని మనస్సులో ఏదో అనుమానం వేధిస్తూందని దోలిన్సిక్ గ్రహించేడు. అతనిమీద చేసిన ఆరోపణ ఏమిటో తెలిసేక చాల ఆశ్చర్యం వేసింది. ప్రక్కనే స్థిమితంగావచ్చి కూర్చున్నాడు.

"జకరయ్‌ని తప్పించింది నువ్వా? అసాధ్యుడివే. నిన్ను వాళ్ళు పట్టుకొన్నారని తెలియనేలేదు సుమా."

పావెల్ ఆశ్చర్యపడ్డాడు. వెంటనే ఆ అభిప్రాయాన్ని త్రోసివేసేడు.

"నేను జకరయ్ ఎవరో ఎరగను. ఓమాటు వాళ్ళ చేతుల్లోపడ్డాక ఏ కేసు పెట్టినా పెడతారు."

దోలిన్సిక్ చిరునవ్వునవ్వుతూ దగ్గిరికి జరిగేడు.

"అది సరిలేరానాయనా! నాదగ్గర దాచనక్కర్లేదులే. నాకూ తెలుసు."

ముసిలివానికి వినబడకుండేందుకు బాగావంగి చెవిలో రహస్యంచెప్పేడు.

"జకరయ్‌ని నేనే వూరుదాటించేను. ఈపాటికి అడంగుకి చేరుకొనేవుంటాడు. అతడే అన్నిసంగతులూ చెప్పేడు."

దోలిన్నిక్ ఒక్క నిముషం ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"నువ్వెగట్టివాడివే. నీసంగతి వాళ్ళకి తెలిసిపోయి, నువ్వు దొరికిపోవడం ఏం బాగా లేను."

ఆతడు కోటుతీసి నేలమీాద పరిచి, దానిమీాద గోడకి జేరబడి కూర్చున్నాడు. జేబులోంచి కాగితంతీసి సిగరెట్టు చుట్టుకోవడానికి సన్నాహం ప్రారంభించేడు.

దోలిన్నిక్ ఏమీ బాగాలేదన్నదెందుకో పావెల్‌కు అర్థంఅయింది. ఆతడు చెప్పినదాంట్లో అబద్ధంలేదు. జకరయ్ తప్పించుకొన్నాడు. ఈపాటికి...

పెట్లూరా కోసక్ సేనలలో ప్రచారంచేసేడని దోలిన్నికను అరెస్టుచేసేరు. వారు లొంగిపోయి కమ్యూనిస్టుల తరఫున తిరిగిపోవడం మంచిదంటూ గుబెర్నియా (జిల్లా) విప్లవ సమితి ప్రచురించిన కరపత్రాల నాతడు పంచిపెట్టేడనేది ఒక ఆరోపణ.

ఆతడు పావెల్‌కు తన విషయాలన్నీ పూర్తిగా చెప్పడం మంచిదికాదనుకొన్నాడు.

"కుర్రాడు. కొట్టడం ప్రారంభిస్తే నిలబడగలడో, లేడో."

రాత్రి పడుకోబోయేముందు తన భయాన్ని చూచాయగా ఆతనితో చెప్పేడు.

"చూడు, కోర్చాగిన్ మనం గట్టిచిక్కుల్లో వున్నట్లే కనబడుతూంది. ఐనా చూస్తాంగా."

మర్నాడు మరో కొత్తఖైదీని తెచ్చేరు. దొప్పచెవుల మంగలి ష్లోమా జెల్ట్సర్‌ను నగరంలో ఎరగనివాళ్ళుండరు.

"ఫకూన్లి, బ్లువెస్టీనూ, ట్రాక్టెన్ బర్గూ కావలసివస్తే ఎదురు సన్నాహం చేసుకోనీ, కాని, వృాళ్ళ్ళవున్న యూదు లకేం పట్టింది. వాళ్ళెప్పటికీ వినరు. నే చెప్తున్నా నమ్ము. ఫక్సుకి బట్టలంగడివుంది. ట్రాక్టెన్ బర్గ్ కంటే పిండిమరవుంది. నాకేముంది? కాలే కడుపులు తప్ప మిగతా వాళ్ళ కేముంది? ఏమీ లేదు. వట్టిబికార్లం, ఔనంటావా, కాదంటావా? అయితే నాకడుపులో ఆలోచన దాగదుసుమా. ఈవేళ ఓ ఆఫీసరుకు క్షౌరంచేస్తున్నా. కొత్తగా సైన్యాలతో వచ్చిన మనిషిలే. ఆయనకు క్షౌరంచేస్తూ అడిగేసేను—"ఇక్కడి పోగ్రాముల సంగతి పెట్లూరాకి తెలుసా? రాయబారం వెడితే మాట్లాడ తాడా?"—అన్నాను. అరరెరే. నాదిక్కుమాలిన నోరూరు కోదు. ఏదో పేచీ తెచ్చిపెడుతూనే వుంటూంది. ఆఁ. ఇంతకీ ఆ ఆఫీసరు ఏంచేసేడో తెలుసా? క్షౌరంచేసేను. తలదువ్వి, పౌడరుకొట్టి అలంకరించేక డబ్బులివ్వడానికి బదులు నన్ను అరెస్టు చేస్తున్నాననాన్నడు. అధికారులమీద ఆందోళన చేస్తున్నానట."

జెల్ట్సర్ గుండెలు కొట్టుకొన్నాడు.

"నేను చేసిన ఆందోళన ఏమిటో చెప్పు. ఆమాట అడిగితే... ...బంకోలులో పెట్టెయ్యడమేనా?"

ఆ ఆవేశంలో దోలిన్నికో చొక్కాగుండీని ఓమారు లాగేడు. చేతులుపట్టుకు గుంజేడు ఓమారు.

దోలిన్నిక్ చిరునవ్వు నవ్వేడు.

"నిజమే ష్లోమా ! నీలాంటి తెలివైనవాడు చెయ్య వలసినపని కాదు. వేళాపాళా చూసుకుమాట్లాడాలి. ఎన్ని చెప్పు. నువ్వు ఇక్కడికి చేరడం అట్టే క్షేమంకాదుసుమీ."

జెల్ట్సర్ తలవూపేడు. నిరాశతో చెయ్యి విదిలించేడు. ఇంతలో తలుపు తెరచుకుంది. సామోగాయామెను లోపలికి గెంటి తలుపువేసేరు. ఆమెతూలి, కూలబడిపోయి, త్రోసినవాడిని నానాతిట్లూ తిట్టింది.

"నువ్వా, నీకమాండెంటూ మన్నుగానూ. నే తెచ్చి పెట్టిన సారాత్రాగి ఉక్కిరిబిక్కిరయిచావా.

కాపలాదారు తలుపు భళ్ళునవేసేడు. బయట తాళం వేసినచప్పుడు వినిపించింది.

ఆమె కొంచెంసేపటికి స్థిమితపడ్డాక తాత పలకరించేడు.

"మళ్ళీ లాకొక్కచ్చేరన్నమాట. ఏంచేస్తాం! కూరోచ్చి, సర్దుకో."

ఆమె తాతవేపు చురచురాచూసింది. తనమూటతీసుకొని దోలిన్స్కి దగ్గరగాచేరి కూర్చుంది.

ఏదో నాలుగుసీసాల సారా తెచ్చేదాకా కమాండెంటు ఆవిణ్ణి వదిలిపెట్టేడు. తన పనయ్యేక మళ్ళీ కొట్టులోకిత్రోసేడు.

హఠాత్తుగా గార్డ్సుగదిలో కేకలు వినిపించేయి. తర్వాత ఎవరో పరుగెడుతున్న చప్పుడు. ఎవరో ఆఫీసరు బొంగురుగొంతుకతో అరుస్తున్నాడు. గదిలోవాళ్ళంతా నిశ్శబ్దంగా ఆలకించేరు.

*　　*　　*

ఇదేసమయంలో చర్చిముందర మైదానంలో వింత వింతఘటనలు జరుగుతున్నాయి. మైదానంలో మూడుదిశ లలో ఒక డివిజన్ సైనికులు చతురస్రదళాలుగా యుద్ధ సన్నాహంలో నిలబడివున్నారు.

చర్చికి ఎదురుగా కాల్బలపు రెజిమెంట్లు మూడు చతురాలుగా తీరి నిలబడివున్నాయి.

ఈ సైన్యం పెట్లూరా 'డైరెక్టరీ'కున్న సేనలన్నింటి లోకీ బలమైనదీ, శ్రేష్ఠమైనదీనని ప్రశస్తి. పంపరపనసడిప్పలు బోర్లించినట్లున్న టోపీలూ, మాసి, చిరిగినదుస్తులూ వాళ్లూ రైఫిళ్ళు "ఎట్ రెస్ట్" (at rest) లో పట్టుకొని నిలబడి వున్నారు.

మొదటచెప్పిన డివిజన్‌లో చేరినవారంతా ప్రధా నంగా భూస్వామివర్గాలనుంచి వచ్చేరు. సోవియట్లతో పోరాడవలసిన అవసరాన్ని వాళ్ళెరుగుదురు. జార్ సైన్యాలు ఆయుధాగారాలనుంచి తీసుకొన్న ఆయుధపరికరాలతో సుస జ్జితంగావున్నారు. ఈ డివిజనును పెట్లూరా తనరంగంలో అతి కీలకస్థానంలోవున్న ఈరైలుకూడలిస్థలాన్ని కాపాడటానికి తెచ్చేడు. మెపెటోవ్కానుంచి ఐదుదిశలకు రైళ్ళు వెడ తాయి. ఇల్లాంటి కూడలిస్థలం చెయ్యిజారితే పెట్లూరాపని ఆఖరే. అసలు ఆయనచేతిలోవున్న ప్రదేశమే స్వల్పం. చిన్నజిల్లాపట్టణం విన్నిట్సా ఆయన ప్రభుత్వకేంద్రం.

ఆవేళ చీఫ్ ఆటామన్ పెట్లూరా స్వయంగా తన సైన్యాల పరిశీలనకు వస్తున్నాడు. ఆయనరాకకు సన్నా హంగా సైన్యాలు సంసిద్ధం చేయబడ్డాయి.

మైదానంలో మామూలు ఎవ్వరూ చూడకుండే చోట కొత్తగా చేర్చుకోబడిన సైనికుల్ని నిల్చోబెట్టేరు. వాళ్ల కాళ్లకి బూట్లు లేవు. యూనిఫారాలూ లేవు. ఎవరికి అందిన చొక్కా వాళ్ళు వేసుకొని, అల్లాగే వచ్చేసేరు. నిద్రపోతూంటే మంచాల మీంచి లేపుకొచ్చిన వాళ్ళూ, దారికాచి దారినపోతూంటే పట్టుకొచ్చిన వాళ్ళూను వీళ్ళు. ఒక్కళ్ళకీ యుద్ధం తెలియదు. ఆ ఆసక్తి లేదు.

"మనం అంత దద్దమ్మలమేం కాము."— అనుకుంటూ వీలు దొరికితే పారిపోవా లనే సన్నాహంలో వున్నారు.

పెట్లూరా ఆఫీసర్లు చాలమంది గ్రామాలకుపోయి దొరికిన పడుచువాళ్ళను పట్టుకొస్తున్నారు. వాళ్ళని దళాలుగా విభజించి ఆయుధాలిస్తున్నారు. రెండు మూడు రోజులయ్యేసరికి వాళ్ళు ఒక్కొక్కళ్ళే చల్లగా జారుకుంటున్నారు. ఓ పదిరోజులయ్యేసరికి ఎవళ్ళో తెలివితక్కువ సన్యాసులు తప్ప ఎవరూ సైన్యంలో మిగలడం లేదు.

ఈతరహా సైనికులకి బూట్లు ఇవ్వడం దండుగ. అసలే బూట్లు, వాటికి కావలసిన పరికరాలూ దొరకడం లేదు. అయినా చేర్చుకొన్న ప్రతి సైనికుడికీ బూట్లు ఇవ్వమని ఆజ్ఞలు వచ్చేయి. దానితో కాలిజోడు ఆకారంలో వున్న తుక్కంతా వాళ్ళ కాళ్ళకి అమిరింది. కాని, అవి కాళ్ళని వుండడం ఎల్లాగ? తాళ్ళూ, తంపరులూ వుపయోగించేరు.

ఆ కాలిజోళ్ళతోనే వాళ్ళని కవాతు చేయించేరు.

కాల్బలం వెనక గోలుబ్ గుర్రపు సైన్యం బారులు తీరింది.

ఈ తమాషాచూడవచ్చిన పట్టణవాసుల్ని దూరంగా వుంచడానికి అశ్వికభటులనుపెట్టేరు.

వచ్చేది 'చీఫ్ అటామన్' ఆయె. ఇల్లాంటిసందర్భాలు అన్నప్పుడూరావు. ఆ తమాషాచూడ్డానికి పట్టణప్రజఅంతా విరగబడ్డారు.

చర్చిమెట్లమీద కర్నలులూ, కెప్టెనులూ, ఫాదిరీ కూతుళ్ళు ఇద్దరూ, యూక్రేనియన్ ఉపాధ్యాయులు కొందరూ, కొందరు 'స్వతంత్రకోసక్కు' పార్టీవాళ్ళూ చేరేరు. గూనిమేయరుకూడా వాళ్ళమధ్య నిలపడ్డాడు. ఒక్కమాటలో చెప్పాలంటే నగరంలోని 'పెద్దఇళ్ళ' వాళ్ళంతా అక్కడున్నారు. కాల్బలాల ఇన్స్పెక్టర్ జనరల్ ఒక కకేషియన్ చెర్కెస్కాతో అక్కడే నిలబడివున్నాడు.

ఫాదర్ వాసిలీ ఈస్టర్పండుగల్లో ధరించే మంచి దుస్తులు పైకితీస్తున్నాడు.

పెట్లూరాకి ఘనస్వాగతం ఇచ్చేటందుకై ఏర్పాట్లు చేసేరు. కొత్తగాచేరిన సైనికులచేత ప్రమాణంతీసుకోవడం ఆనాటి కార్యక్రమాలలో ఒకటి. ఆ అవసరంకోసం పసుపు, నీలిరంగులజెండా బైటికితీసేరు.

పెట్లూరాను తీసుకురావడానికై డివిజనల్ సేనాధిపతి పాత బాక్సికారులో స్టేషనుకు బైలుదేరేడు.

ఆతడు అలావెళ్ళగానే కాల్బలాల ఇన్స్పెక్టర్ జనరల్ కర్నల్ చెర్న్యాక్ను పిలిచేడు.

"కమాండెంట్ ఆఫీసూ, మిగిలినవీ సరిగ్గావున్నాయో లేవో పోయి చూడు. కూడా కొందర్నితీసుకెళ్ళు. ఎవరైనా

ఖైదీలుంటే కనుక్కోం. పీటర్స్‌వర్గ్ సోజారకాన్ని పట్టుకుంటే వదిలెయ్యి."

చెర్నాష్యేవ్ టక్కున తిరిగేడు. ఎదుట కనిపించిన కోసక్ కెప్టెన్‌ను తనవెంట రమ్మన్నాడు. ఇద్దరూ గుర్రాల్ని పురికించేరు.

ఇన్‌స్పెక్టర్ జనరల్ ఫాదిరీకూతురువంక తిరిగేడు.

"విందు మాటేమిటి? అన్నీ సిద్ధంగావున్నాయా?"

"ఆహా! కమాండెంటు మహాశ్రద్ధ తీసుకొన్నాడు."

మాట్లాడుతున్నంతసేపూ ఆమెకళ్ళు ఇన్‌స్పెక్టరు సుందరముఖాన్ని తడుముతూనే వున్నాయి.

ఉన్నట్లుండి ప్రేక్షకజనం కదలబారింది: ఎవడో కాతు గుర్రాన్ని దౌడుతీయిస్తూ వస్తున్నాడు. దూరాన్నుంచే చేయివూపుతూ కేకపెట్టేడు.

"వస్తున్నారు."

ఇన్‌స్పెక్టర్ అడుగు ముందుకేసేడు.

"ఫాలిన్"

ఆఫీసర్లంతా తమ తమ స్థానాలకు పరుగులెత్తేరు.

పెట్లూరా కారు చర్చిని సమీపించేసరికి బ్యాండు వాళ్ళు "చిరంజీవతి యూక్రేయిన్"—అంటూ పాట అందుకొన్నారు.

డివిజన్ కమాండరు వెనక ఆయాసపడుతూ 'చీఫ్ అటామన్' కారుదిగేడు. పెట్లూరా అంత పొడుగూ, పొట్టీగా కుండా మధ్యరకంగా వుంటాడు. ఆబోతులా మెడ తెగబలిసి

వుంటుంది. ఆ లావుపాటి మెడమీద కోసుగా తలకాయ సీలపెట్టి బిగించిన ట్లుంటుంది. నీలిరంగు పొడుగుకోటు తొడిగేడు. పసుపురంగు బెల్టుచుంచి హోల్‌స్టరులో బ్రౌనింగ్ రివాల్వరు మిసమిసలాడుతుంది. తలమీద ఖాకీటోపీ దానికి పింగాణీతో చేసిన బిళ్ళ తగిలించివుంది.

సైమన్ పెట్లూరానిచూస్తే యోధుడని అనిపించదు. అసలు సైనికుని ఆకారమే లేదు.

ఏదో అసంతుష్టితోనే ఇన్‌స్పెక్టర్ రిపోర్టు విన్నాడు. తర్వాత గూనిమేయరు ఆయనకుస్వాగతంఇస్తూ మాట్లాడేడు.

పరధ్యానంగానే పెట్లూరా అన్నీవిన్నాడు. ఆయన దృష్టిఅంతా అక్కడ సమీకరించిన సైనికులమీదనేవుంది. ఇన్‌స్పెక్టరువేపు తల ఎగరవేసేడు.

"ఇహ ప్రారంభిద్దాం."

జెండాకుప్రక్కనే అమర్చిన వేదికమీదికెక్కి పెట్లూరా పదినిముషాలసేపు సైన్యాలకో వుపన్యాసం ఇచ్చేడు.

ఆ వుపన్యాసంలో వుత్సాహంలేదు. ప్రయాణంలో అలసిపోయేడోయేమో పెట్లూరాలోనే వుత్సాహంలేదు. ముందే ఏర్పాటు చేసుకొన్నప్రకారం సైనికులు 'స్లావా' 'స్లావా'—అని నినదిస్తూంటే పెట్లూరా తన వుపన్యాసాన్ని ముగించి వేదికదిగేడు. నుదుటనుంచి కారుతున్న చెమటను జేబురుమాలుతో అద్దుకొన్నాడు. ఇన్‌స్పెక్టరూ, డివిజనల్ కమాండరూ వెంటవస్తూంటే పెట్లూరా సైనికదళాల తణిఖీ ప్రారంభించేడు.

కొత్తగా చేర్చుకొన్న వారి దళాలమధ్యనుంచి వెడుతూంటే పెట్లూరా ముఖం చిట్లించేడు. విసువుతో పెదవులు కరచుకొన్నాడు.

తణిఖీ ఆఖరున కొత్త రిక్రూట్ల పటాలాలు ఒకవరస, క్రమంలేకుండా మందలాగ జెండావద్దకు నడిచేయి. అక్కడ ఫాదర్ వాసిలీ బైబిల్ చేతబట్టుకొని నిలబడివున్నాడు. సైనికులు ఒకరి తర్వాత ఒకరు ముందు బైబుల్ నూ, తర్వాత జెండాకొసభాగాన్ని కళ్ళకద్దుకొంటున్నారు. ఆ సమయంలో తలవని తలంపుగా ఒక ఘటన జరిగింది.

ఏవిధంగా సాధించేరోగాని ఒక ప్రతినిధివర్గం మైదానంలోకి రాగలిగేరు. తిన్నగా పెట్లూరావద్దకు వచ్చేరుకూడా. రాయబారులకుముందు కలపవర్తకుడు బ్లవ్ స్టీన్ చేతిలోని పళ్ళెంలో ఒకరొట్టె, వుప్పు పెట్టుకొని నడుస్తున్నాడు. ఆయన వెంట బట్టలదుకాణదారు, ఫక్సు ఇతరవర్తకులు వచ్చేరు.

బ్లవ్ స్టీన్ బహువినయంగా నమస్కరించి పళ్ళెం పెట్లూరావేపు జాచేడు. ప్రక్కనేవున్న ఆఫీసరొకడు ఆపళ్ళేన్ని అందుకొన్నాడు.

“నగరంలోని యూదు ప్రజలం ప్రభుత్వాధిపతులైన తమయెడ గౌరవం, విశ్వాసం ప్రకటిస్తున్నాము. మా వినతి పత్రాన్ని స్వీకరించ ప్రార్థన.”

చేతికిచ్చిన కాగితాన్ని పైనుంచి క్రిందికి ఒక్కమారు పెట్లూరా చూసేడు.

“బాగుంది.”

ఫక్సు ముందుకడుగు వేసేడు.

"మాదుకాణాలు తెరుచుకొనేటందుకు అనుమతించా లని మా ప్రార్థన. పోగ్రాములు జరగకుండా రక్షణకల్పించా లని కోరుతున్నాము."

ఫకన్స చివరిమాటలను అస్పష్టంగా గొణిగేడు.

ఆ మాటలు చెవినిపడగానే పెట్లూరా కనుబొమ్మలు చిట్లించేడు. ముఖాన కోపం దీపించింది.

" మాసైన్యాలు పోగ్రాములకు దిగవు. జ్ఞాపకం వుంచుకోండి."

ఫకన్స నిస్పృహతో చేతులు జారవిడిచేడు.

పెట్లూరా భుజం అదిరింది. సమయంకానిసమయంలో రాయబారులు రావడం చాలా చికాకు కలిగించింది. మీసాలు పెదవులతోపట్టి పీక్కుంటున్న గోలుబ్ వేపు తిరిగేడు.

"కర్నల్ ! ఇదిగో నీ కోసక్కులమీద ఫిర్యాదు వచ్చింది. విచారణచేసి, తగినచర్యలు తీసుకో."

తర్వాత ఇన్‌స్పెక్టరు వేపు తిరిగేడు.

"పెరేడ్ ప్రారంభించు."

గోలుబ్‌తో వ్యవహరించవలసివస్తుందని పాపం ఆ రాయబారు లెన్నడూ అనుకోలేదు. ఇప్పుడాపరిస్థితి ఎదు రయ్యేసరికి చల్లగా జారుకొనసాగేరు.

ప్రజల దృష్టిఅంతా ఇప్పుడు కవాతువేపే వుంది. ఆఫీసర్ల ఆజ్ఞలు ఖంగుఖంగున వినిపించసాగేయి.

గోలుబ్ పైకివేమీ కోపంలేనట్లుగా రాయబారుల దగ్గిరికెళ్ళేడు. వాళ్ళకిమాత్రమే వినిపించేటట్లు తిట్టేడు.

"ఫోండి. గాడిదకొడుకుల్లారా: మళ్లీ కనిపించేరంటే కైమా వండేస్తా"

బ్యాండు ప్రారంభమైంది. మొదటి పటాలం మైదానంలోంచి కదిలింది. వారు పెట్లూరా నిలబడిన వేదిక ప్రక్కకు రాంగనే ఒక్కమారు 'స్లావా' అని నినదించేరు. అక్కడి నుంచి ముందుకు కదిలి, రాజవీథిగుండా ప్రక్కవీథులలో అదృశ్యమయిపోయేరు. తర్వాత ఒక్కొక్క కంపెనీయే ఒక దానితర్వాత మరొకటి వందనంచేస్తూ కదిలిపోతున్నాయి. వానిముందు నీటయిన యూనిఫారాలలో ఆఫీసర్లు షికారు పోతున్నట్లు చేతిలో కర్రలు వూపుకుంటూ నడిచిపోతున్నారు.

పెరేడ్‌లో ఆఖరున కొత్తరిక్రూట్ దళాలువచ్చేయి. ఒకరికొకరికి అడుగు కలియదు. ఒకరినొకరు త్రోసుకొంటూ మందమాదిరిగా వాళ్ళు కదిలివచ్చేరు.

వాళ్ళని సరిగ్గావుంచడానికీ, నడిచేటట్లు చేయడానికీ ఆఫీసర్లు ఎంతయినా శ్రమపడ్డారు. కాని లాభంలేకపోయింది. కాళ్ళీడుస్తూ నడుస్తున్నారు. ఒక కంపెనీ వెళ్ళిపోయింది. రెండోకంపెనీ వేదికప్రక్క నడుస్తూంది. దానిలోని ఒక రైతు కుర్రవాడు పెట్లూరావేపు నోరుతెర్రపెట్టిచూస్తూ గోతులో అడుగువేసి బోర్లాపడ్డాడు. వానిచేతిలోని రైఫిలు రాళ్ళమీదపడి ఘల్లుమంది. లేవడానికి ప్రయత్నించేడు. కాని, వెనకవాళ్ళువచ్చి తొక్కేసేసరికి మళ్ళీబోర్లబడ్డాడు.

ఆ ఘటనచూసి ప్రేక్షకులలో కొందరు పక్కున నవ్వేరు. కంపెనీ విడిపోయి చెల్లాచెదురుగా మైదానానికి

అడ్డుపడి తోచినట్లు సాగిపోయేరు. పడిపోయిన కుర్రవాడు రైఫిల్ తీసుకుని పరుగెత్తిపోయి తనవాళ్ళలో కలిసేడు.

ఈ దృశ్యం చూడడానికిష్టంలేక పెట్లూరా తల తిప్పుకొన్నాడు. ఇంక కొసకంటూ నిలబడ్డం ఇష్టంలేక వేదికదిగి కారువేపు చరచర నడిచిపోయేడు. అతనివెనకనే వస్తూ ఇన్‌స్పెక్టరు బహువినయంగా అడిగేడు.

"శ్రమదు విందుకుండరా?"

పెట్లూరా పుల్లవిరుపుగా సమాధానం ఇచ్చేడు.

"ఉండను."

చర్చిచుట్టూవున్న కోరడివద్ద సెర్జీ బ్రూజక్, వాల్యా, క్లిమ్‌కాలు నిలబడి ఈ దృశ్యాలన్నీ చూస్తున్నారు. సెర్జీ కోరడికమ్మీలు పట్టుకొని, తన ఎదుటవున్న ఆ జనంవంక మహా అసహ్యంతో చూస్తున్నాడు.

"పోదాం, రా, వాల్యా! తమాషా ముగిసింది లే"— అని గట్టిగా, వెక్కిరింతగా అన్నాడు. చుట్టుపక్కలవాళ్ళంతా అతనివేపు ఆశ్చర్యంతో తేరిపారిచూసేరు.

వాళ్ళవేపేనా చూడకుండా సెర్జీ ద్వారంవేపునడిచేడు. అతని వెనకనే అతనిచెల్లెలు వాల్యా, మిత్రుడు క్లిమ్‌కా అనుసరించేరు.

*　　　*　　　*

కర్నల్ చెర్న్యాకూ, కోసక్కు కెప్టెనూ కమాండెంటు ఆఫీసుదగ్గరే గుర్రాలనుఆపి దిగేరు. వార్తాహరసైనికుడొకడు

కనిపిస్తే గుర్రాల్ని ఆతనికి వప్పచెప్పి గబగబా ఆఫీసులో ప్రవేశించేరు.

"కమాండెంటు ఎక్కడ?"

వార్తాహరసైనికుడు సత్తేడు.

"ఎరగనండి. ఎక్కడకో వెళ్లేరు."

చెర్న్యాక్ ఆఫీసంతా కలయచూసేడు. మహాసహ్యంగా చెత్తా, చెదారంతో వుంది. గదినిండా అడ్డదిడ్డంగా పక్కలు వేసి వున్నాయి. కొంతమంది ఇంకా దొర్లుతూనేవున్నారు. మరికొందరు పక్కలేనా చుట్టుకోకుండా లేచి ఎక్కడికో పోయేరు.

"ఏమిటీ పందులగుంట. పందుల్లా దొర్లుతూ పడుండడానికి ఎవళ్ళు అనుమతించేరురా."

చెర్న్యాక్ కోపంతో కేకలుపెడుతూ చేతిలోని కొరడాతో ఎడపెడ విసిరేడు.

ఒక కోసక్కు లేచి కూర్చుని, త్రేనుస్తూ సణిగేడు.

"ఎందుకల్లా అడిసిపడతావు? ఇక్కడా ఒకడు అడిసిపడేటందుకున్నాడు. చాలులే."

"ఏమిట్రా అన్నావు?"—

అంటూ చెర్న్యాక్ అటుతిరిగేడు.

"ఎవరనుకున్నావురా, బద్మాష్! నేనెవరో ఎరుగుదువా? కర్నల్ చెర్న్యాకీని. తెలిసిందా. గాడిదా. లే. ఏం కదలరేం? చర్మం వలిపించేస్తా."

మహాకోపంతో చెర్న్యాక్ గార్డుగదివేపు ఉరికేడు.

"ఒక్కనిముషం ఇస్తున్నా. ఆ చెత్తాచెదారం అంతా ఊడ్చి బాగుచెయ్యాలి. పక్కలు ఎత్తెయ్యాలి. ఆ వెధవ మొహాలు కడుక్కోవాలి. పచ్చిపాళ్ళల్లా వున్నారు. మీారు కోసక్కులా ?"

ఆ కోపంలో చెర్న్యాక్ దారికి అడ్డంగావున్న నీళ్ళ కడవను ఒక్కతన్ను తన్నేడు.

కెప్టెన్ కూడా కావలసినంత హంగామా చేసేడు. నోటికివచ్చిన తిట్లల్లా వుపయోగించాడు. వాటికి సాయంగా మూాఁకొసల కొరడాతో వీపులు ఛెళ్ళుమనిపించి ఉరికించేడు.

"చీఫ్అటామన్ కవాతు మైదానంలో వున్నారు. ఇక్కడికీ రావచ్చు. లేవండి."

కోసక్కులు పరిస్థితులు బాగులేవని గ్రహించేరు. కొరడాలతో వీపుచిట్లేలావుందని గ్రహించేరు. కర్నల్ చెర్న్యాక్ సంగతి వాళ్ళు అదివరకే విన్నారేమో...గబ గబ కదిలేరు.

మరుక్షణంలో ఆఫీసంతా ఒబ్బిడిఅయింది.

"ఖైదీలసంగతికూడా చూడ్డంమంచిది."—అని కెప్టెన్ సలహాఇచ్చేడు. "వీళ్ళు ఎల్లాంటివాళ్ళని చేర్చేరో ఏమో. 'చీఫ్అటామన్' చూస్తానంటే పేచీవస్తుంది."

"ఏదిరా తాళం. తలుపుతియ్యి."—అని చెర్న్యాక్ కాపలాదారుని అడిగేడు. సార్జెంటు పరుగెత్తివచ్చి తలుపు తీసేడు.

చెర్న్యాక్ కమాండెంట్‌ను పిలుచుకురమ్మన్నాడు.

"కమాండెంటు ఏడీ? ఎంతసేపు కూర్చోవాలేం! పిలుచుకురాండి. గార్డుని వాకిట్లోకి పిలవండి. రైఫిళ్ళని బైనెట్లు లేవేం?"

"మేము: నిన్ననే వచ్చేమండీ"—అంటూ సార్జెంటు సర్ది చెప్తూ కమాండెంటుకోసం పరుగెత్తేడు.

కెప్టెన్ కొట్టుగదితలుపును కాలితో తన్ని తోసేడు. లోపలవున్న వాళ్ళు కొందరులేచి నిలబడ్డారు. కొందరు కదలలేదు.

"తలుపు బార్లా తెరు. కనబడ్డంలేదు."–అని చెర్న్యాక్ ఆజ్ఞాపించేడు.

తలుపు బార్లా తెరిచేరు. ఆతడు లోనికివచ్చి ఖైదీల ముఖాలు పరీక్షగా చూసేడు.

మంచంమీదకూర్చున్న ముసిలివానివంక తిరిగి "నిన్నెందుకు పట్టుకొన్నారు" అని అడిగేడు.

ఖంగుమన్న ఆ గొంతుక వినేసరికి ముసిలివాడు భయపడ్డాడు. మంచంమీదినుంచిలేస్తూ, కట్టుకున్న లాగు పైకి లాగి పట్టుకున్నాడు.

"నాకు తెలియదండి. లాక్కొచ్చిపడేసేరు. కూర్చున్నాను. మా ముంగిట్లో కట్టినగుర్రం పోయింది. కాని, నాకు దాని గొడవేం తెలియనేతెలియదు."

కెప్టెన్ మధ్యలో ప్రశ్నించేడు—"ఎవరి గుర్రం?"

"పటాలపుగుర్రంలేండి. మాయింట్లో మకాంచేసిన సైనికులే దానిని అమ్మి తాగేసేరు. ఇప్పుడు నేరం నామీద పెడుతున్నారు."

చెర్నొవ్యాక్ ముసలివాణ్ణి ఆపాదమస్తకం ఒక్క పర్యాయం పరీక్షగా చూసేడు.

"నీ బట్టాపాతా తీసుకు పరుగెత్తు, ఫో."

మళ్ళీ ప్రశ్నకుకూడా తావియ్యకుండా సామోగాయామెవేపు తిరిగేడు.

ముసలివాడు తనచెవుల్నే నమ్మలేకపోయేడు. కళ్ళు చికిలిస్తూ కెప్టెను అడిగేడు.

"నన్ను పొమ్మంటారా?"

ఎంత త్వరగాపోతే అంతమంచిదన్నట్లు కెప్టెన్ తల ఎగరవేసేడు.

అప్పుడే చెర్నొవ్యాక్ సామోగాయామెను ప్రశ్నిస్తున్నాడు.

"నిన్నెందుకు పట్టుకొన్నారు?"

నోట్లోవున్న రొట్టెముక్కను నమలకుండానే మింగేసి ఆమె టపీమని సమాధానం ఇచ్చింది.

"అయ్యగారూ! దురన్యాయమండి. ఆలకించండి. బీదనుండని. నా సారాతాగి నన్నే జైలులోపెట్టడం ఎక్కడన్యాయవుందా?"

"సారావ్యాపారం చేస్తావా?"

"వ్యాపారంలేదు. బండలులేదు. కమాండెంటువచ్చి నాలుగు సీసాలు పట్టుకెళ్ళేడు. ఒక్కకానీ చేతులో పెట్టలేదు. అదీ వ్యాపారం. ఇచ్చినంతా తాగెయ్యడం. ఏగాని ఇవ్వకపోవడం. ఇదికూడా వ్యాపారమేనా? మీరేచెప్పండి."

"చాలునులే. ఫో."

రెండోమాటు చెప్పించుకోనేవరకూ ఆమె నిలబడ లేదు. తన బుట్టతీసుకొని వొంగి వొంగి దండాలుపెడుతూ గుమ్మంవేపు జరిగింది.

"మీతల్లికడుపు చల్లగుండాలి."

దోలిన్నిక్ ఈ వ్యాపారం అంతా కళ్ళార్పకుండా చూస్తున్నాడు. ఇదంతా ఏమిటో వాళ్లెవళ్ళకీ తెలియడం లేదు. ఎవళ్ళో పెద్దఆఫీసర్లు వచ్చేరనీ, తమసంగతి తేల్చేస్తు న్నారనీ అర్థంఅయింది.

ఈమారు చెర్న్యాక్ దృష్టి దోలిన్నిక్ మీద పడింది.

"నీ మాటేమిటి?"

"కర్నల్ గారు పలకరించినప్పుడు లేవవేం?" అని కెప్టెన్ గద్దించేడు.

దోలిన్నిక్ సావకాశంగాలేచి నిల్చున్నాడు.

"నిన్నెందుకు పట్టుకొన్నారు?"

దోలిన్నిక్ నున్నగాగీసిన కర్నల్ గడ్డాన్నీ, మెలితిప్పిన సన్నని మీసాన్నీచూస్తూ ఒక్కక్షణంనిశ్శబ్దంగానిలబడ్డాడు. మనస్సులో ఆలోచనలు పరుగులు వారేయి. నోటికొచ్చింది చెప్పిచూద్దాం - అనుకొన్నాడు.

"ఎనిమిదిగంటలు దాటేక వీధిలో వున్నానని పట్టు కొచ్చేరు."

దానిఫలితం ఎలావుంటుందోనని ఆదుర్దాతో ఎదురు చూసేడు.

"రాత్రివేళ నువ్వేంచేస్తున్నావుమరి?"

"అప్పటికి రాత్రికానిదేనా? పదకొండుగంటలేఐంది."

ఆ సమయానికి నోటికొచ్చిందేదో చెప్పేడేకాని, అది ప్రయోజనకారి కాగలదని ఆత డూహించనేలేదు.

కాని కర్నల్ ఆజ్ఞ వినేసరికి కాళ్ళు కదలలేదు.

"లేచిఫో."

తనకోటుకూడా తీసుకోకుండా దోలిన్నిక్ హడా విడిగా వెళ్ళిపోయేడు. అప్పటికప్పుడే కెప్టెన్ తర్వాతిఖైదీని ప్రశ్నిస్తున్నాడు.

అందరికీ ఆఖరున వాళ్ళు కోర్చాగిన్‌ను ప్రశ్నించేరు. ఇదంతా జరుగుతూంటే ఆశ్చర్యంతో చూస్తూ ఆతడు కూర్చుండిపోయేడు. దోలిన్నిక్ విడుదలయ్యేడంటే ఆతనికి మొదట నమ్మిక కలగలేదు. వాళ్ళెందుకువదిలేస్తున్నారో? దోలిన్నిక్‌ని...కర్ఫ్యూఆజ్ఞ ధిక్కరించినందుకు పట్టుకొన్నా రన్నాడు....అప్పుడు ఆలోచన తట్టింది.

కర్నల్ మామూలుగా జెల్‌ట్సర్‌ను ప్రశ్నించేడు.

"నిన్నెందుకు పట్టుకొన్నారు?"

ఆదుర్దాతో వణికిపోతూ ఆమంగలి సమాధానంఇచ్చేడు.

"ఆందోళన చేస్తున్నా నంటారు దేవరా! కాని, ఆందోళన అంటే ఏమిటో నాకు తెలియదు."

చెర్న్యాక్ సావధానుడయ్యేడు.

"ఏమిటేమిటి? ఆందోళనా? నువ్వేం ఆందోళన చేసేవు?"

జెల్ట్సర్ నాకేం తెలుసునన్నట్లు చేతులు వెళ్ళ బెట్టేడు.

"అదేమిటో నాకే తెలియదు. చీఫ్ అటామన్‌గారి కివ్వడానికై యూదులనుంచి దరఖాస్తు మీద సంతకాలు పెట్టిస్తున్నారన్నాను."

"ఏమిటా దరఖాస్తేమిటి"—అన్నాడు చెర్న్యాక్. నమిలేసేలాగ చూస్తూ కెప్టెన్ జెల్ట్సరు దగ్గరకెళ్ళేడు.

"పోగ్రాములు జరక్కుండా చూడవలసిందంటూ అర్జీ. తమరెరగని దేముంది? ఈపట్టణంలో పెద్ద పోగ్రాము జరిగింది. జనం అంతా హడిలిపోయేరు.

చెర్న్యాక్ మండిపడ్డాడు.

"చాల్లే. లంజకొడక. దరఖాస్తుసంగతి మరిచిపోకుండా వీపు... ..."

మాట సగంలోనే కెప్టెన్ వేపు తిరిగేడు.

"వీడిని జాగ్రత్తపెట్టు. హెడ్‌క్వార్టర్సుకు తీసుకురా. వీడిసంగతి నే కనుక్కుంటా. ఈ దరఖాస్తులూ అదీ ఏమిటో చూస్తా."

జెల్ట్సర్ గిడగిడలాడేడు. కాని, కెప్టెన్ కొరడాతో ఒక్కటేసేడు.

"నోర్ముయ్! తొత్తుకొడక."

జెల్ట్సర్ బాధతో కళ్ళనీళ్ళు తుడ్చుకుంటూ మూలకుపోయి కూర్చున్నాడు. అతికష్టంమీద ఏడుపు ఆపుకొన్నాడు.

ఈ హడావిడి జరుగుతుండగా పావెల్ లేచినిలబడ్డాడు. జెల్ట్సర్ కాక ఖైదులోవున్న దాత షొక్కడే.

చెర్న్యాక్ ఆతనిముందు నిలబడి ఆపాదమస్తకం పరీక్షగా చూసేడు.

"నువ్వేంచేస్తున్నావు వికటుడా?"

కర్నల్ ప్రశ్నను టలాయించడానికి వీల్లేదు. నోటికి వచ్చింది చెప్పేసేడు.

"బూటుమడమకోసం జీనుమెత్త కోసేను."

"ఎవరిదా జీను?"

"మా యింట్లో ఇద్దరు కోసక్కులిన్ని పెట్టేరు. వాళ్ళదో పాతజీనుంది. దానిమెత్తనుంచి ఇంతముక్క కోసుకున్నా. నన్నిక్కడి కీడ్చుకొచ్చేరు."

ఏదన్నామెత్తగా మాట్లాడితే ఖైదునుంచి బయట పడవచ్చునవే వెర్రిఆశతో "అది తప్పని తెలియదండి."- అన్నాడు.

కర్నల్ పావెల్ వంక చీకాకుపడుతూ చూసేడు.

"మహాగట్టివాళ్ళనేరేడు. వెధవ కమాండెంటుగిరీ ..."

ద్వారంవేపు తిరుగుతూ కర్నల్ పావెల్‌ను పొమ్మని అరిచేడు.

"ఇంటికి ఫో. మీనాన్నతో చెప్పు. ఇల్లాంటి వెధవ పనులు చెయ్యకుండా ఓనూరు బుద్ధిచెప్పమను. వెళ్ళు."

అందరూ గదివదిలి బయటకువచ్చేరు. పావెల్‌కు ఇంకా నమ్మకంలేదు. ఉద్వేగంతో గుండెలు కొట్టుకొంటున్నాయి. చటుక్కున నేలబడివున్న దోలిన్నికోటు తీసి భుజాన వేసు కున్నాడు. కర్నల్ కేసి తిరిగికూడా చూడకుండా బయట జారుకున్నాడు. మరుక్షణంలో వీధిలో పడిపోయేడు.

జెల్‌స్టరు దురదృష్టవంతుడు. ఖైదీలలో అతడొక్కడే మిగిలిపోయేడు. హడలిపోతూ ద్వారంవేపు అడుగువేసేడు. చుట్టుప్రక్కల ఎవరూలేరు, బయటకుపోదామని అతని ఆలోచన కాని, ఆ సమయానికే సెంట్రీగార్డు గదికివచ్చేడు. వస్తూనే కొట్టుగది తలుపుమూసి తాళంవేసి సమ్మాంలో బైఠాయించేడు

ముంగిట్లోకివచ్చేక చెర్న్యాక్ తిరిగిచూసేడు. తాను చేసినపని సంతృప్తికరంగా వుందనిపించింది.

"మనం రావడం మంచిపనేఅయింది. చూడు.ఇక్కడ ఎంత అసహ్యంగావుందో. ఈ కమాండెంటుగాడిని ఓ రెండు వారాలపాటు బొక్కలోపడేస్తే రోగం కుదిరిపోతుంది. సరే, నడు, వేళయింది."

సార్జంటు వాకిట్లో తనదళాన్ని బారుతీర్చి నిలోచ్చ పెట్టేడు. కిర్నల్ రాంగనే ఆయనదగ్గరకువచ్చి సేల్యూట్ చేసేడు.

"అంతా సర్దేశాం."

చెర్న్యాక్ రికాబులో కాలుపెట్టి ఒక్క ఎగురులో గుర్రంమీద కూర్చున్నాడు. కెప్టెన్ గుర్రం మొరాయిస్తూంటే దానితో తంటాలుపడుతున్నాడు. కర్నల్ కళ్ళెం సవరించి చేతిలోకితీసుకొని సార్జంటుకు కర్తవ్యం నిర్దేశించేడు.

"తాను పోగుచేసిన తుక్కు సరుకునంతనీ నేను వదిలిపెట్టేనని మీ కమాండెంటుతో చెప్పు. అతని వ్యవహారం బాగులేదనీ, ఓ రెండువారాలపాటు గార్డుగదిలో శిక్షపడు

తుందన్నానని చెప్పు. ఇంక, ఆ గదిలోవున్న వెధవాయిని, హెడ్ క్వార్టర్సుకి వెంటనేపంపు. గార్డుని సంసిద్ధంచెయ్యి."

సార్జెంటు సేల్యూట్ చేసేడు.

"చిత్తం."

కర్నలూ, కెప్టెనూ చర్చిముందున్నమైదానంవేపు గుర్రాల్ని వురికించేరు. అప్పటికప్పుడే పెరేడ్ ముగిసిపో వచ్చింది.

* * *

ఒకదానితర్వాత ఒకటిగా పెరటికంచెలు ఏడింటిని దాటి పావెల్ పెరళ్ళకడ్డబడి పోతున్నాడు. ఆయాసం వచ్చేసింది ఏడురోజులనుంచి తిండీతిప్పలూ సరిగ్గాలేవు. కాళ్ళుచేతులు కట్టేసి పడేసినట్లు చీకటికొట్టులో పడివుండడం. ఆతని బలంఅంతా ఇగిరిపోయింది. అడుగుకూడా పడ్డంలేదు.

ఇంకిప్పు డెక్కడికి వెళ్ళడం? ఇంటిమాట తలపెట్టను కూడా కూడదు. బ్రూజక్ ఇంటికెడితే, అక్కడ తన్ను ఎవ రన్నాచూస్తే వాళ్ళకొంపకు చుట్టుకుంటుంది.

ఏంచెయ్యాలో తోచలేదు. మళ్ళీ పరుగు ప్రారం భించేడు. కూరపెరళ్ళకు అడ్డపడి, మళ్ళీ కంచెలమీదుగా ఎక్కిదిగుతూ పట్టణం చివరకు చేరుకొన్నాడు. ఎదురుగా పెద్దఎత్తయిన కోరడి అడ్డుతగిలింది. అటూ ఇటూ చూసేడు. కోరడికి ఆవలగా ఫారెస్టువార్డెన్ ఇల్లు కనబడేసరికి ఆశ్చర్యం వేసింది. అనుకోకుండానే ఆతనికాళ్ళు అక్కడికి లాక్కొ చ్చేయి. అక్కడి కెళ్ళాలనే ఆలోచన ఏక్షణంలోనూలేదని

చెప్పగలడు. కాని, రావడం అక్కడికే వచ్చేడు. ఎల్లా జరిగిందో ఆతనికి అర్థంకాలేదు.

కొంచెంసేపు విశ్రాంతికావాలి. కాస్త ఆలోచించుకొని తర్వాత ఏంచెయ్యాలో నిర్ణయించుకోవాలి. ఫారెస్టు వార్డెన్ పెరట్లో ఓమూలాగా పాకఒకటి వుండాలి. అటువేపు ఎవరూ రారు. అక్కడ దాగుకోవచ్చు.

అటూయిటూచూసి నెమ్మదిగా కోరడీఎక్కి లోపలికురికాడు. చెట్ల గుబురుల్లోంచి లీలగా కనిపిస్తున్న ఇంటిమీాద ఓ కన్నువేసి పెరట్లోవున్న పాకవేపు నడిచేడు. కాని, తీరాచూస్తే పాకచుట్టూ వుంటూవచ్చిన పువ్వులతీగలూ, చెట్లూ చచ్చిపోయి బంగనబయలులావుంది. వేసవికాలపు ఎండల్లో అవి చచ్చి ఎండిపోయేయి.

ఇంకోచోటికి పోదామని •వెనకతిరిగేడు. కాని, ఆ అవకాశం లేకపోయింది. భోంయ్ మంటూ ఓ కుక్క మీాద కొచ్చింది. చరాలున వెనక్కితిరిగేడు. ఇంటివైపునుంచి ఒక పెద్దకుక్క ఉరుకుల్లో వచ్చేసింది. దాని అరుపులతో పెరడు అంతా ప్రతిధ్వనించి పోతూంది.

దానిని వెనక్కికొట్టడానికి పావెల్ తయ్యారయ్యేడు. మొదటితన్నుతో అది వెల్లకిలాపడింది. మళ్ళీసర్దుకొని మీాద వురకడానికి పొంచి సిద్ధంగా తయారయింది. ఇంతలో ఎరిగున్నగొంతు వినిపించివుండకపోతే ఆ కయ్యం ఏ విధంగా ముగిసేదో.

"ట్రెసర్! ట్రెసర్! రా."

తోన్యా పరుగెత్తుకొంటూ వచ్చి కుక్క మెడనున్న పట్టీపట్టుకొని వెనక్కిలాగి పట్టుకొంది. అటుతర్వాతకాని ఆమె పావెల్‌ను చూడలేదు. అప్పుడైనా ఆమె వెంటనే ఆతనిని గుర్తుపట్టలేదు

"ఇక్కడేంచేస్తున్నావు? నిష్కారణం నీ కేసును. అదృష్టవంతుడివి. దగ్గర్లోవుండిపోయాగనక గాని"

అప్పటికి ఆతనిగుర్తు తెలిసింది. అప్పుడేనా ఆతనిలో కోర్చాగిన్ పోలికలున్నాయనేగాని, ఆతడే కోర్చాగిన్ అయి వుంటాడనుకోలేదు.

పావెల్ ఆమెను పలకరించేడు.

"తోన్యా! గుర్తుపట్టలేదా?"

ఆమె ఆశ్చర్యానికి మేరలేదు. వెర్రిగా కేకపెట్టి, ఆదుర్దాగా ఆతనివేపు పరుగెత్తింది.

"నువ్వా? పావెల్!"

తోన్యా తననుఉసికొల్పుతూందనే భ్రమతో బ్రెసర్ ఒక్క గంతువేసింది.

తోన్యా దాని నెత్తిమీద రెండు కొట్టింది.

"పడుకో, పడుకో."

బ్రెసర్ వెనక్కితగ్గింది. తనకేదో అవమానం జరిగిపోయినట్లు వెనకకాళ్ళమధ్య తోకముడిచి ఇంటివేపు నడిచింది.

తోన్యా పావెల్ చేయిపట్టుకొంది.

"నిన్ను విడిచిపెట్టేరా?"

"నన్ను పట్టుకొన్నట్లు నీకు తెలుసునన్నమాట!"

నాకన్నీ తెలుసు. లిజా చెప్పింది. అయితే... వాళ్ళు వదిలిపెట్టేరా? ఎల్లా రాగలిగేవు?"

"వదిలేసేరు. అయితే పొరపాటున వదలిపెట్టేరు. మాట్లాడకుండా చక్కా వచ్చేను. ఈపాటికి మళ్ళీ వెతుకుతూ వుండివుంటారు. ఇంక ఇక్కడికి రావడం, ఎల్లావచ్చేనో నాకే తెలీదు. మీ పాకలో కాస్త పడుకుందామని నా ఆలోచన. కాళ్ళు తేలిపోతున్నాయి."

దయా, దాక్షిణ్యం, ఆదుర్దా, ఆనందంతో ఆమె ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. ఆతని రెండుచేతులూ పట్టుకుంది.

"పావెల్, నువ్వంటే నాకెంత ప్రేమో తెలుసా? మొండితనంగా ఆరోజున ఆల్లావెళ్ళిపోయేవు. నాకెంత కష్టం కలిగింది? ఇప్పుడేనా వచ్చేవు. మళ్ళీ పోనివ్వను. ఏమైనా సరే. మాయింట్లో వీలుగానే వుంటుంది. నీయిష్టంవచ్చినంత కాలం వుండొచ్చు."

పావెల్ తలతిప్పేడు.

వాళ్ళకి నేనిక్కడ దొరికిపోతే ఏమన్నావుందా? నేను రాను."

ఆమె ఆతనిచేతులు గట్టిగా పట్టుకొంది.

"రాకపోతే ఇంకెప్పుడూ నీతోమాట్లాడేది లేదు. మీ ఆర్టెమ్ ఇంట్లోలేడు. ఆయన్నిపట్టుకొని ఎస్కార్టుతో ఇంజను నడపడానికి తీసుకుపోయేరు. రైల్వేవాళ్ళందరినీ పట్టుకు తీసుకెడుతున్నారు, పనిలోకి. మరి నువ్వెక్కడికెడదామని?"

పావెల్ కు భయం లేకపోలేదు. తనకు ప్రేమపాత్రురాలైన ఆమెను ఇబ్బందిలో పెట్టడం ఇష్టంలేదు. కాని తప్పనూలేదు ఆకలి, అలసట, బాధతో లొంగిపోయేడు.

తోన్యా తనగదిలో సోఫామీద అతనిని కూర్చోబెట్టి తల్లిదగ్గర కెళ్ళింది.

"ఇల్లా విను. అమ్మా! కోర్చాగిన్ నా గదిలో వున్నాడు. తెలుసుగా, అతను. అసలు సంగతి విను. ఒక బోల్షివిక్ నావికుడు తప్పించుకుపోవడానికి ఆతను సాయ పడ్డాడు. దానికోసం అరెస్టుచేసేరు. జైలులోంచి తప్పించుకొచ్చేడు. ఎక్కడికి పోవడానికీ చోటులేదు. అమ్మా ఆతడిని మనింట్లో వుండనిద్దామే."

ఆ మాటలు చెప్తూంటే తోన్యా కంఠంనిండివచ్చింది.

తల్లి కూతురుముఖంలోకి పరీక్షగాచూసింది.

"ఉండనీ. కాని ఎక్కడ వుంచుతావు?"

తోన్యా సిగ్గుపడింది.

"నా గదిలోనే. సోఫాలో పడుకుంటాడు. ఇప్పటి మట్టుకు నాన్నగారితో చెప్పవద్దు."

కూతురు తడబడుతూ మాట్లాడటంచూసి తల్లి ఆమె వంక తేరిపారిచూసింది.

"ఇతనికోసమేనా ఈమధ్య ఎల్లాగో వుంటున్నావు?"

"ఊఁ."

"కాని, అతడు యింకా బాగా చిన్నపిల్లగాడు."

తోన్యా తన గౌనుకొంగు నలుపుతూ సిగ్గుపడింది.

నిజమే... అయితేనేం. పారిపోయివచ్చాడుగనకగాని లేకుంటే కాల్చేసేవారే."

కోర్చాగిన్ మకాము ఎకటూరినామి హైలోవ్నాకు చాలా కంగారే పుట్టించింది. ఆతని అరెస్టు, తా మెవ్వరూ ముక్కు మొగం ఎరగని ఈ పిల్లవాడిమీద కూతురు మమ కారమూ ఆమెకేదోలా వున్నాయి.

కాని, తోన్యా దానిని గమనించలేదు. తల్లి అంగీక రించినట్లే తేల్చుకుంది. ఇంక పావెల్ సౌకర్యాల విషయం ఆలోచించసాగింది.

"అమ్మా! ఆతడికి ముందు స్నానం ఏర్పాటు చెయ్యాలి. రైలులో బొగ్గేసేవాడిలా మహామురికిగావున్నాడు. ఎన్నాళ్ళయిందో నీళ్ళుపోసుకోని. ఆసంగతి నేనుచూస్తాలే."

ఆమె వెంటనేవెళ్ళి పొయ్యిలో నిప్పేసింది. కట్టు కొనేటందుకు బట్టలు వెతికి తెచ్చింది. అన్నిసిద్ధంచేసి పావెల్ దగ్గరకొచ్చింది. మాటకవకాశం ఇవ్వకుండా తిన్నగా స్నానాలగదికి లాక్కుపోయింది.

"నీ బట్టలన్నీ మార్చుకో. ఇదిగో కట్టుకునేందుకు తెచ్చేను. నీబట్టలు వుతుకుతాలే. అవి బాగుచేసేవరకూ వీటిని కట్టుకో." అంటూ ఆమె అక్కడున్న కుర్చీవేపు చూపింది. దానిమీద నీలిరంగు నావికుల కోటూ, ఒకలాగూ నీటుగా మడతపెట్టి వున్నాయి.

పావెల్ ఆశ్చర్యపడ్డాడు. తోన్యా నవ్వింది.

"ఓమాటు విచిత్రవేషాలకోసమని వీటినివాడేను. నీకు సరిగ్గా సరిపడతాయి. ఊఁ, ఇంక కదులు. నువ్వు నీళ్ళుపోసుకొనేసరికి అన్నంఏర్పాట్లు చూస్తా."

ఆమె బయటికిపోయి తలుపువేసేసింది. ఇంక బట్టలు విడిచి, నీళ్ళుపోసుకోవడంతప్ప పావెల్ మరోమాట అనడానికూడా వ్యవధి నివ్వలేదు.

ఒకగంట తర్వాత ముగ్గురూ - తల్లీ, కూతురూ, కోర్చాగినూ - కలిసి భోజనానికి కూచున్నారు.

పావెల్ ఆవురావురంటూ వున్నాడేమో మూడుమాట్లుమారు వేయించుకున్నాడు. ఎకటారినామిహైలోవ్నా వద్ద మొదట కొంత బిడియపడ్డాడుకాని, ఆమె చూపిన ఆదరణలో అది వదలిపోయింది.

భోజనం అయేక అంతా తోన్యాగదిలో చేరేరు. ఎకటారినా కోరికమీద పావెల్ తన కథఅంతా చెప్పేడు.

అతడు తన కథనం ముగించేక ఎకటారినా ప్రశ్నించింది.

"ఇప్పుడింకేమిటి నీపథకం?"

పావెల్ ఒక్కక్షణం ఆలోచించేడు.

"ఓమాటు ఆర్టెమ్‌ను చూడాలి. తర్వాత యిక్కడి నుంచి వెళ్ళిపోవాలి."

"కాని, ఎక్కడికెడతావు?"

"ఉమాన్‌కిగాని కీవ్‌కిగాని చేరుకోగలననుకొంటా. ఎక్కడికనేది ఇంకా నేనేమీ అనుకోలేదు. ఎక్కడికో ఓ చోటికి పోవాలి. సాధ్యమైనంత త్వరగా పోవాలి."

పరిస్థితులలో వస్తున్న మార్పులు చూస్తూంటే ఆతని కాశ్చర్యంగా వుంది. ఆరోజు ప్రొద్దుట ఆ చీకటికొట్టులో వున్నాడు మధ్యాహ్నానికి తోన్యా ప్రక్కన, శుభ్రమైన దుస్తులలో కూర్చునివున్నాడు. పైగా విడుదలయిపోయేడు కూడా.

జీవితగతి ఎంత విచిత్రంగావుందో అనుకొన్నాడు : ఒక్కక్షణంలో ఆకాశంలో కారుమేఘాలు కమ్ముకొని వుంటాయి. మరుక్షణంలో సూర్యుడు జాజ్వల్యమానంగా వుంటాడు. మళ్ళీపట్టుకొంటారేమోనన్న భయంలేకపోతే, ఆ క్షణంలో అతనికన్న ఆనందపురుషుడు వేరొక డుండడు.

ఈ పెద్దఇంటిలో కూర్చుండి వున్నంతమాత్రాన అరెస్టు తప్పించుకోవడం సాధ్యంకాదని ఆతడెరుగును. ఇక్కడ దాగడంకన్న, వెళ్ళిపోవడమే మేలు. అయినా వెళ్ళిపోవడమంటే ఎల్లాగో అనిపిస్తూంది. ఇక్కడే కూర్చుని తోన్యాతోకలసి గారిబాల్డీకథ చదువుతూంటే ఎంత బాగుంటుంది. ఆమాట తలుచుకుంటేనే ఎంతో సంతోషం అనిపిస్తూంది. తనలాగే గారిబాల్డీ కూడా నిలవనీడలేక చాలా కష్టపడివుంటాడు. తాను జైలులోవున్నదల్లా ఒక్క వారం రోజులే, కాని ఏడాదినుంచి వున్నట్లనిపిస్తూంది.

ఊహు. తనలో యోధుడికుండవలసిన లక్షణాలులేవు.

"ఏమి టాలోచిస్తున్నావు?"

తోన్యా ఆతనికేసి వొరిగి ప్రశ్నిస్తూంది. ఆమె నీలి కళ్ళలో అగాధాలు కనబడ్డాయి.

"క్రిస్టినా సంగతి చెప్పేదా?"

"చెప్పు."

తనతో పాటు ఖైదులో వున్న ఆ పల్లెటూరిపిల్ల విచార కరగాథను పావెల్ నెమ్మదిగా వినిపించేడు.

టక్ టక్ మంటూ గడియారంలో సెకండ్ల ముల్లు చక్కర్లు ముగిస్తూంది.

"...మళ్ళీ కనిపించలేదు." అని అతను అతికష్టం మీద ఆమె కథను ముగించేడు. తోన్యా విచారంతో తలవొంచు కొంది. ఆమె కళ్ళ నీళ్ళు కమ్మేయి.

పావెల్ ఆమెవంక పరిశీలనగా చూసేడు.

"ఈ వేళ రాత్రి నే వెడతా."

"ఏమీ లేదు. ఎక్కడికి పోవడానికి వీలు లేదు."

తోన్యా ఆతని జుట్టును వేళ్ళతో సవరిస్తూ ప్రతిమాలుతున్నట్లు మాట్లాడింది.

"తోన్యా, నువ్వో సాయం చేసిపెట్టాలి. స్టేషనుకు ఎవరినేనా పంపి ఆర్టెమ్ సంగతి తెలుసుకోవాలి. సెర్యోజాకి ఓ చీటీ ఇస్తాను. ఒకచోట రివాల్వరొకటి దాచేను. అది తెచ్చు కోవడానికై నేను పోవీలు కాదు. సెర్యోజా తెచ్చిపెడతాడు. వాడికా చీటి అందించగలవా?"

తోన్యా లేచింది.

"నేను ఇప్పుడే బయలుదేరుతున్నా. లిజా సుఖా రోకను చూడాలి. మే మిద్దరం కలిసి స్టేషనుకెడతాం. ఆ చీటి ఏమిటో వ్రాయి. సెర్యోజాకి పట్టుకెళ్ళి ఇస్తా. ఆత డుండేది ఎక్కడ? నిన్ను చూడాలంటే రమ్మనేదా?"

పావెల్ ఒక్క క్షణం ఆలోచించేడు.

"రివాల్వరు తీసుకొని, చీకటిపడ్డాక మీా పెరటిదగ్గిరికి రమ్మను."

తోన్యా తిరిగివచ్చేసరికి చాలా ఆలస్యమయింది. అప్పటికి పావెల్ గాఢనిద్రలోవున్నాడు. ఆమె తట్టేటప్పటికి లేచి కూర్చున్నాడు.

ఆర్టెమ్ ఈవేళే తిరిగివచ్చేడు. ఇక్కడికిప్పుడే వస్తాడు. అతనికి హామీాగా వుండడానికి లిజానాన్న వొప్పుకొన్నారు. దానిమీాద ఓగంటసేపు తిరిగిరావడానికి ఒప్పుకొన్నారు. ఇంజను స్టేషనులోవుంది. నువ్విక్కడున్నావని చెప్పడానికి వీలులేక పోయింది. చాల అవసరంగా మాట్లాడవలసిన పని వుంది. ఓమాటు రమ్మన్నాను. అదుగో వచ్చేడు."

తలుపుతియ్యడానికి తోన్యా పరుగెత్తింది. తన కళ్ళను తానే నమ్మలేనంత ఆశ్చర్యంతో ఆర్టెమ్ గుమ్మంలో నిలబడిపోయేడు. తోన్యా వెళ్ళి తండ్రి పడుకొన్న గదితలుపు గట్టిగా జేరవేసింది. ఆయన టైఫస్‌తో మంచంమీాదున్నాడు. అన్నదమ్ముల మాటలు ఆయన చెవినిబడతాయి.

మరుక్షణంలో ఆర్టెం తమ్ముడిని గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు.

* * *

చివరకు నిర్ణయంఅయింది. పావెల్ మరునాడే బయలుదేరుతాడు. కజాటిన్ వెళ్ళేరైలులో బ్రూజక్ అతడిని తీసుకెళ్ళడానికి ఏర్పాటుచేస్తానని ఆర్టెమ్ చెప్పేడు.

ఆర్టెమ్ పెద్ద మాటకారీ కాదు, ఆర్భాటం మనిషీ కాదు. అల్లాంటివాడు కనబడదనుకొన్న తమ్ముడు కనబడేసరికి ఆనందం పట్టలేకపోయేడు.

"ఇంకన్నీ ఏర్పాటయినట్లేనా? రేపొద్దుటే అయిదు గంటలకల్లా వేన్ హౌస్ దగ్గరకెళ్ళు. బొగ్గు, కట్టెలూ దింపుతూన్న సమయంలో నువ్వు చల్లగా దూరు. ఓగంట కూర్చుని మాట్లాడితే బాగుండును. కాని పోయితీరాలి. రేపు నిన్ను పంపించే వెడతా. రైల్వే పనివాళ్ళందర్నీ ఒక బెటాలియన్‌గా ఏర్పాటుచేస్తున్నారు. ఒకప్పుడున్నప్పుడు జరిగినట్లే ఇప్పుడూను. తుపాకులుచూపి పనిచేయిస్తున్నారు."

ఆర్టెమ్ విడవలేక విడవలేక తమ్ముడిని వదిలేడు.

చీకటిపడింది. పిస్టల్ తీసుకొని సెర్జీ వచ్చే వేళ అయింది. అతను వచ్చేటంతవరకూ పావెల్ ఆ చీకటిగదిలో ఆ మూల నుంచి ఈ మూలకు పచార్లు ప్రారంభించేడు. తోన్యా, ఆమె తల్లీ జబ్బుగావున్న తండ్రివద్ద కూర్చున్నారు.

కోరడిమూలలో సెర్జీని పావెల్ కలుసుకొన్నాడు. మిత్రులిద్దరూ ఎంతో ఆప్యాయంగా చేతులూ, చేతులూ పట్టుకొని మాట్లాడుకొన్నారు. సెర్జీతో వాల్యాకూడా వచ్చింది. చాలనెమ్మదిగా గొంతుతగ్గించి వాళ్ళు మాట్లాడుకొన్నారు.

"పిస్తోల్ తీసుకురాలేదు. మీ పెరటినిండా పెట్లూరా సైనికులు మకాంచేసివున్నారు. దొడ్డినిండా బళ్ళువిప్పేరు. నెగళ్ళు మండుతున్నాయి. అందుచేత చెట్టుఎక్కడం కుదరలేదు. రివాల్వరు తేలేకపోయేను."

పావెల్ ఆతనిని ఆశ్వాసించేడు.

"ఫర్వాలేదులే. అది లేకపోవడమే మంచిదేమో. తుపాకీకూడా వుండగా దొరికిపోతే మరీచిక్కు. కాని, దానిని పోనివ్వకు. తీసి జాగ్రత్తపెట్టు."

వాల్యా పావెల్‌కు దగ్గరగా జరిగింది.

"నువ్వెప్పుడు బయలుదేరుతావు?"

"రేపు తెల్లవారేముందు."

"ఎల్లాదాటిపోయి వచ్చేవేమిటి? చెప్పు."

సన్నని స్వరంలో పావెల్ జరిగిందంతా చెప్పేడు. ఆఖరున మిత్రులనుంచి సెలవు తీసుకొన్నాడు. ఎప్పుడూ ఎరగనిది ఆతని కంఠం నిండివచ్చింది.

వాల్యాకంఠంకూడా గద్గదికం అయింది.

"వెళ్ళిరా, మరిచిపోకు."

ఇద్దరూ చీకట్లో కలిసిపోయేరు.

ఇల్లు నిశ్శబ్దంగావుంది. గడియారపు టక్కు టిక్కులు తప్ప మరోధ్వని వినబడ్డంలేదు.

ఆ యింట్లోవున్న వాళ్ళలో ఇద్దరికి ఆపూట నిద్ర పట్టే స్థితేలేదు. మరోఆరుగంటలలో విడిపోనున్నప్పుడు నిద్ర మాత్రం ఎల్లావస్తుంది? బహుశా మళ్ళీచూసుకోవడంకూడా జరగకపోవచ్చు. తమ మనస్సులలోవున్న భావోద్వేగాలను విప్పిచెప్పలేనటందుకూడా వ్యవధిచాలదు.

యౌవనపు పొంగులేగాని వాంఛ నెరుగని దశ. కౌగిలింతలూ, ముద్దులూమధ్య మైమరచి జాగ్రదతీతస్థితికి పోయే వయస్సు.

తల్లిప్రేమతప్ప పావెల్ ఇతరులనుంచి తన్నులేగాని యితరం ఎరగడు. ఎప్పుడూ కష్టాలుతప్ప ఎరగడు. ముద్దులు ప్రేమలో ఇంత స్వర్గ అనుభవంవుంటుందనికూడా అతనికి తెలియదు. నేటికీ యువతి ఆతనికా సుఖం రుచిచూపింది.

ఆమెతలను గట్టిగా అదుముకొని మూర్ఛన్నాడు. ఆ చీకట్లోకూడ ఆమెకళ్ళు మిలమిలలాడుతున్నట్లు తోచేయి.

"తోన్యా! నిన్నెంతగా ప్రేమిస్తున్నానో చెప్పలేను. చెప్పడానికి నాకే తెలియదు."

ఆతని మెదడు స్తంభించినట్లుంది. ఆమె శరీరం ఆతని స్పర్శకు అవశమైపోతూంది... కాని, ఆతడు కౌగిలింతను మించి సాహసించలేకపోయేడు.

"తోన్యా! ఈ గంద్రగోళాలన్నీ తగ్గిపోయేక ఎక్కడో ఒకచోట మెకానిక్‌గా పని దొరకకపోదు. నీకింకా ఆనాటికి ఈ మమకారం, అభిమానం, ప్రేమ వుంటే నా భార్యవు అవుదువుగాని. నిన్ను నెత్తినపెట్టుకుంటా. నిన్ను కష్టపెట్టను. బాధించను."

ఎకటారినామిహైలోవ్నా తాము కౌగిలించుకొని వుండగా చూస్తే అన్యథా భావిస్తుందనే భయంతో ఇద్దరూ దూరం దూరంగా జరిగి కూర్చున్నారు.

ఒకరినొకరు మరచిపోకుండా ప్రమాణాలు చేసుకొన్నారు. నిద్రలేమితో కళ్ళుమూసుకుపోతుంటే తెల్లవారే ముందు తలగడలపై వాలేరు. అల్లే నిద్రపోయేరు.

ప్రొద్దుటే ఎకటారినా పావెల్‌ను లేపింది. ఆతడు హడావిడిగా పక్కదిగేడు. స్నానాలగదిలోకిపోయి దుస్తులు వేసుకొంటూండగా ఆమె కూతుర్ని లేపింది.

మసకచీకటిలో యిద్దరూ స్టేషనువేపు పరుగెత్తేరు. దొడ్డిదారిని కలపఅడితులదగ్గర కెళ్ళేసరికి అక్కడ ఆర్టెమ్ ఆలస్యమైపోతూందని ఆదుర్దాపడుతు కనిపించేడు. ఇంజను వెనక బొగ్గుపెట్టె నింపివుంది.

వీరు వెళ్ళేసరికి ఇస్-బుస్‌మంటూ పెద్దఇంజను బొగ్గుపెట్టెకోసం వచ్చింది. కేబిన్‌లోంచి బ్రూజక్ తొంగిచూస్తూ కనబడ్డాడు.

తోన్యాకూ, ఆర్టెమ్‌కూ సెలవుచెప్పి పావెల్ హడావిడిగా ఇంజన్‌లోకి ఎక్కేడు. అది ముందుకు సాగింది. పావెల్ వెనక్కితిరిగి చూసేడు. దూరాన ఇద్దరూ లీలగా కనిపిస్తున్నారు. గాలిలో ఆమె బ్లౌజు రెపరెప కొట్టుకొంటూంది. జుట్టు చెదురుతూంది. అంతదూరంలో ఆమె జేబురుమాలు ఎగరవేస్తూంది.

ఆర్టెమ్ తోన్యావంక చూసేడు. ఆమెకళ్ళ నీలాలు కమ్ముతున్నాయి. అర్థం అయింది. ఒక్కనిట్టూర్పు విడిచేడు.

"పావెల్ చిన్నపిల్లడనుకొన్నా. వీళ్ళిద్దరూ..."

రైలు దూరాన అదృశ్యం అయేక ఆతడు ప్లాట్‌ఫాం నుంచి సెలవు తీసుకొన్నాడు. ఆతని పెద్ద అరచేయిలో ఆమె చిన్నిచేయి అదృశ్యం అయింది.

"మరిచిపోకు."

దూరాన రైలు వేగంగా పరుగెత్తిపోతున్న చప్పుడు వినిపిస్తూంది.

# ప్రకరణం ౬

ఒక వారంరోజులపాటు నగరం చుట్టూ కందకాలూ, ముళ్ళతీగల కంచెలూ లేచేయి. ఫిరంగికాల్పుల మోతలు, తుపాకీ చప్పుళ్ళమధ్యనే నగరవాసులు నిద్రపోయి లేస్తున్నారు. అర్ధరాత్రిదాటేక ఓ గంటసేపు హోరుతగ్గేది. అప్పుడుకూడా మధ్యమధ్య ఔట్‌పోస్టులలోవున్న దళాలు ముందుకు గదుముకోవడానికి ప్రయత్నించినప్పుడు తుపాకుల ఫెళఫెళలు వినిపిస్తూన్నాయి. తెల్లవారేసరికి రైలుస్టేషన్ వద్దనున్నఫిరంగిదళం హడావిడిగాతయ్యారీలుప్రారంభిస్తుంది. నల్లని ఫిరంగిమూతులు ఉన్నట్లుండి భయంకరంగా గర్జిస్తూన్నాయి. మళ్ళీ ఇంతమందూ, గుండూ కూరడానికి సైనికులు చరచర కదులుతారు. ఫిరంగికాల్చేవాడు 'లాన్యార్డు' లాగినప్పుడల్లా నేల కంపించిపోతూంది. పట్టణానికి రెండుమైళ్ళలో వున్న గ్రామాన్ని కమ్ముకుంటూ ఫిరంగిగుళ్ళు మన్నూ, మంటలూ ఎగచిమ్ముతున్నాయి. ఆగ్రామాన్ని కమ్యూనిస్టు సైన్యాలు ఆక్రమించుకొని నిలబడివున్నాయి.

గ్రామంమధ్యన ఒక ఎత్తయిన గుట్టమీద పోలిష్ మఠం ఒకటుంది. ఆ మఠం ఆవరణలో కమ్యూనిస్టులు తమ ఫిరంగుల్ని పెట్టేరు.

ఆ ఫిరంగిసైన్యంలోని కమిస్సార్ పేరు జామోట్సిన్. ఆతడు ఫిరంగిబండి వెనకదన్నుమీద తలపెట్టుకొని నిద్ర పోతున్నవాడల్లా చటుక్కున అదిరిపడిలేచేడు. నడుమున బెల్టుపెట్టుకొంటూ, తలమీదుగా యెగురుతున్న ఫిరంగిగుళ్ళ ధ్వనుల్ని ఆలకించేడు. అవి పేలిన ధ్వనులతో మఠం ఆవరణఅంతా ప్రతిధ్వనించిపోతూంది.

"ఆ నిద్ర ఏదో రేపు చూద్దాం. లేవండి."

ఫిరంగిబలగంకూడా వాని ప్రక్కనే పడుకొనివున్నారు. కమిస్సారుమాట వినబడగానే వారు గబగబాలేచేరు. ఒక్క సిదోర్చుక్ మాత్రం బద్ధకంగా ఆవలిస్తూ, అర తెరిచిన కళ్ళతో దిక్కులు చూసేడు.

"ఇంకా తెల్లవారనైనాలేదు. అప్పుడే మొదలెట్టేరే, ముండాకొడుకులు. కేవలం ఏడిపించడంకోసంకాకపోతే ఏం మునిగిపోయిందని?"

జామోట్సిన్ నవ్వేడు.

"రాడీముండాకొడుకులు. వాళ్ళకి నువ్వునిద్రపోయేవో లేదో పట్టిందా?"

ఫిరంగి బలగం గొణుగుతూనే కదిలేరు.

కొద్దినిముషాలలో కమ్యూనిస్టుల ఫిరంగులుకూడా సమాధానం ఇవ్వడం ప్రారంభించేయి. ఈమారు నగరంలో కూడ వాని ప్రతిధ్వనులు వినిపించసాగేయి.

నగరంలోని పంచదార ఫ్యాక్టరీ పొగగొట్టానికి చివర నాలుగు పలకలు అమర్చి దానిమీద ఒక పెట్లూరా ఆఫీ

సరూ, టెలిఫోను మనిషీ బైఠాయించేరు. గొట్టంలోపలి నుంచి ఒక ఇనపనిచ్చెన వుంది. దానిమీదుగా వాళ్ళు పైకి చేరేరు.

అక్కడినుంచి చూస్తే పట్టణంఅంతా కళ్ళకుకట్టినట్లు కనిపిస్తూంది. వాళ్ళు అవసరమైన దిశగా ఫిరంగులు కాల్చడానికి ఆజ్ఞలిస్తున్నారు. వాళ్ళచేతుల్లోవున్న దూరదర్శినులలోంచి నగరాన్ని ముట్టడిస్తున్న కమ్యూనిస్టుసైన్యాల పోబడులన్నీ కనిపిస్తున్నాయి. ఆ రోజున కమ్యూనిస్టుసైన్యాలు మహోచుగ్గావున్నాయి. దూరంనుంచి ఎడాపెడా కాల్చుకుంటూ ఒక సాయుధరైలుస్టేషన్వైపుగా, నెమ్మదిగా జరిగివస్తూంది. దాని వెనకగా కాల్బలదళాలు దాడికి బయలుదేరి వస్తున్నాయి. అనేకమార్లు బాహాబాహి పోరాటంలో నగరాన్ని స్వాధీనపరచుకోవడానికి ఆనాడు ఎర్రసైన్యదళాలు ప్రయత్నించేయి. కాని, పెట్లూరాసైన్యం పట్టువిడువలేదు. కందకాలు నిజంగా నిప్పులేన్ని ఉముస్తున్నాయి. ఎడతెరిపిలేని కాల్పులధ్వనులు విడబరచటానికి వీలులేకుండా కలిసిపోయి పెద్ద హోరుగా వినిపిస్తున్నాయి. ఆ గుళ్ళవర్షాన్ని తట్టుకోలేక బోల్షివిక్ సైన్యాలు వెనక్కి తగ్గవలసివస్తూంది. ఎందరో సైనికులు యుద్ధభూమికి బలియైపోయేరు.

ఈ వేళ కమ్యూనిస్టు సైన్యాలు ఎడతెరపి లేకుండా మహాపట్టుదలతో యుద్ధం సాగిస్తున్నాయి. తుపాకి కాల్పులతో దిక్కులు ప్రతిధ్వనించిపోతున్నాయి. పొగగొట్టం మీదినుంచిచూస్తే వారు ఒక్కొక్క అడుగే గదుముకొని వస్తున్నారని తెలుస్తూంది. పదడుగులు పరుగెత్తడం, బాక్క

బోర్లా పడుకోవడం, చటుక్కున లేచి మరో పదడుగులు వేయడం—ఇల్లాగే గడుసుకొని ముందుకు వస్తున్నారు. ఒక క్షణంపాటు రైలుస్టేషను వాళ్ళచేతుల్లో పడిపోయినట్లే అనిపించింది. పెట్లూరా సైన్యాలలోని కొద్దిపాటి రిజర్వుదళాల్ని అటు పురికించేరు. కాని ఫలితంలేకపోయింది. బోల్షివిక్ సైనికులు వారి రక్షణలలో గండికొట్టేరు. శత్రువులకాల్పుల్ని కూడా లెక్కచేయకుండా తెగించి వీధుల కడ్డుపడ్డారు. స్టేషన్ ప్రక్కనే వీధు లో కాపుదలగావున్న పెట్లూరా సైన్యం మూడో రెజిమెంటు వారిని ఆపడానికి ఆఖరు ప్రయత్నంచేసి విఫలమయింది. బోల్షివిక్కుల ఒత్తిడిని తట్టుకోలేక గోడలూ గొందెలూ దూకి నగరంమధ్యకు పారిపోయింది. వారు మళ్ళీసర్దుకొని నిలబడ్డానికి ప్రయత్నించేలోపున ఎర్ర సైన్యం బైనట్లతో దాడిచేసి వీధులన్నింటినీ శత్రువిముక్తం చేసింది.

రైల్వేపనివారి కుటుంబాలు ఇళ్ళ నేలమాళిగలలో తలదాచుకొంటున్నాయి. బ్రూజక్ కుటుంబంకూడా మంచుపెట్టెలావున్న ఆ మాళిగలో చలికీ, భయానికీ వొణికిపోతూ కూర్చున్నారు. ఎర్రసేనలు వీధుల్లోకి వచ్చేయని తెలిసేక సెర్జీబ్రూజక్‌ను పట్టుకోవడం ఎవరికీ సాధ్యంకాలేదు. వాళ్ళ అమ్మ గోలచేస్తున్నా వినిపించుకోలేదు. వీధిలోకివచ్చేసేడు. అదేసమయంలో ఒకసాయుధ మోటారు వెర్రిగా కాలుస్తూ వీధివెంట వెళ్ళిపోయింది. దాని వెనువెంటనే పెట్లూరా సైన్యాలు ఉరకలేస్తూ పారిపోయివచ్చేయి. వాళ్ళల్లో ఒకడు సెర్జీ ఇంటిఆవరణలోకి వచ్చేడు. మెళ్ళోవున్న తూటాల

బెల్టూ, నెత్తిమీద టోపీ, కైఫీలూ అక్కడపారేసి దొడ్డివేపు గోరడిఎక్కి, ప్రరికిపారిపోయేడు. సెర్జీ వీధిలోకి తొంగిచూసేడు. పెట్లూరాసైనికులు కాలికివచ్చినట్లు పరుగెత్తుతూ నగరానికి నైరుతిదిశలోవున్న చిన్న స్టేషన్ వేపు పోతున్నారు. వారికి వెనక కాపుగా నిలబడి సాయుధ మోటారుశకటం కాల్పులు సాగిస్తూంది. నగరంలోకి వున్న దండుబాటమీద నర సంచారంలేదు. ఇంతలో దూరాన ఒక ఎర్రసైనికుడు కని పించేడు. కొంతదూరం పరుగునవచ్చి, పడిపోయినట్లుగా బొక్కబోర్లా పడుకున్నాడు. అలా పడుకొనే కాలుస్తు న్నాడు. దాని వెనక ఒకడు. ఆ వెనక మరొకడు ... వాళ్ళ రాకను గమనిస్తూ సెర్జీ గుమ్మంలో నిలబడ్డాడు. ఎర్రసైనికులు లేచి మళ్ళీ పదిబారలు పరుగెత్తిపడుకొన్నారు. మళ్లీ కాల్పులు... మళ్ళీ లేచి పరుగు... ...ఇంతలో ఒక చీనావాడు మెడ నిండా వల్లెవాటుగా మరతుపాకి తూటాలబెల్టులతో వచ్చేడు. రెండుచేతుల్లోనూ రెండు చేతిబాంబులు తీసుకొని అతడు ఉరకలేస్తూ వచ్చేడు. వాళ్ళవెంట మరో ఎర్రసైనికుడు భుజాన మరతుపాకీపెట్టుకొని వచ్చేడు. అతడినిచూస్తే ఇరవ య్యేళ్ళుకూడా వున్నట్లులేదు. నగరంలో అడుగుపెడుతున్న ఎర్రసైన్యదళాన్ని చూసేసరికి సెర్జీ సంతోషం పట్టలేక వీధి లోకి పరుగెత్తి వచ్చేడు.

"జిందాబాద్."

సెర్జీ హఠాత్తుగా పరుగెత్తివస్తూ ఆపుకోలేక చైనా వానిమీదపడ్డాడు. ఎర్రసైనికుడు మాట్లాడకుండా అతనిని

ఆఖరుచేసేసేవాడే. కాని సెర్గీముఖాన కనిపించిన ఆనందోత్సాహాలే అతని ప్రాణాన్ని కాపాడేయి.

చైనావాడు రొప్పుతూనే అడిగేడు.

“పెట్లూరా ఎక్కడున్నాడు?”

సెర్గీ వానిమాటను వినిపించుకోనేలేదు. ఒక్క గంతులో వెనక్కి వెళ్ళి పెట్లూరాసైనికుడు తను ఆవరణలో పారేసి పోయిన తూటాలబెల్టు మెడలో వేసుకొన్నాడు. టోపీ నెత్తిన పెట్టుకొని, ఆ తుపాకీతీసుకొని ఎర్రదళాలవెంటబడ్డాడు. నైరుతి దిశగావున్న చిన్నస్టేషనును పట్టుకొనేవరకూ ఎవ్వరూ ఆతనిని గమనించనేలేదు. స్టేషన్‌లో పెట్లూరాసైన్యాలతాలూకు మందుగుండుసామగ్రితోనూ, సరఫరాలతోనూ రైలుబళ్ళు నిలబడివున్నాయి. వాటిని ఎర్రసైన్యాలుపట్టుకొని, పెట్లూరా సైన్యాన్ని దూరానవున్న చిట్టడివిలోకి నెట్టేసేయి. అక్కడ విశ్రాంతి తీసుకొని సర్దుకొనేటందుకు నిలబడ్డాయి.

ఆ సమయంలో సెర్గీ వాళ్ళదృష్టిలోపడ్డాడు. ఇంతక్రితం మరతుపాకీతో కనిపించిన ఆ యువసైనికుడు అతనినిచూసి ఆశ్చర్యం ప్రకటించేడు.

“నువ్వెక్కడినుంచి వచ్చేవు?”

“ఈవూరివాడినే. మీకోసమే ఇన్నాళ్ళూ కాచుకూర్చున్నా.”

మరుక్షణంలో అతనిచుట్టూ ఎర్రసైనికులు చాలమంది గుమికూడేరు.

చైనావాడుకూడా వాళ్ళల్లోవున్నాడు. అతడు సెర్గీని తాను చూసేనని వచ్చీరాని రష్యన్‌భాషలో చెప్పేడు.

"నేను చూసేను. 'ఎర్రసైన్యం జిందాబాద్' అనడం విన్నాను. అతను బోల్షివిక్కే, మనవాడే. గట్టివాడు."— అంటూ ఆతడు సెర్జీ భుజంతట్టి పెద్దనవ్వు నవ్వేడు.

సెర్జీ ఆనందం పట్టలేకపోయాడు. ఆతడిని వాళ్ళు తమతో వెంటనే చేర్చుకొన్నారు. వాళ్ళతో కలిసి ఆతడు సన్నీలతో దాడిచేసి స్టేషన్‌ను పట్టుకొన్నాడాయె.

నగరప్రజ వీధులలోకి వచ్చింది. ఈ వారంపదిరోజులుగా వాళ్ళు కదలడానికిలేదు, మెదలడానికిలేదు. నానా అగచాట్లూ పడుతున్నారు. ఎర్రసైన్యం నగరంలోకి ప్రవేశించగానే నేలమాళిగలలోంచి బయటికి వచ్చేసి, గుమ్మాల్లో నిలబడ్డారు. సెర్జీతల్లీ, ఆతని చెల్లెలు వాల్యా గుమ్మంలో నిలబడి ఎర్రసైనికులతో కలిసి వెడుతున్న సెర్జీని చూసేరు. వానినెత్తిమీద టోపీలేదు. మెడలో వల్లెవాటుగా తూటాల బెల్టూ. భుజాన రైఫిలూ వున్నాయి.

ఆంటోనినా వాసిలేవ్నాకు ఆతనినిచూడగానే ఎంతో కోపం వచ్చింది.

సెర్యోజా చివరకీ పేచీలో దిగేడన్నమాట. రైఫిల్ ఒకటి వేసుకొని ఊరేగడంకూడాను. ఆనక ఏం గొడవలు వస్తాయో... అని భయపడుతూ ఆంటోనినా కంగారుపడింది.

"సెర్యోజా! ఇంటికిరారా."—అంటూ ఆమెఅరచింది.

"ఒరేయ్! నిర్భాగ్యుడా! ఇంటికిరా చెప్తాను."

ఇదివరకెన్నోమార్లు గూలపోలీలుతిన్న సెర్యోజా ఈ వేళ తల్లివేపు కళ్ళురిమి చూసేడు.

"ఊరికే అరవకు. నేను వచ్చేదిలేదు."

ఆంటోనినా కోపం పట్టలేకపోయింది.

"మీ అమ్మకు చెప్పేసమాధానం ఇదట్రా, నిర్భాగ్యుడా! అయితే, ఇంక ఇంట్లో అడుగుపెట్టు చెప్తాను."

సెర్జీ వెనక్కి తిరిగికూడా చూడలేదు.

"రానులే."

నోటమాటకూడా లేకుండా ఆంటోనినా నిలబడిపోయింది. ఆమె ప్రక్కనుంచే వరుసతర్వాత వరుసగా సైనిక పంక్తి కదిలి ముందుకు సాగిపోయింది.

వాళ్ళలో ఒకడు ఆమెకు ఆశ్వాసం చెప్తూనే ముందుకు కదిలిపోయేడు.

"ఏడవకమ్మా! నీకొడుక్కేమీ ఫర్వాలేదు. కమిస్సారై వస్తాడుచూడు."

ప్లాటూను అంతా హుషారుగా నవ్వుతూ కదిలిపోయింది. కంపెనీ అగ్రభాగంనుంచి పాట వినిపించింది.

...వీరకాహాళులు మ్రోగుతున్నవోయ్
పోరుకు తుపాకి నెత్తండోయ్
స్వేఛ్ఛారాజ్యము సాధించుటకై మన
వీరత్వముచూపి...

సైనికులంతా గొంతు కలిపేరు. ఆ గొంతులమధ్య సెర్జీ జంబోరాకంఠం ఖంయ్‌మని వినిపించింది.

లెస్జిన్‌స్కీల ఇంటి కోరడిగేటుముందు ఒక అట్ట కట్టివుంది. దానిమీద "రెవ్‌కమ్" (రివొల్యూషనరీ కమిటీ)

అని వ్రాసివుంది. దాని ప్రక్కనే పెద్దపోస్టరు అతికివుంది. దానిలో ఒక పొడుగుపాటిసైనికుడు "రెడార్మీలో చేరేవా?" అన్న మాటవేపు వేలితో చూపుతున్నట్లు చిత్రించబడింది.

ఆ రాత్రి అంతా రాజకీయశాఖకు చెందిన మనుష్యులు పట్టణంఅంతటా పోస్టర్లు అతికేరు. వానిప్రక్కనే పెపెట్రోగ్రాడ్ ప్రజలగురించి రివెల్యూషనరీకమిటీ చేస్తున్న మొట్టమొదటి ప్రకటన కనబడుతూంది.

"కామ్రేడ్స్! శ్రామికసైన్యాలు నగరం పట్టు కొన్నాయి. సోవియట్లఅధికారం తిరిగి నెలకొల్పబడింది. నగరంలో శాంతి-భద్రతలను కాపాడవలసిందని కోరు తున్నాం. దుర్మార్గులయిన హంతకుల్ని తరిమేసేం. వాళ్ళింక రాకుండా వుండాలంటే, వాళ్ళు మళ్ళీ కన బడకుండా చెయ్యాలంటే రెడార్మీలోచేరండి. కార్మిక ప్రజల ప్రభుత్వాన్ని సర్వవిధాలా బలపరచండి. సేనా దళనాయకుని చేతిలో నగరసేనలమీంది అధికారం వుంటుంది. పౌరపాలనా వ్యవహారాలన్నీ రివెల్యూష నరీ కమిటీచేతుల్లో వుంది.

(సం) దోలిన్నిక్.
అధ్యక్షుడు
రివెల్యూషనరీ కమిటీ.

లెస్లిన్ స్కీ లయింట్లో కొత్తముఖాలు కనిపించేయి. 'కామ్రేడ్' అన్నమాట నిన్నటివరకూ ప్రాణాపాయకరంగా వున్నదల్లా, ఈవేళ అది గౌరవనీయం అయింది. నాలుగు

మూలలా ఆమూ ఓ పినబడుతూంది. 'కా|మేడ్' అనే పిలుపు నేను సర్వార్థసాధకం.

దోలిన్నిక్ నిద్రాహారం ఎరగడు. విప్లవకరప్రభుత్వాన్ని స్థాపించడంలో ఆమూజీవప్రదంగికి ఊపిరిసలపడంలేదు.

"పార్టీకమిటీ" అనేమాట వ్రాసిన ఒక కాగితం ఒక చిన్నగది గుమ్మానికి అంటించివుంది. ఆ గదిలో కామ్రేడ్ తొణకకుండా బెణకకుండా గంభీరంగా ఇగ్నాత్యేవా కూర్చునివుంది. సోవియటుప్రభుత్వశాఖల స్థాపన బాధ్యతను రాజకీయశాఖవారు ఆమెకూ, దోలిన్నిక్‌కూ వప్పచెప్పేరు.

మరునాటికల్లా ఆఫీసులు ఏర్పడ్డాయి. గదులలో మేజాలు, వానిమీద టైప్‌రైటర్లు, వానిముందు గుమాస్తాలు అంతా అమిరేరు పూజిస్కీకి నగరంలో సప్లయిల బాధ్యత వప్పచెప్పేరు. ఈవిధంగా సోవియటు అధికారం కాలూనుకొంది. పూజిస్కీ నగరంలోని పంచదార ఫ్యాక్టరీలో మెకానిక్ వద్ద తోడుగా పనిచేసేవాడు. చాల సమర్థుడు, బంగారుమనిషికాని, ఆతడు మహోపట్టుదలతో తన పనికి పూనుకొన్నాడు. పంచదార ఫ్యాక్టరీ యజమానులు అప్పటికి చేసేదేమీలేక అణగిపడివున్నా మహోకసిగా వున్నారు. పూజిస్కీ-పోరాటం వాళ్ళతోనే పడింది.

పంచదారఫ్యాక్టరీకార్మికుల్ని సమావేశపరచి ఆతడు వున్న పరిస్థితులను వారిముందు పెట్టేడు.

"మళ్ళీ వెనకటిబాధలు మనకుండవు. మన తాత తండ్రులూ, మనమూ ఈ పోటిస్కీలకి నానాచాకిరీచేసేం. చాలు

సెంక. వాళ్ళకి మనం రాజభవనాలు సప్లయిచేస్తే ఆ మహా రాజులు చావకుండా మనకింత కూడు పడేశారు.''

“పోటిస్కీ దొరలూ, సాంగుజ్కో ప్రభువులూ ఎంత కాలంనుంచి మన వీపులమీద సవారుచేస్తున్నారు? రష్యాను, యూక్రేనియను కార్మికుల్ని పీల్చిపిప్పిచేసినట్లే పోటోస్కీ పోలిషుకార్మికుల్ని ఎంతమందిని పీల్చిపిప్పిచేయలేదు? వాళ్ళే ఈవేళ సోవియటు ప్రభుత్వం పోలిషు కార్మికుల్ని నేలబెట్టి రాసేస్తుంది సుమా యని హెచ్చరిస్తున్నారు.

“కామ్రేడ్స్! ఆమాటలు నమ్మొద్దు. వివిధజాతుల కార్మికుల కీనాడున్నంతస్వేచ్ఛ మరెప్పుడూ లేదు. శ్రామికు లందరూ సోదరులు. ఇంక ఈ పెద్దలమాటా? వాళ్ళని జాగ్రత్త పెడదాం. భయపడకండి.''

అతడు బల్లమీద ఒక గుద్దుగుద్ది తన వుపవ్యాసం కొనసాగించేడు.

“అన్నదమ్ములమధ్య పేచీలూ, రక్తపాతమూ కలిగించిన దెవరు? శతాబ్దాల పొడుగునా పోలిష్ రాజులూ, ప్రభువులూ పోలిష్ రైతుల్ని తురుష్కులతో యుద్ధాలకు తోలేరు. ఒక జాతిమీద మరోజాతిని ఎగదోలేరు. వాళ్ళ మూలంగా ఎంతరక్తం ప్రవహించిందో, ఎంతెంతలేని కష్టాలు వచ్చేయో ఒక్కమారు జ్ఞాపకం చేసుకోండి. వానివలన లాభపడ్డ దెవరు? ఇంక ఇదెంతో కాలం సాగదు. పీడకుల్ని మట్టుపెట్టేద్దాం. “ప్రపంచకార్మికులారా! ఏకముకండి.''— అంటూ బోల్షివిక్కులిచ్చిన నినాదంతో వాళ్ళకి గుండెలు

అదిరిపోతున్నాయి. మన క్షేమం, భవిష్యత్తు అందులోనే వున్నాయి కామ్రేడ్స్! కమ్యూనిస్టుపార్టీలోకిరండి. చేరండి.

"ఒకరోజున పోలిష్ రిపబ్లికూ ఏర్పడుతుంది. కాని అది పోటిస్కీలరాజ్యంగాక, సోవియటురాజ్యం అవుతుంది. పోటిస్కీ-లవంటి వాళ్ళనితీసేస్తాం. సోవియటురాజ్యంలో అధికారం అంతా మనదే. మీరంతా బ్రోనిక్ పెటాస్జిన్‌స్కీని ఎరుగుదురుగా? ఆయనను మన ఫ్యాక్టరీ కమిస్సారుగా రివెల్యూషనరీ కమిటీ నియమించింది. 'ఇదివరలో మన ఆవాహనా, విసర్జనాలేదు. ఇకముందు మనదే సర్వమూ. కామ్రేడ్స్! ఇది సంతోషించదగిన రోజు. తాచుపాములు బొరియలలోదూరి బుసలు కొడుతున్నాయి. వాటిని లెక్క చేయకండి. కార్మికుల ప్రయోజనాలనే గమనించండి. ప్రపంచంలోని ప్రజలందరినీ సోదరులనుగా భావించండి. వారితో సోదరభావం నెలకొల్పండి."

ఎంతో ఆవేశంతో, హృదయపూర్వకంగా మాట్లాడి ఫూజిస్కీ వేదిక దిగేడు. సభలోవున్న పడుచుకారు అంతా జయజయధ్వనులు చేసేరు. పెద్దవాళ్ళు మాట్లాడటానికి వెనకాడేరు. రేపు బోల్షివిక్కులు వెళ్ళిపోతే తమ ప్రాణాలు ప్రమాదంలో పడతాయని వాళ్ల భయం. ప్రాణం తీయక పోయినా పనిలోంచి పొమ్మంటే చాలదా?

స్థానికపాఠశాలోపాధ్యాయుడు చెరోన్నపిస్కీ బోల్షివిక్ అభిమాని. ఆయనను నగరంలో విద్యాశాఖకు కమిస్సారునుగా చేసేరు.

'రెవ్‌కమ్' కార్యాలయానికి ఎదురుగా స్పెషల్ సైన్యదళం ఆఫీసు తెరిచేరు. 'రెవ్‌కమ్' ఆఫీసులో పనులు వాళ్ళు చూస్తారు. ఆ ఆఫీసు ఆవరణలో రాత్రిళ్ళు మర తుపాకీ సిద్ధంచేయబడుతుంది. దాని తూటాబెల్టులు పాము చుట్టల్లా చుట్టుకొని తుపాకీ బ్రీచ్‌లోంచి తొంగిచూస్తున్నాయి. దాని ప్రక్కనే యిద్దరుసైనికులు రైఫిళ్ళతో కాపలా నిలబడ్డారు.

కామ్రేడ్ ఇగ్నాత్యేవా ఆఫీసులోకి వెడుతూ వాళ్ళ దగ్గరకెళ్ళింది. "నీ కెన్నేళ్లుంటాయి"— అని ఒక సైనికుణ్ణి ప్రశ్నించింది.

"పదిహేడు"

"ఈవ్రూరేనా?"

ఆ పడుచువాడు చిరునవ్వు నవ్వేడు.

"ఆ. నేను మొన్నయుద్ధంవేళనే రెడార్మీలోచేరేను."

ఇగ్నాత్యేవా ఆతనిముఖంవంక పరీక్షగా చూసింది.

"మీ నాన్న ఏంచేస్తుంటాడు?"

"ఇంజన్ డ్రైవరు అసిస్టెంటు."

ఆ సమయంలో దోలిన్నిక్ ఒక సైనికుణ్ణి వెంటబెట్టుకొని గుమ్మంలోకి వచ్చేడు.

ఇగ్నాత్యేవా దోలిన్నిక్‌ను ఆపింది.

"జిల్లాకమ్యూనిస్టు యువజనసంఘాన్ని చూడ్డానికి మనిషి దొరికేడు. ఇతడే. ఈవ్రూరివాడేనట."

దోలిన్నిక్ సెర్జీవంక పరీక్షగాచూసేడు. ఆ యువకుడు సెర్జీయే.

"నువ్వా. శెభాష్! మనకి కామ్రేడా! మంచిది. పోయి పడుచుకారునందర్నీ కొట్టుకురా."

సెర్జీ ఆశ్చర్యంతో వాళ్ళముఖాలు చూసేడు.

"మరి మా దళంమాట?"

"ఆ సంగతి నేను చూస్తాంలే."— అంటూ బోల్షివిక్ మెట్లుఎక్కేడు.

మరో రెండురోజులయ్యేసరికి యుక్రెయిన్ కమ్యూనిస్టు యువజనసంఘం ఏర్పడింది.

ఈనూతనజీవిత ప్రవాహంలో సెర్జీ తలమునకలయ్యేడు. వూళ్ళోనేవున్నా ఇంటికెళ్ళడంకూడా మరచిపోయేటంతపని.

సెర్జీబ్రూజక్‌కూడా బోల్షివిక్ అయ్యేడు. యుక్రేనియన్ కమ్యూనిస్టుపార్టీ కమిటీ ఇచ్చిన కార్డును నూరుమాట్లు జేబులోంచితీసి చూసుకొన్నాడు. యువజనసంఘం సభ్యుడూ, కార్యదర్శిగా నమోదుచేస్తూ ఇచ్చినపత్రంఅది. అదిచూసినా ఇంకా ఎవరన్నా సందేహం కనబరిస్తే మొలనున్న 'మాన్‌లికర్' రివాల్వరు వుండనేవుంది. పావెల్ పుణ్యమాయని అది తనకి మిగిలింది. పాపం ఆతడెక్కడున్నాడో.

'రెవ్‌కమ్' వప్పచెప్పిన బాధ్యతలను పూర్తిచేయడం లోనే ఆతనికాలం గడుస్తూంది. ఈవేళకీవేళ ఇగ్నాత్యేవా ఏదో కొత్తపని ఇవ్వడానికై ఆతనికోసం కనిపెట్టుకొనివుంది. డివిజనల్‌రాజకీయశాఖా కార్యాలయానికి ఇద్దరూ వెళ్ళి ఏవో యిన్ని పత్రికలూ, పుస్తకాలూ తీసుకురావాలి. గుమ్మంలో

రాజకీయశాఖ తాలూకు మనిషి ఒకరు ఒక కాపుతో పేళ్ళ కోసం కనిపెట్టుకొనివున్నారు. సెర్గీ ఆఫీసులో అడుగుపెడు తూనే మళ్ళీ బయటకు వస్తారు.

పెద్దస్టేషనులోవున్న ఒక రైలుపెట్టెలో ఒకటో సోవి యట్ యూక్రేనియన్ డివిజన్ తాలూకు రాజకీయశాఖ ప్రధానకార్యాలయం పనిచేస్తూంది. సెర్గీరాగానే కారు బయలుదేరింది. దారిలో ఇగ్నాత్యేవా ఆతనిని ఒకటే ప్రశ్నలు.

"నీపని ఎల్లాజరుగుతూంది? మీ సంఘం ఏర్పడిందా? మీ స్నేహితుల్ని, పనివాళ్ళపిల్లల్ని, యువజన సంఘములో చేర్పించాలి. కమ్యూనిస్టు యువజనసంఘం ఎంత వేగంగా ఏర్పడితే అంతలాభం. దానికోసం రేపో కరపత్రం తయారు చేద్దాం. నాటకంహాలులో పెద్దర్యాలీ జరిపిద్దాం. రాజకీయ శాఖలో ఉస్తానోవిచ్ అనే ఆమె వుంది. ఆమెని నీకు పరి చయం చేస్తా. ఆమె యువజనసంఘాల్లో పనిచేస్తున్నట్లు గుర్తు."

అంటూనే ఇగ్నాత్యేవా ఉస్తినోవిచ్‌ను ఆతనికి పరి చయంచేసింది. ఆమె పద్దెనిమిదేళ్ళవడుచు. నల్లటి కత్తిరిం చినజుట్టు. ఖాకీదుస్తులు వేసుకొంది. ఆమె సెర్గీకి ఎన్నో పని సులువులు చెప్పి, అవసరమైనప్పుడు సాయంచేస్తానని వాగ్దానం చేసింది. తిరిగివచ్చేటప్పుడామె అతనికి పెద్దకట్టపుస్తకాలూ, పత్రికలూ ఇచ్చింది. యువజనసంఘ నియమావళికూడా ఆతని చేతిలో పెట్టింది.

...

ఆ రాత్రి ఆఫీసుకు తిరిగివచ్చేసరికి బాగాపొద్దుపోయింది. ఆతడు వచ్చేటప్పటికి గుమ్మంలో వాల్యా కనబడింది. కనిపిస్తూనే ఆతనిని చీవాట్లు పెట్టింది.

"నీకు సిగ్గుండద్దటరా? ఇంటికిరాకపోవడంలో నీవుద్దేశం ఏమిటి? అమ్మ ఒక్కటేపేడుపు. నాన్నకి మహాకోపంగా వుంది. ఇంటికిరా. పెద్ద రభస అయిపోతుంది."

"ఏం ఫర్వాలేదులే. ఇంటికి రావడానికి నాకు తీరిక లేదు. ఏదేమయినా ఈరాత్రిరావడం అసలేపడదు. అయితే నువ్వురావడం మంచిపనే అయింది. నీతో మాట్లాడాలి. రా, లోపలికి."

సెర్జీ ఎంతో మారిపోయే డనిపించింది. వాల్యా తన అన్నను గుర్తేపట్టలేకపోయింది. ఎంతోహుషారుగావున్నాడు.

ఇద్దరూ కూర్చోగానే సెర్జీ సరాసరి తాను చెప్పదలచినది చెప్పడం ప్రారంభించేడు.

"వాల్యా! నువ్వుకూడా కామ్‌సోమాల్‌లో చేరాలి. అంటేఏమిటో నీకు తెలియదా? కమ్యూనిస్టు యువజనసంఘం అన్నమాట. నేనిప్పుడిక్కడ చేస్తున్నపని అదే. నీకు నమ్మకం లేదుకదూ? చూసుకో."

సెర్జీఇచ్చిన కాగితాన్ని వాల్యాతీసుకుచదివింది. ఆమెకెంతో ఆశ్చర్యం కలిగింది.

"కామ్‌సోమాల్'లో నే నేంచేస్తాను?

"బోలెడంత పనివుంది. నన్నుచూడు. నిద్రపోవడానికూడా నాకుతీరిక లేదు. ఎంతోప్రచారంచెయ్యాలి. మీటింగు పెట్టాలని ఇగ్నాత్యేవాఅంటుంది. అక్కడ నేనే మాట్లాడా

లట. నాకు చేతకాదు. అందులో ఏదో తిరకాసు వుందను కుంటా. తీరాచేసి తగలబెడతానేమో. అది సరేగాని, నువ్వు చెప్పు. చేరుతావా ?"

"నాకేం తోచడంలేదబ్బా! అమ్మకి తెలిసిందంటే గొడవచేసి చంపేస్తుంది.

"అమ్మమాట అల్లావుంచు. ఆవిడకేం తెలీదు. అస్తమానం తన పిల్లలు తన ప్రక్కనే వుండాలంటుంది. అంతే. సోవియటురాజ్యం అంటే ఆవిడకి అయిష్టంలేదు. పైగా అదంటే ఆమె కిష్టమే అయితే తన పిల్లలు మినహా మిగతా అందరూ యుద్ధంలో కెళ్ళాలని ఆవిడవుద్దేశం. అది మంచిదంటావా ? జకరయ్ ఏం చెప్పేవాడు ? పావెల్ నిచూడు. వాళ్ళమ్మ ఏమంటుందో అని కూర్చున్నాడా ? మన బ్రతుకు తెరువు చూసుకోడానికి మనం యుద్ధానికి అవసరమైతే దిగాలిసిందే. నువ్వేమంటావు! ఎంతో బాగుంటుంది. నేను మగపిల్లలలోనూ, నువ్వు ఆడవాళ్ళల్లోనూ పనిచేద్దాం. అవునుగాని క్లిమ్‌కాగాడు ఏమయ్యాడు ? వాడి నీవేళ పట్టుకోవాలి, నువ్వేమంటావుమరి ? మాతోటే వుంటావా ? వుండవా? ఈపుస్తకంచూడు. అన్నిసంగతులు తెలుస్తాయి."

కామ్‌సోమాల్ నిబంధనావళిని జేబులోంచితీసి ఆతడు వాల్యాచేత బెట్టేడు. ఆమె ఆతని ముఖంవేపు తేరిపారి చూస్తూ, నెమ్మదిగా ఓ ప్రశ్న వేసింది.

"పెట్లూరా మళ్ళీవస్తే ?"

సెర్జీకి ఆ విషయం ఇంతవరకూ తట్టనేలేదు. కొంచెం సేపు ఆలోచించేడు.

"నేనైతే మిగిలినవాళ్ళతోపాటు పోతాను. కాని, నీమాట ఏమిటి? అప్పుడు అమ్మ నిజంగా గోలపెట్టేస్తుంది."

వాల్యా ఆలోచించింది.

"అమ్మకి చెప్పనేవద్దు. మనిద్దరిలోనే వుంచుదాం. అదే మేలు."

"మంచి ఆలోచనే."

ఇగ్నాత్యేవా గదిలో ప్రవేశించింది. సెర్గీ చెల్లెల్ని ఆమెకు పరిచయంచేసేడు.

"మాచెల్లెలు, వాల్యా. కామ్‌సోమాల్‌లో చేరమంటున్నా, కామ్రేడ్ ఇగ్నాత్యేవా, బాగాపనికొస్తుంది. కాని మాఅమ్మతోనేవుంది పేచీఅంతా. రెండోకంటివానికి తెలియకుండా వాల్యానుచేర్చుకోగలమా? ఒకవేళమనం నగరం వదలిపెట్టిపోవలసి వస్తుందనుకో. నేనైతేఅందరితో వచ్చేస్తా. కాని వాల్యా! అప్పుడు అమ్మ గోలపెట్టేస్తుందని దానిభయం.

కుర్చీలో కూర్చుని ఇగ్నాత్యేవా జాగ్రత్తగా విని ఆలోచించింది.

"సరే. అదే మంచిది."

* * *

పట్టణం నాలుగుమూలలా అతికిన పోస్టర్లు చూసుకొని నగరంలోని యువకులు చాలమంది మీటింగు రోజున వచ్చేరు. నాటకశాల నిండిపోయి కిటకిటలాడుతూంది. పంచదార ఫ్యాక్టరీ కార్మికుల బ్యాండుమోగుతోంది. మీటింగులోకి వచ్చిన వాళ్ళల్లో చాలమంది హైస్కూలు విద్యా

ర్థులూ, జిమ్నాసియం పిద్యార్థులూను. వాళ్ళకి మీటింగు మీదకంటె, మీటింగుతర్వాత వుంటుందన్న సంగీతకచేరీ మీద ఆసక్తి హెచ్చు. దానికోసమే వచ్చేరుకూడా.

వేదికమీదికి ఉయెజ్డు (తాలూకా) కమిటీ కార్యదర్శి కామ్రేడ్ రాజన్ వచ్చేడు.

అందరికళ్ళూ ఆతనివేపు తిరిగేయి. ఆయన వుపన్యాసాన్ని అతిశ్రద్ధగావిన్నారు. దేశంలోజరుగుతున్న యుద్ధాల్ని గురించి చెప్పి యువకులంతా కమ్యూనిస్టుపార్టీని బలపరచాలన్నాడు. ఉపన్యాసం పకడ్బందీగానే వుందిగాని దానినిండా 'ఛాందస మూర్ఖ వాదుల'నీ, 'సాంఘిక జాతీయ దురహంకారుల'నీ ఏమిటేమిటో మాటలు తెగవాడేడు. అది ఎవరికీ అర్థంకాలేదు. అయినా ఉపన్యాసంఆఖరున అందరూచప్పట్లు గొట్టి, హర్షధ్వనులు చేసేరు. తర్వాత సెర్జీ మాట్లాడుతాడని ప్రకటించేరు. ఆతను వేదికమీదికి వచ్చేడు.

తీరావచ్చేక ఆతడు భయపడినట్లే జరిగింది. ఎదురుగా జనంకనబడ్డాక ఏంమాట్లాడాలో ఆతనికి అర్థంకాలేదు. అధ్యక్షస్థానంలోవున్న ఇగ్నాత్యేవా చిన్నగా సలహాఇచ్చి బయటపడేసింది.

"ఒక చిన్నకమిటీని ప్రారంభించడం గురించిచెప్పు."

సెర్జీకి సులువుదొరికింది. సరాసరి విషయం అందుకున్నాడు.

"సరే. చెప్పేదంతా చెప్పేరు. మీరు విన్నారు. ఇంక సంఘం ప్రారంభిద్దాం. ఎవరుచేరుతారో, పేర్లివ్వండి."

సభ అంతా నిశ్శబ్దం అయింది. ఉస్తినోవిచ్ ముందుకు వచ్చి మరల ఆడుకుంది. మాస్కోలో యువజనసంఘాన్ని ఎలా ఏర్పరచేరో సభికులకు వివరించింది. ఆమె మాట్లాడుతూంటే సెర్గీ ప్రక్కగా నిలబడ్డాడు.

సంఘాన్ని పెట్టుకోందామనగానే మాట్లాడకుండా వూరుకున్నందుకు సభికులమీద ఆతనికెంతో కోపంవచ్చింది. మనస్సులోనే పళ్ళుకొరికేడు. వాళ్ళకేసి ఉరిమిచూసేడు. వాళ్ళు ఉస్తినోవిచ్ ఉపన్యాసమూ వినడంలేదు. జెలివానోవ్ ఆమెవంక అసహ్యంత తెలిపేచూపులు పరపి ప్రక్కనున్న లిజాసుఖారోక్కతో ఏదోచెప్పడం సెర్గీ గమనించేడు. మీటింగు మొదటివరుసలో జిమ్నాసియంలో చదువుతున్న ఆడపిల్లలు కూర్చునివున్నారు. వాళ్ళముఖాలకు దట్టంగా పౌడరుపట్టించేరు. కిలకిలనవ్వుకుంటూ ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నారు ఉపన్యాసాలు వినడమే లేదు. వేదికకు ప్రక్కగా ఒకవేపున రెడార్మ్యయువకులు నిలబడివున్నారు. వాళ్ళలో తనకు పరిచితుడైన మరతుపాకీ పడుచువాడుకూడా వుండడం సెర్గీచూసేడు. వేదిక అంచును ఆనుకొని కూర్చుండి సీతాకోకచిలకల్లా సింగారించుకొని సభకు వచ్చిన లిజాసుఖరోక్కనూ, అన్నాఅద్మోవ్స్కాయానూ ఎంతో అసహ్యంతో చూస్తున్నాడు. వాళ్ళిద్దరూ తమ పక్కనున్న యువమిత్రులతో మహాకబుర్లుచెప్తూ వుపన్యాసం వినడమేలేదు.

ఎవ్వరూ తన వుపన్యాసం వినడంలేదని గ్రహించి ఉస్తినోవిచ్ త్వరగా ముగించి కూర్చుంది. తర్వాత

ఇగ్నాత్యేవా లేచింది. ఆమె శాంత గంభీర విగ్రహంచూసి సభికులు సల్లాపాల్ని కట్టిపెట్టేరు.

"కామ్రేడ్స్! ఇంతవరకూ చెప్పిన సంగతుల్ని గురించి జాగ్రత్తగా ఆలోచించండి. మీలో కొంతమందయినా విప్లవంలో గట్టిగా పనిచేస్తారనే నమ్మకం నాకుంది. పనిచేయడానికి మిమ్మల్ని ఎవ్వరూ ఆటంకపరచరు. రావడం, రాకపోవడం మీ యిష్టంమీదుంది. మీ అభిప్రాయాలుకూడా మేము వినడం మంచిది. మాట్లాడదలచినవాళ్ళు రాండి."

మరల సభలో నిశ్శబ్దం, ఒక క్షణాంతర్వాత వెనక నుంచి ఎవరిదో గొంతు వినబడింది.

"నే మాట్లాడుతా."

అంతా ఆధ్వనివేపు తిరిగేరు. మెల్లకంటి మిషా లెవ్చెకోవ్ జనాన్ని ఒత్తిగించుకొంటూ వచ్చి వేదిక నెక్కేడు.

"ఇప్పుడున్న పరిస్థితుల్లో మనం బోల్షివిక్కుల వెంట వుండడమే సరిఅయిన పని. నేనువస్తున్నా. సెర్యోజా నన్ను ఎరుగును. కామ్సోమాల్ లో నేను చేరుతున్నా."

సెర్జీకి బ్రహ్మానందం కలిగింది. కొసనున్నవాడు వేదిక మధ్యకు గెంతేడు.

"చూసేరా, కామ్రేడ్స్! నేను చెప్పలేదూ మిషా మనవాడు. వాళ్ళనాన్న రైల్వేస్విచ్‌మన్. కారుకిందపడి చచ్చిపోయేడు. అందుచేతనే అతడు చదువుకోలేకపోయేడు. జిమ్నాసియానికి వెళ్ళకపోయినా ఇల్లాంటి సమయాల్లో ఏం చెయ్యాలో అతనికి తెలుసు."

సభలో గోల బయలుదేరింది. తల నున్నగా దువ్వి, బాగా టిప్‌టాప్‌గావున్న ఒక యువకుడు లేచేడు. తానిలా మాట్లాడుతా వన్నాడు.

"కామ్రేడ్స్! మీరు అడుగుతున్నదేమిటో నాకర్థం కాలేదు. మమ్మల్ని రాజకీయాల్లో దిగమంటారా? అయితే మేం చదువుకొనేదెప్పుడు? జిమ్నాసియం చదువు అవాలి కదా? ఇదేదో, తాలింఖానాలాంటిదో, గ్రంథాలయం లాంటిదో అయితే వేరుమాట. వస్తాం. ఆడేవాళ్ళు ఆడు ఆడుకొంటారు. చదువుకొనేవాళ్ళు చదువుకొంటారు. కాని రాజకీయాల్లోకిదిగడంఅంటే కోరి పీకకు వురితెచ్చుకోవడమే. దీని కెవ్వరం అంగీకరించం."

ఓఖుషేవ్ వేదిక దిగుతూంటే సభలో హర్ష ధ్వానలు చెలరేగేయి. ఓఖుషేవ్ నగరంలోని ఒక వైద్యుని కొడుకు, జిమ్నాసియం విద్యార్థి.

ఆతని తర్వాత మరతుపాకీ యువకుడు వేదికమీదికి వచ్చేడు. సభలో నవ్వు వినబడింది. మండిపడ్డాడు.

"ఎందుకు నవ్వుతారు, గాడిదల్లారా!"

అతని కళ్ళు చింతనిప్పులల్లే ఎర్రబడ్డాయి. మనిషి కోపంతో వొణికిపోతున్నాడు.

"నాపేరు ఇవాన్ జార్కీ. నేనో అనాథను. తల్లినీ, తండ్రినీ ఎరగను. ఓకిల్లూ, వాకిలీలేదు. వీధుల్లో తిరుగుతూ పెరిగేను. దొరికిననాడు ఓ రొట్టెముక్క దొరికింది. నెలలో ఎక్కువరోజులు ఉపవాసాలతోనే గడిచేయి. కుక్కకంటె

కనాకష్టంగా బ్రతికేను. అమ్మా, నాన్నాచాటున పెరుగుతున్న మీకు ఆబతుకు అర్థంకాదు. ఇంతలో సోవియటు ప్రభుత్వం ఏర్పడింది. ఎర్రసైనికులు జేరదీసేరు. నావిషయంలో శ్రద్ధతీసుకొన్నారు. ఒక పటాలానికి నేను దత్తుపోయేను. వాళ్ళే నాకు బట్టలిచ్చేరు. వ్రాయడం, చదవడం నేర్పేరు. అన్నిటికన్నా ప్రధానమైనది మనిషిఅంటే ఏమిటో చెప్పేరు. మనిషిలా బ్రతకడం నేర్పేరు. వాళ్ళమూలంగా నేను బోల్షివిక్కు నయ్యేను. బ్రతికివున్నంతకాలం బోల్షివిక్కుగానే వుంటాను. మేము దేనికోసం యుద్ధంచేస్తున్నామో నాకు తెలుసు. మాయుద్ధం బీదవాళ్ళకోసం, కూలివాళ్ళ ప్రభుత్వంకోసం. మీరంతా మెటికలు విరుచుకుంటూ కూర్చున్నారు. ఈ పట్టణాన్ని విడిపించడంకోసం రెండువందలమందిపైగా కామ్రేడ్సు చచ్చిపోయేరనిఎరుగుదురా?"

జార్కాగొంతు ఖంగ్‌మంటూ హాలంతా ప్రతిధ్వనించింది.

"మన సుఖంకోసం, మనం బాగుండాలని వాళ్ళు ప్రాణత్యాగంచేసేరు. దేశం నాలుగుమూలలా యుద్ధరంగాలలో జనంచచ్చిపోతూంటే, మీరిక్కడ రంకులరాట్నాల మీద వినోదిస్తున్నారు."

జార్కా ఉన్నట్లుండి అధ్యక్షస్థానంవేపు తిరిగేడు. వేలుపెట్టి హాలువంకచూపేడు.

"వీళ్ళతో మాటలు వ్యర్థ కాలక్షేపం. వాళ్ళకి అర్థం అవుతుందనా? ఏమీలాభంలేదు. కడుపుకాలుతున్నవాడితో నాలుగువేళ్ళా లోపలికిపోయేవాడు నేస్తంకట్టడు. ఇంత

మందిలో ఒక్కడే ముందుకురాగలిగేడు. అతడూ దరిద్రుడూ, అనాధుడూకనక నే ముందుకువచ్చేడు. ఏం ఫర్వాలేదు..."

జార్కా మళ్ళీ సభాసదులవంక తిరిగేడు. అతని గొంతు ఝణఝణలాడిపోతూంది.

"మీరు రాకపోతే మా పని ఆగిపోతుం దనుకోకండి. మిమ్మల్ని ప్రాధేయపడతా మనుకోవద్దు. కట్టకట్టుకుచావండి. మీతో మాట్లాడవలసిందొక్కటేవుంది. మెషిన్ గన్ ! మర తుపాకీ ! !"

జార్కా వేదికదిగి అటూ యిటూ చూడనుకూడా చూడకుండా హాలువదలి వెళ్ళిపోయేడు.

సభాధ్యక్షు లెవ్వరూ సంగీతకచేరీ అయ్యేవరకూ నిల బడలేదు.

'హెవ్ కమ్'కు తిరిగిపోతూ సెర్జీ ఒక్క నిట్టూర్పు విడిచేడు.

"రసాభాసు జార్కా సరిగ్గా చెప్పేడు. ఈ జిమ్నా సియంమూకతో లాభంలేదు. వాళ్ళతో మాట్లాడితే మంట పుడుతుంది."

"ఆశ్చర్యం ఎందుకు ?"—అంది ఇగ్నాత్యేవా.

"అక్కడ ఒక్క కార్మికుల పిల్లవాడన్నా వున్నాడా ? వాళ్ళలో చాలమంది మధ్యతరగతి మేధావివర్గంవాళ్ళే. వట్టి కబుర్లపోగులు. నువ్వు వెళ్ళి రంపంమిల్లు పనివాళ్ళలోనూ, పంచదారఫ్యాక్టరీ పనివాళ్ళలోనూ పని చెయ్యాలి. అయితే ఒకటి. ఈ మీటింగుకోసం పడిన శ్రమఅంతా వ్యర్థం అను కోకు. విద్యార్థుల్లోకూడ మంచివాళ్ళుంటారు."

ఉస్తినోవిచ్ అంగీకారం తెలిపింది. "ఔను."

"సెర్యోజా! మన అభిప్రాయాలు అందరికీ నచ్చ చెప్పాలి. అదీ మనపని. ప్రతి కొత్తసమస్యమీదకీ కార్మికుల దృష్టిని తిప్పాలి. మనం ఎన్నో మీటింగులు, మహాసభలు, సమావేశాలు జరపడం అవసరం. రాజకీయశాఖ స్టేషన్ దగ్గర్లో వేసవి నాటకశాల ఒకటి ప్రారంభిస్తూంది. కొద్ది రోజుల్లో ప్రచారకరైలు ఒకటి వస్తూంది అప్పుడు మనపని మంచి బాగా జరుగుతుంది. లెనిన్ ఏమన్నారో తెలుసా? "ప్రజల్ని, కోట్లమంది కార్మికుల్ని పోరాటంలోకి తీసుకొస్తే తప్ప మనం నెగ్గలేము."

ఉస్తినోవిచ్ స్టేషన్ కు బయలుదేరేసరికి రాత్రిబాగా పొద్దుపోయింది, సెర్జీ ఆమెను అంతవరకూ సాగనంపేడు. సెలవుతీసుకొంటూ ఆతడామెచేయి పట్టుకొన్నాడు. ఆమె ముఖాన చిరునవ్వు రేఖగా తోచింది.

తిరిగివస్తూ సెర్జీ తమయింటికెళ్ళేడు. తల్లి తిట్టినంత సేపూ తలవొగ్గేడు. తండ్రికూడా అందుకొనేసరికి సమాధా నాలు ప్రారంభించేడు. కొడుకు నోరువిప్పేక జఖార్ వాసిలీ విచ్ బ్రూజక్ కు మాట తోచలేదు.

"జర్మన్లు వచ్చినప్పుడు నువ్వు సమ్మెచేసేవు. ఇంజ న్ లో కాపలాదారుని చంపేసేవు. అప్పుడంతా ఇంటిసంగతి నీకు జ్ఞాపకమేవుంది కాదూ? కాని ఆ పనులు చేసేవుఎందుకు? పనివాడుగా నీ మనస్సు మంచేదో చెడ్డఏదో గమనించింది. అంతే నేనూను. మన యింటి సంగతి ఆలోచించ లేదనా!

ఆలోచించేను. మేము వెనక్కి తగ్గవలసివస్తే మిమ్మల్ని బాధి స్తారని నేనెరుగుదును. అయినా ఇంటివద్ద వుండటం నాకు సాధ్యంకాదు. ఎందుచేతనో నువ్వూ ఎరుగుదువు. ఎందుకీ అన వసరపు అల్లరి? నేనో మంచిపని చేస్తున్నాను. బాగుండనాలి గాని, అల్లరికాదు చేయవలసింది. నువ్వు సరేనంటే అమ్మా వూరుకుంటుంది.''

జఖార్ వాసిలీవిచ్ బెంచిమీద ముళ్ళమీదున్నట్లు న్నాడు. బుగ్గమీసాలూ, దుబ్బుగడ్డం మధ్యనుంచి పచ్చని పళ్ళు కనిపించేలా నవ్వేడు.

"దొంగవెధవా! వర్గచైతన్యంఅంటూ మొదలెట్టేవూ? నీ మొలనున్న రివాల్వరుచూసి భయపడి గూబను సాగదీయ నని ధైర్యం కాబోలు.''

గూబలు సాగదీయడం మాటవచ్చినా ఆతనికంఠంలో కోపం ఛాయామాత్రంగాకూడ లేదు.

''సరే, ఫో, వెడుతున్న వాడికి అడ్డంరావడం ఎందుకు? కాని, అప్పుడప్పుడోమాటు ఇంటికివచ్చి పోతూండు. వెళ్లు.''

* * *

రాత్రివేళ. తెరిచివున్న వీధిద్వారంలోంచి వెలుతురు వీధిగుమ్మాలలో పడుతూంది. లెన్‌జిన్‌స్కీల యింట్లో వకీలు గారి బల్లచుట్టూ సోఫాలలో అయిదుగురు మనుష్యులు కూర్చునివున్నారు. దోలిన్నిక్, ఇగ్నాత్యేవా, రహస్య పోలీసుఅధికారి తిమోషెంకో, రైల్వేకార్మికుడు షూదిక్ రైల్వేకర్మాగారాలనుంచి వచ్చిన ఓస్టాప్చుకూను. వీరు ఐదు

గురూ రి వెల్యాృవసరీ కమిటీసభ్యులు. కమిటీమీటింగు జరుగుతూంది.

దోలిన్నిక్ బల్లమీదికివంగి ఇగ్నాత్యేనా వంకచూస్తూ మాట్లాడేస్తున్నాడు.

"యుద్ధరంగానికి సరఫరాలు వెళ్ళాలి. పనివాళ్ళకి తిండి కావాలి. మనమూ పట్టణంలో అడుగు పెట్టగానే దుకాణాల వాళ్ళు ధరలు పెంచేసేరు. వాళ్ళు సోవియటునోట్లు పుచ్చుకోమంటున్నారు. వెనకటి జారిస్టు రూపాయలో, కెరెన్స్కీనోట్లోతప్ప చలామణీకావడంలేదు. ఈవేళ మనం కూర్చుని ధరలు ఏవిధంగా నిర్ణయించాలో లెక్కలుకట్టాలి. నిర్ణయించిన ధరలకి వర్తకులు తమసరుకులుఅమ్మరని మనకు తెలుసు. వున్నదంతా దాచేస్తారు. ఆపద్ధతిలో సోదాలుచేసి, సరుకును స్వాధీనపరచుకోవలసివుంటుంది. ముద్దుముద్దుగా వ్యవహరిస్తే లాభంలేదు. కార్మికుల్ని మరీమాడ్చడంలో అర్థంలేదు. కామ్రేడ్ ఇగ్నాత్యేవా మనల్ని తొందరపడవద్దంటూంది. అది మేధావులకుండే పిరికిదనపు లక్షణం అంటాను. కోపం వద్దు. నేను ఆలోచించే మాట్లాడుతున్నాను. ఇక్కడ పేచీ చిన్నవర్తకులదికాదు. హోటల్ యజమాని బోరిస్‌జాన్ మేడలో నేలమాళిగలున్నాయనీ, వాటినిండా ధాన్యం దాచేరనీ ఈవేళనే తెలిసింది. పెట్లూరా రాకపూర్వమే వూళ్ళో వున్న పెద్దవ్యాపారులంతా తమసరుకు అక్కడ దాచేసేరట."

దోలిన్నిక్ హేళనగా తిమోషెంకోవేపు చూసేడు. ఆతడు ఉలికిపడ్డాడు.

నీకెల్లా తెలిసింది?"

ఇల్లాంటివార్తలు సంపాదించవలసినది తాను. కాని, తనకే సంగతి తెలియనే లేదు. దోలిన్నికుకు తెలిసింది. అది కొంచెం చికాకు అనిపించింది.

దోలిన్నిక్ నవ్వుకొన్నాడు.

"నాకన్నీ తెలుస్తూంటాయి, సోదరా! నాకు తెలిసింది, అదొక్కటేనా? నిన్న నువ్వూ, డివిజనల్ కమాండరు కారు డ్రైవరూ కలిసి ఓ అరసీసా సారాపట్టేసిన వార్తకూడా నాదాకా వచ్చింది."

తిమోషెంకో కంగారుపడ్డాడు. సిగ్గూ కలిగింది. ఇష్టం లేకపోయినా మెచ్చుకోక తప్పలేదు.

"దేవాంతకుడివే."

ఇగ్నాత్యేవా అయిష్టంగా ముఖం చిట్లించింది. అది చూసేక మరి నోటమాట రాలేదు. ఈ వజ్రడంముండాకొడుక్కి అన్నిసంగతులూ తెలుస్తాయి అని మనస్సులోనే అను కొన్నాడు.

దోలిన్నిక్ తనకు వార్త తెలిసినపద్ధతి చెప్పేడు.

"సెర్జీబ్రూజక్ నాకు చెప్పేడు హోటలులో పనిచేసే వాడి నెవరినో అతడెరుగునట. జాన్ వంటవాళ్ళకి ఏంకావా లంటే అది, ఎంతకావాలంటే అంత ఇస్తుండేవాడని ఆ కుర్ర వాడు చెప్తూండడం సెర్జీ విన్నాడు. నిన్నపోయి ఆ మాళిగ సంగతేమిటో వివరంగా తెలుసుకువచ్చేడు. ఇప్పుడు మనం తెలుసుకోవలసినదల్లా అదెక్కడుందీఅని. తిమోషెంకో! మీ వాళ్ళకి చెప్పు. కావలసివస్తే సెర్జీని తీసుకెళ్ళు. రోజుబాగుండా

సైన్యాలకీ, కార్మికులకీకూడా సరఫరాలు అందించగలుగుతాము."

ఒక అరగంట తర్వాత ఎనిమిదిమంది సాయుధ సైనికులు హోటలువాని యింటితలుపు తట్టేరు. కొత్తవాళ్ళు రాకుండా ఇద్దరు ద్వారంలో కాపలా నిలబడ్డారు. మిగతా వాళ్ళు లోపలి కెళ్ళేరు.

ప్రొప్రయిటర్ జాన్ లావుగా పొట్టిగా పీపాలా వుంటాడు. ఓకాలు లేదు. కర్రకాలుతో కుంటుకుంటూ వచ్చేడు.

"ఇప్పుడేం వుంటుంది? కామ్రేడ్స్ ఇంత రాత్రివేళ."

జాన్ వెనక ఆతని కూతుళ్ళు నిలబడివున్నారు. పక్కగదిలోంచి జాన్ భార్య దుస్తులు వేసుకొంటూ ఆయాసపడడం వినిపిస్తోంది.

మీయిల్లు సోదా చెయ్యడానికి వచ్చేం.

ఇంట్లో ప్రతిఅంగుళంమేరా బహుజాగ్రత్తగా శోధించేరు. దొడ్లో పెద్దబేరన్ నిండా కట్టెలూ, కంపలూ పేర్చి వున్నాయి. ఎన్నోసావిళ్ళు, వంటశాల, పెద్దకొట్టుగది, అన్నిటినీ అతిజాగ్రత్తగా కంట్లో వత్తిపెట్టుకు వెతికేరు. కాని, రహస్యపు నేలమాళిగ పొడ దొరకలేదు.

వంటశాల ప్రక్కనేవున్న చిన్నగదిలో పనిపిల్ల ఒకామె నిద్రపోతూంది. ఆమెకి సోదాసంగతే తెలియదు. సెర్జీవెళ్ళి నెమ్మదిగా ఆమెను లేపేడు.

"నువ్వెక్కడ పనిచేస్తూన్నావా?"

ఆ వనిత స్త్రీ దిగ్భ్రమ చెందినట్లు వెర్రిచూపులుచూసి, కంబళీ నిండుగా కప్పుకుంది.

“ఔను. నువ్వెవరివేం?”

సెర్జీ అసలుసంగతి చెప్పేడు.

“లే. బట్టలు వేసుకో.”

విశాలంగావున్న వంటశాలలో తిమోషెంకో హోటల్ యజమానిని ప్రశ్నలు వేస్తున్నాడు. అతడు బుకా యిస్తున్నాడు.

“మాయింట్లో నేలమాళిగ లేవీ లేవు. మీరూరికే అనవసరంగా శ్రమపడుతున్నారంతే. ఒకప్పుడు నాకు చిన్న హోటలు వుండేది. ఇప్పుడేంలేదు. నేను పెద్దవున్నవాడినేం కాదు. పెట్లూరాసైన్యం నాదగ్గిరవున్నదేదో వూడ్చుకు పోయేరు. ఏలాగో ప్రాణాలతో బయటపడ్డాను. సోవియట్ ప్రభుత్వం ఏర్పడిందంటే నాకెంతో ఇదిగావుంది. నాకున్నదేదో మీకళ్ళముందరేవుంది. చూస్తున్నారుగా.”

జాన్ తనపొట్టిచేతులు నలుదిక్కులకూతిప్పేడు. మాటలు అంతతియ్యగావున్నా కళ్ళతోమాత్రం మార్చిమార్చి మనుష్యులవంక ఉరిమిచూస్తున్నాడు.

తిమోషెంకో జౌడుకరచేడు.

“అయితే చెప్పవన్నమాట. ఆఖరుపర్యాయం మళ్ళీ చెప్తున్నావిను. మాళిగ ఎక్కడుందో చూపించు.”

జాన్ భార్య ఆయాసపడుతూ, తమకే తినడానికి ఏమీ లేదంది.

'కామ్రేడ్ ! మాకే తిండిలేదు, వున్నదంతా వాళ్ళే వూడ్చుకుపోయేరు.''

దానికి ప్రోద్బలంగా ఏడవడానికి ప్రయత్నించింది, కాని కుదరలేదు.

''మీాకే తిండి లేదంటున్నారే. మరి పనిమనిషిని ఎల్లా భరిస్తున్నారు.''—అని సెర్జీ ప్రశ్నించేడు.

''ఆమె పనిమనిషి కాదు. ఎవరో అనాధ, పేద బాలిక. వుండేందుకెక్కడా చోటులేదుగనక మాయింట్లో వుంటుంది. క్రిస్టినానే అడగండి. ఆవిడే చెప్తుంది.''

తిమోషెంకో కింక కోపం ఆగలేదు.

''సరి. అయితే ఇంక మా పని మేంచేస్తాం.''

తెల్లవారింది. సోదాఇంకా జరుగుతూనేవుంది. పద మూడుగంటలనుంచి శ్రమపడుతున్నా ఫలించలేదు. తిమో షెంకోకు విసువు కలిగింది. ఇంక పోదామన్నాడు. సెర్జీ పని పిల్ల గదికూడా సోదాచేసి ఇంక బయలుదేరదామనుకుం టున్నాడు. ఆ సమయంలో ఆతనివెనకనే గుమ్మంలో నిల బడ్డ క్రిస్టినా బహునెమ్మదిగా అసలురహస్యం చెప్పేసింది.

''వంటగదిలో పొయిలున్న అరుగుక్రింద చూడు.''

మరో పదినిముషాలలో ఆ అరుగు విప్పేసేరు. క్రిందికి ఇనప నిచ్చెన కనబడింది. మరో రెండుగంటలలో లారీలు బస్తాలతోనూ, పీపాలతోనూ కదలిపోవడం ప్రారంభించేయి. చుట్టుప్రక్కల వీధులవాళ్ళంతా అంతసరుకు దాచబడడం చూసి, నోళ్ళు తెరిచేరు.

* * *

ఒకరోజున ఎండమండిపోతూంటే చిన్నమూట చంకన పెట్టుకొని మేసియాయూకోవ్ లేవ్నా కోర్సాగినా వూళ్ళోకి వచ్చింది. పావెల్ సంగతి సందర్భాలు ఆర్టెమ్‌నోట విని ఆమె ఏడ్చింది. ఇంక బ్రతుకెందుకు అనుకొంది. కాని ఏలాగో బ్రతకక్కతప్పదు. తిండికి పని చూసుకోవాలి. ఎర్రసైనికుల బట్టలు వుతకడానికీ, వాళ్ళు సైనికులతోపాటు వాళ్ళకిచ్చే రేషన్లు ఇవ్వడానికీ ఏర్పాటు చేసుకొంది.

ఒక రోజున ఆర్టెమ్ హడావిడిగా ఇంటికి వచ్చేడు. గుమ్మంలో అడుగు పెడుతూనే "పావ్కా వుత్తరం వచ్చిందమ్మా" అన్నాడు.

ఇద్దరూ కూర్చుని పావెల్ జాబు చదివేరు.

"అన్నయ్యకు,

నేను సజీవంగానే వున్నాను. పెద్ద ఆరోగ్యంగా లేకపోయినా, తుంటిమీద తుపాకీదెబ్బ తగిలింది. కాని మానుతూంది. ఎముకకు దెబ్బేమీ తగులలేదని డాక్టరు చెప్పేడు. అందుచేత నన్నుగురించి బెంగ పెట్టుకోకు. ఫర్వాలేదు. నయం అవుతుంది. హాస్పిటలునుంచి బయటకొచ్చేక సెలవు దొరకవచ్చు. కొద్దిరోజులపాటు ఇంటికొస్తా. అమ్మ ఎక్కడుందో తెలియలేదు. వ్రాస్తే సమాధానం లేదు. నేనిప్పుడు కామ్రేడ్ కోటోవ్‌స్కీ నాయకత్వాన ఏర్పడిన ఆశ్వికదళంలో చేరేను. ఆయన పేరూ, పరాక్రమమూ గురించి కథలు చెప్పుకుంటూరు. నువ్వూ వినేవుంటావు అటువంటిమనిషిని ఇంతవరకు చూడలేదనుకో. ఆయనంటే నాకు మహాయిష్టం. అమ్మ ఇంటికింకా

రాలేదా? వస్తే నా నమస్కారాలు చెప్పు. నీకు చాలా యిబ్బందులు కలిగించేను; క్షమించు.

భవదీయుడు,
పావెల్."

"నాయనా! ఫారెస్టు వార్డెన్ ఇంటికెళ్ళి ఈ ఉత్తరం సంగతి చెప్పిరా, ఆర్టెమ్."

పావెల్‌నుగురించి అటుతర్వాత రోజంతా మేరియా ఏడుస్తూనేవుంది. తెలివితక్కువపెద్దమ్మ. ఏ హాస్పిటలులో వున్నాడో ఎడ్రసేనా వ్రాయలేదని పదిసూట్లు నిట్టూర్పు విడిచింది.

* * *

సెర్జీ ఈమధ్య రైలుస్టేషన్ దగ్గరికి తరచుపోవడం ఎక్కువయింది. స్టేషన్ ప్రక్కన ఒక ఆకుపచ్చరంగు వేసిన పెట్టెలో డివిజనల్ రాజకీయశాఖవారి ప్రచారకార్యాలయం వుంది. ఆ పెట్టెలో ఒకప్రక్కన ఉస్తినోవిచ్, ఇగ్నాత్యేవాల ఆఫీసు వుంది. సెర్జీ వచ్చినప్పుడల్లా ఇగ్నాత్యేవా 'నీరహస్యం నాకు తెలుసులే' అన్నట్లు చిరునవ్వు నవ్వుతూంటుంది.

ఆతడు కామ్‌సోమాల్ జిల్లాకమిటీ కార్యదర్శి రీటా ఉస్తినోవిచ్‌తో చాలసన్నిహంగా వుంటున్నాడు. ఆమెనుంచి పుచ్చుకొన్న పుస్తకాలూ, పత్రికలూతోపాటు అవ్యక్తానందాన్నికూడా ఆతడు వచ్చినప్పుడల్లా మూటకట్టుకొని పోతున్నాడు.

ప్రతిరోజూ డివిజన్‌కు సంబంధించిన నాటకశాలకు కార్మికులూ, ఎర్ర సైనికులూ అత్యధిక సంఖ్యలో హాజరవుతున్నారు. పన్నెండో సైన్యానికి చెందిన ప్రచారక రైలు సుందరమైన పోస్టర్లతో సైడింగులో నిలబడివుంది. ఇరవై నాలుగుగంటలూ వచ్చేపోయేవారితో బండి కిటకిటలాడుతూ వుంటుంది. బండిలోనే చిన్నప్రెస్సు వుంది. పత్రికలు, కరపత్రాలు, పోస్టర్లుముద్రించి ప్రవాహంలా బయటికి తోసేస్తున్నారు. యుద్ధరంగం సమీపంలో నేవుంది.

ఒకరోజు సాయంకాలం సెర్జీ ఏదోపనిమీద నాటకశాలకు వచ్చేడు. రీటా కొంతమంది ఎర్రసైనికులతో మాట్లాడుతూ కనిపించింది. ఆ రాత్రి ఆతడామెను రాజకీయ శాఖలో పనిచేసేవాళ్ళబసలవరకూ దిగబెట్టడానికి వచ్చేడు. తిరిగి వెళ్ళిపోయేటప్పుడామెచేతిని తనచేతిలోకి తీసుకొని తన మనస్సునంతా ఆమె ముందుపెట్టేడు.

"రీటా! ఎప్పుడూ నీతో నేవుండాలనీ, నిన్నుచూడాలనీ అనిపిస్తూంటుంది. నీతోవున్నంతసేపూ ఎంతో సంతోషంగా వుంటుంది. నిన్నొకసారిచూస్తే కలిగిన హుషారులో ఎంతసేపయినా తలఎత్తకుండా పని చెయ్యగలననిపిస్తుంది."

రీటా ఒక్క క్షణం అతని ముఖంలోకి చూసింది.

"ఇదిగో, కామ్రేడ్! ఒక్కటి చెప్తావిను. ఈమాదిరి ప్రేమగీతాలు ఇంకెప్పుడూ నావద్ద పాడకు. నా కవాట్టే రుచించవు."

చీవాట్లుతిన్న బడిపిల్లవాడిలాగ సెర్జీ సిగ్గుపడ్డాడు.

"మరోలా అనుకోకు...మన మిద్దరం స్నేహితులమే ననుకొంటున్నా...ఇప్పుడు నేనన్న వేవీ విప్లవ ద్రోహకరాలు కావుగదా. సరే...ఇంకెప్పుడూ అననులే"

త్వరత్వరగా ఆమె సెలవు తీసుకొని సెర్గీ తన ఆఫీసుకు పరుగెత్తిపోయేడు.

తర్వాత చాలరోజులవరకూ ఆతడు స్టేషన్ చాయల కూడా పోలేదు. రావడంలేదేమని ఇగ్నాత్యేవా అడిగింది. కాని, ఆతడు తీరుబడి వుండడంలేదని చెప్పి తప్పించుకొన్నాడు. నిజానికి తీరుబడిలేనిమాటకూడా నిజమే.

* * *

ఒకరోజు రాత్రి పంచదార ఫ్యాక్టరీ యజమానులు కాపురాలున్న వీధిగుండా వెళుతూండగా రెవ్‌కమ్ సభ్యుడు షూడిక్ మీద ఎవరో తుపాకీ కాల్చేరు. వెనువెంటనే ఆ ప్రాంతంలోని యిళ్ళన్నీ సోదాచేసేరు సోదాలో చాల ఆయుధాలూ, కాగితాలూ దొరికేయి. పత్రాలనుంచి నగరంలో పిల్సుడిస్కీకి సంబంధించిన 'స్ట్రెలెట్స్'అనే రహస్యసంస్థ వివరాలు దొరికేయి.

వెంటనే 'రెవ్‌కమ్' కార్యాలయంలో సమావేశం జరిగింది. ఉస్తినోవిచ్ కూడా దానికి హాజరయింది. ఆమె సెర్గీని పక్కకుపిలిచి తీసుకెళ్ళింది.

"నీమగతనపు అహంకారానికి దెబ్బతగిలిందికాబోలు నేం? నీస్వంతవ్యవహారాలతో పార్టీ పనులు నష్టపరుస్తున్నావన్నమాట. అదిమంచిదికాదు, కామ్రేడ్."

అటుతర్వాత సెర్జీ మరల రైలుస్టేషనుకు రాకపోకలు సాగించేడు.

ఆగడు జిల్లామహాసభకు హాజరయ్యేడు. రెండు రోజుల పాటు దీర్ఘచర్చలు జరిగేయి. మూడోరోజున ప్రతినిధులం దరితోకలసి ఆతడుకూడా ఏరుదాటి, అక్కడ అడవిలో మకాంపెట్టిన జారూమ్నా బందిపోటుదొంగల ముఠాతో ఓరోజూ, ఓరాత్రీ యుద్ధంలో పాల్గొన్నాడు. జారూద్నూ వెట్లూరా సేనానాయకులలో ఒకడు.

తిరిగివచ్చేక అతడు ఇగ్నాత్యేవాను చూడబోయేడు. ఆ సమయంలో రీటాకూడా అక్కడేవుంది. అక్కడినుంచి వాళ్ళిద్దరూ ఆమె బసవరకూ వెళ్ళేరు. విడిపోయేటప్పుడు అత డామెచేతిని తనచేతిలోకి తీసుకొని నిమిరేడు. రీటా కోపంతో చెయ్యిలాక్కుంది. మళ్ళీ చాలరోజులవరకూ ఆతడు ప్రచారక రైలువేపు ముఖం చూపించలేదు. పనివచ్చినప్పుడుకూడా రీటాను ఆతడు కలుసుకోవడంలేదు. ఎందుకు రావడంలేదని ఓమారామె అడిగింది.

"ఏంలాభం? కార్మికవర్గానికి శత్రువునుఅనో, మరో కటో చీవాట్లు తినడమేగా."

* * *

కకేషియన్ ఎర్రజెండా డివిజన్‌తో రైళ్లు స్టేషన్‌లోకి వచ్చేయి. వానికి సంబంధించిన ముగ్గురు కమేండర్లు 'రెవ్‌కమ్' ఆఫీసుకువచ్చేరు. వారిలో ఒకడు సన్నగా, పొడుగ్గావున్నాడు. అతడు సరాసరి దోలిన్నిక్ వద్దకు వచ్చేడు.

"ఇంకోమాట చెప్పొద్దు. మా గుర్రాలుచావుకి సిద్ధంగా వున్నాయి. వెంటనే నూకుబళ్ళగడ్డి చూడు."

వెంటనే సెర్గీ ఇద్దరు ఎర్రసైనికుల్ని వెంటతీసుకొని గడ్డితేవడంకోసం బయలుదేరేడు. ఒక గ్రామంలో ధనిక రైతులు కొందరు వాళ్ళనికొట్టేరు. ఎర్రసైనికుల ఆయుధాలు లాక్కొని నిర్దాక్షిణ్యంగా చితకకొట్టేరు. కుర్రవాడుగదాయని సెర్గీని కొద్దిదెబ్బలతో వదిలిపెట్టేరు. బీదరైతుసంఘం వాళ్లు ముగ్గురినీ బండిలోవేసి పట్నం చేరేసేరు.

మర్నాడు ఒక సాయుధదళం అవూరు వెళ్ళింది. ఆ మర్నాడే కావలసిన గడ్డి సమకూడింది.

దెబ్బలసంగతి తెలిస్తే తన యింట్లోవాళ్ళు కంగారు పడతారని సెర్గీ నాలుగురోజులపాటు ఇగ్నాత్యేవా బసలోనే వుండిపోయేడు. రీటా అతనిని చూడ్డానికి వచ్చింది. ఈమారు ఆమెయే ఆతనిచేతిని తన చేతిలోకి తీసుకొని నిమిరింది.

*　　*　　*

ఒక రోజున మంచి ఎండవేళ రీటాను చూడడానికై సెర్గీ ప్రచారకర్తైలు దగ్గరకొచ్చేడు. కబుర్లుచెప్తూ మిత్రుడు పావెల్ వ్రాసిన లేఖను ఆమెకు చదివి వినిపించేడు. ఆతనిని గురించి ఆమెకు ఎన్నో కబుర్లుచెప్పేడు. ఇంటికి తిరిగిపోతూ "చిట్టడవిలో కోనేట్లో స్నానానికి వెడుతున్నా" నన్నాడు.

తలవంచుకొని పనిచేస్తున్నదల్లా రీటా తల ఎత్తింది.

"ఆగు, నేనూ వస్తున్నా."

చెరువులో నీళ్ళు నిర్మలంగా, చల్లగా స్నానానికి ఆహ్వానిస్తున్నట్లున్నాయి.

"నేను పోయి స్నానంచేస్తాను. వెళ్ళి రోడ్డుమీద కూర్చో" మని రీటా ఆతనిని పంపేసింది.

సెర్జీ రోడ్డుప్రక్కనేవున్న పెద్దబండమీద కూర్చుని, చెరువులో రీటా ఈదుతూన్న ధ్వనులు వింటూన్నాడు.

దూరాన తోన్యా తుమానోవా ప్రచారక రైలులో సైనిక కమిస్సారుగావున్న చుజానిన్‌తో కలిసి అటువేపేవస్తూ కనబడింది. చుజానిన్ ఆఫీసర్ల యూనిఫారంలో వున్నాడు ఆమెతో ఏదో మాట్లాడుతూ వస్తున్నాడు.

ఆమధ్య పావెల్ ఉత్తరం సెర్జీకి తెచ్చియిచ్చినది తోన్యాయే. అత డామెను గుర్తుపట్టేడు. దగ్గరకువచ్చేక ఆమెకూడా ఆతనిని తేరిపారిచూసింది. ఎవరో గుర్తుచేసుకోనే టందుకు ప్రయత్నిస్తున్నట్లనిపించింది. దగ్గరకువచ్చేక సెర్జీ జేబులోంచి పావెల్ జాబుతీసి ఆమె కందించేడు.

"కామ్రేడ్! ఒక్కక్షణం ఆగండి. నా వుత్తరంలో మీా విషయంకూడా వ్రాసేడు.

తోన్యా ఆ జాబు సందుకుంది. ఆ మూలనుంచి ఈ మూలకి చదివేసి తిరిగి ఇచ్చేసింది.

"ఇంకేమన్నా వార్తలు తెలిసాయా?"

"ఊహు."

వెనుకనుంచివస్తున్న రీటాకాళ్ళక్రింద గులకరాళ్ళు చప్పుడయి చుజానిన్ తిరిగిచూసేడు. రీటానుచూసేక ఆయన తోన్యాతో నెమ్మదిగా "నడు, పోదాం." అన్నాడు.

రీటాగొంతుకలో వెక్కిరింత వినిపించింది.

"కామ్రేడ్ చుజానిన్! పొద్దుటినుంచి రైలులో నీకోసం వెతుకుతున్నారే."

చుజానిన్ ఆమెవేపు అయిష్టంగా చూసేడు.

"మరేం తొందరలేదు. నేను కనబడకుంటే పనులు ఆగిపోవు."

వాళ్ళిద్దరూ వెడుతూంటే రీటా పరీక్షగా దారివేపే చూస్తూ నిలబడింది.

"ఈరంగేళీ రాయుడికి సెలవిచ్చి పంపెయ్యడం మేలు"
—అంది రీటా

ఓకుచెట్లతలలు గాలికి ఊగులాడుతూంటే అడవి ఝుమ్మంటూంది. చెరువుమీదుగావస్తున్న చల్లనిగాలికి ప్రాణం తేలిపోతూంది. సెర్గీ స్నానానికి తాను బయలు దేరేడు.

ఆతడు తిరిగివచ్చేవరకూ రీటా రోడ్డుకుదగ్గరలోవున్న చెట్టుమొదట్లో కూర్చుంది. ఇద్దరూ కబుర్లుచెప్పుకుంటూ అడవిలోపలికి బయలుదేరేరు. ఒక చెట్లగుంపుక్రింద ఒత్తుగా పెరిగిన గడ్డిలో కాస్సేపు కూర్చున్నారు. అడవి అంతా ప్రశాంతంగావుంది. ఓకుచెట్లు చల్లనిగాలిలో గుసగుసలాడుతున్నాయి. రీటా తలక్రింద రెండుచేతులూ పెట్టుకొని గడ్డి మీద పడుకొనివుంది.

సెర్గీకళ్ళు ఆమెకాళ్ళకున్న మాసికలువేసిన బూట్లమీదపడ్డాయి. తన బూటుకూడాచిరిగి వేళ్ళుబయటికి రావడం చూసుకొన్నాడు. నవ్వొచ్చింది.

"ఎందుకు నవ్వుతావు?"

సెర్జి తన బూటుచూపేడు.—"ఈ బూట్లతో యుద్ధాలేంచేస్తాము?"

రీటా సమాధానం ఇవ్వలేదు. ఆమె ఆలోచనలు మరెక్కడోవున్నాయి. కొంతసేపటికా ఆలోచనలలోంచి బయటపడింది.

"చుజానిన్ పార్టీ సభ్యుడేగాని వట్టిపనికిమాలినవాడు. మన కార్యకర్తలు చింకిరిబట్టలతో తిరుగుతూంటే, ఆతనికా గొడవేపట్టదు. పార్టీలోవాడులా వుండడు... ఇంక యుద్ధరంగంపరిస్థితి నిజంగా చాలతీవ్రంగావుంది. ఇంకా చాలకాలం తీవ్రయుద్ధాలు తప్పేలాగలేవు."

ఆమె ఒక్కక్షణం వూరుకొని మళ్ళీప్రారంభించింది.

"సెర్జి! మనం మాటలతోటీ, చేతులతోటీకూడ యుద్ధం నడపాలి. కామ్సోమాల్ సభ్యుల్లో నాలుగోవంతు మందిని సేనలలోకి తీసుకోవాలని కేంద్రకమిటీ నిర్ణయం తీసుకుంది. నీకుతెలుసా? నన్నడుగుతే మనం ఇక్కడ ఆఖ్ఖరోజు లుంటామనుకోను."

ఆమె గొంతులో ఏదో కొత్తదనం వినిపించి సెర్జి ఆశ్చర్యపడ్డాడు. ఆమె నల్లనికళ్ళవేపు చూస్తూంటే ఆతని శరీరం పరవశమయిపోతూంది. కాని, సంభాళించుకొన్నాడు.

రీటా హఠాత్తుగా లేచికూర్చుంది.

"నీ రివాల్వరేది?"

సెర్జి బెల్టుతడుముకొన్నాడు: "ఆ కులక్ ముండాకొడ్కులు లాక్కున్నారు."

రీటా జేబులోంచి మిలమిలలాడుతున్న పిస్తోలు పైకి తీసింది.

"ఆఓక్ చెట్టుచూడు."

రీటాపిస్తోలు ఇరవైయైదుఅడుగుల దూరంలోవున్న ఆచెట్టు మొదలువేపు తిరిగింది. గురికూడా చూడకుండానే టపటప కాల్చింది. బెరడువ్రూడి క్రిందపడింది.

"చూసేవా?"

ఆనందంతో ఆమె మళ్ళీకాల్చింది. మళ్ళీ బెరడూడి గడ్డిలోపడింది.

ఈమారు పిస్తోలును ఆతని కందించింది.

"ఏదీ చూద్దాం. నువ్వెలా కాలుస్తావో."

సెర్జీకాల్చినవానిలో మూడింట ఒకవంతు గురితప్పేయి. రీటా ఫర్వాలేదన్నట్లు చిరునవ్వు నవ్వింది.

"ఈమాత్రంకూడా కాల్చగలవనుకోలేదు."

ఆమె పిస్తోలు క్రిందపెట్టి మరల గడ్డిలోపడకవేసింది. ఆమె గౌనుబిగువుల్లో గుండ్రనిరొమ్ములు పిటపిటలాడేయి.

"సెర్జీ!, ఇల్లారా."

ఆతడామె ప్రక్కకు జరిగేడు.

"ఆ ఆకాశంచూడు. ఎంత నీలిగావుందో. నీ కళ్ళు కూడా అలాగేవున్నాయి. అలా వుండకూడదు. ఉక్కురంగులో వుండాలి. నీలిరంగు చాల మెతకరంగు."

రీటా ఉన్నట్లుండి లేచికూర్చుంది. చటుక్కున ఆతని తల రెండుచేతులలో పట్టుకొని పెదవులు ముద్దుపెట్టుకొంది.

*　　*　　*

రెండు నెలలు గడిచేయి. ఆకురాలుకాలం వచ్చింది. నెమ్మదిగా చీకటిపడింది. చెట్లూ చేమలూ చీకట్లో కలిసిపోయేయి. డివిజనల్ హెడ్ క్వార్టర్సులో టెలిగ్రాఫ్ గుమాస్తా తన యంత్రంమీద టకటక లాడిస్తున్నాడు.

"మొదటి డివిజన్ చీఫ్ ఆఫ్ స్టాఫ్‌కు. పె.పె. టో. వ్లా రివెల్యూషనరీ కమిటీ అధ్యక్షునికో ప్రతి. ఈ తంతి అందిన పదిగంటలలోగా నగరంలోని కార్యాలయాలన్నీ తరలించాలి. పట్టణంలో ఒక్క పటాలాన్ని ఎస్. రెజిమెంటు సేనాధిపతి ఆధీనంలో వదలండి. రాజకీయశాఖను, అన్ని సైనికవ్యవస్థలను, బారాంచేవ్ స్టేషనుకు తరలించాలి. ఈ ఆజ్ఞను అమలుజరిపి వెంటనే డివిజన్ కమాండరుకు తెలియపరచాలి.

( సంతకం. )

మరో పదినిముషాలలో ఈ వార్తనుతీసుకొని మోటార్ సైకిలుమీద వార్తాహరుడు నగరవీధులలో బయలుదేరేడు. తిన్నగావచ్చి 'రెవ్ కమ్' కార్యాలయంముందు ఆగేడు. ఇంకా మోటారు గురగురలాడుతుండగనే ఆతడు లోనికి పరుగెత్తి దోలిన్నికుకు టెలిగ్రామ్ అందించేడు. మరుక్షణంలో తేనెతుట్ట కదిలినట్లు జనం కదిలేరు. ప్రత్యేక కార్యాలకోసం నిర్దేశించబడిన కంపెనీవాకిట్లో పంక్తులుదీరింది. మరో గంటకు సామాన్లుతీసుకొని బళ్ళు పొడోల్‌స్క్ స్టేషనువేపు తరలేయి. అక్కడ వానికోసం రైల్వే కార్లు సిద్ధంవున్నాయి.

టెలిగ్రామ్ సంగతి వినగానే సెర్జీ మోటార్ సైకిల్ వాలా వద్దకు పరుగెత్తేడు.

“కాం మేడమ్! స్టేషన్ వరకూ నన్ను ఎక్కించుకుని తీసు కెళ్ళగలవా?”

“ఎక్కు. గట్టిగా మాత్రం పట్టుకో.”

ప్రచారక వాన్ అప్పుడే రైలుకు తగిలించివుంది. దానికో పది గజాలదూరంలో రీటా నిలబడివుంది. సెర్జీ ఆమె భుజాలు పట్టుకొన్నాడు. అతిప్రియమైన వస్తువు నేదో పోగొట్టుకొంటున్నట్లు అతని మనస్సు కొట్టుమిట్టాడుతూంది.

“రీటా! సెలవు. మళ్ళీ ఎప్పుడో కలుసుకుందాం. మరిచిపోకు.

అతనికళ్ళల్లో నీళ్ళు చిమ్మడం అతనికే కంగారుపుట్టించింది. మాట్లాడితే ఏడుపు వచ్చేస్తుందేమోనని భయం కలిగింది.

* * *

తెల్లవారేసరికి పట్టణమూ, స్టేషనూకూడా ఖాళీఅయి పోయేయి. పట్టణంవద్ద సెలవుతీసుకొంటున్నట్లు ఆఖరుబండి 'కీ' పెడుతూ వెళ్ళిపోయింది. రియర్ గార్డ్ పటాలం రైల్వే లైన్ రెండువేపులా స్థానాలు తీసుకొంది.

చెట్లనుంచి పండుటాకులు జలజల రాలుతున్నాయి. సుడిగాలులు రాలినఆకులను వీధులవెంట తరుముకెళ్ళేయి.

రెడార్మీవాళ్ళ పాడుకుకోటూ, తూటాలబెల్టులతో సెర్జీ పంచదార ఫ్యాక్టరీసమీపంలోవున్న 'క్రాసింగ్' వద్ద కాపలా నిలబడ్డాడు. అతనితో మరో డజనుమంది ఎర్రసైని

కులుకూడా అక్కడున్నారు. పోలిష్ సేనలు నగరాన్ని సమీపిస్తున్నాయి.

*　　　　*　　　　*

అవ్తోనోవ్ పెట్రోవిచ్ తన పొరుగునవున్న జిరాసిం లియాన్‌టీవిచ్ ఇంటితలుపు తట్టేడు. జిరాసిమ్ బట్టలు వేసుకొంటున్నవాడు కిటికీవద్దకొచ్చి తొంగిచూసేడు.

"ఏమిటది?"

వీధిన వెడుతున్న ఎర్రసైనికులవంక అవ్తోనోమ్ కన్నుగిలిపేడు.

"అయ్యాలు వెడుతున్నారు."

జిరాసిమ్‌ముఖం దుఃఖాకులమయింది.

"పోలిష్‌వాళ్ళ నిశాన్ ఏమిటో, నీకేమన్నా తెలుసా?"

"ఒంటితల రాంబం దనుకొంటాను."

"ఎక్కడన్నా సంపాదించగలవా, ఒకటి?"

అవ్తోనోమ్ బుర్రగోక్కున్నాడు. ఒకటి రెండు నిముషాలు ఆలోచించేడు.

"వాళ్ళకేం? లేడికి లేచిందే ప్రయాణం. పై గుడ్డ దులిపి భుజానవేసుకుపోతారు. కాని మనకే బాధ. వచ్చిన ప్రతికొత్త అధికారితోనూ బాధపడేది మనం."

హఠాత్తుగా మరతుపాకీ ఒకటి ఝుణఝుణలాడింది. స్టేషనుదగ్గర ఒకఫిరంగి మోగింది. వెనువెంటనే రైలుకూత. గుంయ్‌మంటూ ఫిరంగిగుండొకటి ఫ్యాక్టరీ కంత దూరంలో రోడ్డుమీద పడి ఢామ్మని పగిలింది. ఇన్నిరాళ్ళూ, ఇంత

దుమ్మూ ఎగిరింది. పొలిరంగు పొగచుట్టేసింది. నిశ్శబ్దంగానూ, విచారంగానూ ఒక ఎర్రసైన్యదళం రోడ్డెక్కదిలిపోయింది. దారిపొడుగునా వాళ్ళు మధ్యమధ్య వెనక్కి తిరిగిచూస్తూనేవున్నారు.

సెర్గీ కనుగొలుకులనుంచి ఒకచుక్క బుగ్గ వెంటజారింది. రెండోకంటివా డెవడికీ కనబడకొండా అతను చటుక్కున దానిని ఒత్తేసుకున్నాడు. సెర్గీప్రక్కనే పొడుగుపాటి అంతెక్ క్లోపోటోవ్స్కీ నడుస్తున్నాడు. అతడో రంపంమిల్లు పనివాడు. అతను రైఫిల్ గుర్రంమీదినుంచి వేలు తియ్యనేలేదు. ఏదో ఆలోచనలో మగ్నుడైవున్నాడు. సెర్గీముఖం చూడగానే ఇంక పట్టలేకపోయేడు.

“వాళ్ళు మనకుటుంబాల్ని నానాబాధలూ పెడతారు. నేనూ పోలిష్‌వాడినే గనక నాకుటుంబంమీద మరీ కసిగా వుంటారు. మానాన్నని రంపంమిల్లులోంచి తగిలేసి, చితక కొడతారు. ఆయన్ని మనతో వచ్చెయ్యమన్నా. కాని కుటుంబాన్ని వదలి రాలేకపోయేడు. ఆ లంజకొడుకుల సంగతి కనుక్కొనేవరకన్నా ఇక్కడ నిలబడలేకున్నా.”

“ఆ ఇరుకురోడ్లూ, బురదా దుమ్మూ కొట్లూడేసందులూ కూలిపోతూ అసహ్యంగావున్న చిన్నచిన్నఇళ్ళూ వదిలిపోడానికే వాళ్ళకి మనసు వొప్పడంలేదు. వాల్యా మొదలయినవాళ్ళెందరో రహస్యంగా పనిచేయడానికై వెనక దిగబడిపోయారు. పోలీష్ ‘వైట్‌గార్డు’ దళాలు నగరాన్ని సమీ

పిస్తున్నాయి. వాళ్ళకి దయాదాక్షిణ్యాలు లేవు. క్రూరత్వం మూర్తీభవించినట్లుంటారు.

ఎర్రసేనలు వెళ్ళిపోతూంటే రైల్వేకార్మికులు విచార వదనాలతో చూస్తూ నిలబడిపోయేరు.

సెర్జీ వెనక్కి తిరిగి కేకేసేడు.

"కామ్రేడ్స్! మళ్ళీవొస్తాం. మరిచిపోకండి."

# ప్రకరణం 8

వెన్నెల వెలుతురులో నదినీరు మిలమిలలాడుతూంది. చిరుగాలికి కెరటాలు గట్టులనున్న గులకరాళ్ళల్లో గలగల మంటున్నాయి. గట్టుల ప్రక్కలనేవున్న మెరకలలో నీరు కదలడంలేదు. కాని నదిమధ్యనమాత్రం ఉరకలేస్తూ పోతూంది. గోగోల్ అమరత్వం ప్రసాదించిన గభీర సుందరతరంగిణి డ్నీపర్ ఇది. నది కుడిగట్టు వరకంగా తెగ్గోసినట్లుంది. ఎడమ గట్టున వేసవికాలంలో ఇసుకతిన్నెలు ఏర్పడతాయి.

కుడిగట్టున అయిదుగురుమనుష్యులు ఒకచిన్న కందకం తవ్వుకొని మాక్సిమ్ మరతుపాకీ పెట్టుకుకూర్చున్నారు. ఏదో రైఫిల్ డివిజన్ బాపతు ఎలగోలచౌకీఇది. మరతుపాకీ ప్రక్కనే నదివేపు ఎదురుగా సెర్జిబ్రూజక్ పడుకొనివున్నాడు.

ఎడతెగని యుద్ధాలలో అలసిసొలసి, పోలిష్ ఫిరంగుల ముందు నిలవలేక ఎర్రసైన్యం రెండురోజులక్రితం కీవ్ నగరాన్ని వదలిపెట్టి నది ఎడమగట్టుకి తిరోగమించింది. అక్కడ కందకాలు తవ్వుకొని నిలదొక్కుకుంది.

తిరోగమనం, విపరీతమైన సైన్యనాశం, కీవ్‌ను శత్రువులకు వప్పచెప్పవలసి రావడంతో సైన్యాలన్నీ దిగులుగా

వున్నాయి. శత్రువుల చక్రబంధంలోంచి ఏడో రైఫిల్ డివిజన్ ఎంతో పరాక్రమంచూపి పోరాడి బయటపడింది. అడవుల కడ్డుపడి మాలిన్ స్టేషన్ సమీపంలో రైలుకట్ట ఎక్కింది. ఆవేపునుంచి గట్టిదెబ్బతీసేసరికి పోలిష్ సేనలు విచ్చిపోయాయి. కీవ్ రోడ్డు నిరాటంకం అయింది.

కాని, కీవ్ నగరం చేతులనుంచి జారిపోయిందే అనే విచారం వారిని వదలలేదు.

దార్నిట్సానుంచి పోలిష్ సేనలు ఎర్రసేనలను తరిమివేసి దానిని ఆక్రమించేయి. దార్నిట్సాప్రక్క నేవున్న రైల్వే బ్రిడ్జిని ఆక్రమించేయి. ఎడమగట్టున కాలూనుకొనేపాటి ప్రదేశాన్ని సంపాదించేయి. కాని, వారు అక్కడినుంచి ముందుకుసాగడానికి చేసిన ప్రయత్నా లన్నింటినీ ఎర్రసైన్యం విఫలపరచింది.

నదివేపుచూస్తూంటే సెర్జీకి గతరోజు ఘటనలన్నీ కళ్ళకు కట్టినట్లు కనిపించేయి.

నిన్నమధ్యాహ్నం ఆతడున్నదళం పోలిష్ సేనల మీాద ఎదురోక్కలు జరిపింది. తీవ్రమైన యుద్ధంసాగింది. అదే ఆతడు పాల్గొన్న మొట్టమొదటి బాహాబాహీయుద్ధం. ఒక పోలిష్ సైనికుడు సన్నీ అమర్చిన రైఫిల్‌తో మీాదికొచ్చేడు. ఏమిటో బడబడలాడుతూ, మహోవ్రేకంతో మీాదికొచ్చిన వానిని సెర్జీ ఎదుర్కొన్నాడు. రైఫిళ్ళు రాపాడేయి. పోలిష్ వాని సన్నీని పక్కకుతోసేసి సెర్జీ ఒక్క పొడుపుతో వానిని కడతేర్చేడు.

సెర్గీ చెయ్యి వణకలేదు. మనుష్యుల్ని యుద్ధంలో చంపక తప్పదని అతనికి తెలుసు. స్నేహాలంటే ఎంత చెవి కోసుకునేవాడైనా, మనసు ఎంత మెత్తనిదయినా ఆత డా హత్యాకాండ సాగించక తప్పదు. స్వాభావికంగా ఆతడు క్రూరుడు కాడు, కుటిలుడూ కాడు. అయినా కొంతమంది పర కష్టోపజీవులు అమాయకులకు విషంనూరిపోసి తమమీదికి ఎగతోసేరు. వాళ్ళతో యుద్ధం తప్పదు. ప్రజలు ఒకరినొకరు చంపుకోనక్కరలేని రోజును త్వరగా సన్నిహితం చేయడం కోసం ఈ హత్యాకాండ సాగించక తప్పదు.

పరమానోవ్ వెనుకనుంచి ఆతని భుజం తట్టేడు.

"లే, ఇక్కడినుంచి కదులుదాం. లేకుంటే వాళ్ళ కళ్ళ పడగలం."

*   *   *

ఇక్కడికి ఏడాదినుంచి పావెల్ కోర్చాగిన్ తనజన్మ భూమి ఆ మూలనుంచి ఈమూలకి ప్రయాణం చేస్తూనే వున్నాడు. మరఫిరంగిబళ్ళమీద, ఫిరంగిబళ్ళమీద, గుర్రాల మీదకూర్చుని ఒకటే తిరుగుడు. మనిషి ఎదిగేడు. కష్టాలు, పరిశ్రమతో గట్టిపడ్డాడు. ప్రపంచజ్ఞానం సంపాదించేడు. మెడలో మోస్తున్న తూటాలబెల్టు బరువుకీ, భుజాన వేసు కొన్న రైఫిల్ బరువుకీ చర్మం పుళ్ళుపడి, మాని, కాయలు కాచిపోయింది.

ఆ ఏడాదిలోనూ ఆతడెన్నో భయంకరదృశ్యాలు చూసేడు. తనలాగే బట్టా పాతా, తిండీ తిప్పలూ లేకపోయినా

అచంచలమైన వర్గచైతన్యంతో శత్రువుల్ని ఎదిరిస్తున్న వేలకొలదిమంది సహచరులతో ఆతను యూక్రెయిన్ అంతా తిరిగేడు. రెండుపర్యాయాలుమాత్రమే ఆతడా యుద్ధాలలో పాల్గొలేదు. మొదటిమాటు తుంటిమీద తుపాకిదెబ్బతగిలి హాస్పిటలుకుచేరినప్పుడు, రెండోమారు 1920 ఫిబ్రవరిలో వచ్చిన టైపస్ జ్వరంతో పడివున్నప్పుడూను.

పోలిష్‌వాళ్ళ మరఫిరంగులకు చనిపోయినవారికన్న టైఫస్‌జ్వరంతో ఎక్కువమంది ఆతనున్న పన్నెండో సైన్యంలో చచ్చిపోయేరు. పోలిష్ సేనలను ఉత్తర యూక్రెయిన్‌లోకిరాకుండా ఆ రోజుల్లో పన్నెండోసైన్యం సుదీర్ఘమైన రంగంలో యుద్ధం చేస్తూంది.

పావెల్ జ్వరంనుంచి పూర్తిగా తేరుకోకపూర్వమే తన దళంలోకి వచ్చేసేడు. ఆ దళం కజాటిన్ - ఉమాంచ్ బ్రాంచి రైలులైన్ మీదున్న ఫ్రాంటోవ్కా స్టేషనును కాపాడుతూంది. ఆ స్టేషను అడవిమధ్యన వుంది. చిన్న స్టేషను భవనం, చుట్టూరా శిథిలమైన కొద్దిపాటి గుడిసెలూ తప్ప అక్కడేమీ లేవు. మూడేళ్ళుగా నిరంతరం సాగుతూన్న యుద్ధాలమూలంగా అక్కడ మనుష్యులు బతకడం అసంభవం అయిపోయింది. ఆ స్టేషను ఎన్నిమార్లు చేతులు మారిందో.

పెద్దమార్పులకు సన్నాహాలు జరుగుతున్నాయి. పన్నెండోసైన్యం విపరీతంగానష్టపడి శిథిలావస్థలో కీవ్ వేపుగా తిరోగమిస్తున్నకాలంలోనే, రెండో వేపున శ్రామిక ప్రభుత్వం శక్తియుక్తులు కూడదీసుకొని పోలిష్‌సైన్యాల మీద గట్టిదెబ్బతీయడానికై సన్నాహాలు చేసుకొంటూంది.

యుద్ధాలలో గడితేరిన మొదటి ఆశ్వికసైన్యాన్ని ఉత్తర కాకేససునుంచి యూక్రేయిన్‌కు తరలిస్తున్నారు. నాలుగు, ఆరు, పదకొండు, పద్నాలుగు ఆశ్వికడివిజన్లు ఒకదాని తర్వాత ఒకటిగా ఉమాన్‌ప్రాంతానికి చేర్చబడ్డాయి. అవి దారిలో మహాఅల్లరిచేస్తున్న మాఖ్నోబందిపోటుదళాల్ని నిర్మూలించి వెనుకభాగాన్ని గట్టిపరచుకొని సిద్ధంఅయ్యాయి.

పదహారున్నరవేలమంది కత్తులుదూసి ముందుకురకడానికి సిద్ధంగావున్నారు.

సన్నాహాలన్నీ పూర్తిచేసుకొనేలోపున శత్రువు ఆటంకాలు కలిగించకుండా, ముందు జాగ్రత్తపడకుండాచెయ్యడం ఎల్లాగ అనేదే ఎర్రసైన్యం సర్వసైన్యాధ్యక్షులనీ, నైరుతి రంగ అధ్యక్షుల్నీ వేధిస్తున్న సమస్య. ఆశ్వికసైన్యాలను అక్కడికి తీసుకురావడం నిరాఘాటంగా సాగేటందుకు కావలసిన జాగ్రత్తలన్నీ తీసుకొన్నారు. ఉమాన్‌రంగంలో దాడులు తగ్గించేరు. మాస్కోనుంచి ఖార్కోవ్ ప్రధాన కార్యాలయానికీ, అక్కడినుంచి పద్నాలుగు, పన్నెండు సైన్యాల ప్రధానకార్యాలయాలకు సరాసరి తంతి సాగుతూంది. సంకేతభాషలో వార్తల్ని టెలిగ్రాఫ్ తీగలు మోసుకుపోతున్నాయి.

“ఆశ్వికసైన్యాల కేంద్రీకరణమీద దృష్టిపడకుండా పోలిష్‌వాళ్ళదృష్టి మళ్ళించండి.” బుడెన్నీ ఆశ్వికసైన్యాల సమీకరణకు ఆటంకం వచ్చేఘట్టంలోతప్ప పోలిష్‌వాళ్ళని యుద్ధానికి కవ్వించడంలేదు.

చాకీలో నెగడి మండుతూంది. నల్లనిపొగ చుట్టలు చుట్టుకొంటూ పైకెగస్తూంది. ఆ పొగలో దోమలు ఉక్కిరి బిక్కిరియై పారిపోతున్నాయి. మంటలచుట్టూ అర్ధచంద్రాకారంలో సైనికులు పడుకొని వున్నారు. ఎర్రనిముఖాలు మంటవెలుగులో మిలమిలలాడుతున్నాయి కుమ్ముమీద పెట్టిన మెస్‌టిన్నులలో నీరు పొంగులు వారుతూంది.

హఠాత్తుగా నిప్పులో వేసిన దుంగక్రిందనుంచి మంట భగ్గుమని ప్రక్కనేపడుకున్న ఒక సైనికుడి జుట్టు మాడి సురసురలాడింది. చటుక్కున తలతీసుకొని తప్పుకొన్నాడు. చుట్టూ వున్నవారంతా నవ్వేరు.

నడికారుమనిషి ఒకతను మంటవెలుతురులో కూర్చొని రైఫిల్‌గొట్టం తుడుచుకొంటున్నాడు.

"కుర్రాడికి పుస్తకాలంటే మహాఇష్టం. మంటలవేడి కూడా తెలియడంలేదు."

మరొకడు అందుకొన్నాడు.

"కోర్చాగిన్! ఆ చదివేదేదో గట్టిగాచదువు. అందరం వింటాం."

కోర్చాగిన్ చిరునవ్వుతో తల ఎత్తేడు.

"కామ్రేడ్ ఆంద్రోష్చుక్! చాలమంచిపుస్తకం. విడవబుద్ధికావడంలేదు."

అతనిప్రక్కనేవున్న మరోయువకుడు ఏదేం పుస్తకం అన్నాడు.

"ప్రేమగాథఅయితే నాకు మహాయిష్టం"

నలుగురూ నవ్వేరు. మాత్వేచుక్ కన్నెగరేసేడు.

"సెరెదా! ప్రేమ అనేది మహాదొడ్డది."

ఓ నిముషం పూరుకొని మళ్ళీ అందుకున్నాడు.

"మహాఅందంగా వుంటావేమో. నీవెనకాల పరుగెత్తేసరికి ఆడపిల్లల కాలిజోళ్ళు వారానికొకటి అరిగిపోతూండి వుంటాయి. ఒక్కలోపం వుందిగాని లేకపోతేనువ్వు అపరమన్మధుడివే. లోపంఅల్లా చప్పిడిముక్కుది. అయినా ఫర్వాలేదు. ఓ రాత్రిముక్కుకి *నొవిట్స్కీ గ్రెనేడ్ వేలతియ్యి. తెల్లవారేసరికి చక్కబడుతుంది."

నలుగురూ ఫక్కున నవ్వేసరికి మరఫిరంగిబళ్ళకి కట్టిన గుర్రాలు ఉలికిపడి తిరిగితిరిగి చూసేయి.

సెరెదా ఆ అపహాస్యాన్ని లెక్కచేయలేదు.

"ముఖం తీరుకాదు చూడవలసింది. బుర్రలోవున్న గుంజుచూడాలిగాని... నీసంగతే చూసుకో. నీ నాలిక మహాచురుకేగాని, వట్టి అడ్డగాడిదకున్న తెలివి."

ఇద్దరూ కయ్యానికి దూసుకొంటూంటే సెక్షన్ నాయకుడు తాతారినోవ్ కోపపడ్డాడు.

"ఎందుకర్రా దెబ్బలాడుకొంటారు? కోర్చాగిన్‌ను చదవనీండి, విందాం."

"అది సరైన పని. పావ్‌లూషా చదవ్వయ్యా!"— అంటూ చుట్టూరావున్న జనం సమర్థించేరు.

పావెల్ నెగడికి దగ్గరగా జరిగేడు.

---

* నొవిట్స్కీ గ్రెనేడ్ రమారమి పదిపౌను లుంటుంది. దానివి ముళ్లతీగ కంచెల్ని ధ్వంసం చేయడానికై ఉపయోగిస్తారు.

"కామ్రేడ్స్! ఈ పుస్తకం పేరు గాటెన్ శ్లో. ఓటాలం కమిస్సారు ఇచ్చేడు. మంచిబాగుంది. ఓపిగ్గా వింటామంటే చదువుతా."

"కానీ, ఎవ్వర్నీ నోరు విప్పనియ్యంలే.

మరికొంత సేపటికి కమిస్సార్ను వెంటబెట్టుకొని రెజి మెంటల్ కమాండరు కామ్రేడ్ పుజూరేవ్స్కీ వచ్చేసరికి గ్రంథపఠనం మహావేగంగా సాగిపోతూంది. పది పద కొండుమంది కళ్ళూ పాఠకుడిమీదనే వున్నాయి.

"రెజిమెంటు తాలూకు స్కౌట్లలో సగంమంది ఇక్కడే వున్నారు. వాళ్ళల్లో నలుగురు మరీ చిన్నవాళ్ళే. అయితేనేం మంచి సైనికులు. అదుగో ఆ చదువుతున్నవాడు కోర్చాగిన్. ఆ తోడేలు కళ్ళల్లా కళ్ళూ అతనూ జారూకీ. వాళ్ళిద్దరూ స్నేహితులు. నోటితో పైకి చెప్పుకోరుగాని ఒకరితో ఒకరు పోటీపడి పనులు చేస్తారు. మా స్కౌట్లలోకల్లా కోర్చాగిన్ గట్టివాడు. ఇప్పు డానికి పోటీ మరొకడు వచ్చేడు. వాళ్ళిప్పుడు రాజకీయ ప్రచారంకూడా ప్రారం భించేరు. మంచి పనిచేస్తున్నారు. పడుచుకారంతా వీళ్ళని "యంగ్ గార్డ్" అంటూంటారు. పేరుకి తగినవాళ్ళులే."— యంటూ పుజూరేవ్స్కీ కమిస్సారుకు దూరంనుంచే పరి చయం చేసేరు.

"చదువుతున్నది రాజకీయ బోధకుడా?"

"ఉహు. ఇక్కడ రాజకీయాలు చెప్పేవాని పేరు క్రామర్."

పుజూరేవ్స్కీ గుర్రాన్ని ముందుకు నడిపేడు.

"కామ్రేడ్స్! అభినందనలు."

కమాండర్ గుర్రంమీదినుంచి క్రిందకి దిగి, తనవేపు రావడంచూసి అంతా లేచి నిలబడ్డారు.

"చలి కాగుతున్నారా?" అంటూ కమాండరు చిరునవ్వు నవ్వేడు. సైనికులంతా కమాండరుకు నమస్కారం చేసేరు. కమిస్సారు ఇంకా గుంపుకు వెళ్ళే ప్రయత్నంలో గుర్రం దిగనేలేదు.

రివాల్వరు హోల్స్టరు పక్కకు తోసుకుంటూ పుజూరేవ్‌స్కీ కోర్చాగిన్ ప్రక్కన చదికిలబడ్డాడు.

"సిగరెట్ కాలుద్దామా? నావద్ద మంచి పొగాకుంది."

కమాండరు సిగరెట్టు చుట్టుకొని ముట్టించేడు. కమిస్సారు ఆయనకోసం కనిపెట్టుకొని గుర్రంమీద నేవున్నాడు.

"దొరోసెన్! నువ్వు వడు. ఓక్షణం కూచ్చునివస్తా. హెడ్ క్వార్టర్సునుంచి కబురొస్తే మనిషిని పంపు."

కమిస్సారు వెళ్ళిపోయేడు.

"చదువు, నేనూ వింటా."

పుస్తకం చివరకంటా చదివి పావెల్ క్రిందపెట్టేడు. ఒక్కక్షణంవరకూ ఎవ్వరూ మాట్లాడలేదు. గాడ్‌ఫ్లై దుఃఖగాథ అందరి మనస్సుల్నీ కలతపెట్టింది. పుజూరేవ్‌స్కీ సిగరెట్టు పీలుస్తూ చర్చకోసం ఎదురుచూస్తున్నాడు.

సెరెదా నిశ్శబ్దాన్ని భంగించేడు.

"విచారకరమైన గాథ. ప్రపంచంలో అల్లాంటి మను

ష్యులున్నారన్నమాట. అన్నికష్టాలెవ్వరూ పడలేరు. కాని, ఒక ఆదర్శంకోసం మనిషి ఎంతైనా త్యాగం చెయ్యగలుగుతాడు.''

ఆ పుస్తకం సెరెదాను బాగా ఆకర్షించింది.

బెలాయాజెర్కోవ్ నుంచి వచ్చిన ఆంద్రూషాఫోమిచేవ్ ఆవేశం ప్రకటించేడు.

''ఆతని గొంతులో కర్రకూరిన ఆ మతబోధకుడు దొరికితే పీకి పిసికేస్తా.''

ఆంద్రోష్చుక్ కుమ్ముమీదవున్న ఒకపాత్రను నిప్పులకేసి నెట్టుతూ తన అభిప్రాయం ప్రకటించేడు.

''ప్రాణాధికమైనదానికోసం ప్రాణాలివ్వడానికి మనిషి సందేహించడు. దానిమీదవున్న విశ్వాసమే ఆతనికాబలం ఇస్తుంది. తాను చేస్తున్న పని మంచిదే ననేభావం ఏర్పడితే మనిషి చావుకి భయపడడు. వీరులు పుట్టేది అల్లాగే. నేనో కర్రాణ్ణి ఎరుగుదును. వాని పేరు పొరైకా. ఒడెస్సాలో తెల్లసేనలు (విప్లవ వ్యతిరేకత తెలుపు. విప్లవం ఎరుపుగా గుర్తు.) వానిని చుట్టువారేయి. ఆతడు వాళ్ళందర్నీ దగ్గరగా రానిచ్చి చేతిబాంబు నేలకొట్టేడు. దాని అదురులో తాను చచ్చిపోయేడు. ఒక ప్లాటూన్ శత్రువుల్ని ఖతంచేసేడు. చూస్తే వేలెడు కర్రాడు. మనం పుస్తకాల్లో చదివే మనుష్యుల్లాంటివాడేం కాడు. కాని పుస్తకాల కెక్కించవలసిన మనిషిమాత్రం అవును. మన జనంలో అటువంటివాళ్ళు ఎందరో వున్నారు.''

ఒక చెంచాతో గిన్నెలో వస్తువు కదిలించి, ఇంత తీసి నోట్లో వేసుకొని, కళ్ళు చికిలించేడు :

“కొందరు కుక్కచావు చచ్చేవాళ్ళు లేకపోలేదు. చాల అవమానకరమైన చావుచస్తారు. ఇజ్యాస్లావ్ దగ్గర జరిగిన యుద్ధంలో ఒక విషయం నాకళ్ళతో చూసేను. ఇజ్యాస్లావ్ గోరున్ నదిమీదుంది ప్రాచీనపు పట్టణం. అక్కడో చర్చివుంది. కోటలాగే కట్టేరు దాన్ని. మేమాపట్టణంలో ప్రవేశించేం. సన్నగా మెలికలుతిరిగివున్న గొందుల్లో ఒక్కొక్కళ్ళకన్న నడవలేరు. అందుచేత బారుతీరి వెడుతున్నాం. మా కుడిపార్శ్వాన లెట్టిష్ కంపెనీ కమ్ముకొనివుంది. గొందుల్లోంచి రాజవీథికి వచ్చేసరికి ఒక గుమ్మంలో చెట్టుకి మూడు గుర్రాలు కట్టేసి కనబడ్డాయి. ఇంకేముంది ? ఎవళ్ళో పోలిష్ వాళ్ళు దొరికేరులే అనుకొన్నాం. పదిమంది ఆయింటివేపు వురికేం. లెట్టిష్ కంపెనీ కమాండరు రివాల్వరుచేత పట్టుకొని మా ముందు వురికేడు.

“వీథిద్వారం తెరిచేవుంది. అందరం లోపలజొరబడ్డాం. కాని, లోపల వున్నది పోలిష్‌వాళ్ళుకాదు. మన మనుష్యులే. గస్తీ గుర్రపుదళం వాళ్ళు. వాళ్ళు మాముందు వస్తున్నారు. వచ్చి వెధవపని చేస్తున్నారు. ఆ యింట్లో ఓ పోలిష్‌ఆఫీసరు వుండేవాడు. ఈ యోధులు వెళ్ళి వాడిపెళ్ళాన్ని పట్టుకొన్నారు. చెరుస్తున్నారు. లెట్టిష్ ఆఫీసరు ఆ దౌర్జన్యం చూడగానే ఆవేశం పట్టలేకపోయేడు. వాళ్ళభాషలో ఏమేమిటో తిడుతూ గస్తీసైనికుడొకడి రెక్కపట్టుకొన్నాడు. మిగతావాళ్ళ నిద్దరినీ మేముపట్టుకొన్నాం. ముగ్గురినీ బయ

టకు లాక్కువచ్చి నిలబెట్టేం. అక్కడున్నవాళ్లం రష్యన్లం ఇద్దరం. మిగిలినవాళ్ళంతా లెట్టిష్ వాళ్ళు. ఆ కమాండరు పేరు బ్రెదిస్. ఆయన చెప్పేదేమీ నాకర్థం కాకపోయినా ఆ ముగ్గుర్నీ ఖతంచేయమన్నాడనేది అర్థంచేసుకోవడం కష్టమేంకాదు. లెట్టిష్ సైనికులు మహాగండటు. సహరూపానుభూతి లేదు. మారుమాట్లాడకుండా ఆ ముగ్గుర్నీ పశువులసాలవైపు ఈడ్చుకుపోయేరు. వాళ్ళపని ఆఖరుఅయిందని నాకు తెలుసు. వాళ్ళల్లో ఒకడున్నాడు. పెట్టంతమనిషి. తెలుపు చుక్కలా వెనుపట్టే వాడూ దేవరపోతులావున్నాడు. ఆ కమాండరు ముక్కు క్రింద ఉమ్మివేయబుద్ధిపుట్టింది. ఇంక నాకు చేసిన సాయంగానూ చూసితీరాలి. ఓ ఆడమనిషికోసం నన్ను చంపుతాననట్రా అంటున్నాడు. మిగతా ఇద్దరూ బావుర్మని బతిమాలుకుంటున్నారు.

"నాకు చాలకష్టం అనిపించింది. కమాండరువద్దకెళ్ళేను. "కామ్రేడ్! వాళ్ళనిచంపి నీచేతు లెందుకు ఖరాబు చేసుకొంటావు. విచారణకుపెట్టి శిక్షింపచెయ్యి. ఇంకా పట్టణంలో యుద్ధం ముగియలేదాయె. ఈ వెధవలకోసం మన పని పాడుచేసుకోవద్దు"—అన్నాను. అతను నాకేసి పెద్దపులిలా చూసేడు. నిజం చెప్పొద్దూ. ఆమాట ఎందుకు అన్నానురా అనిపించింది. తుపాకీ నాకేసి తిప్పేడు. ఏడేళ్ళనుంచి యుద్ధరంగాలలోవున్నాను. కాని అంతభయం ఎన్నడూ వేయలేదు. కాల్చేసి, మరీమాట్లాడేలా కనిపించేడు. ఏదో వచ్చీరాని రష్యన్ భాషలో అరిచేడు. నాకేం అర్థంకాలేదు. "మన రక్తంతో మన జెండాకి రంగువేసేం. ఈ వెధవలు మన

సైన్యానికే అప్రతిష్ఠ తెస్తున్నారు. ఇల్లాంటి వాంగకు మరణమే శిక్ష.'' — అల్లాంటిదే ఏదో చెప్తున్నా డని పించింది.

"ఇంక అదిచూడలేక వీధిలోకి పారిపోయేను. నేను వీధిలోకి వచ్చేసరికి తుపాకీ కాల్పులు వినిపించేయి. ఆ గస్తీ దళం మూళ్లో మెట్రోపోల్ దగ్గరనుంచి వస్తూంది. ఒకప్పుడు వాళ్ళు మూఖోన్నతో పరుగెత్తేవారట. చెత్తమూక.''

ఆంద్రోష్చ్క్ నిప్పుల్లోనుంచి పాత్రతీసి తన ఎదుట పెట్టుకొని, రొట్టెకోసం మూటవిప్పేడు.

"అల్లాంటి పాడుచేత్త అప్పుడప్పుడు మనలోనూ కనిపిస్తుంటారు. ఎవరు ఎలాంటివాడో ఎల్లాగ చెప్పడం? అందరం విప్లవకారులమే నంటాం. వాళ్ళమూలంగా మనంద రికీ బద్‌నామ్. అయితేనేం అటువంటి ఘటన చూడలేము. ఆ దృశ్యం ఎన్నటికీ మరవలేను.''

—అంటూ ఆతడు మసలుతున్న టీ చప్పరించి కథ ముగించేడు.

నలుగురూ నిద్రకుపడేసరికి రాత్రిగడిచింది. సెరెడా గుర్రు వినిపిస్తూంది. వుజూరేవ్‌స్కీ గుర్రపుజీను తలక్రింద పెట్టుకొని అక్కడే నిద్రపోయేడు. రాజకీయాలు చెప్పే క్రామర్ ఒక్కడూ తన నోట్‌బుక్కులో ఏదో వ్రాసుకుంటూ కూర్చుండిపోయేడు.

మరునాడు గస్తీకిపోయివచ్చి పావెల్ గుర్రాన్ని చెట్టుకు కట్టేసేడు. అప్పుడే టీ తాగి పాత్రక్రిందపెట్టిన క్రామర్‌ను పిలిచేడు.

"చూడు, క్రామర్! ఒకటిగా ఆశ్వికసైన్యంలోకి నీను మార్పించుకొంటే ఎల్లాగ వుంటుందంటావు? నాలుగా చూస్తూంటే వాళ్ళెదో పెద్ద దే తలపెట్టినట్టు కనిపిస్తూంది. పనిలేక అంత సైన్యాన్ని చేరుస్తారంటావా? ఇక్కడుంటే అవేం కనబడవు."

క్రామర్ ఆతనివేపు ఆశ్చర్యంతో చూసేడు.

"మార్పించుకొంటావు? సైన్యాలలో ఒక యూనిట్ నుంచి మరోదానిలోకి మారడమంటే సినిమాల్లో సీట్లు మార్చుకొన్నట్లే ననుకొంటున్నావా?"

"ఎవళ్ళు ఎక్కడుండి యుద్ధంచేస్తేనేం? వెనక్కి పారి పోవడం లేదుకద."

కాని క్రామరు ఆ అభిప్రాయానికి సుతరాం అంగీకరించలేదు.

"కాని క్రమశిక్షణ? పావెల్! నువ్వు మంచివాడివే గాని బాగా అరాజకంమనిషివి. నీకు తోచినట్లల్లా చేసెయ్యొచ్చుననుకొంటున్నావు. అబ్బాయి! మనపార్టీకీ, కామ్సోమాల్ కీ క్రమశిక్షణ ప్రాణంలాంటిది. ఏంవచ్చినా ముందు పార్టీ సంగతి ఆలోచించాలి. మనం అందరం అవసరం ఎక్కడుందో అక్కడుండాలిగాని ఇష్టప్రకారం తోచినచోట వుండాలనుకోకూడదు. మార్పుకోసం నువ్వు దరఖాస్తు పెట్టడమూ, పుజూరేవ్ స్కీ కాదనడమూ అయిందిగదా? ఇంకావేమిటి?

క్రామర్ ఆవేశంతో మాట్లాడేడేమో గొంతు పొడిపోయి దగ్గువచ్చింది. అతడు చాలాకాలం ప్రెస్సుల్లో పని

చేసేడు. సీసపుకలం రొమ్ములకి పట్టేసి, తరుచుగా బుగ్గలుపా
బారుతుంటాయి.

కొంతసేపున్నాక పావెల్ తనఅభిప్రాయం ఖచ్చితం
చెప్పేసేడు.

"నువ్వు చెప్పిందంతా బాగానేవుంది. కాని, ఏది ఏ
అవనీ, నేనుమాత్రం బుడెన్నీ సేనల్లో చేరేదే."

మరునాడు సాయంకాలం పావెల్ ఆ చౌకీదగ్గర క
బడలేదు.

* * *

ప్రక్క గ్రామంలోని పాఠశాల బిల్డింగుముందు బుడెన్నీ
ఆశ్వీక సైనికులు పెద్దవలయంగా ఏర్పడి నిలబడ్డారు. మధ్యన
మరతుపాకీబండిమీద ఒకడు కూర్చుని అకార్డియన్ వాయి
స్తున్నాడు. ఆతనికి దానిని వాయించడం బాగా చేతకాదు.
ఆతని వ్రేళ్ళక్రింద నది కుయ్యో, మొర్రో అన్నట్లు మధ్యమధ్య
ఒకొక్కమారు అరుస్తూంటుంది. ఆ వలయంమధ్యన
హోపక్ నాట్యంచేస్తున్న ఒక ఆశ్వికుడు ఆ సంగీతం విని
ఏంచెయ్యడానికీ తోచక నిలబడిపోతున్నాడు.

ఆపటాలం అప్పుడే గ్రామంలోకివచ్చిందేమో వూళ్ళో
పడుచువాళ్ళంతా చుట్టూచేరి ఆపాటలూ, గంతులూ చూస్తు
న్నారు.

"తోప్తాలో! ఊఁ. గెంతు. అదీ. ఏయ్! అకార్డియన్
వాయించవయ్యా! చూస్తావేం!"

ఆ [illegible] గీ[illegible] ప్రేక్షక్లు ఇవాన్ [illegible]ప్పాటిస్తోహోంది సుస్పష్టంగా సంచెమ్యుస్తంటేగాని ఆ సున్నితమైన మెట్లమీద జరగలే కుండా [illegible]యి.

"మాఖోన్గాడికి జఫిషాశీకల్యాబా బలైపోయేడు, పాపం. లేకపోతే అకార్డియన్ ఎంత బాగావాయించేవాడు. ఎప్పుడూ మన స్నేహితున్ని కుడిచేతివేపునే వుండేవాడు. చచ్చిపోయేడు. పాపం. మంచి పోటరీ, మంచి వాద్యగాడూ."— అంటూ ఒక ఆశ్వికుడు విచారం తెలిపేడు.

వలయంలో నిల్చున్న పావెల్ ఆ మాటలు విన్నాడు. జనాన్ని ఒత్తిగించుకొని బండివద్దకెళ్ళి అకార్డియన్ తిత్తుల మీాద చెయ్యివేసేడు. గీతం ఆగిపోయింది.

వాద్యగాడు కనుబొమ్మలు ముడేసేడు.

"ఏమిటి?"

తోప్తాలో కూడా నిలబడిపోయేడు. చుట్టూజనం కోపంతో గుర్రుమన్నారు.

"ఏమిటది?"

పావెల్ వాద్యాన్ని తీసుకొన్నాడు.

"నేను వాయించిచూస్తా."

ఆశ్వికసైనికుడు అనుమానం కనబరుస్తూనే వాద్యంతీసి ఆతని కందించేడు.

మంచిఅలవాటున్నవాడల్లే పావెల్ పటకామెళ్ళో తగిలించుకొని అకార్డియన్ కాళ్ళమీాద పెట్టుకుకూర్చున్నాడు. విసనకర్ర తెరచినట్లు తిత్తులుసాగదీసి నెమ్మదిగానొక్కుతూ

మెట్లమీద వేళ్ళు పరుగెత్తించేడు. మృదుమధుర సంగీతం ప్రవాహంలా వినిపించింది.

తోప్తాలో చేతులుచాచి పెద్దపక్షిలా ఎగురుతున్నట్లు వలయంమధ్యకు వచ్చేడు. ఆతనిశరీరం వూహించలేనంతగా మెలికలు తిరిగిపోతూంది. గిర్రున తిరుగుతున్నాడు. పిక్కల మీద, తొడలమీద, మోకాళ్ళమీద, తలమీద, నుదుటి మీద, జోడుమడమలమీద, నోటిమీద సంగీతానికి అనుకూలంగా లయవేస్తున్నాడు.

సంగీతం అంతకంతకు చురుకందుకుంది. వెర్రెత్తిస్తూంది. తోప్తాలో కాళ్ళు ఝాడిస్తూ, బొంగరంలా గిర్రున తిరిగేడు.

* * *

బుడెన్నీ ఒకటో అశ్వికసైన్యం కొన్ని గట్టిదెబ్బలు తీసి 1920 జూన్ 5 న పోలిష్ సరిహద్దుసేనలలో గండికొట్టి లోనికిదూరింది. మూడో పోలిష్సైన్యాన్నీ, నాలుగో సైన్యాన్నీచీరి చెరోవేపుకూ నెట్టేసింది. వారిని అడ్డగించడానికై జనరల్‌సావిస్కీ నాయకత్వాన ఒక అశ్వికబ్రిగేడ్ వచ్చింది. వారిని ఓడించి రూజనూవేపుగా సాగింది.

పోలిష్ సేనాధిపతి మంచి బలమైన సైన్యాన్ని తెచ్చి యుద్ధరంగాన్ని కమ్ముకొనేటందుకుపయోగించేడు. అయిదు టాంకులు ప్రోగ్రెబిష్చె స్టేషన్‌నుంచి యుద్ధరంగంవేపు వెళ్ళేయి. పోలిష్ సేనలు అశ్విక సైన్యాన్ని అడ్డుకొట్టడం కోసం జారూద్నిట్సవద్ద సమీకరించేయి. కాని బుడెన్నీ

సైన్యం జారూదిన్నతూన్సను పక్కకు దిగతొక్కి పోలిష్ సైన్యాల వెనకవైపు చేసకొన్నాయి.

బుడెన్నీ ఒకటో అశ్వికసైన్యాన్ని వెంటబడి దెబ్బ తీయడంకోసం జనరల్ కోర్నిస్కీ అశ్విక డివిజనును వురికించేరు. ఒకటో అశ్వికసైన్యం కజాటిన్ వేపు వెడుతుందని పోలిష్ అధికారుల అంచనా. అది పోలిష్ సేనల వెనక భాగంలో మంచి కీలకస్థానంలో వుంది. ఆ వుద్దేశంతో కోర్నిస్కీ సేనలు బుడెన్నీ సేనలను వెనక వేపునుంచి గట్టిదెబ్బ తీయాలనే ప్రయత్నంతో బయలుదేరేయి. కాని ఈ ఎత్తు ఫలవంతం కాలేదు. పోలిష్‌వాళ్ళు తమ రంగంలో ఏర్పడిన గండిని పూడ్చుకోగలిగేరు బుడెన్నీ సైన్యాలకు వెనకబలం లేకుండా చేసేరు. కాని ఒక పెద్ద అశ్వికసైన్యం తమ పంక్తుల వెనకభాగంలో వుండడం మహాప్రమాదకరంగానేవుండిపోయింది. వారు ఏ మూలనుంచి మీదపడతారో. తమ ప్రయాణాల ఆయువుపట్లన్నీ వాళ్ళచేతుల్లో వున్నట్లే. పైగా కీవ్ దగ్గరున్న తమ సేనలను వెనకవేపునుంచి ఏ క్షణంలో దెబ్బతీసినా తీయవచ్చు.

బుడెన్నీ అశ్వికసైన్యం దారిలోవున్న వంతెనలు, రైలు వంతెనలు కూలగొడుతూ ముందుకు సాగింది. రైలు పట్టాలు పీకిపారేసింది. దానితో కీవ్‌నుంచి పోలిష్‌సేనలు పారిపోవడంకూడా కష్టం అవుతుంది.

ఝిటోమిర్ అనేచోట ఒక పోలిష్ సైన్యంయొక్క ప్రధాన కార్యాలయంవుందని ఖైదీలనుంచి బుడెన్నీకి తెలిసింది. నిజానికి ఆ యుద్ధరంగ ప్రధానకార్యాలయమే అక్క

డుంది. ఆ వార్త వినగానే ఒకటో ఆశ్వికసైన్యాధిపతి ఝిటోమిర్‌నూ, బెర్డిచేవ్‌నూ కూడ ఆక్రమించాలని నిర్ణయించుకొన్నాడు. రెండూ రైల్వేజంక్షనులూ, ప్రభుత్వ కార్యాలయాలున్న జిల్లాకేంద్రాలూను.

జూన్ 7 వ తేదీన తెల్లవారేసరికల్లా ఒకటో ఆశ్విక సైన్యం ఝిటోమిర్ వేపుగా అతివేగంగా కదిలిపోతూంది.

మాఖ్నో బందిపోట్లచేతిలో చచ్చిపోయిన అకార్డియన్ వాద్యగాడు కల్యాబోక్‌స్థానే పావెల్ తన ఆశ్విక దళం కుడివేపున స్వారిచేస్తున్నాడు. ఆ దళంలోనివారంతా పట్టుపట్టి ఆతనిని తమదళంలోకి చేర్పించుకున్నారు. అంత బాగా అకార్డియన్ వాయిస్తున్నవానిని విడవడానికి వాళ్ళు అంగీకరించలేదు.

గుర్రాలు నురుగులుకక్కుతున్నా సైన్యం ఎక్కడా ఆగలేదు. ఝిటోమిర్ సమీపంలో సైన్యం నాలుగుమూలలకీ విస్తరించి, కత్తులుదూసి నగరంమీద పడింది.

గుర్రపుగిట్టల తాకిడికి నేల కంపించింది. గుర్రాల సకిలింపులకు దిక్కులు ప్రతిధ్వనించేయి. రికాబుల్లో నిలబడి ఆశ్వికులు సింహనాదాలుచేసేరు.

నగరంలో సైన్యం ప్రవేశించింది. తోటలు, వీధులు, రోడ్లు గుర్రపుడెక్కలక్రిందగా వెనక్కిపరుగులు తీస్తున్నాయి.

పోలిష్‌సేనలు ఈ ఉత్పాతానికి దిగ్భ్రమచెందేయి. ఎదుర్కోడానికూడా అవి గట్టిగా ప్రయత్నించలేదు. ఒక్క దెబ్బలో నగరంలోని బలగం నాశనం అయిపోయింది.

తానెక్కిన గుర్రం మెడమీదుగా ముందుకు వంగి, విచ్చు కత్తితో పావెల్ తోప్తాలో ప్రక్కనే ఫెటోమిర్ ప్రవేశించేడు. పోలీస్‌సైన్యం తుపాకీ తీసేలోపున తమ కత్తులకెరయై పోవడం తనకళ్ళతో చూసేడు.

గుర్రపుడెక్కలనున్న నాడాలు వీధుల్లో పరచిన రాళ్ళమీద నిప్పుకణాల్ని చిమ్ముతున్నాయి. ఒక వీధిమలుపులో రోడ్డుమధ్యనున్న మరఫిరంగి వాటి నెదుర్కొంది. పోలీస్ టోపీలు, నీలిరంగు యూనిఫారాలతో ముగ్గురుసైనికులు దాని వెనక వొదిగిఉన్నారు, బ్రీచ్‌లో తూటాలబెల్టులు మేపుతున్నారు. నాలుగోవాడి చొక్కాకాలరుమీద బంగారు జలతారు మిలమిలలాడుతూంది. అతను మాజరుతీసుకొని వాళ్ళప్రక్క నిలబడివున్నాడు.

తోప్తాలోగాని, పావెల్‌గాని గుర్రాల్ని ఆపలేకపోయేరు. అవి తిన్నగా మరతుపాకీవేపు పరుగెత్తేయి. మరతుపాకీ మృత్యువు నుముస్తూంది. ఆఫీసరు కోర్చాగిన్‌మీదికి మాజర్ కాల్చేడు. కాని గురితప్పింది. గుండు అతనిబుగ్గను గీసుకుపోయింది. మరుక్షణంలో గుర్రం ఆఫీసరును తోసేసి తొక్కింది.

మరతుపాకీ టపటపలాడింది. తూట్లుపొడిచేసినట్లు తోప్తాలో గుర్రంతోసహా నేల కొరిగేడు.

భయంతో పావెల్‌గుర్రం వెనకకాళ్ళమీద లేచింది. అతను కళ్ళెంబిగపట్టి పడిపోకుండా కాచుకొన్నాడు. మరుక్షణంలో గుర్రం మరతుపాకీమీంది దూకింది. పావెల్‌కత్తి ఒక్కవిసురులో దగ్గరగావున్న ఒక పోలీస్‌సైనికుడి తలను

ఉత్తరించింది. అదే విసురుతోనే కత్తి కెంపు వేళ్ళనుంచి షూరోకని తలమీద పడడానికి సిద్ధంగా పైకివచ్చింది. కాని అంతలో గుర్రం మళ్ళీ పక్కకు తిరిగింది.

కట్టతెగిన ప్రవాహంలా ఎర్ర గుర్రపు సైన్యం వచ్చి పడింది. వీధిమూలల్లో కత్తులు మిలమిలలాడేయి.

పట్టణంలో వున్న జైలుగదులు కేకలతో ప్రతిధ్వనించిపోయేయి.

జైలుగదు లన్నీ స్త్రీ, పురుషులతో నిండివున్నాయి. నగరంలో యుద్ధం జరుగుతూందని వాళ్ళకి తెలిసింది. తమ విముక్తి సన్నిహితం అయిందనిపిస్తున్నా, ఆ మాటను నమ్మలేకపోతున్నారు. అంత హఠాత్తుగావచ్చింది, దాడి.

కొద్దిసేపటికి జైలుగుమ్మంలో తుపాకీకాల్పులు వినిపించేయి. మరుక్షణంలో జనం పరుగెత్తుతూవచ్చేరు. ఇంకో నిముషంలో ఎన్నోరోజులుగా ఆశిస్తూ, నిరాశపడిపోతున్న మాటలు వినిపించేయి.

"కామ్రేడ్స్! మీరు విడుదలయ్యేరు."

పావెల్ ఓగది గుమ్మంవేపు పరుగెత్తేడు. దానికి తాళం వేసివుంది. ద్వారం పక్కనున్న కిటికీలో పదితలలు ఒకదాని నొకటి నొత్తుకొని కనిపించేయి. పావెల్ ఆవేశంతో తుపాకీ మడమతో తాళం కప్పమీద బాదడం ప్రారంభించేడు.

"ఉండు. ఈ బాంబుతో దీన్ని బ్రద్దలుచేద్దాం"— అంటూ మిరోనోవ్ అతనిని పక్కకులాగి జేబులోంచి చేతి బాంబు తీసేడు.

ప్లాటూన్ కమాండరు సిగార్స్కింకో ఆ చేతిబాంబు వూడలాక్కున్నాడు.

"మతిలేదా ఏం, తెలివితక్కువ పెద్దమ్మా! తాళాలు తెస్తున్నారు వుండు."

తుపాకులు వెనకనుంచి పొడిచి నడిపిస్తూంటే తాళం చెవులతో జైలరు వచ్చేడు. మరికొద్దిసేపట్లో తలుపులు తెరుచుకొన్నాయి. స్త్రీలూ, పురుషులూ మహానందంతో గంతులు వేస్తూంటే జైలు వాకిళ్ళు నిండిపోయేయి. ఒకరి ఒంటిమీదా సరియైన బట్టలులేవు. ఎన్నాళ్ళయిందో స్నానాలు చేసి.

పావెల్ తలుపు తెరిచి గదిలోకి పరుగెత్తేడు.

"కామ్రేడ్స్! మీరు విడుదలయ్యేరు, బుడెన్నీ సైన్యం—మేము పట్టణం పట్టుకొన్నాం."

కళ్ళనీళ్ళు కమ్ముతూంటే ఒకామె పరుగెత్తివచ్చి పావెల్‌ను కౌగలించుకొంది. ఎంతో ప్రియబంధువు దొరికినట్లు వెక్కివెక్కి ఏడ్చింది.

ఆ జైలులో పోలిష్ అధికార్లు అయిదువేల డెబ్బయ్యొక్క మంది బోల్షివిక్కులీన్ని, రెడార్మీలో పనిచేసే రాజకీయ ప్రచారకులు రెండువేలమందిని బంధించివుంచేరు. కొద్ది దినాలలో తుపాకుల వాతబడనున్న వీరందరినీ విడుదలచేయడం ఎర్ర సేనలకు చాల గొప్పవిజయం. ఏడువేలమంది వీరులు మళ్ళీ తమపంక్తులలోకి వచ్చిచేరుతున్నారు. వారి జీవితాలు అంధకారంలోంచి ఒక్కమారు వెలుగులోకి ప్రవేశించేయి.

ఖైదీలలో ఒకడు పావెల్ ను ఆప్యాయంగా దగ్గరగా వచ్చి కౌగలించుకొన్నాడు. అతడు షెపెటోవ్కాలోని ఒక ప్రెస్సు పనివాడు. అతని పేరు శామ్యూల్ లెఫెర్.

* * *

షెపెటోవ్కాలో పోలిష్ సేనలు చేసిన దారుణాలను గురించి శామ్యూల్ లెఫెర్ చెప్తూంటే పావెల్ ఒళ్ళు జలదరించింది.

“ఓ రోజు రాత్రి వాళ్ళు మమ్మల్నిఅందర్నీ పట్టుకొన్నారు. ఎవడో దొంగ వెధవ మిలిటరీపోలీసుకి మా సంగతి చెప్పేడు. అందరం దొరికిపోయేం. ఏంకొట్టేరని చెప్పను.” నాకే తక్కువ దెబ్బలు తగిలేయి. మొదట్లోనే నేను వాళ్ళెరక్కుండా పడిపోయేను. మిగతా వాళ్ళు నాకంటె బలంగా వున్నారు.

“మేము చెప్పవలసిందంటూ మిగలలేదు. దాచవలసింది అసలేలేదు. మనకంటె వాళ్ళకే బాగా తెలిసేయి. మనంచేసిన ప్రతిపనీ వాళ్ళెరుగుదురు. మనలో ఎవడో ద్రోహి లేకపోతే వాళ్ళకిఅవన్నీ తెలియడం సాధ్యంకాదు. ఆరోజులు తలుచుకొంటే కంపరం పుడుతూందనుకో. పట్టుబడ్డవాళ్ళల్లో చాలమంది నీకూ తెలుసు. వాల్యా బ్రూజక్, రోజా గ్రిట్స్మన్. రోజా, ఎంతమంచిపిల్ల! పదిహేడోయేడు అప్పుడే జొరబడింది. ఆ కళ్ళూ అవీ, పాపం...సాషాబన్ షాఫ్ట్ ను నువ్వెరుగుదువు కదూ. మాతోపాటే కంపోజిటరుగా పనిచేసేవాడు. మేనేజరుగారిని ఎప్పుడూ వెక్కిరించుతూ బొమ్మలేసేవాడు. అత

చేసి, జర్మను సిపాయిలు విద్యార్థులు నోవోసెల్‌స్కీ, తుజిట్స్కు లనూ తీసుకుపోయేరు. బహుశా వాళ్ళ పేర జ్ఞాపకంవుండే వుంటారు. మిగిలిన వాళ్ళుగూడా అక్కడికి వాళ్ళే. కొద్దిమంది జిల్లా కేంద్రంనుంచి వచ్చినవాళ్ళున్నారు. మొత్తం 29 మందిని పట్టుకున్నారు. వాళ్ళలో ఆరుగురు ఆడవాళ్ళు. అందర్నీ మహాఘోరంగా బాధపెట్టేరు. మొదటిరోజునే వాల్యానూ, రోజానూ చెరిచేరు. ఆ రాక్షసివెధవలు వాళ్ళని తోచినట్లల్లా హింసించి మళ్ళీ గదుల్లో పడేసేరు. అప్పటినుంచే రోజాకు మతిస్థిమితం చెడి, కొద్దిరోజుల్లో వెర్రెత్తిపోయింది.

"ఆమెకు పిచ్చెత్తడం అబద్ధమనీ, అదంతా నటన అనీ వాళ్ళ వూహ. ప్రశ్నలువేయడం, చావగొట్టడం ఇంకా ఆమెనుచూడలేక పోయేమనుకో, ఆఖరుకి తీసుకుపోయి కాల్చేసేరు. ముఖమంతా గాయాలే. వెర్రిచూపులుపడ్డాయి. పది హేడేళ్ళపిల్ల తొంభయ్యేళ్ళదిలా అయిపోయింది. కాల్చేసి వాళ్ళామెకు ఉపకారమే చేసేరనాలి.

"ఆఖరువరకూ వాల్యాబ్రూజక్ మహాగట్టిగా నిల బడింది. వాళ్ళంతా వీరులచావుచచ్చేరు. ఆబాధలన్నీ ఎల్లా పడ్డారో అనిపిస్తుంది. పావెల్! వాళ్ళచావులు చాల భయం కరం, చెప్పలేను.

"వాల్యా చాలా ప్రమాదకరమైన పనిచేసేది. పోలిష్ హెడ్‌క్వార్టర్సులోని వైర్లెస్ ఆపరేటర్లతో కత్తుకలిపింది. ఆ వార్తలన్నీ తెచ్చి మనజిల్లా కేంద్రానికిచ్చేది. దీనికితోడు ఆమెఇంటివద్ద ఓపిస్తోలు, రెండు చేతిబాంబులూ సోదాలో

బయటపడ్డాయి. ఎవరో ఒకామెకు ఆ చేతిబాంబులిచ్చి ఆమె వద్ద ఇచ్చి, పోయి ఆవార్త అందించేరు. హెడ్ క్వార్టర్సును పేలగొట్టేసేందుకు ప్రయత్నిస్తున్నారని ఆరోపించేటందుకు కావలసిన దొంగసాక్ష్యం అంతా వాళ్ళు తయారుచేసేరు.

"ఆ రోజులు గురించి చెప్తూంటే బాధకలుగుతూంది పావెల్. కాని చెప్పమంటున్నావు గనుక చెప్తున్నా. వాల్యాకూ మరిద్దరికీ సైనికకోర్టు శిక్ష వేసింది. మిగిలిన వారిని కాల్చెయ్యాలని విధించేరు. మాతో కలిసి పనిచేసిన పోలిష్ సైనికుల్ని అంతకు రెండురోజులుముందే విచారించేరు. కార్పొరల్ స్నెగూర్స్కో అనే వైర్లెస్ ఆపరేటరుమీద దేశద్రోహ నేరమూ, సైన్యాలలో కమ్యూనిస్టు ప్రచారంచేసేడనీ ఆరోపించేరు. కాల్చెయ్యమన్నారు. యుద్ధానికిపూర్వం ఆయన లోజ్‌లో ఎలక్ట్రిషియన్‌గా పనిచేసేవాడు. అతను తనశిక్ష మీద అప్పీల్ చేసుకోలేదు. 24 గంటల తర్వాత అతడిని కాల్చిచంపేసేరు.

"ఆయన కేసులో వాల్యాను సాక్ష్యం ఇమ్మన్నారు. స్నెగూర్స్కో తాను సేనలలో కమ్యూనిస్టు ప్రచారంచేసినట్లు ఒప్పుకొన్నాడనీ, దేశద్రోహ నేరాన్ని అంగీకరించలేదనీ వాల్యా తర్వాతచెప్పింది. 'పోలిష్‌సోవియట్ సోషలిస్టు రిపబ్లికు నా మాతృభూమి'—అన్నాడట "నేను పోలిష్ కమ్యూనిస్టుపార్టీసభ్యుడినే. నా ఇష్టానికి వ్యతిరేకంగా నన్ను సైన్యాలలో చేర్చేరు. నన్ను చేర్చేక నాలాగనే యుద్ధరంగాలకు ఈడ్చుకువచ్చినజనం కళ్ళు తెరిచేటందుకు శాయశక్తులా పనిచేసేను. కావాలనుకొంటే ప్రాణంతీసుకోండి. నేనుమాత్రం

దేశద్రోహినికాను, కాబోను. మీరు పెద్దమన్యులదేశాన్ని మాతృభూమిగాచూస్తారు. కార్మిక కర్షకులదేశం నా మాతృభూమి. నా మాతృభూమి త్వరలోనే ఏర్పడుతుంది. ఆవిషయంలో నాకేమాత్రం సందేహంలేదు. దానిలో నన్నెవ్వరూ దేశద్రోహి అనలేరు."—అన్నాడట.

"విచారణ తరవాత మమ్మల్నందర్నీ కలిపేవుంచేరు. ఇంక కాల్చెయ్యడానికి ముందు జైలుకి తెచ్చేరు. రాత్రికి రాత్రి హాస్పటలు ప్రక్కన జైలుకెదురుగా ఉరిస్తంభాలు పాతేరు. రోడ్డుకి దగ్గరలోనే అడవికి ఆవలగా పెద్దగొయ్యివున్నచోటు మనుష్యుల్ని కాల్చెయ్యడానికి ఏరుకున్నారు. మా అందరికీ ఒకే పెద్దగొయ్యి తవ్వేరు.

"వూరందరికీ తెలియాలని మాకు విధించిన శిక్షలు నగరం అంతటా ప్రకటించేరు. ప్రజల్ని భయపెట్టడంకోసం వాళ్ళు బహిరంగంగా వురులు తియ్యాలని నిర్ణయించేరు. ఉదయంవేళనుంచి జనాన్ని తోలుకురావడానికి పూనుకొన్నారు. అవి భయంకరంగా వుంటాయని తెలిసినా కొంతమంది అదీచూద్దామన్నట్లు వెళ్ళేరు. కొద్దిసేపట్లోనే జైలు బయట పెద్దగా జనం పోగయ్యేరు. జనంచేసేధ్వని ఝుమ్మని మాగదుల్లోకంటా వినిపిస్తూంది. జనానికి వెనక వేపున వీధిలో మరతుపాకులు నిలిపేరు. నాలుగువేపులనుంచీ పోలీసుల్నీ, అశ్వికపోలీసుల్ని తెచ్చేరు. ఒక బెటాలియన్ సేనని తెచ్చి వీధుల్లోనూ, గొందుల్లోనూ కాపలాపెట్టేరు. ఉరితీసినవాళ్ళని పడెయ్యడంకోసం స్తంభాలకుదగ్గరలోనే ఒక గొయ్యితవ్వేరు.

"ఒకటీ అరా మాట మధ్యమధ్య మాట్లాడుతూన్నా అందరం చివరిఘడియలు లెక్కపెడుతూన్నాం. మాట్లాడుకోనేవన్నీ రాత్రే మాట్లాడేశాం. సెలవులు తీసుకొన్నాం. రోజా ఒక్కర్తే గదిలో ఓమూలకూర్చుని ఏడుస్తూ గొణుక్కుంటూంది. ఆదెబ్బలు-ఆ శిక్ష బాధలుపడీ, దౌర్జన్యాలకు గురి అయీ వాల్యా దీనపరిస్థితిలో పడిపోయింది. మాతోపాటు, ఆవూరివాళ్ళే ఇద్దరు కమ్యూనిస్టు పడుచులున్నారు. వారిద్దరూ అక్కచెల్లెళ్ళు. ఒకరినొకరు కౌగలించుకొని ఏడుస్తున్నారు. పల్లెప్రాంతాలవాడు స్త్రెపకోవ్ అనే ఒకతను మాతో వుండేవాడు తన్ను పట్టుకోవచ్చిన ఇద్దరు పోలీసువాళ్ళని కొట్టేశని ఆతణ్ణి లాక్కొచ్చేరు. ఆ పడుచుల ఏడుపుచూసి ఆతడు కోపంచేసేడు. "కామ్రేడ్స్! ఏడవద్దు. ఇక్కడేడుస్తే ఏడ్చేరు. అక్కడమాత్రం ఏడవకండి. ఆ దొంగవెధవలు మనల్నిచూసి నవ్వేపరిస్థితి కలిగించకూడదు. వాళ్ళు మన మీద ఎల్లాగూ దయచూపరు. మనం చావకతప్పదు. తప్పనప్పుడు దర్జాగా చద్దాం. వాళ్ళని ప్రాధేయపడబోము. తెలిసిందా. కామ్రేడ్స్! చచ్చేటప్పుడు వీరుల్లా చద్దాం.

"తర్వాత వాళ్లు మమ్మల్ని తీసుకెళ్ళడానికి వచ్చేరు. వాళ్ళముందు జ్వార్కోవ్‌స్కీ వచ్చేడు. వాడెవరో తెలుసా? గూఢచారిదళం ప్రధాని. మహాక్రూరుడు. హింసించి ఆనందించే రకం. పిచ్చికుక్క. ఆడపిల్లల్ని వాడే చెరిచేవాడు. వాడి కోపిక లేకపోతే పోలీసువాళ్ళకి పప్పచెప్పిచూస్తూ ఆనందించేవాడు. పోలీసులు విచ్చుకత్తులతో రోడ్డుపొడుగునా

రెండు బారులుగా నిలబడివున్నారు. ఆ పంక్తులమధ్యనుంచి మమ్మల్ని ఉరి స్తంభాల దగ్గరకు తీసుకెళ్ళేరు.

"తుపాకీ మడమలతో పొడిచి కొట్టి వరసకు నలుగురేసి చొప్పున నిలబెట్టి జైలులోంచి బయటకు తెచ్చేరు. తిన్నగా ఉరి స్తంభాలకెదురుగా మమ్మల్ని నిల్చోబెట్టేరు. ఉరి తియ్యబడేవాళ్ళు చచ్చిపోతూంటే చూస్తూ మావంతుకోసం కనిపెట్టుకొని వుండేటట్లు చేయడం వాళ్ళుద్దేశం. ఉరి స్తంభం బాగా ఎత్తుగా బలమైనమూలాలతో కట్టేరు. పైన వేసిన అడ్డ దూలంనుంచి బలమైన పగ్గంతో వేసిన మూడు ఉచ్చులు వేళ్ళాడుతున్నాయి. వాని క్రింద ఒక బల్ల వుంది. దానిమీది కెక్కడానికి మెట్లు. బల్ల చివరభాగం ఒక కర్రమీద ఆనించి వుంచేరు. ఆ కర్ర కావలసినప్పుడు తీసెయ్యొచ్చు. దానిని తీసేస్తే బల్ల పడిపోతుంది. మమ్మల్ని చూడగానే జనంలో గొణుగుడు ప్రారంభమయింది. అందరి కళ్ళూ మా మీదనే వున్నాయి. మా బంధువులుకూడా ఆ జనంమధ్యవున్నారు. వాళ్ళని గుర్తుపట్టేనుకూడా.

"కొంచెందూరంలో ఒకభవనం అరుగుమీద పోలీస్ పెద్దలూ, ఆఫీసర్లూ దూరదర్శినిలతో వినోదంచూస్తున్నారు. బోల్షివిక్కుల్ని వురితియ్యడం వాళ్ళకి సరదాగావుంది.

"కాళ్ళకింద మంచు మెత్తమెత్తగా వుంది. మంచు ముక్కలతో అడవంతా తెల్లగా కనిపిస్తూంది. చెట్లమీద దూదిపింజెల్లాగ మంచు దట్టంగా కప్పుకొని వుంది. మంచు పింజెలు ఎగిరివచ్చి మా ముఖాలమీద పడుతున్నాయి. పడి

క్రమంగా తిరిగి [illegible] జారిపోతున్నాయి. ఉరిస్తం భం వరకూ [illegible] క్రింద మంచు మెత్తగా వుంది. [illegible] గట్టిబట్టలు కూడా లేవు. అయినా ఎవళ్ళకీ చలి [illegible]లేదు. ప్టాకింగులతో నడు స్తున్నా [illegible] స్టెపానోవ్ కు.

“[illegible] మిలిటరీ ప్రాసిక్యూటరూ, పెద్ద ఆఫీసర్లు కొందరూ నిలబడి వున్నారు. చిట్టచివరకు వురితీయ వలసిన వాళ్ళొస్తూ, [illegible] జైలునుంచి బయటికి తెచ్చేరు. ముగ్గురూ ఒకరి భుజాలమీద ఒకరు చేతులు వేసుకొని ఆనుకొని వస్తున్నారు. వాల్యా ఆ ముగ్గురిలో మధ్యన వుంది. ఆమెకు నడిచే శక్తి కూడా లేదు. మిగతా ఇద్దరూ పట్టుకొని, సాయంఇచ్చి నడిపించుకొనివస్తూన్నారు. అయినా ఆమె ఓపిక వున్నంతలో తలఎత్తుకొని గంభీరంగా అడుగు వెయ్యడానికే ప్రయత్నిస్తూంది, స్టెపానోవ్ మాటలామె మరిచిపోలేదు. “కామ్రేడ్స్! మనం వీరుల్లా చావాలి.”— అన్నమాట అందరిమనస్సుల్లో మెదులుతూనేవుంది. ఆమె వూలు జాకెట్టు తొడిగింది. కోటూ ఏమీ లేదు.

“జ్వారోన్కోవ్‌స్కీకి వాళ్ళు అల్లా ఒకరిచేతులొకరు పట్టుకొని నడవడం ఇష్టంకాలేదుకాబోలు. వెనకనుంచి గెంటేడు. వాల్యా ఏదోఅంది. ఓ అశ్వికపోలీసువాడు కంచీతో మొగంమీదకొట్టేడు. చూడవచ్చినవాళ్ళల్లో ఒకస్త్రీ వెర్రికేక పెట్టింది. జనాన్నీ, పోలీసుల్నీ తోసుకొని వచ్చిపడడానికి ప్రయత్నించింది. కాని, ఆమెనుపట్టుకుని లాక్కుపోయేరు,

బహుశా వాల్యాతల్లి అయివుంటుంది. ఉరి స్తంభాలదగ్గరకు రాగానే వాల్యా పాటప్రారంభించింది. అటువంటి స్వరం ఎప్పుడూ వినలేదు. మరణయాత్రలో మాత్రమే బహుశా మానవుడు అంత ఆవేశంతో పాడుతాడేమో. "వార్జా వియాంకా" అని అందుకుంది. మిగిలినవాళ్ళిద్దరూ గొంతు కలిపేరు. కోపంపట్టలేక అశ్వికపోలీసులు కొరడాలతో వాళ్ళని బాదడంప్రారంభించేరు. వాళ్ళు క్రిందపడిపోయేరు. మూటల్ని మోసుకెళ్ళినట్లు మోసుకువెళ్ళి బల్ల ఎక్కించేరు. వారికి విధించిన శిక్షను గబగబా చదివేసేరు. అది ఇంకా పూర్తి కాకుండానే ఉరితాడు మెడకు తగిలించేరు. తగిలిస్తూంటే మేము ప్రారంభించేం.

"ఆకలిమంటల మలమలమాడే—అనాధులందరు లేవండోయ్."

"సిపాయీలు నాలుగుమూలలనుంచీ మామీద విరుచుకుపడ్డారు. ఆ దెబ్బలమధ్యనే ఉరిబల్లక్రిందవున్న కమ్మీని తుపాకీ మడమలతో కొట్టి తోసెయ్యడం, ముగ్గురూ వేళ్ళాడిపోవడమూ చూసేను.

"మిగతా మమ్మల్నందర్నీ ఆ ప్రక్కనేవున్న గోడకి జేరబెట్టి నిలబెట్టేరు. అక్కడ చెప్పేరు. మాలో పదిమంది శిక్షలు 20 ఏళ్ళ ఖైదుశిక్షలుగా మార్చేరట. మిగిలిన పదహారుగురినే అక్కడే కాల్చిచంపేసేరు.

గొంతు బిగిసిపోతున్నట్లు శామ్యూల్ చొక్కా మెడ పట్టి పీక్కున్నాడు. అతనివేళ్ళు వణికిపోతున్నాయి.

"మూడురోజులదాకా ఆ శవాలల్లాగే ఉరితాళ్ళకి వేలాడుతూన్నాయి. వాటినద్ద రాత్రీపగలూ కాపలాపెట్టేరు. తర్వాతవాళ్ళు మరికొందరు ఖైదీల్ని తెచ్చి మూలోపెట్టేరు. వాళ్ళు చెప్పేరు. ఆ ముగ్గిరిలోనూ మంచి బలమైన తోబాల్దిన్ శరీరం వేళ్ళాడుతున్న తాడు నాలుగోరోజున తెగిపోయిందట. అప్పుడు మిగతా ఇద్దర్నీకూడా తీసిపాతేసేరట.

"కాని, ఉరిస్తంభాలు తియ్యలేదు. మమ్మల్నిక్కడికి తెచ్చేనాటి కవి ఇంకా అక్కడున్నాయి. కొత్తవాళ్ళకోసం వాటి నక్కడే వుంచేరు."

శామ్యూల్ నీరవదృష్టితో ఎదుటచూస్తూ అలాగే వుండిపోయేడు. కథనం ముగిసిందని పావెల్‌కుకూడా అనిపించలేదు. మెలితిరిగిపోయిన తలలతో ఆమూడు శరీరాలూ అతనికళ్ళముందు ఆడుతున్నాయి.

బయట సైనికులను సమీకరించడానికై ఊదుతున్న బాకా వినబడింది. పావెల్ ఉలికిపడ్డాడు. క్షీణస్వరంతో శామ్యూల్‌ను పిలిచేడు.

"నడు పోదాం."

ఇరుప్రక్కలా గుర్రపు సైనికులు కాపలాకాస్తూంటే వీధివెంట పోలిష్ సైనిక ఖైదీలు వెళ్ళిపోతున్నారు. జైలు గుమ్మంలో రెజిమెంటల్ కమిస్సార్ ఒకనోట్ పుస్తకం కాగితంమీద ఏదో ఆజ్ఞ గిలిగేడు. దానిని స్క్వాడ్రన్ కమాండరు చేతికిచ్చేడు.

"కామ్రేడ్! అంతిపోవ్! ఇది తీసుకో. ఖైదీలందర్నీ నొవ్గొరోద్—వోలినిస్కీకి అశ్వికదళాన్ని తోడిచ్చిపంపు.

గాయపడ్డవాళ్ళకి వైద్యసహాయం ఇవ్వు. వాళ్ళను బళ్ళ కెక్కించు. నష్టానికి ఇన్నైనా మొత్తం తీసుకుపోయి వదిలెయ్యి. వాళ్ళ ఇష్టంవచ్చిన చోటికి పొమ్మను. వాళ్ళతో పెట్టుకూర్చోలేము. కాని ఒక్కటి, ఖైదీల్నిమాత్రం బాధించడం కూడదు. జాగ్రత్త."

పావెల్ గుర్రంఎక్కుతూ శామ్యుగ్ల్యాల్ కు ఆదేశమిచ్చేడు.

"విన్నావా? వాళ్ళు మనవాళ్ళని ఉరితీస్తున్నారు మనం వాళ్ళని తోడిచ్చి మరీపంపుతున్నాం. ఎల్లాచెయ్య గలుగుతున్నామంటావు?"

రెజిమెంటల్ కమాండర్ ఆతనివేపుచూసి గుర్రు మన్నాడు,

"ఖైదీల విషయంలో క్రూరంగా వ్యవహరిస్తే మర ణమే శిక్ష. మనం వాళ్ళవంటి వాళ్ళంకాము."

పావెల్ తిరిగివెడుతూ రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిల్ ప్రకటనను జ్ఞాపకం చేసుకొన్నాడు. దానిని రెజి మెంటులో చదివి వినిపించేడు.

"కార్మిక — కర్షకుల దేశం తన ఎర్రసైన్యాన్ని అభి మానిస్తుంది. దానిని చూసుకొని గర్వపడుతుంది. ఆసైన్యాలు తమ కేతనాలకు ఒక్కమచ్చకూడా తగలనివ్వవు"

"ఒక్క మచ్చకూడా తగలనివ్వవు" — అనేమాట పావెల్ నోట అప్రయత్నంగా వచ్చేసింది.

*  *  *

నాలుగో డివిజను ఝిటోమిర్‌ను పట్టుకొన్నప్పుడే, ఏదో రైఫిల్ డివిజనుకు చెందిన 20 వ బ్రిగేడు ఓకునినోవో గ్రామం సమీపంలో కామ్రేడ్ గోలికోవ్ నాయకత్వాన దీన్పర్ నదిని దాటింది.

25వ రైఫిల్ డివిజనూ, బష్కీర్ అశ్విక బ్రిగేడూ కలిసి వున్న సేనాభాగం దీన్పరునదిదాటి కీవ్-కోరోస్టెన్ రైలు మార్గములోని ఇర్షా స్టేషనును పట్టుకొని రైలుదారిని అడ్డం కొట్టేటందుకై ఆజ్ఞలు జారీఅయినాయి. దీనితో పోలిష్ సేనలు కీవ్ నుంచి పారిపోయేటందుకున్న ఒక్క అవకాశమూ చెయ్యిజారిపోతుంది

షెపెటోవ్కా కామ్సొమోల్ సంస్థకు చెందిన మిషా లెవ్‌చుకోవ్ ఈనదిని దాటుతూ మరణించేడు. అల్లల్లాడు తున్న పాన్‌టూన్ బ్రిడ్జిమీదుగా సైన్యం తూర్పుగట్టు నందు కోడానికి పరుగెత్తుతూంది. ఎక్కడినుంచో ఝుమ్మంటూ ఫిరంగి గుండొకటి పడి వంతెనలో కొంతభాగం ముక్కలై పోయింది. మిషా తూలిపోయి ఒక పడవక్రింద పడిపోయేడు. మరిపైకి తేలలేదు. ఆతడానదికి బలియైపోయేడు. వెనకాలే వస్తున్న యెకిమెంకో అనే పసుచువాడు కేకపెట్టేడు.

"మిష్కా! మిష్కాయే. పాపం!"

ఒక నిమిషం దీన్పరునది సెరారంగు సీటివంక అతి భయంతో చూస్తూ నిలబడిపోయేడు. కాని వెనకవస్తున్న వాళ్ళు తోసేస్తున్నారు.

"చవటా! ఏమిటి చూస్తున్నావు ! నడు."

ఇంక అయ్యో అనడానికికూడా వ్యవధిలేదు. వాళ్ళున్న బ్రిగేడ్‌ను దిగతొక్కి అప్పుడే చాలమంది తూర్పుగట్టును ఆక్రమించేసేరు.

తర్వాత నాలుగురోజులకిగాని మిషా మరణవార్త సెర్జీకి తెలియలేదు. అప్పటికప్పుడే బ్రిగేడ్ బూకాస్టేషను పట్టుకొని కీవ్‌కు అభిముఖంగా తిరిగింది. ఏలాగైనా చక్ర బంధంనుంచి బయటపడి కోరోస్టెన్ చేరాలని పోలిష్‌సేనలు అతితీవ్రంగా తిరుగుదాడులు చేస్తున్నాయి.

యెకిమెంకో సెర్జీప్రక్కనే నేలపడుకొని అవిరామంగా కాలుస్తున్నాడు. రైఫిల్‌గొట్టం చుర్రుమని కాలిపోతూంది. బోల్టుతియ్యడం, వెయ్యడంకూడా వీలుకాలేదు. నిరాశ పడ్డాడు. తల పైకెత్తకుండా తగుజాగ్రత్తతీసుకొనే సెర్జీవంక తిరిగేడు.

"కాలిపోతూంది. పక్కనపెట్టవలసిందే కొంతసేపు."

తుపాకుల చప్పుళ్ళలో ఆ మాటలు సరిగ్గా సెర్జీకి వినిపించనేలేదు.

చప్పుళ్ళు కొంతతగ్గేక యెకిమెంకో యాధాలాపంగా మిషా మరణవార్త చెప్పేడు.

"నీమిత్రుడు దీన్లపర్‌లో మునిగిపోయేడు. ఏ చెయ్యేనా అందించేలోపుగా కొట్టుకుపోయేడు."

చెప్తూనే మళ్ళీ రైఫిల్ అందుకొని, బోల్టుబిగించి కాల్చడం ప్రారంభించేడు.

*  *  *

బెర్ది చేవ్ స్టేషను పట్టుకోడానికి వెళ్ళిన పదకొండో డివి జనును పోలీషు సేనలు చాలతీవ్రంగా ఎదిరించేయి. నగరవీధు లలో రక్తమే ప్రవహించింది. మరతుపాకుల జల్లుగో ఎర్ర ఆశ్వికసైన్యం వీధులలో విరుచుకుపడింది. నగరం పట్టు కొంది. చావగా మిగిలిన పోలిష్ సైనికులు పారిపోయేరు. రైల్వేయార్డులలోవున్న రైలుబళ్ళు యథాతథంగా ఎర్ర సైన్యంచేత చిక్కేయి. పోలిష్ సైన్యాలకు అన్నింటికన్నా పెద్దనష్టం మరొకటి కలిగింది.

యుద్ధరంగానికంతకూ మందుగుండు సరఫరాచేస్తున్న గిడ్డంగి పేలిపోయి వాళ్ళు చాలానష్టపడ్డారు. రమారమీ పది లక్షలగుళ్ళు ధ్వంసమైనాయి. ఆ చప్పుడుకు నగరంలోని ఇళ్ళన్నీ వూగిపోయేయి.

ఝిటోమిర్, బెర్ది చేవ్‌లు ఎర్రసైన్యంచేతుల్లో పడ డంతో పోలిష్‌సేనల వెనకభాగం రక్షణలేకుండా అయింది. దానితో వారు తమ్ముచుట్టుకొంటున్న ఉక్కువలయంనుంచి బయటపడడానికై కీవ్ నగరంవదిలి బయటకువచ్చేసేరు.

యుద్ధరంగాల సుడిగుండంలోపడి కొట్టుకుపోతూంటే పావెల్‌కు కాలజ్ఞానమే లేకుండపోయింది. తానొకడున్నాడనే వ్యక్తిత్వంకూడా మరిచిపోయేడు. యుద్ధంచేసేవాళ్ళు 'నేను' అనేది మరిచిపోయి, చుట్టుప్రక్కలవాళ్ళలో లీనమైపోవాలి. మేము, మారెజిమెంటు, మాస్క్వాడ్రను మాబ్రిగేడు—అనే దే వాళ్ళ ఆలోచన.

పరిస్థితులు అతివేగంగా మారిపోతున్నాయి. ప్రతి రోజూ ఏదో కొత్తసంఘటన తటస్థపడుతూంది.

బుడెనీస్కి ఆశ్వికసైన్యం కొండవిరిగిపడ్డట్లు మీాద పడింది. దెబ్బమీాద దెబ్బతీసింది. పోలిష్ సేనల వెనుక భాగంలో రక్షణలన్నీ శిథిలం అయిపోయేయి. విజయోన్మా దంలో బుడెనీస్కిసైన్యం నొవోగ్రాడ్—వోల్యాన్స్కి మీాద విరుచుకు పడింది. అది పోలిష్ రక్షణలకు గుండెకాయ లాంటిది. వారు చాల గట్టి ప్రతిఘటనలు ఎదుర్కోవలసి వచ్చింది. కొండ ఎదుర్కొన్న అలలలా వెనక్కి విరిగిపడు తున్నారు. మళ్ళీ మళ్ళీ ముందుకొస్తున్నారు.

పోలిష్ సేనలు మహాప్రమాదంలో పడ్డాయి. ముళ్ళ తీగల కంచెలు, నగరంలోని సైన్యాలు ఇస్తున్న ప్రతిఘటన ఇవేవీ వారిని కాపాడలేవు. జూన్ 27 న వుదయమే బుడెనీస్కి సేనలు గుర్రాలు దిగకుండానే స్లుక్ నదిని దాటేసేయి. నొవోగ్రాడ్—వోల్యాన్స్కి ప్రవేశించేయి. పోలిష్ సేనలు కోరెట్స్ వేపు పారిపోయేయి. రెండో వేపున అదేరోజున 45 వ డివిజన్ నొవీ—మిరోపాట్ వద్ద స్లుక్ నదినిదాటేయి. కోటోవ్స్కీ ఆశ్వికబ్రిగేడ్ ల్యూబార్ స్కంధావారంమీాద పడింది.

ఒకటో ఆశ్వికసైన్యానికి రేడియోస్టేషనుద్వారా సర్వ సేనాధిపతినుంచి ఆజ్ఞలుఅందేయి. ఆశ్వికబలాన్నంతనూ కేంద్రీకరించి రోవ్నోను పట్టుకోమని ఆజ్ఞ. ఎర్ర ఆశ్విక సైన్యాలదాడిని తట్టుకోలేక పోలిష్ సేన నాలుగు వేపులకీ పారి పోయింది.

మహోద్ధృతంగా యుద్ధాలు సాగిపోతున్న ఈ రోజు ల్లోనే పావెల్ నిలవనితలంపుగా అన్నగారినికలుసుకొన్నాడు.

స్టేషన్‌లో వున్న సాయుధ రైలువద్ద ఏదో పనివుంటే బ్రిగేడ్ కమాండరు పావెల్‌ను పంపించేడు. అతను గుర్రంమీద, రైలుకట్ట వెంబడిపోయి సాయుధరైలు మొదటిపెట్టె దగ్గరకు వెళ్ళేడు. కవచం సందులలోంచి నల్లని ఫిరంగిగొట్టాలు పైకి కనిపిస్తూంటే ఆ రైలు దుర్భేద్యం అనిపించింది. చక్రాలకు కాపుదలగా బిగించిన ఇనపరేకుల్ని తప్పించి చాలమంది పని వాళ్ళు ఆయిల్ కేన్‌లతో ఇరుసుల్లో నూనె పోస్తున్నారు.

ఒక ఎర్రసైనికుడు బకెట్‌తో నీళ్ళు తెస్తూ ఎదురైతే పావెల్ అతణ్ణి ఆపేడు.

"కమాండరు ఎక్కడున్నాడు"

ఆ సైనికుడు ఇంజనుచూపేడు.

"అక్కడ."

పావెల్ ఇంజనులోకి ఎక్కేడు.

"కమాండరును చూడాలి."

ముఖంనిండా స్ఫోటకం మచ్చలున్న ఒకవ్యక్తి ఆతని దగ్గరకు వచ్చేడు.

"నేనే కమాండరును."

పావెల్ జేబులోంచి ఉత్తరం తీసిఇచ్చేడు.

"బ్రిగేడ్ కమాండరు ఇచ్చేరు. ముట్టినట్లు కవరు మీద సంతకంచేయండి."

కమాండరు మోకాలిమీద కవరు వొత్తిపెట్టుకొని సంతకం గిలికేడు. దిగువన ఒకపనివాడు ఆయిల్ కేన్‌తో మధ్యచక్రానికి వొంగి నూనెపోస్తున్నాడు. ఆతని వీపూ,

ట్రౌజర్ జేబులో దోపిన రివాల్వరుమడమా మాత్రం కని పిస్తున్నాయి.

కమాండరు ఇచ్చిన కవరుతీసుకొని పావెల్ ఇంజను దిగేడు. గుర్రంకళ్ళేలు సవరించేడు. ఎక్కబోతున్నాడు. ఇంతలో ఆ పనివాడు లేచి వెనక్కితిరిగేడు. పావెల్ గుర్తు పట్టేడు. ఒక్క ఉరుకులో వెళ్ళి కౌగలించుకొన్నాడు.

"ఆర్టెమ్."

ఆర్టెమ్ చేతిలోని నూనెడబ్బా క్రిందపడిపోయింది. ఇద్దరూ గాఢంగా కౌగలించుకొన్నారు. ఆర్టెమ్ తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడు.

"పావ్కా! నువ్వేనుట్రా ?"

సాయుధరైలు కమాండరూ, తదితరులూ చిరునవ్వు లతో చూస్తూ నిలబడ్డారు.

"అన్నదమ్ములు అనుకోకుండా కలుసుకొన్నారు."– అని చెప్పుకొన్నారు.

* * *

ఆగస్టు 19న ల్వోవ్ ప్రాంతంలో ఒక దుర్ఘటన జరి గింది. యుద్ధమధ్యంలో పావెల్ టోపీ క్రిందపడింది. దానిని తీసుకోడానికై గుర్రాన్ని ఆపేడు. ఆతని ముందున్నస్క్వాడ్రన్లు పోలిష్ సేనల స్థానాలను గండికొట్టి లోపల ప్రవేశించేయి. ఆ క్షణంలోనే నదివేపు గుర్రాన్ని దౌడుతీయిస్తూ పొదల మధ్యనుంచి దెమిదోవ్ పావెల్ను సమీపించేడు. ప్రక్కనుంచి వెళ్ళిపోతూ వార్తచెప్పేడు.

"డివిజన్ కమాండరు చచ్చిపోయేడు."

పావెల్ తెల్లబోయేడు. కమాండరు లెటునోవ్ మంచి ధైర్యసాహసాలున్నవాడు. రత్నంలాంటి మనిషి. ఆతడు చచ్చిపోయేడనేసరికి పావెల్‌కు ఎంతో కోపం వచ్చింది.

ఇంకా ఆ ఆవేశంలో గుర్రం అలసిపోయివున్నా పరుగెత్తించి యుద్ధంలో కలబడ్డాడు.

"చంపండి! పురుగుల్ని చంపినట్లు చంపండి! పోలిష్ 'ష్లాక్తా' (పిశాచాల్ని)ను నాశనంచేయండి! మన లెటునోవ్‌ను చంపేసేరు." అనే కేకలతో యుద్ధరంగం ప్రతిధ్వనించి పోతూంది. పావెల్ తన ఎదుటనున్న ఒక ఆకుపచ్చ యూనిఫారాన్ని రెండు తుండేలుగా నరికేసి ముందుకు గుర్రాన్ని పురికించేడు. తమ డివిజనల్ కమాండరు మరణంతో ఆవేశపరులైన అశ్వికసైన్యం ఒక పోలిష్‌పటాలాన్ని పూర్తిగా సంహారించేసింది.

అటుతర్వాత పారిపోతూన్న పోలుల వెంటబడ్డారు. ఆ దశలో పోలిష్ ఫిరంగులు కాల్పులకు అందుకున్నాయి. ష్రాప్నెల్ మృత్యువును చిమ్ముతూ గాలిలో ఎగురుతూ వస్తూంది.

హఠాత్తుగా పావెల్ ఎదురుగా పెద్దమంట కనబడింది. చెవులు ఘుల్లుపడేటట్లు చప్పుడు. తలకు రపీమని ఏదో తగిలింది. కళ్ళుతిరిగి నేలపడ్డాడు. పడడంలో గుర్రం మెడ మీదుగా ముందుకు విసిరేసినట్లు పడిపోయేడు.

కళ్ళు చీకట్లు కమ్మేయి.

# ప్రకరణం 9

ఆక్టోపసుకు పిల్లి తలకాయంత కన్ను. కన్ను నడిమిని ఎరుపుజీర వున్న ఆకుపచ్చని వెలుగు. దానికి అసహ్యాకరమైన, పొడుగుపాటి చేతులు. అవి పాముల్లా చుట్టుకొంటూ, మెలికలుపడుతూ మీదికి వస్తున్నాయి. అవి కదులుతూంటే బెరడులా బీటలువారి గట్టిపడిపోయిన చర్మం గరగరమని ధ్వనిచేస్తూంది. ఆక్టోపస్ కదిలింది. తనముఖంలోకి చూసింది. దాని చేతులు మీద పాకుతున్నాయి. అవి చల్లగా, సూదులతో గుచ్చుతున్నట్లనిపించేయి. అది ముక్కుతో ముఖం మీద పొడిచింది. మెలికలు తిరుగుతూ తన రక్తం తాగేస్తూంది. తన వొంట్లోంచి రక్తం బయటికి పోతూంది. ఆక్టోపసు వొళ్లు బరువెక్కిపోతూంది. ఆ ముక్కు ఇంకా రక్తం పీల్చేస్తూనేవుంది. పీల్చినకొద్దీబాధ భరింప శక్యంగాకుండా వుంది.

ఎక్కడో దూరాన మనుష్యుల కంఠం వినిపించింది.

"నాడి ఏలావుంది?"

ఎవరో ఆడగొంతు సమాధానం ఇచ్చింది.

"నాడి 138. జ్వరం 103.1. పొడుగునా సంధిలోనే వున్నాడు."

ఆక్టోపస్ అదృశ్యమైపోయింది. కాని బాధ అదృశ్యం కాలేదు. ఎవరో తన నాడిచూస్తున్నట్లు పావెల్‌కు అనిపించింది. కళ్లు తెరుద్దామనుకొన్నాడు. కనురెప్పలు తెరవలేనంతబరువుగా కనిపించేయి. ఏమిటింత వేడిగావుంది. అమ్మ పొయ్యి మంట వెయ్యటంలేదుగద. మళ్ళీమాటలువినబడ్డాయి.

"నాడి ఇప్పుడు 122."

మళ్ళీ కళ్లు తెరవా లనుకొన్నాడు. కాని లోపల ఏదో మంటలు మండుతూంది. ఉక్కిరిబిక్కిరిగావుంది.

ఎంతో దాహంగావుంది. లేచి వెంటనే ఏదో తాగాలి. కాని ఎందుచేతనో లేవలేకుండావున్నాడు. కాలుచేతులు కదిలించాలనుకొన్నా కదలడంలేదు. శరీరం చెప్పినమాట వినడంలేదు. అమ్మ మంచినీళ్లు తెస్తుంది. ఆవిడతో చెప్పాలి. తన ప్రక్క నేదో కదులుతూంది. మళ్ళీ ఆక్టోపసుగాని వచ్చిందా? అదిగో...చింతనిప్పుల్లా కళ్ళూ, అదీ...

దూరంనుంచి ఇందాకటి మృదుస్వరం మళ్ళీ వినిపించింది.

"ఫ్రోశ్యా! కొంచెం నీళ్లుతే."

ఫ్రోశ్యా ఎవరబ్బా! జ్ఞాపకంచేసుకొనేటందుకు చేసిన ప్రయత్నం ఆతనిశక్తికి మించిపోయింది. మళ్ళీ స్మృతితప్పింది. అంతలో మళ్ళీ తెలివివచ్చి నీళ్ళుఅడిగేడు.

"దాహం."

ప్రక్కనే మాట వినిపించింది.

"తెలివి వొస్తూంది."

ఈమారు మరీదగ్గరలో అతిమృదువుగా మాటలు వినిపించేయి.

"మంచినీళ్లు కావాలా కామ్రేడ్"

"వాళ్ళు నన్నే అడుగుతున్నారా? అయితే జబ్బుగా వున్నానా ఏమిటిఖర్మ. ఆ. సైగస్ కాదూ. అదే."—మళ్ళీ ఇంకోమారు కళ్ళు తెరవడానికి ప్రయత్నించేడు. ఎల్లాఅయితే నేం తెరిచాడు. అర తెరిచిన కళ్ళకి మొట్టమొదట తన తల మీద ఏదో ఎర్రటి బంతిలాంటివస్తువు కనిపించింది ఇంతలో నల్లటి మరొక చేదో తనమీదికి వంగడంమూలంగా ఆ ఎర్ర టిది కనిపించడంలేదు. పెదవులకేదో సీసామూత తగిలింది. నోట్లో తడితగిలింది. లోపల మంటలుచల్లారేయి. తృప్తితో సన్నగా అన్నాడు.

"చాలు."

"నే కనబడుతున్నానా, కామ్రేడ్."

తనమీదికి వంగిన నల్లనిఆకారం ఏమిటో తెలియలేదు. మళ్ళీ మగత కమ్ముతూంది. అలోపుగానే రెండుమాటలు చెప్పేడు.

"చూడలేను. కాని వినబడుతున్నాయి..."

"ఈవిధంగా ఈదుర్చుకు రాగలడని ఎవ్వరం అనుకో లేదు. ఇంచుమించు ప్రాణం పోసుకున్నాడు. గట్టిశరీరం. నినాళ్లాడిమిరోవా నీదే ఈచలవ. నువ్వు నిజంగా ఇతనికి ప్రాణంపోసేవు."

ఒక స్త్రీకంఠం వినిపించింది.

'సంతోషం.'

పదమూడు రోజులు స్మృతిలేకుండా పడివున్నాక ఆతనికి క్రమంగా తెలివి వొచ్చింది. నెమ్మదిగా కోలుకున్నాడు. ఇంచుమించు చచ్చిబ్రతికేడు. పునర్జన్మ. కనిపించే వన్నీ కొత్తగా వున్నాయి. ఒక్క—తలకాయే కదలదు. పట్టీల మూలంగా కదలలేనంత బిగువు. కదల్చలేకున్నాడు. కాని మిగిలిన ఒళ్ళంతా స్వాధీనంలోకి వచ్చింది. చేతివేళ్ళు కదలించగలుగుతున్నాడు.

*　　　*　　　*

మిలిటరీ హాస్పిటలులో జూనియర్ డాక్టరుగా పని చేస్తున్న నినావ్లాడిమిరోవా తన గదిలో టేబిల్ ప్రక్క కూర్చుని చిన్న నోట్ బుక్ తిరగేస్తూంది. దానిలో సన్నని అక్షరాలలో సుందరంగా వ్రాత కనబడుతూంది.

ఆగస్టు 26, 1920.

అంబ్యులెన్సు రైలులో అతిప్రమాద దశలోవున్న సైనికుల్ని తీసుకొచ్చేరు. వారిలో ఒకనికి నెత్తిమీద చాల పెద్దగాయం తగిలింది. గదిలో మూలకిటికీ పక్కగా ఆతనికి మంచంవేశాం, పదిహేడేళ్ళవాడు. ఆతని జేబులో దొరికిన కాగితాలూ, కేసువివరాలూ వుంచిన కవరుఒకటి నాకిచ్చేరు. ఆతనిపేరు పావెల్ ఆంద్రెయేవిచ్ కోర్చాగిను. ఆ కాగితాలతో బాగా నలిగిపోయిన యూక్రెయిన్ కొమ్సోమాల్ సభ్యత్వపు కార్డు ఒకటుంది. (967) చిరిగిన ఎర్రసైన్యపు గుర్తుకార్డు ఒకటీ, రికనైజాన్సు పనిలో అసాధారణ సాహసం చూపినందుకు అభినందిస్తూ రెజిమెంటల్ ఆర్డరుపత్రం ఒకటీ

వున్నాయి. బహుశా ఆతడే వ్రాసుకొని వుంటాడు. ఓ చీటీ కూడా వుంది. దానిలో—"నేను మరణిస్తే నా బంధువులకు తెలియచేయండి. వారి అడ్రసు—మెకానిక్, ఆర్టెమ్‌కోర్చాగిన్, రైల్వేడిపో, షెపెటోవ్కా.

ఆగస్టు 19 న తలపై ఈ గాయం తగిలినప్పటినుంచీ ఆతడు ఒళ్లుఎరగడు. రేపు అనాటొలీస్టెపానోవిచ్ పరీక్షిస్తారు.

ఆగస్టు 27.

ఈవేళ కోర్చాగిన్ గాయం పరిశీలించేం. చాలా లోతయిన గాయం. తల ఎముక చిట్లింది. తల కుడిపార్శ్వం అంతా పడిపోయింది. కుడికంటిలో రక్తనాళం తెగి, వాచి పోయింది.

చీము, వాపు వ్యాపించకుండేటందుకు అనాటొలీస్టెపానోవిచ్ ఆ కన్ను తీసెయ్యాలన్నారు. వాపుతగ్గుతుం దేమో చూద్దామని నేను నివారించేను. కుర్రాడు అందవికారంగా తయారవుతాడేమోననే నా బాధ. కుర్రవాడు కోల్కోవచ్చు. అంగవికలుణ్ణిచెయ్యడం అన్యాయం.

అస్తమానం సంధిమాటలు. తెగ ఆరాటపడుతున్నాడు. మాలో ఎవరోఒకరం నిరంతరం ఆతనిపక్కనే కాచుకు వుంటున్నాం. నేను ఇంచుమించు ఆతని మంచం వదలడమే లేదు. వయస్సు ఎంతోలేదు. అప్పుడే చావడం ఏమిటి? ఎల్లాగయినా బ్రతికించాలని నా పట్టుదల. సాధించితీరాలి.

నావంతు అయిపోయేకకూడా నిన్న ఆతడి వార్డులోనే చాలాగంటలు గడిపేను. అక్కడున్నవాటిలో మరీ గడ్డు కేసు

అతని దే. ఆతని సంధిఖింటూ కూర్చున్నా. ఏదో కథ చెప్తు న్నట్లు చెప్పేస్తున్నాడు. ఆతడినిగురించి చాలాకబుర్లు తెలి సేయి. ఉన్నట్లుండి బండబూతులు మాట్లాడుతున్నాడు. ఆతడినోట ఆబూతులువినడం నాకు చాల బాధకలిగించింది. ఆతడు బ్రతుకుతాడనే నమ్మకం అనాటొలీస్టెపానోవిచ్ కి లేదు. "ఇల్లాంటి పిల్లకాయలిన్ని సైన్యాల్లో ఎందుకు చేర్చుకుంటారో అర్థంకాదు" అని ఆయన గొణుగుతున్నాడు.

ఆగస్టు, 30

కోర్చాగిన్ కి ఇంకా తెలివిరాలేదు. అసాధ్యరోగాల వార్డుకి ఆతనిని మార్చేరు. ఫ్రోశ్యా ఆతని మంచం వదలడం లేదు. ఆమె ఆతడిని ఎరుగుననిఅనిపిస్తుంది ఎప్పుడో ఇద్దరూ ఒకచోట పనిచేసేవారట. వాసి విషయంలో ఆమె ఎంత దయ చూపుతూంది! ఇంక లాభంలేదనే అనిపిస్తూంది.

సెప్టెంబరు, 2
రాత్రి 11 గం.

ఈవేళ సుదినం. కోర్చాగిన్ కు తెలివివచ్చింది. ప్రమాదదశ దాటింది. నిన్నా, మొన్నా అసలింటికే పోలేదు నేను.

ఒకమనిషిని బ్రతికించగలిగేమన్న సంతోషం పట్ట లేకపోతున్నాను. మా వార్డులో ఒకడు బ్రతికేడు. ప్రాణాలు తినేసే ఈ పనిలో ఒక ప్రాణిని బ్రతికించేమన్నదొకటే సంతో షం. రోగులు పిల్లల్లా అనిపిస్తారు. ఎంతో ఆప్యాయం చూపి స్తారు. నాకూ వాళ్ళంటే ఇంతో ఇదిగావుంటుంది. వాళ్ళు

వెళ్ళిపోతూంటే ఏడుపొస్తుంది. అది తెలివితక్కువని నాకు తెలుసు. అయినా ఆప్కోలేను.

సెప్టెంబరు, 10

ఈవేళ కోర్చాగిన్ పేర ఆతని బంధువులకు మొట్ట మొదటిసారి జాబు వ్రాసేడు. తన గాయం అంత పెద్దదేం కాదనీ, త్వరలోనే విముక్తుడయి ఇంటికివస్తాననీ వ్రాసేడు. మనిషికి బాగా రక్తనష్టం అయింది. పాలిపోయి చూస్తే భయంవేసేలా వున్నాడు.

సెప్టెంబరు, 14

కోర్చాగిన్ ఇన్నిరోజుల కీవేళ నవ్వేడు. ఆతడు నవ్వితే చాలా బాగుంటుంది. వయస్సుకు తగని గాంభీర్యం వుంది. త్వరగా తేరుకొంటున్నాడు. ఫ్రోశ్యాతో ఆతనికి చాల స్నేహంవుంది. ఆమె ఎప్పుడూ ఆతని మంచందగ్గరే వుంటూంది. నన్నుగురించి ఆతనివద్ద పొగిడిందికాబోలు. ఆతడు నన్ను చూడగానే చిరునవ్వుతో పలకరిస్తున్నాడు. నిన్ననో ప్రశ్న వేసేడు.

"డాక్టర్! నీచేతిమీద ఆ నల్లటి మచ్చలేమిటి, డాక్టర్!"

సంధిలోవున్నప్పుడు ఆతడే నా జబ్బలుపట్టుకొని పీకేసేడని చెప్పలేను.

సెప్టెంబరు, 17

కోర్చాగిన్ నుదుటిమీది గాయం వేగంగా మానుతూంది. గాయం కట్టుకట్టేటప్పుడు బాధను ఓర్చుకోవడంలో

ఆతడు చూపుతున్న శక్తిచూస్తే మా అందరికీ ఆశ్చర్యంగావుంది.

అటువంటి కేసుల్లో సాధారణంగా రోగి తెగ మూలుగుతాడు. పట్టులేము. కాని, ఈతడు మాట్లాడడు. కట్టువిప్పి ఐడిన్ పూసేటప్పుడు నరాలన్నీ బిగపట్టేస్తాడు. ఒక్కొక్కప్పుడు స్మృతీ తప్పుతుంది. కాని మూలగడం మాత్రం మూలగడు.

కోర్చాగిన్ మూలిగేడంటే ఆతనికి స్మృతి తప్పిందన్న మాటే. అంత ఓర్పు ఎక్కడిదో. ఆశ్చర్యం!

సెప్టెంబరు, 21

ఈవేళ మొట్టమొదటిసారి చక్రాలకుర్చీలో కూర్చోబెట్టి కోర్చాగిన్‌ను బాల్కనీలోకి తోసుకెళ్ళేం. మొక్కలూ అవీచూచి ఎంత ఆనందపడ్డాడు! పరిశుభ్రమైన గాలి తాగినట్లు పీల్చుకొన్నాడు. తలఅంతా కట్లతోవుంది. ఒక్క కన్నుమాత్రమే బయటకు వుంది. ఈ ప్రపంచాన్ని మొట్టమొదటిసారి చూస్తున్నట్లు ఆ వొంటికంటిలో ఎంతో ఆశ్చర్యం, ఆనందం దీపించేయి.

సెప్టెంబరు, 26

ఈవేళ ఇద్దరు పడుచులు కోర్చాగిన్‌కోసం హాస్పిటలుకు వచ్చేరు. వాళ్ళతో మాట్లాడ్డానికి నేను క్రిందికి వెళ్ళేను. వాళ్ళలో ఒకామె చాల అందంగావుంది. తోన్యా తుమానోవా ఒకామెపేరు. రెండో ఆమెపేరు తాతియానా

బురానోవ్‌స్కాయా. కోర్చాగిన్ స్మృతిలో లేసప్పుడు తరచుగా తోన్యా పేరు ఉచ్చరించేడు. వాళ్ళను చూడనిచ్చేను.

అక్టోబరు, 8

కోర్చాగిన్ తోటలో ఒక్కడూ తిరగగలుగుతున్నాడు. హాస్పిటలునుంచి ఎప్పుడు వదులుతారని అడుగుతున్నాడు. త్వరలో నే—అన్నాను. ఆ పడుచులిద్దరూ ఆతనిని చూడడానికై తరుచుగా ఆసుపత్రికి వస్తున్నారు. ఆత డెప్పుడూ మూలగకపోవడం ఎందుకో ఇప్పుడు తెలిసింది. ఆతనినే అడిగేను. "గాడ్‌ఫ్లై చదువు. ఎందుకో అర్థం అవుతుంది"—అన్నాడు.

అక్టోబరు, 14

కోర్చాగిన్ ఆసుపత్రినుంచి విడుదలయ్యేడు. కంటికట్టు విప్పేసేరు. తలకిమాత్రం ఇంకావుంది. కన్ను గుడ్డిదయింది. కాని, అలా కనిపించదు ఈ కుర్రవాడిని పంపెయ్యడం విచారకరంగానేవుంది. కాని తప్పదు. జబ్బు తగ్గేక వెడతారు. బహుశా మళ్ళీచూడం.

వెళ్ళిపోతూ నావద్దకు వచ్చేడు—"ఎడంకన్నుపోతే ఒకలావుండేది. ఇప్పుడు తుపాకీకాల్చడం ఎల్లాగ?"

ఇంకా యుద్ధం తాపత్రయమే.

*     *     *

హాస్పిటలునుంచి వెళ్ళేక ఆతడు తోన్యా బసచేసిన బురానోవ్‌స్కీల యింటివద్దనే కొన్నాళ్ళున్నాడు.

అతడు తోన్యాను కామ్సోమాల్ కార్యకలాపాలలోకి తీసుకురావడానికి పూనుకొన్నాడు. పట్టణంలోని కామ్సోమాల్ సమావేశానికి ఆమెని తీసుకెళ్ళేడు. తోన్యా ఒప్పుకుంది. బట్టలు వేసుకొని వీధిలోకి వచ్చేసరికి ఆమె వేషం చూసి అతడు ఔడుకరచేడు. మంచి అందమైన దుస్తులూ అవీ వేసింది. కాని ఆ అలంకారాలు కామ్సోమాల్ మీటింగ్‌లో ఎబ్బెట్టుగా కనిపిస్తాయనుకొన్నాడు.

దానిమీదనే ఇద్దరూ మొట్టమొదటిసారిగా జగడం ఆడుకున్నారు. "ఏమిటీ వేషం?"—అని ఆత డడిగినప్పుడు ఆమెకు కోపంవచ్చింది.

అందరిలాగే నేనూ ఎందుకువుండాలి? నా వేషం నీకు నచ్చకపోతే నేనూ రాను. నువ్వే వెళ్ళు."

మీటింగులో రంగుమాసిన చొక్కాలూ, బ్లౌజుల మధ్య తోన్యాదుస్తులు కొట్టవచ్చినట్లు కనబడ్డాయి. పావెల్ చిక్కుల్లోపడ్డాడు. పనుచువాళ్ళంతా ఆమెను పరాయిదాన్నిగానే చూసేరు. అదికనిపెట్టి తోన్యా నిర్లక్ష్యంగా వ్యవహరించడం ప్రారంభించింది.

వార్ఫులవద్దనున్న కామ్సోమాల్ సంఘ కార్యదర్శి పాన్క్రాటోవ్ పావెల్‌ను చాటుకుపిలిచి, తోన్యావేపు కన్నుగిలిపి చూపుతూ అడిగేడు.

"ఈ బొమ్మని నువ్వేనా తీసుకొస్తి?"

పావెల్ కటువుగా "ఔను," అన్నాడు.

"ఉమ్. చూస్తే ఆమె ఇంటిలో ఇముడుతుందను కోను. మరీ బూర్జువాతత్వం గిలి ఒస్తోంది. ఇక్కడికెల్లా వచ్చింది!"

పావెల్ కణతలు కొట్టుకొన్నాయి.

"ఆమె నా స్నేహితురాలు. నేనే తీసుకువచ్చేను. తెలిసిందా! బట్టలమీదమోజు ఎంతవున్నా మనకి శత్రు కోటిలోనిది కాదు. బట్టల్నిపట్టి మనుష్యుల విలువకట్టడం మంచిపద్ధతి కాదు. ఎవర్నితీసుకురావాలో, ఎవర్నితీసుకురా కూడదో నాకూ తెలుసు. పెద్దరికం వెలిగించకు, కామ్రేడ్."

ఇంకా ధూర్తుగా సమాధానం ఇచ్చేవాడే. కాని, మిగిలినవాళ్ళందరిలోనూ ఆ భావాలేవున్నాయని గ్రహించ డంచేత తగ్గేడు. ఆకోపంఅంతా తోన్యామీద చూపించేడు.

"చెప్పేను. ఎందుకీ వేషాలు."—అని మనసు లోనే బాధపడ్డాడు.

ఆరోజు మొదలుకొని వారిస్నేహం విడిపోయింది. జీవి తాంతం వుంటుందనుకొన్న స్నేహబంధం చల్లబడిపోతూంటే పావెల్ మనస్సు ఎంతో దుఃఖపడింది.

చాలరోజులు గడిచేయి.కలుసుకొన్నప్పుడూ, మాట్లా డుకొన్నప్పుడూ అల్లా వారు అంతకంతకు దూరం అయిపో తున్నారు. తోన్యా చూపించే చవకబారు అహంకారం పావెల్‌కు దుస్సహం అయింది.

ఇంక స్నేహం లాభంలేదని ఇద్దరూ గ్రహించేరు.

ఆఖరుపర్యాయం కుపెచెస్కీ బాగ్‌లో మాట్లాడు కొన్నారు. బాగ్‌లో బాటలన్నీ రాలినఆకులతో నిండి

వున్నాయి. ఎదిపక్క-నేవున్న మిట్టపై చిన్నమండపంవుంది. అక్కడనిలబడి క్రిందపారుతున్న దీన్నపరుపైపు చూస్తున్నారు. రైలుబ్రిడ్జిక్రిందనుంచి ఓ తొట్టిపడవ నిందుచూలాలులావచ్చి వారిని దాటిపోయింది. అస్తమిస్తున్నసూర్యుడు త్రుఖానోవ్ దీవికి బంగారు మలాముా చేస్తున్నాడు.

తోన్యా దృక్కులలో విచారం దీపించింది.

"మనస్నేహం ఆఖరుకావలసిందేనా?"

అంతవరకూ ఆమె ముఖంవంక నేచూస్తున్న పావెల్ కనుబొమ్మలు ముడేసి చిన్నగా సమాధానం ఇచ్చేడు.

"తోన్యా! ఈ సంగతి ఇదివరకే ఆలోచించేం. నీమీద నాకు ప్రేమవుండేది. ఇప్పుడుకూడా మళ్ళీప్రేమించ గలననే నా వూహ. కాని, నేనల్లాచెయ్యగలగాలంటే నువ్వు మా మనిషివికావాలి. నేనిప్పుడు వెనకటి పావ్లూషాను కాను. పార్టీకన్న నిన్నే ఎక్కువగా చూసుకొనేమాటుంటే నీకు తగినభర్తను కాలేను. ఏమంటావా నాకుపార్టీ తర్వాతనే ప్రియబంధువు లంతాను."

దిగువన దొర్లిపోతున్న నీలి నీటివంక చూస్తూంటే తోన్యాకళ్ళు నీళ్ళుకమ్మేయి.

తనకు చిరపరిచితమైన ఆముఖాన్నిచూస్తూంటే పావెల్‌కు ఎంతోజాలి కలిగింది.

అతడామె భుజంమీద చెయ్యివేసేడు.

"తోన్యా! మాతోవచ్చెయ్యి. పెత్తందార్లని తుద ముట్టించేటందుకు ఇద్దరంకలిసి పనిచేద్దాం. ఎంతోమంది పడు

చులు మాత్రోపాటు కష్టాలూ, బాధలూ పడుతున్నారు. వాళ్లు నీలాగ చదువుకొని వుండకపోవచ్చు. అయినా నేనూ, నం-నువ్వెందుకు మాతో చేరకూడదు? మాడూసిన నిన్ను చెప్పు డాగ్లపట్టించడానికి ప్రయత్నించే షన్నాను. నాపడో వ్యర్థుడు. కాప్రమేమన్ను నీతో స్నేహంగా వుండడం లేదంటావు. ఏదో నాట్యపువిందుకు వెళుతున్నట్లు ఆ వేషం ఎందుకు వేసేవు? నీ తెలివితక్కువగర్వమే ఇంతచేసింది. మిగిలినవాళ్ళంతా వేసుకుంటున్నారుగదా యని నేనీ రంగుపూసిన పాతమిలిటరీ కోటు తొడుగుతున్నానంటావా? కూలిపని చేసుకొనేవాడిని ప్రేమించగలధైర్యం నీకుంది. కాని, ఒక ఆదర్శాన్ని నువ్వు ప్రేమించలేకున్నావు. నిన్నువిడిచిపెట్టడం నాకు విచారం గానే వుంది. నిన్నెప్పటికీ మరిచిపోలేను.”

ఆతడింకేమీ అనలేదు.

మరునాడు జకరయ్ సంతకంతో నగరంలో ఒక పోస్టరుచూసేడు. ఆతడు ప్రాంతీయగూఢచారి శాఖఅధిపతి. పావెల్ మనస్సు వురకలువేసింది. అతికష్టంమీద జకరయ్ ఆఫీసు ప్రవేశించేడు. సెంట్రీలు ఆతనిని లోనికి పోనివ్వమన్నారు. వాళ్ళతో తగాదాపెట్టుకొంటే అరెస్టుచేయడం దాకావచ్చింది. కాని మొత్తంమీద సాధించేడు.

జకరయ్ ఆతనిని ఘనంగా ఆహ్వానించేడు. యుద్ధంలో అతనిచెయ్యిపోయింది. ఓ ఫిరంగిగుండుతగిలి చెయ్యి ఎగిరి పోయింది.

సంభాషణ వెంటనే పనిమీదికి మళ్ళింది.

"యుద్ధానికి పనికివచ్చే దశవచ్చేవరకూ విప్లవ ప్రోసాలుల్ని అణిచెయ్యడంలో నాకు సాయం చెయ్యగేళ్ళరా" అన్నాడు జకరయ్.

*        *        *

పోలిష్ తెల్ల సేనలతో యుద్ధం ముగిసింది. వారిని ఎర్ర సేనలు వార్సాకంటూ తరిమికొట్టేయి అలసిపోయి, తగినంత వస్తుసామగ్రిలేక, సరఫరాలు దూరంకావడంతో శత్రువులను నిశ్శేషం చేయకుండానే వెనుతిరిగేయి. తర్వాత తర్వాత పోలులు సగర్వంగా చెప్పుకొన్న "విస్తులా*విజయం" ఇదే. పోలిష్ సోవియట్ సోషలిస్టురిపబ్లిక్ నుగురించి కన్నకలలు నెరవేర లేదు.

రక్తంలోతడిసిన దేశం తాత్కాలికంగానైనా యుద్ధ విరామాన్ని అభిలషిస్తూంది.

పావెల్ ఇంటికి వెళ్ళలేకపోయేడు. షెపెటోవ్కా పోలిష్‌వాళ్ళ చేతుల్లో మిగిలిపోయింది. తాత్కాలిక సరిహద్దు లోకి వచ్చింది.

పావెల్ రాత్రింబగళ్ళు ఛెకా (గూఢచారిశాఖ) కార్యాలయంలోనే ఏదోఒక పనిచేస్తూవుండిపోతున్నాడు. తనపట్టణం పోలిష్‌వాళ్ళ చేతుల్లో వుండిపోయిందన్నవార్త ఆతనిని కంగారుపెట్టింది.

"యుద్ధవిరమణ సంధిమీాద సంతకాలు జరిగేయంటే మాఅమ్మ అవతలిసరిహద్దులో వుండిపోతుందేమిటి?"

---

* వార్సాముందు ప్రవహిస్తున్న నది.

జకరయ్ ఆతనికి ధైర్యంచెప్పేడు.

"బహుశా సరిహద్దు నదివెంబడే గోరున్ మీదుగా పోవచ్చు. అల్లాజరిగితే మీవూరు మనకేవస్తుంది. ఏదే మయ్యేదీ తెలుస్తుందిగా."

సైన్యాలను పోలిష్ యుద్ధరంగంనుంచి దక్షిణానికి తరలిస్తున్నారు. సమయంలో సోవియట్లు పశ్చిమాన పోలిష్ రంగంలో యీవచ్చిక్క వినియోగిస్తున్న అదను చూసుకుని లాంగెల్ క్రిమియానుంచి డ్నీపరునది వెంబడే యెకటారినో స్లావ్ రాష్ట్రంవేపు ఉత్తరదిశగా దాడిప్రారంభించేడు.

పోలిష్రంగంలో యుద్ధాలు ముగిసేయికనుక సోవియట్ ప్రభుత్వం క్రిమియానుంచి విప్లవవ్యతిరేకుల్ని తుడిచిపెట్టా లని ఆవైపుగా సేనలను పంపింది.

సైన్యాలు, సామగ్రులతో కీవ్ మీదుగా ఎన్నో రైలు బళ్ళు దక్షిణంవేపు కదిలేయి. రాకపోకలు చిక్కులో పడ కుండా కాచుకొనేటందుకై ఛెకాశాఖ విధివిరామా లెర క్కుండా పనిచేసింది. స్టేషన్లనిండుగా రైళ్ళే. రైళ్ళను నిలిపి వుంచేటందుకు సైడింగులులేక ఎన్నోమార్లు రైళ్ళు ఎక్కడి వక్కడ నిలబడిపోవలసివస్తూంది. ఏదో డివిజనును వెంటనే పంపాలంటూ ఆజ్ఞలను టెలిగ్రాఫ్ గుమాస్తాలు అనుక్షణం పంపుతున్నారు. అందుకొంటున్నారు. దేనికదే అత్యవసరం, ప్రధానమూను.

"అన్నిటికన్నా ప్రధానం...మిలిటరీఆజ్ఞ...లైన్ ఖాళీ చెయ్యాలి."

ఈ ఆజ్ఞను వెంటనే అమలుజరిపకపోతే మిలిటరీకోర్టు ముందు పెడతాము సుమాయని ప్రతి ఆజ్ఞాపత్రానికీ వె కాల ఒకతోకకూడా వుంటూంది.

నిరాటంకంగా బళ్ళు నడిచేటట్లు చూసేబాధ్య స్థానిక రహదారి ఛెకాది.

సేనాధిపతిఇచ్చిన ఫలానా సంఖ్యగల ఆజ్ఞప్రకార వెంటనే తమ సైన్యాలున్న రైలు కదిలేటట్లు చేయమంటూ సైన్యదళాల కమాండర్లు ఛెకా కార్యాలయంలోకి విరుచుక పడుతున్నారు. రివాల్వర్లు ఝళిపిస్తున్నారు. అసాధ్యమని ఎన్ని చెప్పినా ఒక్కరూ వినిపించుకోరు. "చచ్చి అయినాసరే బండిని వెళ్ళేటట్లు చేయాలి'' అంటారు. నానాతిట్లూ తిడ తారు. మరీ పేచీ పరిస్థితులలో జకరయ్ కి కబురుపంపుతారు. అంతవరకూ ఒకరినొకరు చంపుకుంటారేమోనన్నట్లు అరుచు కొంటున్నవాళ్ళు ఆయనరాకతో చల్లబడతారు. ఉక్కు లాంటి ఆ మనిషినీ, సమాధానం సహించని ఆ కంఠాన్నీ చూసేక రివాల్వర్లు హూల్‌స్టర్లలోకి చేరుకొనేవి.

ఒకొక్కప్పుడు తలపోటు ఎత్తిపోతూంటే పావెల్ రైలుస్టేషనుకు వెళ్ళవలసివచ్చేది. ఛెకాలోపని ఆతని నరాల్ని తోడేస్తూంది.

ఒకరోజున మందుగుండుపెట్టెలు పేర్చివున్న ఒక 'ఫ్లాట్ కార్'మీద సెర్జీబ్రూజక్ కనిపించేడు. ఆతనిని చూడ గానే సెర్జీ ఒక్కవురుకున బండిదిగివచ్చి మీదపడి కౌగ లించుకొన్నాడు.

"పావ్కా! నిన్నుచూడ్డంతోనే గుర్తుపట్టేసేను."

ఇద్దరూ ఒకరికొకరు చెప్పుకోవలసినవి ఆ కొంచెంసేపు కబు ర్లున్నాయి. వాళ్ళు క్రితంపర్యాయం కలుసుకొన్న తర్వాత ఎన్నెన్నో ఘటనలుజరిగేయి. ఒకరినొకరు ప్రశ్నలతో ముంచె త్తేరు. సమాధానాలకోసం ఆగకుండానే కబుర్లు చెప్పేసేరు. ఆకబుర్ల హడావిడిలో ఇంజనుకూతకూడా వినబడలేదు. రైలు బయలుదేరేకగాని సెర్గీ మిత్రుణ్ణివదలి బండి ఎక్కలేదు.

ఇంకా చెప్పుకోవలసినవి ఎన్నో మిగిలిపోయేయి. సెర్గీ బండితోపాటు ప్లాట్‌ఫారమ్‌మీాద పరుగెత్తుతూ వెనక్కి తిరిగి ఏదో కేకవేసేడు. అప్పటికే రైలు వేగం అందుకుం టూంది. ఇంక ఆగడానికిలేదు. చటుక్కున ఎగిరి ఒకపెట్టెలో ప్రవేశించేడు.

సెర్గీ వెళ్ళేకకాని ఆతనికి వాల్యా మరణవార్త తెలిసి వుండదనే సంగతి పావెల్‌కు తోచలేదు. మెషెటోవ్కానుంచి వచ్చేసేక ఆతడక్కడికి మళ్ళీ వెళ్ళనేలేదు. మిత్రుణ్ణిచూసిన సంతోషంలో పావెల్ ఆ సంగతిచెప్పడమే మరిచేడు.

"తెలియకపోవడమే మంచిది. మనస్సుకి బెంగ వుండదు." అని సంతృప్తిపడ్డాడు పావెల్. మళ్ళీ తనమిత్రు కనబడడనే సంగతి ఆతనికేం తెలుసు. సెర్గీకీ తెలియదు, తనకు మరణం సమీపిస్తూందని. బోగీపైన కప్పుమీాద, చల్లటి గాలిలో నిలబడి మిత్రుని ఆకారంకోసం వెతుకుతూ దిగం తాలకుచూస్తున్న సెర్గీని దోరోషెంకో అనే ఎర్రసైనికుడు దిగిరమ్మని పిలిచేడు.

సెర్గీ నవ్వేడు.

"భయంలేదు, గాలీ నేనూ నేస్తాలం."

ఒక వారంపోయేక మొట్టమొదటిరోజు యుద్ధంలోనే బందిదీరివచ్చిన తూటాఒకటి సెర్జీకి తగిలింది. అతను తూలి యోయేడు. గుండెలు బాధను చీలుకుపోతూంటే రెండు చేతులూ గుండెల కదుముతున్నాడు. మళ్ళీ గాలిని పట్టుకొంటున్నట్లు చేతులుచాపేడు. తూగి, రాయిలా నేలబడిపోయేడు. నిర్జీవములై గాజుపడిపోయిన ఆకళ్లు అనంతమైన యూక్రెయిన్ మైదానాన్ని పరిశీలిస్తున్నట్లు రెప్పవేయకుండా చూస్తున్నాయి.

*　　　*　　　*

నరాల్ని పిండివేస్తున్న చెకా ఆఫీసుపనితో పావెల్ ఆరోగ్యం బాగా చెడింది. తలపోట్లు తరుచుగా వస్తున్నాయి. ఒకపర్యాయం వరసగా రెండురాత్రులు నిద్రలేకుండా పని చేయవలసివచ్చింది. మూడోరోజున స్మృతితప్పి పడిపోయేడు. ఇంక జకరయ్‌తో కదపక తప్పదనుకొన్నాడు.

"జకరయ్! నేను మరో పనేదన్నా చెయ్యడం మంచిదనుకొంటా. మెషిన్‌షాపులో చేరితే బాగుంటుందని నా వూహ. అలవాటయిన పని. నాతల కేదో వచ్చింది. సైన్యాలలో పనికిరానని సైనిక కమిషన్‌వాళ్ళు చెప్పేసేరు. కాని, ఈ మాదిరిపని యుద్ధరంగంకన్నా అధ్వాన్నం. సుతీర్ముఠాచుట్టూ రెండురోజులు తిరిగేసరికి నాపని అయిపోయింది. కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవాలనుకొంటా. నిల్చోడానికైనా శక్తిలేకుంటే నీకేం వుపయోగపడతాను!"

పావెల్‌వంక జకరయ్ ఎంతో పరితాపంతో చూసేడు.

"ఔను. నీస్థితేం బాగున్నట్లులేదు. నాదే పొర, చాలరోజులక్రితమే నిన్ను పంపెయ్యవలసింది. కాని, తొందరలో నీ సంగతే చూడలేకపోయేను.

ఇది జరిగిన మరునాడే పావెల్ కొమ్సొమోల్ ప్రాంతీయ కమిటీముందు హాజరయ్యేడు. అతనిని కమిటీ పనులలో వుపయోగించుకోవలసిందంటూ ఒక సర్టిఫికెట్ కూడా తీసుకొచ్చేడు. ఆఫీసులో వున్న పసుచునా డాపత్రం తీసుకొని ఓమారు చదివి పక్కన పెట్టి, పెద్దఆరిందాలా కిభుర్లు మొదలెట్టేడు :

"చెకానుంచావస్త? మంచిచోటే. నీకు పనిచూపడం ఎంతపని! ఎంతమంది వచ్చినా వద్దనేటట్లుందా? ఎందులో పనిచేస్తావు? కమిస్సార్ల శాఖలోనా? వద్దూ? పోనీ... వార్తల వద్ద ఆందోళనా కార్యక్రమంలో...? అదీవద్దూ. అదిచాలా మంచి వుద్యోగంసుమా! స్పెషల్ రేషన్లుకూడా ఇస్తారు..."

పావెల్ ఆతనిమాటకు అడ్డంవేశ్శేడు.

"కార్ల కార్ఖానాలో పనిచెయ్యడం నా కిష్టం."

ఆపడుచువాడు ఆ అభిప్రాయాన్ని మింగలేకపోయేడు.

కార్లకార్ఖానాలో ? ఊహు అక్కడ మనుష్యులు అవసరం అనుకోను. ఏమయినా ముందు ఉస్తినోవిచ్‌ని కలుసుకో. ఆమె ఏదో ఒకటి చూస్తుంది.

ఆతడు వెళ్ళి ఉస్తినోవిచ్‌ని కలుసుకొని మాట్లాడేడు. ఆతడు పనిచేయబోయే రైల్వేవర్కు షాపుల్లోనే కొమ్సొమోల్ కార్యదర్శిగా పని చేయడానికి నిర్ణయం జరిగింది.

* * *

ఈలోపున రాంగెల్ సేనలు క్రిమియా-దారిలో గట్టి బందోబస్తులు చేసుకొన్నారు. నల్లసముద్రంలోని క్రిమియాను యూక్రెయిన్‌తో కలుపుతున్న భూసంధిని పెరికోప్ అంటారు. పెరికోప్ సంధి చాల సన్నగా వుంటుంది. ఇదివరలో క్రిమియాలోని తార్తార్ గ్రామాలకీ, జాపరోజేకోసక్కు గ్రామాలకీ మధ్య సరిహద్దుగా పెరికోప్ వుపయోగపడింది. ఇప్పుడు దానిలో ఆధునిక సైనికరక్షణ బందోబస్తులన్నీ చేసేరు.

పెరికోప్ రక్షణల వెనకాల క్రిమియాలోకి దేశం నాలుగు మూలలనుంచి పాతప్రపంచం కోరేవారంతా చేరి, రాబోయే ప్రమాదాల్ని అర్థంచేసుకోకుండా తాగితందనాలు ఆడుతున్నారు.

ఆకురాలు కాలంలో మంచి చలిగావున్న ఒకరోజు తెల్లవారుజామునే కొన్నివేలమంది కార్మిక సైనికులు సివాష్‌చిత్తడినేలల కడ్డుపడి తెల్లసేనల రక్షణల వెనకకి చేరుకొన్నారు. ఇవాన్‌జార్కూ మరతుపాకి నీళ్ళల్లో తడవకుండా నెత్తిన పెట్టుకొని, వాళ్ళతోపాటు క్రిమియా ప్రవేశించేడు.

తెల్లవారేసరికి పెరికోప్ యుద్ధరంగం అయింది. ఎర్రసైన్యం ముఖాముఖిని దాడిప్రారంభిస్తే, తెల్లవారగట్ల శివాష్‌లో దిగి లిటోవ్‌స్కీ ద్వీపకల్పంచేరిన సేనాదళాలు వెనకవేపునుంచి తెల్లసేనలమీద దెబ్బతీసేయి. ఆరోజున మొదట గట్టు ఎక్కినవాళ్ళలో ఇవాన్‌జార్కూ ఒకడు.

మహాభయంకరమైన యుద్ధం జరిగింది, శివాష్ నీళ్ళలోంచి గట్టుఎక్కుతున్న ఎర్రసైనికులమీద తెల్లఆశ్వికసైన్యం తుపానులా విరుచుకుపడింది. ఇవాన్ మరతుపాకీ

క్షణం నోరుమూయకుండా మృత్యువును యథేచ్ఛగా చిలకరించింది. గుళ్ళు తూట్లుపొడిచేస్తూంటే సైనికులూ, గుర్రాలూ కుప్పలు కూలేరు. ఇవాన్ విశ్రామం లేకుండా తూటా బెల్టులు 'బ్రీచ్'లో మేపుతూనే వున్నాడు.

పెరికోప్ రక్షణాలు వందల ఫిరంగులతో గర్జించేయి. నేలబద్దలయిపోతూన్నట్లే కనిపించింది. వేలకొలది ఫిరంగి గుళ్ళు చెవులు గడియలు పడేటట్లు ధ్వనిచేస్తూ మృత్యువును మోసుకుపోతున్నాయి. గుండుదెబ్బలకి నేలగోతులుపడి నల్లని పొగతోపాటు రాళ్ళూ, మన్నూ ఎగిరి జల్లుకురుస్తున్నాయి.

చివరకా రాక్షసితల చితకపొడిచేసేరు. వేలమంది ఎర్రసైనికులు క్రిమియాలో జొరబడ్డారు. మళ్ళీ ఇక్కడ కూడా ఒకటో ఆశ్వికసైన్యం ప్రత్యక్షమయింది. తుఫానులా పరిక్రమించి, పిడుగులా మీద పడింది. భయంతో వణికిపోతూ వైట్‌గార్డు నాయకులు నావలలోపడి పారిపోయేరు.

సోవియట్ ప్రభుత్వం క్రిమియావీరులు పెక్కుమందికి రంగు వెలిసిపోయిన సైనికకోట్లమీద ఎర్రజెండాపదకం అలంకరించింది. ఇవాన్ జార్కో ఆ పదకం పొందిన కామ్‌సోమాల్ వీరులలో ఒకడు.

* * *

పోలిష్ ప్రభుత్వంతో సంధి కుదిరింది. జకరయ్ చెప్పినట్లు షెపెటోవ్కా సోవియట్ యూక్రెయిన్‌లోకే వచ్చింది. నగరానికి ఆవల 25 మైళ్ళలోవున్న నది రెండు రాజ్యాలకూ ఇప్పుడు సరిహద్దు.

1930 డిసెంబరులో ఓరోజున వృదయంవేళకు పావెల్ తన నగరంచేరేడు. మంచుపింజలుపడి మెత్త మెత్తగావున్న ప్లాట్‌ఫారమ్‌మీద అడుగుపెట్టేడు. – "షెపెటోవ్కా!" అనే స్టేషనుపేరు వ్రాసినబోర్డు వంకచూసేడు. ఎడమవేపుతిరిగి తిన్నగా డిపోకువెళ్ళి ఆర్టెమ్‌కోసం వాకబుచేసేడు. కాని, ఆతను అక్కడలేడు. పావెల్ అడవికి అడ్డుపడి తిన్నగా నగరంవేపు నడిచేడు.

వీధి తలుపు చప్పుడైతే మేరియాయాకోవ్‌లేవ్నా పలికింది.

"రాండి. ఎవరో."

మంచుపడి తెల్లగా కనిపిస్తున్నా రెవరోఇంట్లోకి వస్తున్నారు. తేరిపారిచూసింది. రెండో కొడుకు. ఆనందం పట్టలేకపోయింది. నోటమాట రాలేదు.

ఒక్కక్షణానికి తేరుకొని కొడుకును కౌగలించుకొని బావురుమంది. ముద్దులతో నలిపేసింది. కన్నీటితో తడిపేసింది. కష్టాలూ, దుఃఖాలతో అవిసి, ముడతలు పడిపోయిన ఆమె ముఖంవంకచూస్తూ పావెల్ కూర్చున్నాడు. క్రమంగా ఆమె సర్దుకుంది.

అన్నిబాధలూ పడ్డాక మరల ఆమెకళ్ళల్లో సుఖం దీపించింది. చూడగలననుకోని కొడుకు కనిపించినాక ఆతని నెంతచూసినా తనివి పొందలేకపోతూంది. మూడురోజుల తర్వాత ఆర్టెమ్ అర్ధరాత్రివేళ ఇంటికి వచ్చేడు. 'కిట్‌బేగ్' మూలపడేసేడు.

కోర్చాగిన్ల కుటుంబమంతా మళ్ళీ ఒక చోట చేరింది. ఇద్దరు అన్నదమ్ములూ మృత్యువు నోట్లోంచి బయటపడ్డారు. ఎన్నో కష్టాలుపడి మరల కలిసేరు.

ఇప్పుడేం చేద్దామనుకొంటున్నారు."—అని నాలుగో రోజున తల్లి ప్రశ్నించింది.

మళ్ళీ వర్క్-షాప్ కే పోతానమ్మా!'' — అన్నాడు ఆర్టెమ్ ఉత్సాహంగా.

పావెల్ రెండు వారాలు ఇంటివద్దగడిపి మళ్ళీ కీవ్ వెళ్ళిపోయేడు.

